# తెలుగు వెన్నెల

## ప్రపంచ తెలుగు రచయితల 2వ మహాసభల
## ప్రత్యేక సంచిక

ప్రపంచ
తెలుగు రచయితల
మహాసభలు

కృష్ణాజిల్లా రచయితల సంఘం







ఆంధ్రప్రదేశ్ సాంస్కృతిక శాఖ, ఆంధ్రప్రదేశ్ హిందీ అకాడెమీ
భారతీయ బాషా కేంద్రం - మైసూరు, సాహిత్య అకాడెమీ - న్యూఢిల్లీ
సౌజన్యంతో
**కృష్ణాజిల్లా రచయితల సంఘం నిర్వహణ**
2011 ఆగష్టు 13, 14, 15 తేః విజయవాడ ఎస్ వి యస్ కళ్యాణ మండపం



ఆంధ్రప్రదేశ్ సాంస్కృతిక శాఖ
ఆంధ్రప్రదేశ్ హిందీ అకాడమీ
భారతీయ భాషా కేంద్రం మైసూరు
సాహిత్య అకాడెమీ న్యూఢిల్లీ

సౌజన్యంతో


కృష్ణాజిల్లా రచయితల సంఘం ఆధ్వర్యంలో

**ప్రపంచ తెలుగు రచయితల రెండవ మహాసభలు**

**ప్రత్యేక సంచిక**

# తెలుగు వెన్నెల

కూర్పు

శ్రీ గాజుల సత్యనారాయణ
శ్రీమతి భమిడిపాటి బాలా త్రిపుర సుందరి
డా॥ పాలపర్తి శ్యామలానంద ప్రసాద్
శ్రీ పువ్వాడ తిక్కన సోమయాజి
డా॥ గుమ్మా సాంబశివరావు
శ్రీ కె.వి.యల్.యన్. శర్మ
శ్రీ మల్లాప్రగడ ప్రభాకరరావు
శ్రీ వేదాంతం శరత్ చంద్రబాబు
శ్రీ జె. సాయిరాం ప్రసాద్


**కృష్ణాజిల్లా రచయితల సంఘం**
ప్రచురణ

# ప్రపంచ తెలుగు రచయితల మహాసభల కార్యనిర్వాహక వర్గం

గౌరవాధ్యక్షులు
**శ్రీ మండలి బుద్ధప్రసాద్**

అధ్యక్షులు
**గుత్తికొండ సుబ్బారావు**

కార్యనిర్వాహక అధ్యక్షులు
**ఆచార్య యార్లగడ్డ లక్ష్మీప్రసాద్**

ప్రధాన కార్యదర్శి
**డా॥ జి.వి. పూర్ణచందు**

## కార్యవర్గం

శ్రీ ఐ. రామ్‌కుమార్
శ్రీమతి భమిడిపాటి బాలాత్రిపురసుందరి
శ్రీ టి. శోభనాద్రి
శ్రీ పువ్వాడ తిక్కన సోమయాజి
డా॥ గుమ్మా సాంబశివరావు
డా॥ పాలపర్తి శ్యామలానందప్రసాద్
శ్రీ కె.వి.ఎల్.యన్. శర్మ
శ్రీ మల్లాప్రగడ ప్రభాకరరావు
శ్రీ వేదాంతం శరత్‌చంద్రబాబు
శ్రీమతి పి. నాగలక్ష్మి
శ్రీ పి. మోహన్‌రాం ప్రసాద్
డా॥ వై. శ్రీలత
శ్రీ కాట్రగడ్డ వెంకట్రావు
శ్రీ విడియాల చక్రవర్తి
శ్రీ మహమ్మద్ సిలార్
శ్రీమతి కరెడ్ల సుశీల
శ్రీ లాల్‌బహదూర్ శాస్త్రి
శ్రీమతి వి. ఉమామహేశ్వరి
శ్రీ గాజుల సత్యనారాయణ
శ్రీమతి మాదిరాజు శివలక్ష్మి
శ్రీమతి వల్లూరుపల్లి లక్ష్మి
శ్రీమతి చలసాని వసుమతి
శ్రీ గుత్తికొండ వెంకటరాములు
శ్రీ గబ్బిట దుర్గాప్రసాద్
శ్రీ గుడిసేన విష్ణుప్రసాద్
శ్రీ జె. సాయిరామ్ ప్రసాద్
శ్రీ చింతపల్లి వెంకట నారాయణ
డా॥ ఎన్. సీతాపతి
శ్రీమతి సింహాద్రి పద్మ
శ్రీ దొండపాటి దేవదాసు
శ్రీ రేపాక రఘునందన్
శ్రీ శిఖా ఆకాష్
శ్రీ ఎ ఎస్.కె.డి. ప్రసాదరావు
శ్రీ తిక్కిశెట్టి రామ్మోహనరావు
శ్రీ యస్.వి. రత్నారావు
శ్రీమతి కోకా విమలకుమారి
డా॥ జి. రెజీనా
శ్రీమతి గుత్తికొండ కోకిలాంబ

# ముందుమాట

# తెలుగు భాష - గమనం - గమ్యం

- మండలి బుద్ధ ప్రసాద్

ప్రతి నాగరికజాతి తన ఔన్నత్యాన్ని భాష ద్వారా వ్యక్తం చేస్తుంది. 'భాష' మానవజాతి పరిణామంలో రూపుదిద్దుకొన్న ఒక సామాజిక ప్రాణనాడి! తల్లి ఒడి నుండి ప్రారంభమయ్యే భాష తనువు చాలించేదాకా ఒక మహత్తర శక్తిగా వెన్నంటి ఉంటుంది. ఏ జాతికైనా తరగని ఆస్థి ఆ జాతి భాష - మాతృభాష.

మన భాష తెలుగుభాష. నేడు 16 కోట్లమందికి మాతృభాష. రెండువేల ఏళ్ళకు పైగా ఆటుపోట్లను తట్టుకొని నిల్చిన భాష ! లక్షలాది కావ్యాల భాష.

ఈ రోజు తెలుగు భాష 'గమనం – గమ్యం' ప్రశ్నార్థకంగా మారింది. నేడు గత వైభవాలను నెమరువేస్తూ కూర్చునే నాటితరం పండితులు దీనికి దిశానిర్దేశం చేయలేకపోతున్నారు.

వర్తమానంలో ఉక్కిరిబిక్కిరి చేస్తున్న ప్రపంచీకరణలో చిక్కుకున్న నేటితరం రచయితలు అవసరమైనంత చైతన్యాన్ని ప్రకటించలేకపోతున్నారు.

భవిష్యత్తుకు వారసులైన పిల్లలు, యువతరం తెలుగుభాషపట్ల అవసరమైన ఆత్మీయత, అనురాగ, అభినివేశం లేకుండా, ఆంగ్ల భాషలోకి వలసపోతున్నారు.

తెలుగు భాషామతల్లి ఇప్పుడు దారులు మూసుకుపోయిన చౌరస్తాలో దిక్కుతోచక నిలబడింది.

తెలుగు భాష గమనమే ఆగిపోయింది. తెలుగు భాష తీయందనమే ఇంకిపోయింది. ఈ సమయంలో తెలుగు ప్రజలు సమగ్ర భాషా చైతన్యస్ఫూర్తిని ప్రకటించకపోతే రాబోయే తెలుగు భాషాచరిత్ర మనల్ని క్షమించదు. ఇప్పటి తెలుగు భాషా పతనవేగాన్ని చూస్తే మరో 20 ఏళ్లలో తెలుగు అక్షరాలు పురావస్తుశాఖ అధీనంలోకి వెళతాయి. తెలుగు కావ్యాలు తెలుగు రాష్ట్రపు 'నేలమాళిగ'ల్లోకి వెళతాయి. తెలుగు పద్యాలు మౌనమై తెలుగు పదాలు శూన్యమై, తెలుగుదనం విచ్ఛిన్నమై ఒకానొక సంకరజాతి ఆంధ్రప్రదేశ్ చిత్రపటంపై ఆవిష్కృతమౌతుంది. ఇది శాస్త్రీయంగా నిరూపితమైన చారిత్రక సత్యం.

ఇప్పుడు ఐదు రకాల ప్రశ్నలను ఈ వేదిక మీదనుంచి సంధిస్తున్నాయి. "రెండవ ప్రపంచ తెలుగు రచయితల మహాసభలు" ఈ ప్రశ్నలకు సమాధానాలు లభిస్తే తెలుగుభాష బ్రతికి బట్టగడుతుంది. ఈ ప్రశ్నలకు లభించే సమాధానాలే 'భవిష్య కార్యాచరణ ప్రణాళికగా రూపుదిద్దుకుంటుంది.

* * *

## తెలుగుభాష బ్రతికేదెలా ?

ఇవ్వాళ మన ఇంట్లో తెలుగు ఎంత ఉంది ? అలాగే విధులలో – వీధులలో – బడులలో – గుడులలో ఆచార్య వ్యవహారాలలో తెలుగు వినియోగం ఎంత ఉంది ? ఇది వేసిన ప్రశ్న మళ్లీ వేస్తున్నాం ! పాడిన పాటేపాడుతున్నాం ! అందరికీ సమాధానం తెలిసీ, ఏ విధమైన పరిష్కారం లేకుండా వెళ్లిపోతున్నాం ! తెలుగుకు ప్రాచీన భాషా ప్రతిపత్తికోసం గత ప్రథమ ప్రపంచ తెలుగు రచయితలకు మహాసభల వేదికపైనుంచి సవివరమైన కార్యాచరణ రూపొందించి విజయం సాధించాం. కాని, అది అంతటితో ఆగిపోకూడదని ఈ సభలో మరో కార్యాచరణ ప్రణాళికతో ముందుకు వస్తున్నాం.

1. 'తెలుగు' అంశంగా పదవ తరగతివరకు చదవకుండా ఉన్నవారికి ఏ విధమైన డిగ్రీ ఇవ్వరాదు అనే ఉత్తర్వు అమలవ్వాలి.
2. ఇంగ్లీష్ మాధ్యమంలో ఇప్పటికే ఉన్నత విద్య అంటే డిగ్రీ, పి.జి., ఇంజనీరింగ్, మెడికల్ ఇతరమైన వృత్తి విద్యనభ్యసించిన వారు తప్పనిసరిగా తెలుగు భాషా ప్రావీణ్య అర్హత సంపాదిస్తేనే వారి ఉద్యోగ అర్హత నిర్ణయించబడేలా ప్రభుత్వం ఉత్తర్వులివ్వాలి. వేరే రాష్ట్రం నుంచి I.A.S., I.P.S. అధికారులకు తెలుగు రాదని వారిని తెలుగు పరీక్ష A.P.P.S.C. ద్వారా పాస్ అవ్వమని చెపుతున్నాం. మరి మన రాష్ట్రంలోనే పుట్టి, ఇక్కడే చదివి, ఇక్కడే ఆస్తులు కూడబెట్టుకున్న మన తెలుగు పౌరులు తెలుగు రాకుండానే ఉన్నతోద్యోగాలు చేస్తుంటే వాళ్లకి 'తెలుగు భాషా ప్రావీణ్య పరీక్ష' పెట్టడం అవసరం – ఈ దిశగా ప్రయత్నాలుండాలి.
3. పాలనాభాషగా తెలుగు ఉండాలని ఇప్పటికీ చట్టాలున్నాయి. వాటిని అమలుచేసే రాష్ట్ర అధికార భాషా సంఘం మూగవోయి, శూన్య పీఠాలతో ఉండడం విచారకరం. అంతేకాదు రాష్ట్ర అ.భా.సం. కేవలం కాగితపు కుందేలు పిల్ల ! నిధులు లేవు – ఆచరింపజేయించే అధికారిక విధులు లేవు – కేవలం అలంకార ప్రాయమైన 'అగస్త్యభ్రాత' మన అధికార భాషా సంఘం. దీన్ని బలోపేతం చేయాలి.

## తెలుగు చరిత్ర తెలిసేదెలా ?

మన చరిత్ర ఏనాడో గిడుగు, కందుకూరి, జయంతి రామయ్య పంతులు, మల్లంపల్లి సోమశేఖరశర్మ కమతాలు, లక్ష్మణరావు, సురవరం ప్రతాపరెడ్డి, ఆదిరాజు వీరభద్రరావు, రాళ్లబండి సుబ్బారావు వేదం వెంకట రాయశాస్త్రి, మానవల్లి రామకృష్ణకవి, నిడదవోలు వేంకటరావు వేటూరి ప్రభాకరశాస్త్రి వంటి మహానుభావుల వెలికి తీసిన చరిత్ర తప్ప – కొత్త అంశాలు ఏమైనా పరిశోధించుకున్నామా? కొత్త చరిత్రకారులను తయారు చేశామా ? అసలు ఇంతవరకు జరిగిన పరిశోధనల సూచి మన వద్ద సమగ్రంగా ఉందా ? జరగవలసిన పరిశోధనాంశాల జాబితా ఏమైనా తయారు చేసుకున్నామా ? కాలగర్భంలో కలిసిపోతున్న శాసనాలు, నాణాలు, తాళపత్ర గ్రంథాలు, లుప్తమైపోతున్న ప్రాచీన ముద్రిత గ్రంథాలు పునర్ముద్రణకు నోచుకుంటున్నాయా ? ఇవన్నీ చర్చించేదెవరు ? ఈ చర్చలకు సమర్థమైన వేదికగా 'ఈ ప్రపంచ తెలుగు రచయితల మహాసభ" నిలుస్తుంది.

అంతేకాదు. కూలిపోతున్న ప్రాచీన దేవాలయాల్లో ఎన్నో చారిత్రక అంశాలు సమాధి అయిపోతున్నాయి. నిన్న కాళహస్తి గోపురం కూలిపోతే అదొక చారిత్రక విఘాతంగా మనం జీవించలేదు. దానికి గల రాజకీయ, పరిపాలన కోణాలే చర్చించారు. ఆ గోపురం చరిత్రపై ఒక్క పుస్తకం వచ్చిందా ? నేడు రామప్ప దేవాలయం. 'దేవాదుల ప్రాజెక్ట్ కోసం రాళ్ళను పేల్చే బాంబుల ప్రకంపనలతో శిల్పాలు బీటలు వారుతుంటే ఒక కలమైనా గళమైనా నినదించిందా ?

వేయిస్తంభాల గుడి, భద్రాచలం, సింహాద్రి, అహోబిలం, తిరుమల, యాదగిరిగుట్ట, త్రిపురాంతకం కనకదుర్గ ఆలయాలలో చరిత్రకాంశాలపై ఎక్కడన్నా ఒక్కటైనా సదస్సు జరిగిందా? ఎప్పుడో ఎవరో వ్రాసిన విషయాలకే నాడు చిలుకల్లా మాట్లాడుతున్నాం. 'శాసనాలు' తెలుగు భాష – చరిత్రకు తిరుగులేని ఆధారాలు. నాటి లిపిని, భాషను, పలుకుబళ్లను చదువగలవారు ఈనాడు పట్టుమని పదిమంది లేరు. వారి తర్వాత శాసనాలు అధ్యయనం చేసే 'ఎపిగ్రఫీ' పరిశోధక విద్యార్థులను తయారు చేసికోవాలి. ఇప్పటికీ ఎన్నో శాసనాలు అపరిష్కృతంగా ఉన్నాయి. ఇంకా అన్వేషిస్తే ఎన్నో శాసనాలు బయల్పడతాయి. వాటిని చదివే పరిస్థితి మనకు భవిష్యత్తులో ఉండదు. ఈ దిశగా తీసికోవాలసిన చర్యలను చర్చించవలసిందిగా కోరుతున్నాను. బౌద్ధారామాలు ఆంధ్రప్రదేశ్‌లో ఉన్నాయి. వీటిపై ఏమైనా శోధన చేశామా ? కరీంనగర్ జిల్లాలోని బొమ్మలమ్మ గుట్ట రహస్యంపై పరిశోధన జరుగుతోందా ? జైనులకు తెలుగు వారికి గల అనుబంధాలపై పరిశోధన ఏ విశ్వ విద్యాలయంలోనైనా ఉందా ?

తెలుగువారి నౌకాదళం, ఓడరేవులు, వ్యాపారాలపై సమగ్రమైన చరిత్ర పుస్తకం ఒక్కటి మనకు గుర్తుందా ? తెలుగు చక్రవర్తుల పరిపాలనా చాకచక్యాలపై, వారి పాలనా వ్యూహాలపై, ఏమైనా పరిశోధన జరిగిందా ?

శ్రీకృష్ణదేవరాయల పంచ శతాబ్ది ఉత్సవాలలో రెండు కోట్ల రూపాయలు వ్యయంచే మనం సాధించిన, కనుక్కొన్న కొత్త పరిశోధనలేమిటి? ప్రచురించిన పరిశోధనా గ్రంథాలెన్ని ?

ఇలా ప్రశ్నిస్తూపోతే ప్రస్తుత తెలుగు చరిత్ర పరిశోధన పరిస్థితి అధఃపాతాళంలో ఉందని తెలుస్తోంది.

తెలుగువారి సమగ్ర చరిత్ర నిర్మాణానికి చరిత్ర రచయితలు, భాషాశాస్త్రవేత్తలు కదలిరావాలని ఈ వేదికపై నుంచి ప్రపంచ తెలుగు రచయితల సభలు 'పిలుపునిస్తున్నాయి. ఏ అంశాలు పరిశోధించాలి ? ఏ పుస్తకాలు ప్రచురించాలి అనే సమయ నిబద్ధమైన వ్యూహ రచన ఈ సభలలో జరగాలని ఆకాంక్షిస్తున్నాం.

## తెలుగు సాహిత్యం పరిస్థితి ఏమిటి ?

కవులు, రచయితలు క్రాంత దర్శనులు అంటారు. వారే భాషోద్యమానికి పునాదులు – ప్రతీకలు భాష లేందే కవిలేదు. భాష నశిస్తూ పోతుంటే సాహిత్యం చదివే దిక్కు ఉండదు. తెలుగు సాహిత్యంలో జాతీయ, అంతర్జాతీయ ప్రమాణాలను సాధించాలనే ప్రయత్నం అలా ఉంచి, అసలు తెలుగు కవిత్వం, కథ, నవల, వ్యాసం, జీవిత చరిత్రలు, పుస్తకాలు ఎంతమంది మన రాష్ట్రంలో చదువుతున్నారు ? ప్రజలకు – రచయితలకు మధ్య ఎలాంటి సంబంధం ఉంది ? కవిత్వం అనగానే అది కవులకోసం, కవుల వల్ల, కవుల చేత వ్రాయబడేది అనే ప్రజలు భావిస్తున్నారా ? కవిత్వ చర్చలన్నీ సైద్ధాంతిక నేపథ్యంలోనే సాగుతున్నాయా – సాహిత్య సృజనలలో కులం, మతం, ప్రాంతం, వర్గం, రాజకీయ సిద్ధాంతాలే ప్రాధాన్యం పొంది, వాటికి అనుగుణంగానే ప్రాచుర్యం పొందుతున్నాయి. అసలు సామాన్య ప్రజల నోళ్లలో ఆధునిక కవుల సాహిత్యం ఎందుకు ప్రచలితం కావడం లేదు ?

గత 20 సం॥లలో వచ్చిన సాహిత్యం ఈనాడు ఏ విశ్వవిద్యాలయంలోగానీ, కళాశాలలోగానీ, యువతరం సమూహాలలో గానీ, ఒక 'క్విజ్' పోటీ పెడితే ఎంతమంది సమర్థంగా ఎదుర్కోగలరు ?

ఎన్నో ఉత్తమ రచనలు మన ఆధునిక రచయితలు విభిన్న ప్రక్రియలలో గత 20 ఏళ్ళలో రచించారు. కానీ అవన్నీ ప్రజల దగ్గరకు సమర్థంగా వెళ్లాయా ? గుండెలమీద చెయ్యి వేసికొని ఆలోచించండి.

అవార్డులు, సన్మానాలు, బహుమతులు ముఖ్యమే రచయిత ప్రతిష్టను నిర్ణయిస్తున్నాయా ? అనే సందేహం ప్రజల ముందుకొస్తోంది ఈనాడు.

సినిమా, టీవీ, పత్రికా, రేడియో మాధ్యమాల ద్వారా కవులు, రచయితలు తమ శక్తియుక్తులను తెలుగు భాషా సేవకు ఎంతవరకు వినియోగిస్తున్నారు. లేక ఆయా మాధ్యమాలు తెలుగు భాషా పరిరక్షణకు ఏ మేరకు కృషి చేస్తున్నాయి ఈ విషయాలన్నీ ఈ సభల ద్వారా చర్చించి భావి కార్యాచరణ వ్యూహాన్ని నిర్మించాలని భావిస్తున్నారు.

## తెలుగు భాష - సాంకేతిక రంగం

తెలుగు భాషను ప్రపంచ భాషగా చేయగల శక్తి ఒక సాంకేతిక రంగానికే ఉంది అనేది నిర్వివాదాంశం. కంప్యూటర్ రంగంలోను, ఇంటర్నెట్ వినియోగంలోను తెలుగు వినియోగం సూక్ష్మాతి సూక్ష్మం. దాదాపు శూన్యాంకానికి దగ్గరదగా ఉంటుంది. అమెరికా దేశంలో తెలుగు పిల్లలే దాదాపు కంప్యూటర్ రంగాన్ని 40% శాసిస్తున్నారు. వారు మనకున్న గొప్ప అంతర్జాతీయ భాషాపరమైన సాయుధులు వారి సహకారంతో ఇంటర్‌నెట్‌లో తెలుగు అక్షరం మెరిసేలా 'యూనికోడ్' సాధించాలి. ఈ పని 10 ఏళ్ళ క్రితమే తమిళులు చేశారు !

తెలుగు టైపింగ్ కంప్యూటర్‌లో వినియోగం వేలరెట్లు పెరగాలి. ఇప్పటికే "గూగుల్" తెలుగును తన హోం పేజీలో చూపిస్తోంది. మనమే వినియోగించడం లేదు. సాంకేతిక రంగానికి అవసరమైన పదజాలాన్ని సృష్టించి నిఘంటువులు రావాలి. శిక్షణా కేంద్రాలు రావాలి. తెలుగు మీడియం విద్యార్థుల చేతికి తెలుగు కంప్యూటర్లు తెలుగు సాంకేతిక విప్లవం చేరాలి. దీనికోసం మనం ఏ విధమైన చర్యలు తీసికోవాలో ఈ సభలో చర్చిద్దాం. పరిష్కారాలు కనుగొందాం. అంతేకాదు తెలుగు భాషలోని పద్యాలు, కావ్యాలు, ఇతరమైన అపూర్వమైన, అంశాలన్నింటిని 'ట్రాన్స్‌క్రిప్షన్' పద్ధతిలో వ్రాసికోవాలి. వాటిని 'వికీపీడియా' వంటి వెబ్‌సైట్స్‌లో పెట్టాలి. తెలుగు ప్రముఖులంతా తమ తమ వెబ్‌సైట్లలో ఇంగ్లీషుతో పాటు తెలుగు వెబ్ సైట్స్ కూడా పెట్టాలి. తెలుగు వారంతా తెలుగులోనే ఈ మెయిల్స్ పంపుకోవాలి. దానికి అవసరమైన సాంకేతిక విషయాలు అందరికీ అందుబాటులోకి వచ్చేలా చర్యలు గైకొనాలి. ఈ విషయాలపై ప్రత్యేకమైన చర్చ జరగాలని మనస్ఫూర్తిగా ఆశిస్తున్నాం.

## తెలుగు వారి ప్రత్యేక సమస్యలు

ఒక ప్రక్క ప్రపంచీకరణ ద్వారా ఉన్న భాష ఉనికి ప్రశ్నార్థకమైతే, తెలుగు వారికి మరో ప్రక్క విభిన్న ఉద్యమాల వల్ల తెలుగు భాష, చరిత్ర, సంస్కృతి గందరగోళంలో పడింది. దీని విషయమై ఏ విధమైన ఆత్మాశ్రయత లేకుండా, స్వాభిమాన, దురభిమాన దోషాలు అంటకుండా, తెలుగు భాషా పరిరక్షణకు తీసుకోవాల్సిన చర్చలు కూడా ఈ సదస్సు ఆహ్వానిస్తోంది.

ఈ సదస్సు ఏ విధమైన రాజకీయ ప్రయోజనాలకోసం కాదు. కేవలం తెలుగు భాషా పరిరక్షణ తెలుగు చరిత్ర పరిశోధన పునర్నిర్మాణం తెలుగుభాష ఆధునిక సాంకేతిక పరిణతి అన్న అంశాలను కేంద్రంగా చేసుకుని నిర్వహించబడుతుందని తెలియజేస్తూ మీ సలహాలు, సూచనలు, పరిష్కారాలు ఇవ్వవలసిందిగా కోరుతున్నాను. కేవలం సెమినార్లలో చేసే సుదీర్ఘ ఉపన్యాస వేదికలు కాక సూచనలు పరిష్కారాలు అందించే వేదికగా ఉండాలని కోరుతున్నాము. గతంలో తెలిసిన అంశాలను చర్విత చర్వణం చేయకుండా, కొత్త మార్గాలు అన్వేషిస్తూ కొత్త పరిశోధనలకు బాటలు వేస్తూ – కొత్త గ్రంథాలు వినూత్న విషయాలతో రచిస్తూ – తెలుగు భాషకు, తెలుగుజాతికి కొత్త వెలుగులు పండించాలని, అందించాలని ఈ రెండవ ప్రపంచ తెలుగు రచయితల సభలు నిర్వహిస్తున్నాము.

**జై తెలుగు భాష ! జై తెలుగు జాతి !**



## తెలుగు మనుగడ - రేపటి సమాజం - రేపటి అవసరాలపై దృష్టిసారిస్తూ...

## ప్రపంచ తెలుగు రచయితల రెండవ మహాసభలు

# లక్ష్యప్రస్తావన

ఆచార్య యార్లగడ్డ లక్ష్మీప్రసాద్
కార్యనిర్వాహక అధ్యక్షులు
ప్రపంచ తెలుగు రచయితల మహాసభలు
ylp1956@gmail.com

తెలుగువారి చరిత్ర, సంస్కృతి, సాంకేతిక రంగాలలో రేపటి అవసరాలపైన, రేపటి మనుగడపైన, రేపటి స్థితిగతులపైనా ప్రధానంగా దృష్టి పెట్టుకొని, కృష్ణాజిల్లా రచయితల సంఘం 2011 ఆగష్టు 13,14,15 తేదీలలో విజయవాడలో రెండవ ప్రపంచ తెలుగు రచయితల మహాసభలు నిర్వహణకు సమాయత్తం అయింది. దేశ విదేశాలనుంచి సాహితీవేత్తలు, భాషావేత్తలు, చరిత్ర పరిశోధకులు, సాంకేతిక నిపుణులు, భాషాభిమానులూ, భాషోద్యమ కార్యకర్తలూ, ఒకే వేదికపైన సమావేశం అయిన ఒక అపురూప సన్నివేశం ఇది.

2007లో జరిగిన తొలి ప్రపంచ తెలుగు రచయితల మహాసభలు తెలుగు భాషోద్యమ స్ఫూర్తి కలిగించటంలో గొప్ప ఫలితాలు సాధించాయి. భాషా సంస్కృతులు ప్రమాద స్థితిలో ఉన్న నేటి రోజుల్లో ఈ రెండవ మహాసభలు ప్రత్యేక ప్రాధాన్యతను సంతరించుకున్నాయి.

ప్రపంచీకరణం, దృశ్యమాధ్యమాలు, సినిమాలు, ముప్పేట దాడి కొనసాగిస్తూండగా, ప్రజలలో ఏర్పడిన పాశ్చాత్య వ్యామోహం, ప్రభుత్వంలో నెలకొన్న నిరాసక్తత, పాలనా వ్యవస్థలో చోటుచేసుకొన్న నిర్లిప్తతలను వదిలించి, తెలుగుభాషనీ, తెలుగుసంస్కృతినీ కాపాడుకోవటానికి మేధావులూ, భాషాభిమానులూ ప్రజల గుండె తలుపులు తట్టే కార్యక్రమాలని రూపొందించవలసి ఉంది. కొన్ని మౌలికమైన అంశాల కచ్చితమైన చర్చ జరగవలసి ఉంది కూడా।

తెలుగు సాహిత్యానికి శూన్యయుగం నడుస్తోన్న నేటికాలంలో, వెలుగు నింపటానికి తీసుకోదగిన చర్యలేమిటి....? రేపటి సమాజానికి సాహిత్యం ఏ విధమైన దిశానిర్దేశం చేయగలుగుతుంది....? తెలుగువారి సమగ్ర చరిత్ర నిర్మాణంపై విశ్వవిద్యాలయాలు, చరిత్రకు సంబంధించిన సంస్థలు ఎందుకని దృష్టి పెట్టలేకపోయాయి ....? మరణశయ్య నెక్కిన భాషల్లో తెలుగు చేరటానికి కారణాలమీద శాస్త్రీయమైన అధ్యయనం ఎందుకు జరగలేదు...? రేపటి సమాజంలో తెలుగు మనుగడ ఏమిటి....? అంతరించి పోతున్న తెలుగు కళారూపాల రేపటి మనుగడ ఏమిటి...? తెలుగు మాధ్యమంలో చదువు ఎందుకు ప్రాధాన్యత కోల్పోయింది...? ఇలాంటి ప్రశ్నలకు సమాధానాలు రాబట్టే విధంగా వేయి గొంతులు ఒక్కటై ప్రశ్నించాల్సిన అవసరం ఉంది.

చరిత్ర పూర్వయుగానికి, చారిత్రక యుగానికీ సంబంధించిన పురావస్తు పరిశోధనలు, తెలుగు నాణాలు, తెలుగు శాసనాలు, తెలుగు భాష ప్రాచీనతను నిరూపించే పరిశోధనాంశాలు, పురావస్తు ఆధారాలు...

తెలుగు సాహిత్యంలో ప్రధాన ఘట్టాలు, సంప్రదాయాలు, సాహిత్య పరిశోధనలు, బాలసాహిత్యం, నాటక, నవలా, కథా, కవితా రచనల రేపటి పరిస్థితులు. తెలుగు విమర్శ. సాహిత్యంలో నిబద్ధత, ఆధునికత, అవాంఛనీయ ధోరణులు, పత్రికా రంగంలో భాషావ్యాప్తి...

తమిళనాడు, ఒరిస్సా, కర్ణాటక, మహారాష్ట్ర మొదలైన ప్రాంతాలలో తెలుగువారి జీవనం, భాషా సంస్కృతుల పరంగా అక్కడి ప్రజలు ఎదుర్కొంటున్న సమస్యలు, రాష్ట్ర ప్రభుత్వం తీసుకోదగిన చర్యలు...

రేపటి అవసరాలకు తగ్గట్టుగా తెలుగు భాషా బోధన, తెలుగు మాధ్యమంలో పాఠ్యాంశాలలో చేయదగిన మార్పులు, మాతృభాషలో ప్రాథమిక విద్యపై శాస్త్రీయ అవగాహన, తెలుగు పండితులపట్ల వివక్షత లేకుండా సముచిత గౌరవాన్ని ప్రభుత్వమూ విద్యాసంస్థలూ అందించటం...

మేలిమి భాషగా తెలుగును కేంద్ర ప్రభుత్వం గుర్తించి, విశిష్ట ప్రాచీన సంపన్నతా హోదా (క్లాసికల్ స్టేటస్) ప్రకటించిన తరువాత చేపట్టనున్న నిర్దిష్ట కార్యక్రమాలను హైదరాబాదులోని కేంద్రీయ విశ్వవిద్యాలయం, మైసూరులోని భారతీయ భాషా కేంద్రం, కేంద్ర సాహిత్య అకాడెమి, ఆంధ్రప్రదేశ్ సాంస్కృతిక శాఖ తక్కిన సంబంధిత సంస్థలు ఈ సదస్సులో ప్రతిపాదించనున్నాయి. తెలుగు బృహన్నిఘంటువు (లెక్సికాన్) నిర్మాణానికి పూనిక వహించటం, తాళపత్ర గ్రంథాల పరిరక్షణ, తెలుగులో విజ్ఞాన సర్వస్వాల రూపకల్పన...

ఆధునిక అవసరాలకు తగినట్లు తెలుగు భాష ఆధునీకరణ, తెలుగు లిపి-కంప్యూటర్ అవసరాలు, కంప్యూటర్‌లో తెలుగు పదజాలం, తెలుగు వెబ్ మేగజైన్లు, తెలుగులో సాంకేతిక ఉపకరణాలు, తెలుగులో వెబ్‌సైట్లు, బ్లాగులూ, సోషల్ నెట్ వర్క్ సైట్లు, మొదలైన అంశాలపైన విశేష చర్చ జరుగుతుంది. తెలుగు యూనికోడ్ విషయమై ప్రభుత్వ పరంగా తీసుకోదగిన చర్యలు, ఇతర సాంకేతిక అంశాలు.. ఈవన్ని రెండవ ప్రపంచ తెలుగు రచయితల మహాసభలకు ప్రధాన చర్చనీయాంశాలు.

ఈ మహాసభల గుర్తుగా విజయవాడలో తుమ్మలపల్లి వారి కళాక్షేత్రం దగ్గర తెలుగుతల్లి విగ్రహం ప్రతిష్టాపన జరుగుతుంది. నగరంలో మహాకవుల చిత్రపటాలు మరియూ వారి కవితల ప్రదర్శన, కవి సామ్రాట్ విశ్వనాథ సత్యనారాయణ నివాసంలో ఆయన జీవిత చరిత్రను తెలిపే ఫోటోల ప్రదర్శన లాంటి అనేక కార్యక్రమాలు ఈ సభల సందర్భంగా ఏర్పాటవుతున్నాయి.

నిన్నటిని స్పృశిస్తూ, నేటిని సమీక్షిస్తూ రేపటి అవసరాలకు తగ్గట్టుగా తెలుగు భాషా సంస్కృతులను తీర్చిదిద్దే లక్ష్యంతో రచయితలు, పరిశోధకులూ, సాంకేతిక నిపుణుల సమాహారంగా ఈ సభలు జరుగుతున్నాయి. భాషోద్యమ స్ఫూర్తితో పాల్గొనవలసిందిగా భాషాభిమానులందరికి ఆహ్వానం.



# *Message to Participants of*
# THE SECOND WORLD TELUGU Writers CONFERENCE BEING HELD IN VIJAYAWADA, 13 to 15 AUGUST 2011

***By Professor Robert Eric Frykenberg***

It is indeed a high honour to have been invited to join you all at this, the Second World Telugu Writers Tirnal. I am extremely grateful to Professor Yarlagadda Lakshmi Prasad and Sri Mandali Buddha Prasad for extending such a gracious invitation. Were it not for family health problems, and complications relating thereto, I would now be with you.

How well I recall the First World Telugu Conference that was held thirty-six years ago, in April 1975. Proceedings on that occasion took place on the great maidan of Hyderabad. Lying below Nowbut Pahar, the historic place from whence the Mughal Emperor viewed the conquest of Golkonda, a huge and colourful shamianah, or pandal, accommodated the crowds. This was a splendid sight when viewed from the Ritz Hotel. In that place, it was my privilege to share a room with that gentle and beloved Telugu authority, Peter Gwynn. This former I.C.S. officer, after retiring as Second Member of the A.P. Board of Revenue, would soon devote twelve years to producing a new *Telugu-English Dictionary* (Oxford University Press, in 1991), with assistance from Professor J. Venkateswara Sastry. This work, containing many colloquial and modern *desi-* terms, was the first fresh dictionary of Telugu language since 1894. He had already published *A Grammar of Modern Telugu* (1985), in collaboration with Professor Bhadriraju Krishnamurti. Acclaim and awards he received were well deserved.

This friendship is mentioned on this occasion because, as a seasoned district officer, Gwynn had strongly encouraged my own research and scholarship from 1959 onwards. Walking back and forth to the Maidan where the Telugu Conference proceedings were taking place, we often discussed the incredible intricacies of social structures among Telugu peoples. Especially wonderful were the varieties *of desi-Telugu* usage that continued to thrive in various taluks and villages of Andhra. By that time, my own work, *Guntur District, 1788-1848: A History of Local Influence and Central Authority in South India* (Oxford: 1965), had attracted attention. Alas, no one (including myself) has completed a sequel to that history. Such a work would have shown us how the huge anicut and irrigation works that transformed the Krishna-Godavari Delta made it into a lush garden. It would show how prosperity and wealth so generated eventually enabled the rise of so many distinguished activists, intellectuals, and radicals, especially in the area surrounding Tenali.

The reason for giving attention to such works lies in the fact that that all history, in its truest sense, is local history. History is about human relationships. It is about faces, and names. It tells small stories, anecdotes about significant incidents. It reminds us that our understandings of events are circumscribed and contingent - fallible and limited by our frailties. It is human agency and institutions that construct and energize social and cultural resources. How can one understand political events if one does not first gain insights into various social and cultural forces that have driven the pistons of political power? Merely to look at surface features, without properly contextualizing them, without tracing deeper roots of conflict from whence they have sprung, is to misunderstand, or to distinguish , what is important from what is mundane or trivial.

What was once known as *Kondavidu Seema,* and then as *Murtazanagar Zillah* (in Persian Urdu), was later lumped into a larger Krishna District, from whence it was that what we now know as Guntur District was restored about a century ago. This district has a unique history. Yet it is also a sample of how similarly unique histories might be uncovered for every other Telugu speaking district - whether of coastal Andhra, from Nellore to Kakinada (part of which was also once known as the Northern Circars); of the Rayalu-Seema districts such as Cuddapah, Kurnool, Chittoor and Anantapur; if not even Bellary; or of the Telengana districts that were ruled from Hyderabad.

By translating and arranging for publication of *Guntur District* in Telugu, Sri (Dr.) Narisetti Innaiah has honoured and challenged all Telugu peoples, wherever they may be. He has made available to younger generations of Telugu readers and scholars, especially those in remote towns or villages, a blueprint for further research on their own history and has shown that, with imagination and persistence, any one of them can do the same. He has thrown down a gauntlet, daring each to write a distinct and different local story, or history. His hope, and mine, is that, by reading the history of one locality, aspiring Telugu scholars may embark upon research projects of their own and will produce more local histories. Eventually, and hopefully, after more fresh local histories have been written, future generations of historians may possess enough data for the synthesizing and writing of over-arching histories of all Telugu peoples, works that are far more comprehensive in coverage and scope, far more penetrating or probing of fresh question, than anything that has so far been produced.

Unexplored sources for writing such histories are abundant. Beyond published district manuals (and gazetteers) of the nineteen century are enormous collections of materials in various archives of South India. The Oriental Manuscript Library, located at Madras University, materials began in the 1780s, with the work of scores of Telugu scholars. Privately employed by Sir Colin Mackenzie, then Surveyor-General of the Madras Presidency who, at his death in the early nineteenth century, bequeathed an enormous horde to the Government, these Telugu scholars went from village to village collecting and/or copying every cadjan-leaf manuscript, every paper document, and every copper or stone inscription they could find and/or purchase. For future Telugu scholars in particular, mention should be made to manuscript Local (Village) Histories within the re-nowned Elliott Collection. One history, of the Niyogi Karnams of Chebrolu for example, traces their origins back to a Gajapati ruler in the 1144 (C.E.). At the same time, manuscript copies of district records that were accumulated and gathered from every local *daftarkhana* or record office, were brought to the Madras Record Office. Just the English translations of these records, often with vernacular inserts, come to three huge, leather-bound volumes per volumes per year. In the early twentieth century, printed *Guides to District Records* were also produced, along with bound copies of some especially noteworthy printed reports. All of these official documents are being preserved and maintained within the State Archives of Andhra Pradesh and Tamil Nadu (in Hyderabad and Chennai/Madras respectively.) Yet to be tapped systematically, in a scientific way, are even more vast reservoirs of Oral Tradition that have been preserved with family *vamshali-s,* within local *katha-s,* as also within various local *stala-purana-s.* Yet to be adequately explored, systematically, are histories of the great devasthanams and samasthanams, not to mention histories of such notables as the Velugoti Lords of Kalahasti, Chandragiri, and Venkatagiri; the palaiagarulu and kavalgarulu of interior uplands, or domains of the great zamindaris, such as Vasireddi and Nuzvid rajas, stretching all the way up along the coast to lords beyond Vizianagaram.

*Respectfully,*

*Robert Eric Frykenberg, Professor Emeritus of History & South Asian Studies,*
*University of Wisconsin — Madison (U.S.A.). Dated 8 August 2011.*

## తెలుగు ప్రజల గుండె తలుపులు తట్టి లేపుతున్న

# కృష్ణాజిల్లా రచయితల సంఘం

- శ్రీ గుత్తికొండ సుబ్బారావు, అధ్యక్షుడు

- డా॥ జి.వి.పూర్ణచందు, ప్రధాన కార్యదర్శి

కృష్ణాజిల్లా రచయితల సంఘానికి 44 ఏళ్ల క్రితం 1967 లోనే జిల్లాలోని సాహితీవేత్తలు పురుడు పోశారు. అది మొదటి కృష్ణా జిల్లా రచయితల మహాసభలు జరిగిన సందర్భం. 1967 జనవరి 8న ఈ వేడుకలు జరిగాయి. అందుకు విజయవాడ రైస్‌మిల్లర్స్ సంఘం హాలు వేదికయ్యింది. నార్ల వెంకటేశ్వరరావు ఈ సభలను ప్రారంభించారు. సభలు ఆ ఒక్కరోజే జరిగాయి. జిల్లా రచయితలే సంఘంగా ఏర్పడి ఈ సభలు నిర్వహించారు.

### రెండవ కృష్ణాజిల్లా రచయితల మహాసభలు :

మళ్లీ ఏడాదికే 1968 మార్చి, 10,11 తేదీలలో కృష్ణాజిల్లా రచయితల రెండవ మహాసభలు జరిగాయి. ఈ సభలను కొండా లక్ష్మణ్ బాపూజీ ప్రారంభించారు. విజయవాడ రామ్మోహన గ్రంథాలయం మేడ మీద హాలులో ఈ సభలు జరిగాయి.

### మూడవ కృష్ణాజిల్లా రచయితల మహాసభలు :

రెండేళ్ల విరామం తర్వాత 1970 జూన్ 27, 28 తేదీలలో గుడివాడలో కృష్ణాజిల్లా రచయితల మూడవ మహాసభలు జరిగాయి. పెను తుఫాను, ఎడాపెడా ఈదురు గాలులు వీస్తున్నా ఆగకుండా సభలు జరిగాయి. కవి సమ్రాట్ త్రిపురనేని వెంకటేశ్వరరావు సభలను ప్రారంభించారు. సభలను గుడివాడ కవిరాజ కళామందిరంలో నిర్వహించారు. పాల్గొన్న ప్రముఖులలో ఆరుద్ర, సోమసుందర్, గజ్జల మల్లారెడ్డి యమ్వీయల్ ప్రభృతులున్నారు.

ఇలా ఎప్పటికప్పుడు వనరులు సమకూరిన సమయంలో ఊపు మీద జిల్లా రచయితల మహాసభలను నిర్వహించడానికి రచయితల సంఘం పరిమితం అయ్యింది. అదిగో అనగానే ఆరేళ్లు గడిచిపోయాయి.

### నాల్గవ కృష్ణాజిల్లా రచయితల మహాసభలు :

1976 నవంబర్ 20,21 తేదీలలో మచిలీపట్నం స్పందన సాహితీ సమాఖ్య ముందుకొచ్చి నాల్గవ మహాసభలకు పూనుకొంది. విహారి, శాలివాహన, గుత్తికొండ సుబ్బారావు, పువ్వాడ తిక్కన సోమయాజి, జి.వి. పూర్ణచందు, బూదరాజు శ్యామసుందర్ ప్రభృతులు నిర్వాహకులుగా ఈ సభలు జరిగాయి. ఈసారీ వానల బీభత్సంలోనే జరిగాయి. అప్పటికప్పుడు వేదికను వేరేచోటికి మార్చి సభలు నిర్వహించారు. శ్రీమాన్ యస్.టి.జి. వరదాచార్యులు సభలను ప్రారంభించారు. డి.వి. నరసరాజు, కొండముది, అద్దేపల్లి, ఆరెస్ సుదర్శనం, రామ్మోహనరాయ్, లత, ఆదివిష్ణు, హవిష్ ప్రభృతులు పాల్గొన్నారు. విశ్వనాథవారి దివ్య స్మృతికి ఈ సభలను అంకితం చేశారు.

### ఐదవ "కృష్ణాజిల్లా రచయితల మహా సభలు" :

ఆ తరువాత మళ్లీ కృష్ణాజిల్లా రచయితల మహాసభల నిర్వహణకు మరో ఆరేళ్లు ఆగాల్సి వచ్చింది. ఇలా ఆగినందువలన ఒక ప్రయోజనం కల్గింది. పెద్దలు మండలి వెంకట కృష్ణారావు, ఎం.ఆర్.అప్పారావు ప్రభృతుల సూచన మేరకు, 'కృష్ణాజిల్లా రచయితల సంఘం' ఒకటి పూర్తిస్థాయిలో ఏర్పడి పనిచేసే సంస్థగా నిర్మించాలనే ఆలోచన చేయడం జరిగింది. వెంకట కృష్ణారావుగారు ఆ సభలకు ఆతిథ్యం ఇవ్వడానికి సన్నద్ధం కావడంతో కృష్ణాజిల్లా రచయితల ఐదవ మహాసభలు, అవనిగడ్డ గాంధీ క్షేత్రంలో 1982 జూలై 10, 11 తేదీలలో జరిగాయి. ఆనాటి ప్రభుత్వ ఆస్థాన కవి దాశరథి సభలను ప్రారంభించారు. ముఖ్య అతిథిగా మండలి వారూ, ప్రత్యేక సంచిక ఆవిష్కర్తగా ముక్కామల నాగభూషణం గారు విచ్చేశారు. సంజీవదేవ్, ఆరుద్ర, లత, అద్దేపల్లి, విహారి, టి.యల్. కాంతారావు, పోతుకూరి సాంబశివరావు ప్రభృతులు పాల్గొన్నారు. ఈ సభల సందర్భంగా డా॥ జి.వి. పూర్ణచందు మినీ కవితా ప్రదర్శన ఏర్పాటు చేశారు. శ్రీ ఎం. ఎ.మూర్తి కథా ప్రదర్శన శ్రీ టి.సాయికృష్ణ గీతగోవిందం బొమ్మల ప్రదర్శనలు కూడా ఏర్పాటయ్యాయి.

### కృష్ణాజిల్లా రచయితల సంఘం ఆవిర్భావం :

ఈ సభల సందర్భంగా కృష్ణాజిల్లా రచయితల సంఘం ఆవిర్భావం జరిగింది. నారాయణరెడ్డి, దాశరథి, ఎం.ఆర్. అప్పారావు, ప్రభృతులతో గౌరవ సలహా మండలి ఏర్పడింది. గౌరవ అధ్యక్షులుగా శ్రీ మండలి వెంకట కృష్ణారావు, అధ్యక్షులుగా శ్రీ ముక్కామల నాగ భూషణం, ప్రధాన కార్యదర్శిగా శ్రీ గుత్తికొండ సుబ్బారావు, కార్యదర్శులుగా శ్రీ మండలి బుద్ధప్రసాద్, డా॥ జి.వి. పూర్ణచందు, ఉపాధ్యక్షులుగా కళాప్రపూర్ణ తెన్నేటి హేమలత, డా॥ త్రిపురనేని వెంకటేశ్వరరావు కోశాధికారిగా శ్రీ మైత్రేయ ఇంకా 15 మంది సభ్యులతో ఒక కార్యవర్గం ఏర్పడింది. అప్పటి నుంచీ

చిరునామా : సత్నం టవర్స్, బకింగ్‌హాం పోస్టాఫీస్ ఎదురు, గవర్నరుపేట, విజయవాడ-2.
ఫోన్ : 9440167697, 9440172642

పూర్తిస్థాయిలో రచయితల సంఘం తన కార్యక్రమాలు ప్రారంభించింది. 1983లో ఇదే కార్య వర్గంతో సంస్థ రిజిస్టర్ అయ్యింది. ఆ సందర్భంగా విజయవాడ దుర్గాభవన్ హాలులో ప్రారంభోత్సవ సభ జరిగింది. శ్రీమతి ఇల్లిందల సరస్వతీదేవి సంస్థను ప్రారంభించారు.

### ఆం.ప్ర. సాహిత్య అకాడమీ గుర్తింపు :

1985లో ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీకి ఎన్నికలు నిర్వహించారు. దేవులపల్లి రామానుజరావు అప్పుడు అకాడమీ అధ్యక్షులుగా ఉన్నారు. ముఖ్యమంత్రి ఎన్టీరామారావు అకాడమీలను రద్దు చేస్తారనే వార్తల నేపథ్యంలో అకాడమీ ధైర్యంగా జనరల్ బోడీ ఎన్నికలు నిర్వహించింది. ఈ ఎన్నికలలో రచయితల సంఘం సభ్యులైన డా॥ తెన్నేటి హేమలత, శ్రీ గుత్తికొండ సుబ్బారావు, డా॥ జి.వి. పూర్ణచందు, శ్రీఎం. ఎ.మూర్తి ఈ నలుగురూ అకాడమీ సభ్యులుగా ఎన్నికయ్యారు. శ్రీమతి లత, శ్రీ సుబ్బారావు అకాడమీ కార్యవర్గ సభ్యులుగా అంతకు మునుపు పనిచేశారు. ఇది కృష్ణాజిల్లా రచయితల సంఘానికి ఆనాడు గర్వకారణమైన విషయం. సాహిత్య అకాడమీ గుర్తింపు కూడా సంస్థకు లభించింది.

### వివిధ అంశాలపై జిల్లా రచయితల మహాసభలు :

కృష్ణాజిల్లా రచయితల సంఘం ప్రతి రెండేళ్ళకొకసారి వివిధ సాహిత్యాంశాల పైన జిల్లా రచయితల మహాసభలను వరుసగా నిర్వహిస్తూ వచ్చింది 1984లో "తెలుగు విమర్శ" పైన, 1986లో తెలుగు నవలపైన, 1988లో తెలుగు కథపైన, 1990లో "తూర్పు యూరప్ పరిణామాల పైన సభలు నిర్వహించగా అర్థవంతమైన చర్చలు జరిగాయి. 1992లో ఆడ నవలలు, క్షుద్ర నవలలు, డిటెక్టివ్ తరహా నవలలు ఇలా నవలా సాహిత్యం అనేక కొత్త పుంతలు తొక్కుతున్న రోజుల్లో, "తెలుగు నవల - నాడు-నేడు-రేపు" అనే అంశంపైన జిల్లారచయితల సంఘం సదస్సు నిర్వహించింది ఘోస్ట్ రచయితలు ఎవరెవరు ఎవరి పేరులతో నవలలు రాస్తున్నారో రహస్యం బట్టబయలు చేసి, శ్రీ పురాణం సుబ్రహ్మణ్య శర్మ సంచలనం సృష్టించింది ఈ సభలలోనే !

### పుస్తక ప్రచురణ :

సభలతో పాటుగా పుస్తక ప్రచురణను కూడా చేపట్టి, శ్రీ జోస్యుల సూర్యనారాయణ మూర్తి రచన "కవితా భారతి" శ్రీ ముక్కామల నాగ భూషణం రచన "అసుర నాగరికత" డా॥ జి.వి. పూర్ణచందు రచన "సప్తసింధు" ఐతిహాసిక నవల, శ్రీ మైత్రేయ, డా॥ జి.వి.పూర్ణచందు సంయుక్తంగా రాసిన "శ్రీ ముక్కామల నాగ భూషణం జీవిత చరిత్ర" గ్రంథాలను ప్రచురించింది.

### వెనకడుగు-పునరుద్ధరణ :

వయోభారం రీత్యా కృష్ణాజిల్లా రచయితల సంఘం పెద్దలు - శ్రీ ముక్కామల నాగభూషణం, శ్రీ మండలి వెంకట కృష్ణారావు, డా॥ లత, డా॥ త్రిపురనేని వెంకటేశ్వరరావు, శ్రీ మైత్రేయ-ఒక్కొక్కరూ స్వర్గస్థులు కావడంతో ... జిల్లా రచయితల సంఘం కార్యకలాపాలు నెమ్మదిగా వెనకడుగు పట్టసాగాయి.

2005లో కృష్ణా మహోత్సవాలలో భాగంగా అవనిగడ్డ శాసన సభ్యులు శ్రీ మండలి బుద్ధప్రసాద్ గట్టిగా పూనుకొని కృష్ణా జిల్లా రచయితల సంఘాన్ని పునరుద్ధరింపచేయాలని సంకల్పించారు. ఆయన వెంట నడిచేందుకు శ్రీ గుత్తికొండ సుబ్బారావు, డా॥ జి.వి.పూర్ణచందు సంసిద్ధతను తెలపడంతో కృష్ణాజిల్లా సాహిత్య చరిత్రలో మరో నూతనాధ్యాయం మొదలయ్యింది.

ఆ సందర్భంలోనే "కృష్ణాజిల్లాలో ప్రాచీన సాహిత్యం" గురించి డా॥ ద్వా.నా. శాస్త్రి, కృష్ణాజిల్లాలో ఆధునిక సాహిత్యం గురించి శ్రీ అద్దేపల్లి ప్రసంగాలు ఏర్పాటుచేసి, సభానంతరం కృష్ణాజిల్లా రచయితల సంఘానికి నూతన కార్యవర్గాన్ని రూపొం దించారు.

శ్రీ మండలి బుద్ధ ప్రసాద్ గౌరవ అధ్యక్షులుగా, శ్రీ గుత్తి కొండ సుబ్బారావు అధ్యక్షులుగా, డా॥ జి.వి. పూర్ణచందు ప్రధాన కార్యదర్శిగా, శ్రీ తాతా రమేశ్ బాబు కోశాధికారిగా రమారమి 60 మందితో జిల్లా వ్యాప్తంగా ఒక కార్యవర్గం ఏర్పాటయ్యింది.

వెనువెంటనే రెండు పొయిట్రీ వర్క్‌షాపులు, ఒక జర్నలిజం వర్క్‌షాపు నిర్వహించడం వలన, రచయితలను, ముఖ్యంగా యువ రచయితలను భారీగా సమీకరించే అవకాశం వీటి వలన కలిగింది.

### తెలుగు భాషా సదస్సుల నిర్వహణ :

2006 ఫిబ్రవరి 12న తెలుగు భాషోద్యమ సమాఖ్యతో కలిసి, తొలి భాషా సదస్సును నిర్వహించి, కృష్ణాజిల్లా రచయితల సంఘం తెలుగు భాషోద్యమానికి తన వంతు భాగస్వామ్యాన్ని ప్రకటించింది ఆ తరువాత ఉయ్యూరు, నూజివీడు, కైకలూరు, మచిలీపట్టణం, గుడివాడ, విజయవాడ జగ్గయ్యపేట, తిరువూరులలో భాషా సదస్సులు ఏర్పరిచి, ప్రజల గుండె తలుపులు తట్టే ప్రయత్నం ప్రారంభించింది. రచయితలు ఎనలేని అభిమానంతో కృష్ణాజిల్లా రచయితల సంఘాన్ని ఆదరించడం ప్రారంభించారు.

### జాతీయ తెలుగు రచయితల మహాసభలు-తెలుగు పసిడి ప్రచురణ:

అదే అదనుగా జాతీయ తెలుగు రచయితల మహా సభలను నిర్వహించేందుకు సంకల్పం చెప్పుకొంది కృష్ణాజిల్లా రచయితల సంఘం. అది ఆంధ్రప్రదేశ్ ఏర్పడిన స్వర్ణోత్సవ సంవత్సరం. ఈ సందర్భంగా 2006 అక్టోబర్ 27-28 తేదీలో జరిగిన జాతీయ తెలుగు రచయితల మహాసభలలో "తెలుగు పసిడి" అనే ఉద్గ్రంథాన్ని ప్రచురించి విడుదల చేయడం జరిగింది. ఈ 50 ఏళ్ల కాలంలో తెలుగుభాష, సంస్కృతి, సాహిత్య వికాస పరిణామాల సమీక్షగా 112 వ్యాసాల సంకలనంగా వెయ్యి పేజీల బృహద్గ్రంథం అది ! 25 ఏళ్ల క్రితం, ఆంధ్రప్రదేశ్ రజతోత్సవాల సందర్భంగా యువభారతి సంస్థ వెలువరించిన "మహతి" గ్రంథం స్ఫూర్తిగా ఈ పుస్తకాన్ని వెలువరించగా, సాహితీవేత్తలు, విమ

ర్శకులు ఈ గ్రంథాన్ని వేనోళ్ల ప్రశంసించారు. ఇమ్మడిశెట్టి అక్కేశ్వరరావు చారిటబుల్ ట్రస్ట్ ఈ గ్రంథానికి సౌజన్యం వహించింది. ఆ సభలలోనే ప్రపంచ తెలుగు రచయితల మహాసభలు నిర్వహణకు సంకల్పం చెప్పుకున్నదీ రచయితల సంఘం.

## మొదటి ప్రపంచ తెలుగు రచయితల మహాసభలు :

భారతదేశ స్వాతంత్ర్యానికి వజ్రోత్సవ సంవత్సరం సందర్భం గానే ప్రపంచ తెలుగు రచయితల మహాసభలు జరిగాయి. 2007 సెప్టెంబర్ 21, 22, 23 తేదీలలో, విజయవాడ శేషశాయి కళ్యాణ మండపంలో వైభవోపేతంగా జరిగాయి. దాదాపు 800 మంది సాహితీ ప్రముఖులు అతిథులుగా రాగా, మూడు రోజులలోనూ కనీసం 10,000 మంది సదస్సులకు హాజరై ఉంటారని అంచనా! ప్రజలలో భాషోద్యమ స్ఫూర్తిని కలిగించి, భాషాభిమానాన్ని రేకెత్తిం చేందుకే ఈ సభలు నిర్వహించామని, ఆ మేరకు ఈ సభలు విజయవంతమయ్యాయని కృష్ణాజిల్లా రచయితల సంఘం భావించింది. ఈ మొదటి ప్రపంచ తెలుగు రచయితల మహాసభల తర్వాత నిజంగానే ప్రజలలో అనుకూల మార్పు కన్పించింది. మనం తెలుగు వాళ్లం, తెలుగులో మాట్లాడటం నామోషీ అనుకోవాల్సిన అవసరం లేదు, తెలుగువారమైనందుకు మనం గర్వించాలనే భావన ప్రజలలో క్రమేణా ప్రస్ఫుటం కాజొచ్చింది. ఇప్పుడు ప్రతి విద్యాలయంలోనూ తెలుగు భాషాదినోత్సవాలు, తెలుగు మీద ప్రత్యేక కార్యక్రమాలు నిర్వహించడం ఒక ఆచారం అయ్యింది. కొందరు పనిగట్టుకొని కార్పొరేట్ స్కూలు ముసుగులో తెలుగులో మాట్లాడి నందుకు పిల్లలను శిక్షించడం, "నా జన్మలో తెలుగు మాట్లాడను" అని బోర్డు రాసి మెడలో తగిలించి, ఎండలో నిలబెట్టడం, గుడ్డలూడదీసి బెంచి ఎక్కించడంలాంటి దుశ్చర్యలకు పాల్పడుతున్నప్పటికీ ఉన్నంతలో భాషాభిమానం ప్రదర్శిస్తున్న వారి సంఖ్య నానాటికి పెరుగుతూ వస్తోంది. ఇదొక సానుకూల పరిణామం. ఇందుకు కృష్ణాజిల్లా రచ యితల సంఘం నిర్వహిస్తున్న కార్యక్రమాలు ప్రధాన ప్రేరకంగా వున్నాయన్నది వాస్తవం.

## వజ్రభారతి గ్రంథ ప్రచురణ :

ప్రపంచ తెలుగు రచయితల మహాసభల సందర్భంగా రాష్ట్ర గవర్నర్ తివారీ, కేంద్రమంత్రి పురంధేశ్వరి ఆవిష్కరించిన 'వజ్ర భారతి' 216 వ్యాసాల అనుశీలనా గ్రంథం కృష్ణాజిల్లా రచయితల సంఘం కృషికి ఒక తార్కాణంగా నిలిచింది. భారత స్వాతంత్ర్య వజ్రోత్సవాల సందర్భంగా 60 ఏళ్ల స్వతంత్ర భారతదేశంలో వివిధ రంగాలలో తెలుగువారి ప్రగతి సమీక్షగా ఈ గ్రంథం వెలువడింది. ఇమ్మడిశెట్టి అక్కేశ్వరరావు చారిటబుల్ ట్రస్ట్ ఈ గ్రంథానికి సౌజన్యం వహించింది. ఇది 1/4 డెమ్మీ సైజులో 1100 పేజీల మహాగ్రంథంగా వెలువడింది. ఐ.ఎ.ఎస్., ఐ.పి.ఎస్. లాంటి పోటీ పరీక్షలకు వెళ్ళేవారికి ఈ పుస్తకం ఒక కరదీపికగా ఉందని, అనేక రంగాలలో తెలుగువారి విజయాలకు సంబంధించిన సమాచారం చక్కగా విశ్లేషించబడిందని విమర్శకుల ప్రశంసలు పొందిన గ్రంథం ఇది !

## తెలుగు భాష ప్రాచీనతపై జాతీయ సదస్సు :

ప్రపంచ మహాసభల నిర్వహణ తర్వాత కృష్ణాజిల్లా రచయి తల సంఘం భాషోద్యమాన్ని బలోపేతం చేసే బాధ్యతలు స్వీకరిం చింది. 2008 ఫిబ్రవరి 17,18 తేదీలలో భారతీయ భాషా కేంద్రం (CIIL), ద్రావిడ విశ్వవిద్యాలయం వారి సహకా రంతో "తెలుగు భాష ప్రాచీనత – విశిష్టత" అనే అంశం మీద ఒక జాతీయ సదస్సుని విజయవాడ హోటల్ ఐలాపురం హాలులో జరిపింది. భాషాజాతిగా తెలుగువారు ప్రాచీనులని, తెలుగు భాషకు 2000 సంవత్సరాలకు మించిన ఆధారాలున్నాయని ఈ సదస్సులో పరిశోధకులు అనేక ఆధారాలను చూపించారు. తెలుగు భాష ప్రాచీనత పైన జరిగిన తొలి సదస్సు ఇది ! ఈ సదస్సులో సమర్పితమైన పరిశోధనా పత్రాలతో "తెలుగు భాష ప్రాచీనత –విశిష్టత" పేరుతో ఒక పుస్తకాన్ని కూడా వెలువరించింది ఇమ్మడిశెట్టి అక్కేశ్వరరావు చారిటబుల్ ట్రస్ట్ వారే ఈ గ్రంథానికీ సౌజన్యం వహించారు. ఈ పుస్తకం ఆవిష్కరణకు ముందురోజు 2008 అక్టోబర్ 31న కేంద్రమంత్రిణి అంబికా సోనీ గారు తెలుగు, కన్నడ భాషలకు ప్రాచీనత హోదా ప్రకటించడంతో ఈ ఆవిష్కరణ సభని విజయోత్సవ సభగా నిర్వహించింది. కేంద్ర మంత్రిణి పురంధేశ్వరిగారు ఈ గ్రంథాన్ని ఆవిష్కరించారు.

భాషా జాతీయులుగా తెలుగువారు కృష్ణాజిల్లా కేంద్రంగా చరిత్ర పూర్వయుగం నుంచీ సాధించిన అంశాలపైన ఇంక దృష్టి సారించింది. కృష్ణా జిల్లా రచయితల సంఘం. ఇందు కోసం రెండు ప్రధానమైన విశేష సదస్సులను నిర్వహించింది. మొదటిది 'కృష్ణాజిల్లా చారిత్రక వైభవం' పై జాతీయ సదస్సు కాగా, రెండవది సింధు కృష్ణా లోయల నాగరికతల తులనాత్మక అధ్యయన జాతీయ సదస్సు. ఎంతో విలువైన, సాధికారికమైన చారిత్రక విశేషాలను ఈ సదస్సు ఆవి ష్కరించాయి.

## కృష్ణాజిల్లా చారిత్రక వైభవం-సదస్సు :

కృష్ణా ముఖద్వారం కేంద్రంగా గత 3000 సంవత్సరాలుగా నడిచిన తెలుగువారి చరిత్రని 121 మంది పురావస్తు శాస్త్ర పరిశోధ కులు, చారిత్రక వేత్తలు, సాహిత్య వేత్తలు విశ్లేషించిన సదస్సు ఇది. భారతీయ పురావస్తు సర్వేక్షణ వారితో కలిసి ఈ సదస్సు 2008 మార్చి 21, 22 తేదీలలో మచిలీపట్టణం డచ్ కోటలో జరిగింది. భయంకరమైన వాన, పెనుగాలులకు వెయ్యిమంది కోసం ఏర్పాటు చేసిన పందిళ్లు డేరాలన్నీ కొట్టుకుపోయి సదస్సుకు అవరోధం ఏర్పడినా, అప్పటి కప్పుడు జిల్లా పరిషత్ సభాస్థలిలోకి వేదికని మార్చి, మొదటి రోజు సదస్సును నిర్వహించగా, రెండవరోజుకి డచ్‌కోటలో ఏర్పాట్లన్నీ పునరుద్ధరించి, వేదికని మళ్లీ డచ్ కోటకు మార్చడం జరిగింది. భారతదేశంలో డచ్ రాయబారులు ఈ సదస్సుకు హాజరు కావడం ఒక విశేషం. ఈ సదస్సులో సమర్పితమైన పరిశోధనా పత్రాల సమాహారమే ఇప్పుడు మీ చేతులలో ఉన్న ఈ పుస్తకం. ఇమ్మడిశెట్టి అక్కేశ్వరరావు చారిటబుల్ ట్రస్ట్ మరియు కె.సి.పి. లిమిటెడ్ వారు ఈ గ్రంథ ప్రచురణకు సౌజన్యం వహిస్తున్నారు.

## సింధు-కృష్ణా లోయల నాగరికతల తులనాత్మక అధ్యయన సదస్సు:

ద్రావిడ విశ్వవిద్యాలయం, రాష్ట్ర పురావస్తుశాఖ వారి సహ కారంతో "సింధు కృష్ణా లోయల నాగరికతల తులనాత్మక అధ్యయన సదస్సు"ను విజయవాడ హోటల్ ఐలాపురం 2009 జనవరి 24, 25 తేదీలలో నిర్వహించడం జరిగింది. రాష్ట్రంలోని పురావస్తు శాస్త్రవేత్తలు అనేకమంది ఈ సదస్సులో పాల్గొన్నారు.

సింధునాగరికత నడుస్తున్న కాలానికి డెక్కన్ భూభాగంలో మానవ సంచారం ఉంది. కృష్ణాలోయ ప్రాంతంలో మనుషులు జీవించారు. వారికొక సంస్కృతి వుంది. నాగరికత వుంది. ఇనుము కరిగించగల నేర్పరులు వాళ్లు. అయితే, చరిత్రకారులు ఈ ప్రజలను, వారి నాగరికతని అధ్యయనం చేయడంలో నిర్లక్ష్యం వహించారు. ఆ నాగరికతని కృష్ణాలోయ నాగరికతగా పిలవాలనీ, సింధు నాగరికతకూ, కృష్ణా నాగరికతకు మధ్య సంబంధాలను ఆ రెండు నాగరికతల స్వరూప స్వభావాలనూ తులనాత్మకంగా అధ్యయనం చేయాల్సిన అవసరాన్ని ఈ సదస్సులో పురావస్తు శాస్త్రవేత్తలు అంగీకరించడం విశేషం. భాషోద్యమ స్ఫూర్తితోనూ, భాషాభిమానంతోనూ, జాత్యాభిమానంతోనూ, చరిత్రకారులు పురావస్తు శాస్త్రవేత్తలు తమ పరిశోధనలను కొనసాగించవలసిన అవసరాన్ని ఈ సదస్సు నొక్కి చెప్పింది.

కృష్ణా జిల్లా రచయితల సంఘం దృష్టిలో ఇదంతా భాషోద్యమంలో భాగమైన శ్రమ మాత్రమే ! తెలుగువారి ప్రాచీన తకు సంబంధించిన ఏ చిన్న ఆధారం దొరికినా దాన్ని వెలుగులోకి తేవడం ఏకైక లక్ష్యంగా ఈ సదస్సులకు రూపకల్పన జరిగింది.

## తెలుగు భాష-సంస్కృతీ చైతన్య యాత్ర :

2008 ఆగస్టు 2 నుంచి 5 వరకూ తొలి "తెలుగుభాష సంస్కృతీ చైతన్యయాత్ర"ని మచిలీపట్నం నుంచి నెల్లూరు వరకూ నిర్వహించి, ఊరూరా తెలుగుభాష పట్ల మమకారాన్ని పెంచుకోవల సిందిగా ప్రజల గుండె తలుపులు తట్టే కార్యక్రమానికి కృష్ణాజిల్లా రచయితల సంఘం శ్రీకారం చుట్టింది. ఆగస్ట్ 5వ తేదీన డా॥ బెజవాడ గోపాలరెడ్డి శత జయంతి సంవత్సరం కావడంతో ఆయన చదువుకున్న బందరు జాతీయ కళాశాల నుంచి, ఆయన స్వస్థలం బుచ్చిరెడ్డిపాలెం మీదుగా నెల్లూరు వరకూ ఈ యాత్ర సాగింది. దారిలో ఎంపిక చేసిన ప్రాంతాలలో పాద యాత్రలు జరుపుతూ 300 మంది రచయితలతో ఈ యాత్ర సాగింది. గుంటూరు జిల్లా రచయితల సంఘం, ప్రకాశం జిల్లా రచయితల సంఘం, నెల్లూరు జిల్లా రచయితల సంఘాలను కూడా ఈ కార్యక్రమంలో భాగ స్వామ్యం చేసి, ఆయా జిల్లాలలో భాషోద్యమంలో వారి పాత్రను కూడా ద్విగుణీకృతం చేయాలనేది లక్ష్యం.

పద్మశ్రీ యార్లగడ్డ లక్ష్మీప్రసాద్ ఈ కార్యక్రమానికి స్ఫూర్తి ప్రదాత. రూపకర్త కూడా ఆయనే. శ్రీ మండలి బుద్ధప్రసాద్ ప్రేరణతో ఈ కార్యక్రమానికి సమాయత్తం అయ్యారు రచయితలు. జస్టిస్ జాస్తి చలమేశ్వర్, శ్రీ వడ్డే శోభనాద్రీశ్వరరావు, శ్రీమతి వి.యస్. రమాదేవి, పద్మభూషణ్ కె.ఇ.వరప్రసాదరెడ్డి, జ్ఞానపీఠ గ్రహీత డా॥ సి. నారాయణ రెడ్డి, జస్టిస్ జి.రఘురాం, దగ్గుబాటి వెంకటేశ్వరరావు, శ్రీ ఎం. వెంకయ్య నాయుడు, ఆచార్య గంగిశెట్టి లక్ష్మినారాయణ, శ్రీ ఉండేల మాల కొండయ్య ప్రభృతులు ఈ యాత్రలో అతిథులుగా పాల్గొన్నారు.

"మన ఇంట్లో మనం తెలుగులోనే మాట్లాడుకుందాం" అనే నినాదంతో ప్రజల్లోకి పాదయాత్రల ద్వారా వెళ్లిన ఒక మహత్తర కార్యక్రమం ఇది. రాజకీయవేత్తగానే కాకుండా, స్వయం గా సాహిత్య వేత్తగా, చిరకాలం ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీకి అధ్యక్షులుగా వున్న డా॥ బెజవాడ గోపాలరెడ్డి శత జయంతి ఉత్సవాలను రచయి తలు ఇలా భాషోద్యమం కోసం పాదయాత్ర ద్వారా జరపడం ఒక అరుదైన నివాళి అనవచ్చు.

## న్యాయ స్థానాలలో తెలుగు అమలుపై జాతీయ సదస్సు :

ఎంత చదువుకున్నవారికైనా కోర్టుకెళితే అక్కడి వ్యవహారాలన్నీ అయోమయంగానే వుంటాయి. అసలే న్యాయపరమైన సాంకేతిక పదాలు-పైపెచ్చు అంతా ఇంగ్లీషులో వుంటుంది వ్యవహారం. చాలా మంది వాది ప్రతివాదులకు తమ తరఫు లాయర్లు ఏం వాదిస్తున్నారో ఎదురుగా వింటున్నా అర్థం కాని పరిస్థితి.

అందుకే న్యాయస్థానాల్లో అన్ని స్థాయిల్లోనూ తెలుగు భాషను అమలుచేయాలని కోరుతూ, అందుకు సాధక బాధకాల మీద ఒక జాతీయ సదస్సును కృష్ణాజిల్లా రచయితల సంఘం 2007 డిసెంబర్ 2న నిర్వహించింది. ప్రఖ్యాత రచయిత, న్యాయమూర్తి, శ్రీ జింబో, శ్రీ సుబ్రహ్మణ్యం, శ్రీ మాడభూషి శ్రీధర్ ఈ సదస్సులో పాల్గొని న్యాయస్థానాలలో తెలుగు అమలుకు సాధ్యాసాధ్యాలను విశ్లేషించారు. ప్రముఖ న్యాయ వాదులు శ్రీ కర్నాటి రామమోహనరావు ప్రభృతులు పాల్గొన్నారు. ఈ సదస్సు ప్రభావంతో చాలామంది న్యాయమూర్తులు తాము నెలకు ఒక కేసయినా తెలుగులో తీర్పు చెపుతామని ప్రకటించడం ఒక శుభ పరిణామం. తెలుగులో అనేక తీర్పులు వెలువరించిన విజయవాడలో ఒక న్యాయమూర్తి శ్రీ సుబ్రహ్మణ్యంగారిని ఈ సదస్సులో సత్కరించడం జరిగింది !

## "నడుస్తున్న భాషోద్యమం" సమీక్షా సదస్సు :

2010 జనవరి 25న విజయవాడలో నడుస్తున్న భాషో ద్యమం తీరుతెన్నుల మీద ఒక సమీక్షా సదస్సును నిర్వహించడం జరిగింది. డా॥ యు.ఎ.నరసింహమూర్తి, ఆచార్య ఎన్.ఎస్. రాజు, డా॥ సామల రమేష్‌బాబు, శ్రీ నండూరి రాజగోపాల్, ఆచార్య వెలమల సిమ్మన్న, నూర్‌బాషా రహంతుల్లా, సంగనభట్ల నరసయ్య, ఆచార్య శరజ్జ్యోత్స్న రాణి ప్రభృతులు ఈ సదస్సులో పాల్గొన్నారు.

## చిన్నయసూరి ద్విశతాబ్ది జయంత్యుత్సవాలు :

నాగార్జున విశ్వవిద్యాలయం, యూజీసీలతో కలిసి 2008 మార్చి నెలలో రెండు రోజులపాటు చిన్నయసూరి సాహిత్యం భాషాభి వృద్ధికి

చేపట్టదగిన చర్యలపై ఒక అధ్యయన సదస్సును కృష్ణాజిల్లా రచయితల సంఘం నిర్వహించింది. చిన్నయసూరి సాహిత్యపీఠం వారితో కలిసి, 2010 జనవరి 26న చిన్నయసూరి ద్విశతాబ్ది ఉత్సవాల సమాపనోత్స వాన్ని కూడా నిర్వహిం చింది. పీఠం అధ్యక్షులు శ్రీ టి.శోభనాద్రి ఆనాటి సభను నడిపించారు.

**తెలుగు మాండలికాలపై జాతీయ సదస్సు :**

కృష్ణా విశ్వవిద్యాలయం, భారతీయ భాషాకేంద్రం (CIIL) లతో కలిసి, కృష్ణా విశ్వవిద్యాలయంలో తెలుగు మాండలికాలపైన ఒక జాతీయ సదస్సును నిర్వహించడం జరిగింది. విశ్వవిద్యాలయం పక్షాన ఈ సదస్సులో సమర్పితమైన పరిశోధనాపత్రాలను ఒక పుస్తక రూపంలో తీసుకువచ్చే ప్రయత్నం జరుగుతోంది.

**తెలుగు మణిదీపాలు గ్రంథ ప్రచురణ :**

వివిధ రంగాలలో ప్రసిద్ధులైన 70 మంది తెలుగువారి జీవిత చరిత్రల్ని దాదాపు 1200 పేజీల ఉద్గ్రంథంగా వెలువరించింది కృష్ణా జిల్లా రచయితల సంఘం. రేపటితరం కోసం వైతాళికులన దగిన ప్రము ఖుల జీవితాలను ఈ పుస్తకం ద్వారా పదిలపరిచినట్లయ్యింది. ప్రసిద్ధ ప్రచురణ సంస్థ ఎమెస్కోవారు ఈ పుస్తకానికి సౌజన్యం వహించారు.

**తెలుగు కథా సదస్సు :**

తెలుగు కథకు వందేళ్ల సందర్భంగా కృష్ణాజిల్లా రచయితల సంఘం 2009 మార్చి 27, 28 తేదీలలో మచిలీపట్నంలో తెలుగు కథ పైన ఒక జాతీయ సదస్సు నిర్వహించింది. భారతీయ భాషాకేంద్రం వారు ఈ సదస్సు నిర్వహణకు తోడ్పాటు నందించారు.

శ్రీ విహారి, శ్రీ మునిపల్లెరాజు, ఆచార్య కొలకలూరి ఇనాక్, శ్రీమతి ఇంద్రగంటి జానకీబాల, శ్రీమతి కె.బి. లక్ష్మి, శ్రీ మధురాంతరం నరేంద్ర, శ్రీ శశిశ్రీ, శ్రీ కోడూరి శ్రీరామచంద్రమూర్తి, శ్రీ వీరాజీ, శ్రీ శీలా వీర్రాజు ప్రభృతులు ఈ సదస్సులో పాల్గొన్నారు. అనేకమంది ప్రముఖ కథా రచయి తలను ఈ సందర్భంగా సత్కరిం చారు. రెండు రోజులూ కథా సమ్మేళనంలో అనేకమంది కథకులు తమ కథలను చదివారు.

**శ్రీ శ్రీ సాహిత్య సమాలోచన సదస్సు :**

శ్రీ శ్రీ శతజయంతి సందర్భంగా, మచిలీపట్నం ఎల్.ఐ.సి. ఉద్యో గుల లలిత కళాసమితితో కలిసి శ్రీ శ్రీ సాహిత్య సమాలోచన సదస్సును 9-8-2009న మచిలీపట్నంలో కృష్ణాజిల్లా రచయితల సంఘం నిర్వ హించింది. కృష్ణా విశ్వవిద్యాలయ కులపతి ఆచార్యమైనేని కేశవ దుర్గా ప్రసాద్, శ్రీమంగళగిరి ఆదిత్యప్రసాద్, శ్రీ కడియాల రామ్మోహనరాయ్, రావిరంగారావు, శ్రీ బీరం సుందరరావు, మాదిరాజు రామలింగేశ్వరరావు, శ్రీమతి కె.బి. లక్ష్మి ప్రభృతులు పాల్గొన్నారు.

**కృష్ణదేవరాయ వైభవం సదస్సు :**

2010 ఫిబ్రవరి 28వ తేదీన కృష్ణాజిల్లా రచయితల సంఘం మచిలీపట్టణంలో శ్రీ ప్రసన్నాంజనేయస్వామి దేవస్థాన అభివృద్ధి కమిటీ సహకారంలో, శ్రీ కృష్ణదేవరాయ వైభవం సదస్సును నిర్వహించింది. కృష్ణదేవరాయలు తెలుగువాడేనని నిరూపించే సదస్సు ఇది. శ్రీమండలి బుద్ధప్రసాద్, ఆచార్య యార్లగడ్డ లక్ష్మీప్రసాద్, ఆచార్య శరజ్జ్యోత్స్నారాణి, శ్రీటి.శోభనాద్రి, డా॥ పాలపర్తి శ్యామలానంద ప్రసాద్, డా॥ గుమ్మా సాంబశివరావు, డా॥ ధన్వంతరి ఆచార్య, శ్రీ మంగళగిరి ఆదిత్య ప్రసాద్, ఆచార్య యస్.గంగప్ప, శ్రీ పువ్వాడ తిక్కన సోమయాజి, శ్రీ యస్. వెంకటేశ్వరరావు, శ్రీ గుడిసేవ విష్ణు ప్రసాద్, డా॥ మాదిరాజు రామ లింగేశ్వరరావు డా॥ సత్రీ, శ్రీ శాలి వాహన ప్రభృతులు పాల్గొన్నారు.

**సుప్రీంకోర్టులో కేసు-కక్షిదారుగా కృష్ణాజిల్లా రచయితల సంఘం:**

2008 అక్టోబరు 31 సాయంత్రం 4 గంటలకు వార్తా మాధ్య మాలలో ఒక మెరుపు వార్త వచ్చింది. శ్రీమతి అంబికా సోనీ తెలుగు -కన్నడ భాషలకు క్లాసికల్ గుర్తింపు నివ్వటానికి కేంద్రం సముఖంగానే ఉన్నదని ప్రధాన మంత్రి మాటగా ఆమె ప్రకటించారు.

1) చెన్నై హైకోర్టులో నడుస్తున్న కేసు తేలిన తర్వాత
2) కేంద్ర కేబినెట్ ఆమోదం పొందిన తర్వాత

ఈ నిర్ణయం అమలులోకి వస్తుందని ఆమె ప్రకటించారు. షరతులతో కూడినదే అయినప్పటికీ, అంబికా సోనీ ప్రకటన తెలుగు, కన్నడ ప్రజలలో హర్షామోదాలను కల్గించింది.

చెన్నై హైకోర్టులో కేసును ఎదుర్కొనేందుకోసం ఆనాటి ఆంధ్రప్రదేశ్ అధికార భాషా సంఘం అధ్యక్షులు డా॥ ఎ.బి.కె. ప్రసాద్ తెలుగుభాష పక్షానా, కన్నడ ఫిలిం డెవలప్‌మెంట్ కార్పొరేషన్ కన్నడ భాష పక్షానా చెన్నై హైకోర్టులో ఇంప్లీడ్ అయ్యారు.

అయితే, కేసు విచారణకు రాకుండా వాయిదాలతో రోజులు గడుపుతున్నప్పుడు కృష్ణాజిల్లా రచయితల సంఘం కూడా కక్షిదారు లుగా చేరి సుప్రీంకోర్టును ఆశ్రయించడం జరిగింది. ఇది రెండు రాష్ట్రాలు - తెలుగు, కన్నడ భాషలకూ-కేంద్ర ప్రభుత్వానికి మధ్య వ్యవ హారం కాగా, మూడో రాష్ట్రమైన తమిళనాడుకూ, తమిళ భాషకూ ఇందులో ప్రమేయం అనవసరం కాబట్టి, తమిళులు ఇప్పటికే క్లాసికల్ హోదాను సాధించుకొని లబ్ధిదారులుగా ఉన్నారు కాబట్టి, కేవలం మోకాలడ్డే ఈ కుతంత్రాన్ని ఆపుచేసి, చెన్నై హైకోర్టులో వేసిన వ్యాజ్యాన్ని రద్దు చేయించవలసిందిగా కృష్ణాజిల్లా రచయితల సంఘం సుప్రీంకోర్టును అభ్యర్థించింది.

సుప్రీం కోర్టులో కేసు దరిమిలా, చెన్నై హైకోర్టులో ఈ కేసు విష యమై న్యాయమూర్తి తన అశక్తతను వ్యక్తపరిచి వాయిదా వేశారు. అప్పటి వరకూ మౌనంగా ఉన్న కేంద్ర ప్రభుత్వం సుప్రీం కోర్టులో తన వాదనను వినిపించింది. తెలుగు, కన్నడ భాషలకు ప్రాచీనతా హోదాని ఇవ్వడం పట్ల తన నిబద్ధతను కోర్టుకు తెలియచేసింది.

2009 మే 16న ఎన్నికల ఫలితాలు వెలువడటానికి ముందు ప్రధానమంత్రి అత్యవసర కేబినెట్ సమావేశం జరపగా, తెలుగు - కన్నడ

భాషలకు క్లాసికల్ హోదా ఇచ్చే విషయంలో కేంద్ర కేబినెట్ ఆమోదం లభించింది. దాంతో అంబికా సోనీగారు చెప్పిన క్యాబినెట్ ఆమోదం షరతు నెరవేరినట్లయ్యింది. ఇంక మిగిలింది చెన్నై హైకోర్టు కేసు.

ఇది ఇలా ఉండగా, సుప్రీంకోర్టు చెన్నై కోర్టు విషయంలో జోక్యం చేసుకోవడానికి నిరాకరించింది. చెన్నైలోనే దీన్ని పరిష్కరించు కోవల సిందిగా 2010 ఏప్రియల్‌లో తీర్పు వెలువరించింది.

దరిమిలా పద్మశ్రీ యార్లగడ్డ లక్ష్మీప్రసాద్ ప్రభృతులు ఢిల్లీలో మళ్లీ కేంద్ర మానవ వనరుల శాఖ మంత్రులను కలిసి ఈ కేసు విషయమై కదిలించడంతో న్యాయశాఖ అభిప్రాయాన్ని కోరడం, కేంద్ర న్యాయశాఖ – చెన్నై హైకోర్టులో కేసు నడుస్తున్నప్పటికీ తెలుగు కన్నడ భాషలకు నిధులు విడుదల ఆపవలసిన అవసరంలేదని చెప్పడంతో చకాచకాఫైళ్లు కదిలాయి.

కేంద్ర మానవ వనరులశాఖ యూనివర్శిటీ గ్రాంట్స్ కమీషన్, కేంద్ర సాహిత్య అకాడమీ, భారతీయ భాషా కేంద్రం (మైసూరు) వారికి ఈ న్యాయశాఖ అభిప్రాయం తెలియజేస్తూ, వివరాలు తెలియచేస్తూ, తక్షణం అన్ని కేంద్రీయ విశ్వవిద్యాలయాలలోనూ తెలుగు, కన్నడ పీఠాలు నెలకొల్పవలసిందిగా ఆదేశించింది. 2010 ఆగస్ట్ నెలలో హైదరాబాద్ కేంద్రీయ విశ్వవిద్యాలయంలో ఒక తెలుగు పీఠాన్ని నెలకొల్పారు కూడా. అయితే, దానికి పాలక వర్గాన్ని, పరిశోధకులను, నిధులను, విధులను ఏర్పాటు చేయవలసివుంది.

ఇది ఇలా ఉండగా చెన్నై హైకోర్టులో మన పక్షాన వాదిం చడానికి అధికార భాషా సంఘానికి అధ్యక్షులు లేకుండా పోవడంతో, మన పరో క్షంలో కేసును మనకు వ్యతిరేకంగా నడిపించే ప్రమాదాలు కన్పించడంతో ముఖ్యమంత్రిగారి దృష్టికి ఈ కేసు పూర్వాపరాలన్నీ తీసుకువెడుతూ, తక్షణం మద్రాసు కేసుని పరిష్కరించే చర్యలు చేపట్టవలసిందిగా కోరుతూ కృష్ణాజిల్లా రచయితల సంఘం ఒక లేఖని రాయడం జరిగింది.

నాటి ముఖ్యమంత్రి రోశయ్యగారు సాంస్కృతిక శాఖ నేతృ త్వంలో ఒక నిపుణుల కమిటీని నియమించి, దీని విషయమై తగు చర్యలు తీసుకోవలసిందిగా ఆదేశించారు. కృష్ణాజిల్లా రచయితల సంఘం గౌర వాధ్యక్షులు, భాషోద్యమ నాయకులు శ్రీ మండలి బుద్ధ ప్రసాద్ కూడా ఈ కమిటీలో ఉన్నారు.

ఈ కమిటీ నిర్ణయం మేరకు, 2010 ఆగస్ట్ 23వ తేదీన రాష్ట్ర సాంస్కృతిక వ్యవహారాల సంచాలకులు శ్రీ చెల్లప్ప, చెన్నై హైకోర్టులో మన ప్రభుత్వం పక్షాన వాదించేందుకు రవీంద్రనాథ్ గారిని న్యాయవాదిగా నియమిస్తున్న విషయం తెలిపారు. కేంద్ర ప్రభుత్వం తరపున సొలిసిటర్ జెనరల్ స్వయంగా ఈ కేసును వాదిస్తారని చెప్పినట్లు కూడా చెన్నై నుంచి వెలువడే వార్త పత్రికలు సూచించాయి. ఈ వ్యాసం రాస్తున్న సమయానికి ఇదీ తాజాస్థితి.

## కృష్ణా విద్యాలయం కోసం, తెలుగు శాఖ కోసం పోరాటం :

బెజవాడలో 1925లో ఆంధ్రవిశ్వవిద్యాలయాన్ని ప్రారం భించినట్లే ప్రారంభించి అనేక కారణాలతో దానిని విశాఖపట్నం (వాల్తేరు) తరలించిన తరువాత విజయవాడలో సిద్ధార్థ విద్యా సంస్థలు ఏర్పడేవరకూ ఈ ప్రాంతాన్ని 'విద్యలవాడ'గా తీర్చిదిద్దాలనే దృఢ సంకల్పం ఇక్కడి నేతల్లో కరువవటం వలన, ఈ జిల్లాకు జరిగిన నష్టాన్ని మరొక విశ్వవిద్యాలయంతోనో, తత్సమానమైన దానితో పూడ్చే నిర్ణయాలు జరగలేదు. ఎన్టీరామారావు ముఖ్య మంత్రి అయ్యాక "ఆరోగ్య వైద్య విశ్వవిద్యాలయం" ఈ జిల్లాకు దక్కింది. వై.యస్. రాజశేఖరరెడ్డి తొలిసారిగా ముఖ్యమంత్రి అయ్యాక శ్రీ మండలి బుద్ధ ప్రసాద్, ఆచార్య యార్లగడ్డ లక్ష్మీప్రసాద్, కృష్ణాజిల్లా రచయితల సంఘం విజ్ఞప్తులను పరిగణనలోకి తీసుకుని బందరులో కృష్ణా విశ్వ విద్యాలయం ఏర్పాటుకు ప్రభుత్వం అంగీకరించింది. అయితే, అలా ఏర్పడుతున్న ఈ కొత్త విశ్వవిద్యాలయంలో తెలుగు శాఖ లేకుండానే కోర్సుల్ని నిర్ణయించిన వార్త తెలిసి కృష్ణాజిల్లా రచయితల సంఘం తీవ్రంగా తన నిరసనను తెలియజేసింది. విశ్వ విద్యాలయం ప్రారంభ సమయానికి జిల్లాలోని రచయితలందరూ ధర్నాచేసి అరెస్టు కావ డానికి సిద్ధం కావలసిందిగా పిలుపు ఇవ్వడమూ జరిగింది. ఆ దశలో నాటి జిల్లా మంత్రివర్యులు శ్రీ మండలి బుద్ధప్రసాద్ ఉన్నత విద్యా మండలిని అంగీకరింపచేసి తెలుగుశాఖ ఏర్పాటుకు మార్గం సుగమం చేశారు. విశ్వవిద్యాలయ కులపతి ఆచార్య మైనేని కేశవ దుర్గాప్రసాద్ స్వయంగా తెలుగు భాషాభిమాని కావడంతో ఆయన తీసుకున్న చొరవ వలననే తెలుగుశాఖ ఏర్పడింది.

విద్యార్థులు చేరడంలేదనే కారణంతో తెలుగు ఎం.ఎ. కోర్సులు పెట్టంలేదని ఉన్నత విద్యా మండలి అన్నప్పుడు, ఫీజులు కట్టుకోలేని విద్యార్థులకు కృష్ణాజిల్లా రచయితల సంఘం వాటిని చెల్లించేందుకు సిద్ధం కావడంతో పరిమితిని మించి విద్యార్థులు చేరారు. దాదాపు ఎనిమిది మంది ఫీజులను కృష్ణాజిల్లా రచయితల సంఘం రెండేళ్ల పాటు చెల్లించింది ..... రెండో సంవత్సరం చివర ఆ విద్యార్థులకే ప్లేస్‌మెంటులు జరిగి వారిలో ఐదుగురికి ఉద్యోగాలు కూడా వచ్చాయి. ఒక రచయితల సంఘం చేయగలిగిన, చేయవలసిన కార్యక్రమంగా దీన్ని భావించాము.

ఇలా తెలుగు భాషోద్యమ స్ఫూర్తితో కృష్ణాజిల్లా రచయితల సంఘం అనితర సాధ్యం అనదగిన ఎన్నో కార్యక్రమాలను నిర్వహించి తెలుగు భాషోద్యమ పరంగా, ప్రజల గుండె తలుపులు తట్టిందనడం అతిశయోక్తి కాదు. జాతీయ కవిసమ్మేళనాలు, వచన కవిత్వం వర్క్ షాపులు, జర్నలిజం వర్క్ షాపులనేకం నిర్వహించి కృష్ణాజిల్లా రచయి తల సంఘం కేవలం కృష్ణాజిల్లాకే పరిమితం కాకుండా, తెలుగునేల నాలుగు చెరగులా భాషా సాహితీ ప్రియులను ఉత్తేజితంచేస్తూ తన ప్రత్యేకతను చాటుకుంటున్నది. ●

# పల్లెలు సాంస్కృతిక జ్ఞాపకాలు

- పోట్లూరు సుబ్రహ్మణ్యం, ఎం.ఏ.

పల్లెలు లేక గ్రామాలు ఇప్పుడు ఏర్పడ్డవి కావు. వేదకాలములోనే వీటి గురించి ప్రస్తావన ఉంది. వేదములలో ప్రాచీనమైనది ఋగ్వేదం. ఈ ఋగ్వేదంలో గ్రామముల యొక్క ప్రస్తావన ఉంది. ఆ రోజుల్లో గ్రామాధికారిని 'గ్రామణి' అని పిలిచేవారు. ఇవి ఆర్థికంగా, రాజకీయంగా స్వయం సమృద్ధి కలిగి ఉండేవి. ఆదికాలంలో మానవులు సంచార జీవితం గడిపేవారు. కాల క్రమంలో సమృద్ధిగా నీరు, సారవంతమైన నేల, సమతుల్యమైన వాతావరణం గల ప్రాంతాలలో స్థిరనివాసం ఏర్పరచుకోవడం మొదలుపెట్టారు. కొన్ని కుటుంబాలు ఒకచోట ఉండడంతో గ్రామం ఏర్పడింది.

పాశ్చాత్య నాగరికతా ప్రభావం లేకుండా ఇప్పటివరకు పురాతన సంస్కృతిని దాచుకొని ఉన్నది పల్లెలే. పల్లె ప్రజలు ముఖ్యంగా వ్యవసాయం మీద ఆధారపడిన వాళ్ళు కావడంతో సూర్యదేవుణ్ణి, వరుణదేవుణ్ణి పూజిస్తారు. అంతేగాక వీరిని ప్రసన్నం చేసుకోవడానికి తరచూ యజ్ఞయాగాదులు, క్రతువులు, పూజలు నిర్వహిస్తారు. అలాగే చెట్లను, జంతువుల్ని, పాముల్ని కూడా భక్తితో పూజిస్తారు. భారతదేశ సంస్కృతికి మూలమైన కర్మ సిద్ధాంతాన్ని వీరు నమ్ముతారు. సామాన్యంగా జీవిస్తూ, త్యాగంతో కరుణతో, దైవభక్తి కలిగి ప్రతిక్షణం సాంప్రదాయబద్ధంగా జీవిస్తారు.

ఆధునిక పోకడలకు దూరంగా సాంప్రదాయ పద్ధతుల్లో వివాహాలు, పోలీసు స్టేషనుకు పోకుండా గ్రామంలోనే గ్రామపెద్దల సమక్షంలో పంచాయితీలు జరిగి న్యాయమైన తీర్పులతో సుఖంగా ఉంటున్నారు. స్త్రీలకు విశేషమైన గౌరవం నేటికీ పల్లెలో ఉంది. అతిథుల్ని ఆదరించడం వారికి గౌరవమర్యాదలు పల్లెల్లో చాలా ప్రాముఖ్యం సంతరించుకొని ఉంది. క్రమశిక్షణ, నీతి నిజాయితీలు కలిగి మోసం, ద్వేషం లేని సమాజం నేటికి మారుమూల పల్లెల్లో ఉంది. ఇల్లు అలకడం, ద్వారబంధాలకు పసుపు రాయడం, కుంకుమ బొట్లు పెట్టడం, గోడలకు సున్నం కొట్టడం లాంటి పద్ధతులు నేటికి పల్లెల్లో సజీవంగా ఉంది.

దిష్టి తీయడం, శకునాలు, కలల్ని నమ్మడం, మంచి చెడు దినాలకు క్యాలండరు చూడడం, తుమ్ములకు ప్రాధాన్యం ఇవ్వడం, బల్లి పడితే శాస్త్రాన్ని పాటించడం, దయ్యాలు, భూతాల్ని నమ్మి మంత్రాలకు, తంత్రాలకు ప్రాధాన్యత ఇవ్వడం మన తెలుగు సంస్కృతికి మచ్చు తునకలు. నమ్మకాలకు విలువ ఇవ్వడం, పుట్టుకలు, చావులకు సంబంధించిన ఆచారాలు పాటించి కార్యక్రమాలు నిర్వహించడం, పండుగలు, పబ్బాలు తు.చ. తప్పకుండా పాటించడం, మిగతా దేవతలతో పాటు గ్రామ దేవతల్ని ఆరాధించడం, తిరునాళ్ళు, జాతరలు చేయడం లాంటి సాంస్కృతిక జీవనం నేటికి గ్రామాల్లో సజీవంగా ఉంది.

పల్లెలోని కుటుంబాలు ఇప్పటికీ సాంప్రదాయబద్ధమైన ఉమ్మడి కుటుంబాలు. తాత, అవ్వ, తండ్రి, తల్లి, చిన్నాయన, చిన్నమ్మ, పెదనాయన, పెద్దమ్మ కొడుకులు, కూతుళ్ళు, అన్నలు, చెల్లెళ్ళు కలిసి ఒకే కుటుంబంగా జీవిస్తున్నారు. ఇది ఒకరి కొకరు ఆప్యాయత కలిగి కలిసి జీవించే ఒక రకమైన రక్షణతో కూడిన వ్యవస్థ. కులమతాలు మరచి గ్రామస్థులందరూ ఒకరినొకరు వరుసలు పెట్టి పిలిచుకుంటూ ఆనందంగా గడిపే జీవితం పల్లె జీవితం. గ్రామ సాంఘిక జీవితానికి మచ్చు తునుక.

పురాతన ఆచారాలు, అలవాట్లు వీళ్ళు తప్పక పాటిస్తారు. వీటిని నిరసత్వంగా తమ తదనంతర జాతికి అందిస్తారు. ఋతువుల వారీగా ప్రకృతి సిద్ధంగా దొరికే కాయగూరలు, ఆకుకూరలు, పండ్లు, వరిధాన్యం, సహజ సిద్ధమైన భాష, నమ్మకాలు, వీరికి ఎప్పుడూ ఉంటాయి. ఆర్థిక అసమానత్వం అనేది చాలా పరిమితంగా ఉంటుంది. బీదవాళ్ళు మట్టిగోడలతో కట్టిన పూరిండ్లలో ఉంటే, మధ్యతరగతి మానవులు పెంకుటిండ్లలో ఉండేవారు. ఆర్థికంగా ఒక మాదిరిగా ఉన్నవారు డాబా ఇండ్లలో నివసించేవారు. ఇది ఈనాటికీ నాగరికతా ప్రభావం లేని పల్లెటూళ్ళలో సజీవంగా ఉంది.

పల్లె జీవితంలో వాస్తవానికి డబ్బుతో పనిలేదు. అంతా వస్తుమార్పిడి పద్ధతే. రైతు పంటలు పండిస్తాడు. కమ్మరి వ్యవసాయ పనిముట్లు చేస్తాడు. వడ్రంగి కొయ్యపని చేసి ఇంటికి అవసరమైన గృహోపకరణాలు చేస్తాడు. కుమ్మరి కుండలు చేస్తాడు. సాలీలు బట్టలు నేస్తారు. ఇలా వీళ్ళు తయారుచేసిన వస్తువులు రైతులకిచ్చి వస్తుమార్పిడి ద్వారా రైతుల నుంచి ధాన్యం పొందుతారు. అలాగే చాకలి, మంగలి, నిమ్నజాతి వాళ్ళు తమ సేవలు అందించి బదులుగా తమ జీవనానికి అవసరమైన సదుపాయాలను రైతుల ద్వారా మిగతా వృత్తి పనివారి ద్వారా పొంది సుఖంగా జీవిస్తారు.

ఇప్పటికీ పల్లెల్లో వస్త్రధారణ మన సంస్కృతిని చాటి చెబుతుంది. కోకలు, రవికలు, పావడాలు, పైటలు, పంచెలు, చొక్కాలు, తుండుగుడ్డలు, జడకుచ్చులు, కమ్మలు, లోలాకులు వాడుతున్నారు. ఆహారం అలవాట్లయిన చద్దన్నం, గడ్డ పెరుగు, వరి అన్నం, రాగిసంగటి, జొన్న సంగటి, పచ్చడి, పులుసు కూరలు, గడ్డ కూరలు తింటున్నారు. రాగి కంకులు, జొన్న కంకులు, సజ్జకంకులు, చిరుతిండ్లుగా వాడుతున్నారు.

రోలు, రోకలి, తిరగలి, కవ్వం, చెక్కపెట్టె, భోషాణాలు, బొట్గలు, బానలు నేటికీ గ్రామస్తులు సజీవంగా వాడుతున్నారు. ఇంట్లో గిలక బావులు నేటికీ ఉన్నాయి. పొలాల్లో దిగుడు బావులు, వాటిలోంచి నీళ్ళు తోడడానికి ఏతాలు నేటికీ వాడుతున్నారు. తాటి ముంజెలు నేటికీ అక్కడ అత్యంత ఇష్టమైన పదార్థాలు. ఇవి నేటి నగరాలలోని హిమక్రీములు (ఐస్‌క్రీముల) కంటే ఎక్కువ ఆరోగ్యంగా, రుచిగా ఉంటాయి. వాగులు, వంకలు, చెరువులు, కాలువలు, తోటలు, తోపులు, గూడుబండ్లు, ఒంటె ఎద్దుబండ్లు, గుర్రపుబండ్లు, పల్లెల్లో తప్ప పట్నాలలో చూడగలమా! స్వచ్ఛమైన గోంగూరపచ్చడి, చింతకాయ పచ్చడి, మామిడికాయ పచ్చడి, చింతచిగురు పచ్చడి, నోరూరించే ఊరగాయలు పల్లెల్లో తప్ప పట్నాలలో ఊహించగలమా!

లడ్లు, అరిసెలు, వడలు, పులిహోర, బొబ్బట్లు, మొదలగు తినుబండారాలు అక్కడ ఎంతో రుచిగా ఉంటాయి. హరికథలు, బుర్రకథలు, భజనలు, చెక్కభజనలు, పండరి భజనలు, తోలు బొమ్మలాటలు, కోలాటాలు, పులిజూదం ఆటలు, తొక్కుడు బిళ్ళలు, గొబ్బిళ్ళు, బిళ్ళంకోడు ఆటలు ఎంతో సహజంగా ఉంటాయి. కోళ్ళు, కుక్కలు, పశువులు, పందులు, కాకులు, గద్దలు, పిట్టలు, మనుషుల్లో కలిసిపోయి సహజీవనం సాగించడం మామూలే.

కల్తీలేని గాలి, నీరు, ప్రకృతిలో జీవిస్తున్న పల్లె ప్రజలు కష్టపడి పనిచేస్తూ ఒళ్లెరుగని నిద్రపోతూ ఆరోగ్యంగా ఉంటున్నారు. కష్టాలు, సుఖాల్లో ఒకరికొకరు తోడుగా ఉంటూ వస్త్రధారణలోనూ, ఆచారాల్లోనూ, అలవాట్లలోనూ తెలుగు సంస్కృతి మూలాలను కాపాడుతూ నేటికీ సజీవంగా ఉన్నాయి.

అందుకే ఈ నవనాగరిక ప్రపంచంలోంచి ఏ మాత్రం నాగరికతా ప్రభావం లేని మారుమూల పల్లెలకు ఒక్కసారి వెళ్ళివద్దాం. కల్తీలేని మన తెలుగు సంస్కృతిని ఒక్కసారి ఆస్వాదించి వద్దాం. ●

# నేనెరిగిన శంకరంబాడి సుందరాచారి

- జాదమద్ది హనుమచ్ఛాస్త్రి

"మా తెలుగుతల్లికీ మల్లెపూదండ" గీతకర్త శంకరంబాడివారితో నా మొదటి పరిచయం రాయదుర్గంలో. అప్పుడు నేను రాయదుర్గంలో ఇన్‌స్పెక్టర్ ఆఫ్ స్కూల్స్‌గా పనిచేస్తుండేవాడిని. వారు నా అతిథిగా వచ్చారు. తాను రచించిన ఏకలవ్యుడు, బుద్ధగీత, సుందరసుధాబిందువులు, అన్న పుస్తకాలు ప్రతులు తెచ్చుకొన్నారు. మరుసటిరోజు రాయదుర్గం హైస్కూల్ సభ ఏర్పాటు జరిగింది. సుందరాచారిగారు తమ రచనల నుండి కొన్ని పద్యాలు శ్రావ్యంగా పాడారు. ఉపాధ్యాయులు, విద్యార్థులు విని ఆనందించారు. ఒక్కొక్క పుస్తకం వెల రూపాయి మాత్రమే. 200 ప్రతులను విద్యార్థులు కొన్నారు.

***(భారతి మాసపత్రిక 1988 సెప్టెంబరు సంచికలో, వారు నాకు రాసిన లేఖ యథాతథంగా)***

శాస్త్రిగారికి శంకరంబాడి గారి ప్రత్యుత్తరం

శ్రీ హనుమచ్ఛాస్త్రిగారికి సుందరాచారి నమస్కరించి వ్రాయునది.

అయ్యా మీ జాబు నానందపూర్వకముగా నందికొంటిని, రాయదుర్గంలో మీరంతా నాకొసంగిన ఆతిథ్యభావం చిరస్మరణీయం. నా సతీమణియు మిమ్ము గుర్తుపట్టగలిగియున్నది.

కవులెవరో కనుగొన్న దుస్సాధ్యమైన నేటి కాలంలో మీరు "మా సీమ కవుల"ను గుర్తించి వ్రాయబూనుట ముదావహం. నేను కవినోకానో నాకు తెలియదు. అయ్యా మీరట్లు చేకొని నా జీవిత విశేషాల నడుగుట చేత కాదనలేక వ్రాయుచున్నాను.

నేను ప్రపంచ సంగ్రామ కాలంలో 10 ఆగష్టు 1914న జన్మించితినని నా తండ్రి తెలిపిరి. రేపటి అగస్టున నేనరువదివయేడు ద్రొక్కుచున్నాను. జన్మ స్థానము తిరుపతి. నా తండ్రి రాజగోపాల్ తల్లి కమలమ్మ.

నాకు రెండవయేట మా తాత మరణింప తండ్రి యుండియు ఆమె తండ్రి మా తాత నన్ను చనువుతో నెత్తి పెంచెను. కట్టుబాట్లు లేని స్వేచ్ఛా వాతావరణంలో సత్సంప్రదాయబద్ధ శ్రీ వైష్ణవుడుగ పెరిగితిని. పదియవ తరగతి వరకు తిరుపతి దేవస్థానం హైందవోన్నత పాఠశాలలో చదివి, ఆపైని మదనపల్లి దివ్యజ్ఞాన సమాజ కళాశాలలో 'ఇంటర్మీడియేటు' చదివి నెగ్గితిని. ఆర్థికాభావమున పై చదువు సాగకపోగా, ఆంధ్రపత్రికా కార్యాలయమున సంవత్సరకాలము సహాయ సంపాద కుడుగా పనిచేసితిని, దానిని వదలి రెండు సంవత్సరములు బెంగుళూరు, 'హిస్ మాస్టర్ వాయిస్' కంపెనీలో కవిగా కొన్ని నాటకముల సెట్లను రచియించితిని. 1989లో పెండ్లాడి బ్రతుకుచెడి చిత్తూరు బోర్డు హైస్కూల్లో సెకండరీ గ్రేడ్ ఉపాధ్యాయుడనై చక్కని దేశికుడని పేరు పొందితిని. ఆ వృత్తి నాకు నచ్చినది కూడా. 1946లో సినిమా పిలుపందినది. రెండు సంవత్సరములు సెలవుగైకొని 'దీనబంధు' అను తెనుగు చిత్రమునకు మాటలు, పాటలు వ్రాసితిని. అప్పుడే ప్రజాదరణ నందుకొనిన "మా తెలుగు తల్లికి మల్లెపూదండ" అను రాష్ట్రీయ గేయమును రచించితిని. టంగుటూరి సూర్య కుమారిచే పాడించితిని. రేడియోలో సారస్వతోపన్యాసములను ప్రసారము చేయుటయు, స్వీయ కవితాగానము చేయుటయునప్పుడే ప్రారంభించితిని, అంతలో నా భార్యకు మనోవ్యాధి కలిగినది. సినిమా వదలి మరలా బడిపంతుల నైతిని. ప్రభుత్వము 1951సం॥లో నన్ను జూనియర్ డిప్యూటి ఇన్స్పెక్టరుగా ఎన్నుకున్నది. ఆకొలువు మూడు సంవత్సరములు మాత్రమే. పై యధికారులకు బానిసనై లొంగి నడువలేక 1954లో రాజీనామా నిచ్చి సాహసించి కవితా జీవనమునకు దొడగితిని.

నాకు బాల్యమునుండియు నాంధ్రభాషపై మక్కువ ఎక్కువ. నేను నా పదునాల్గవయేటనే కవిత్వము వ్రాయదలపడితిని. నాటి కవితాగతుల గుర్తించి యనేకములగు కావ్యఖండికలను, గేయములను వ్రాసి 1940-48వ సంవత్సరములలో వాటిని 'భారతి'లో ప్రకటింపబడజూచితిని.

కాని వయసు ముదురు కొలంది. యట్టి ఖండికలపై నాకర్షణ క్షీణించి పదుగురవలె వ్రాసి ప్రయోజనమేమి? సాహిత్యమునకు నేజేయగలిగిన ప్రత్యేక సేవ యేది? నా శక్తి యెంతటిది? అన్న ప్రశ్నలు నాలో బొడమినవి... "పండితుడు గాను, గురువర్య పంచజేరి పట్టుతో శిక్షణపొందినవాడను గాను. ప్రకృతి సిద్ధముగా లభ్యపడిన తెలుగుబాస-నే ప్రాపుగాగొని వ్రాయువాడ" అని కవిత యున్న కరక్కాయగా భావించు నేటి విద్యార్థి లోకమునకు కవితాభిరుచిని పెంపొందించు దీక్షతో తేట తెలుగులో తేట మాటలతో తెనుగువారి సొంత సొమ్మైన తేట గీతులలో సరళ కావ్యము నల్లి విద్యాశాలలో ప్రచారమునకు తే ప్రారంభించితిని. సర్వేశ్వరుడు నాకు సరళ కవిత్వధారనే కాక చక్కని యుపన్యాస ధోరణిని లభ్యపడ జేసిన కారణమును సులువుగనే విద్యార్థుల ప్రేమను జూరగొంటిని. వారు ఆప్యాయముతో నా మాటలను కావ్యములను విని యానందించుచూ, నా పుస్తకములను స్వేచ్ఛగా కొని నా జీవితమున గడుప నార్థికముగ తోడ్పడుచున్నారు. ప్రజలలో దాతలింకా ముద్రణకు తెచ్చుచున్నారు. నేను 700 విద్యాశాలలు పర్యటించి భాషా ప్రచారము గావించితినింతవరకు.

నేను వ్రాయు కావ్యములన్నియు విద్యార్థుల యుపయోగార్థమే అను కొంటిని కాని అవి మహాకవులను విమర్శకులను గూడా యాకర్షించుట నా యదృష్టము. కీ॥శే॥ శ్రీ పాదవారు, "ఇది విద్యార్థులకుపయోగ నిమిత్తమే యని చెప్పునే కానీ నేనట్లు తలంపను? ఎంతవారికైన నేర్పుకు తగిన పద్ధతు లిందుగలవు అనిరి. తేటగీతుల తెలుగు తేదీపిరుచుల యూట, కొసరుల కెంకుల కాటువడక నమ్మి నమ్మించి నిత్యబోధనమ్ముదారి. సారతరమిది సుందరాచారి కవిత. అనియు ఎవరికెవరో కందమును సీసమును సొంతము చేసికొనినట్లు సుందరాచారిగారు తేటగీతులను సొంతము చేసికొన్నారేమో అన్నంత సామరస్య మును వారి రచనలలో చూపుతున్నారనిరి శ్రీ విశ్వనాథ. తెలుగు పలుకుబడి కవితాశక్తి నాకు ముఖ్యము. ఈ మూడు గుణములను మూటగట్టి వీరు పొత్తములను రచించునట్టున్నది. వీరి శైలి సంస్కృత సమాసము నుండియు మారుమూల పదము నుండి విడివిడి సరళమైనది. వీరు రచించుచున్న గ్రంథముల జూడ నీ యుగములో వీరికొక ప్రత్యేక వాఙ్మయముగ నేర్పాటు కాబోవుచున్నట్లున్నది అన్నారు శ్రీ పింగళి "సుందరాచారి గారి ఖండ కావ్యము లను చదువుకొనియు, చదివించుకొని వినియు ఉత్తమ కవితా పఠనవేళ పొందదగిన పరమాహ్లాదమును పొందుచుంటిని. "తమ రచన యాబాల గోపాలము సర్వజన సంసేవ్యము కాదగినట్లు అప్రయత్నముగ సహజ ధోరణిలో వ్రాయగల తెలుగు కవులలో శ్రీ సుందరాచారి అగ్రశ్రేణికి చెందినవారు అన్నారు. శ్రీ గడియారం" అతని శైలి మిక్కిలి సహజమైనది. చక్కని తెలుగు నుడికారము జాతీయములు ఈతని రచనకు ఒక యందమును చేకూర్చినది. శ్రీరాయప్రోలు "శ్రీ సుందరాచారి సూక్తి ఎంత తేటగా సూటిగా వినబడుతుందో అంతస్ఫూర్తి గాను దూరంగా ధ్వనిస్తున్నది" అన్నారు.

సామాన్య సంఘమును నా సాహిత్య సేవను గుర్తించినది. 40 విద్యా సంస్థలు ఒక్కొక్కటి 116/-లతో నన్ను సన్మానించినవి. 1956లో శ్రీ కల్లూరు

సుబ్బారావుగారు హిందూపురంలో సన్మానించిరి. చిత్తూరు టాగూర్ సెంటెనరీ సెలబ్రేషన్ కమిటీవారు నా గీతాంజలి అనువాదాన్ని ప్రకటించి వెలువరిస్తూ సువర్ణాంగుళీయప్రదానముతో సత్కరించిరి. 1969లో జిల్లా స్థాయిలో ఆంధ్రప్రభుత్వం తిరుపతిలో సత్కరించింది. 1970లో చిత్తూరు రామవిలాస సభవారు జిల్లా కవిగా నన్ను, జిల్లా నటకుడుగా నాగయ్యను, జిల్లా గాయకునిగా చిత్తూరు సుబ్రహ్మణ్యం పిళ్ళైను సత్కరించింది. 1970లో ఢిల్లీ ఆంధ్ర సంఘము ఘన సన్మాన మిచ్చినది. అనేక ఛందస్సులతో వ్రాసిన ఖండికలుగాక నేను నేటికి 9000 తేటగీతులను వ్రాసియున్నాను.

నాకు నటన కూడా నచ్చిన కళ నటింపగలను కూడా. బళ్ళారి రాఘవ స్థానంగార్ల నటనను విమర్శిస్తూ అనేక వ్యాసములను వ్రాసితిని.

ఇక నే రచించిన ముద్రిత గ్రంథములు

**వచనములు :** 1. నేటి కవిత్వము 2. సంగ్రహ సుందర భారతము 3. ఏకలవ్యుడు 4. కళాపూర్ణోదయము

**కావ్యములు :** 2. కెరటాలు (ఖండకావ్య సంపుటి) 2. సుందర సుధా బిందువులు (ఖండకావ్య సంపుటి) 3. బుద్ధగీత 4. ఏకలవ్యుడు 5. అపవాదం 6. పేదకవి 7. నాస్వామి 8. సంగ్రహ వాల్మీకి సుందర రామయణము 10. సుందర భారతము (3 నుండి పది వఱకు అన్ని తేటగీతి కావ్యములే) 11. జనమాల (గేయ సంపుటి) 12. శాంతిదూతలు (బుద్ధుని గాంధీల బుఱ్ఱకథలు) 13. స్వప్న సుందరుడు (ఉషా పరిణయ కావ్యము) 11. గీతాంజలి

**ముద్రితములు :** 1. రంగిరాళ్ళేం (పల్లెపదాలు) 2. గాలిమేడలు (నాటకము) 3. ఆరాచకము (నాటకము)

1936లో సుందర రామాయణము రాళ్ళపల్లి వారి కంకితమగు సభలో వేంకటేశ్వర యూనివర్శిటి యుపాధ్యక్షులు, రిజిస్ట్రారు రామానుజులురావు నాయుడుగారు, రాయప్రోలు మానపల్లివారి సమక్షంలో "ప్రసన్నకవి" యను బిరుదము నందికొంటిని.

ఈ వివరములు చాలనిచో నా పంచాశద్వర్ష పూర్తి వర్ధంతి సన్మాన సంచిక నిందు వెంట ప్రత్యేకముగ బుక్‌పోస్టులో పంపుచున్నాను. నన్ను గూర్చిన వివరములన్నియు నందుగలవు. నా పుస్తకములనన్నింటిని తపాలుద్వారా మీకు పంపుట నాకు చేతకాని పని. మన్నింతురు గాక. మచ్చునకు నా పద్యములు కొన్ని.

ఉ॥ వారును వీరు మెచ్చికొను భంగిని కోరి కలమ్ము పట్టి వ్రాయగా
నేరను వ్రాయు కావ్యములు, నిండు మనమ్మది పొంగి యేరులై
పారెడు దాక యుక్త పదబంధము తీరెడుదాక భావముల్
జారవు నా కలమ్మునిడి సత్యము నా హృదయమ్ము తెల్పితిన్

చ॥ లలిత పదాలనేరి మృదులమ్మగు శయ్యను గూర్చి భావముల్
తెలియజెప్పి పామరుల తెల్వికి పంచ బురాణ గాథలం
దలి పరమార్థ ధర్మముల తత్త్వము నింపి సలక్షణమ్ముగా
కలమును కట్టుతో నిడిపి కైతల నల్లుదు విశ్వశాంతికై

ఇక ఓపికలేదు. నిలుపుతాను. ఇది నా సోది. వలసినంత వాడు కొనండి.

మీ వాడు
సుందరాచారి

1975 ఏప్రిల్‌లో హైదరాబాదులో ప్రపంచ తెలుగు మహాసభలు వైభవంగా జరిగాయి. ఆ సభలో, నా గేయం మా తెలుగు తల్లికీ మల్లెపూదండ పాడుటకు టంగుటూరి సూర్యకుమారి గారిని పిలిపించారు. నన్ను గుర్తించలేదు. సభలకు వెళ్ళిన నన్ను గుర్తించలేదు. కొందరు నా అభిమానులు నేను బయట వుంటున్న విషయం విద్యాశాఖా మంత్రి మండలి కృష్ణారావుగారికి తెల్పారు. ఆయన స్వయంగా వచ్చి నన్ను ఆహ్వానించారు. సభలో సత్కరించారు.

తన జీవితానుభవసారాన్ని వివరిస్తూ

అర్థము గడియించి, అధికారమున పొంగి
అతివలిచ్చు సుఖములనుభవించి
ఆశదీర త్రాగి ఆడినా, పాడినా
చిక్కలేదు సుఖము శ్రీనివాస ॥

1974లో నేను రాసిన జాబుకు బదులు రాశారు. ఆ జాబు భారతి మాస పత్రికలో ప్రచురింపబడింది.

తిరుపతిపట్టణాభివృద్ధి సంస్థ అధ్యక్షులు భూమన కరుణాకర రెడ్డి 2004 నవంబర్ 19 నుండి 23 వరకు, శంకరంబాడి సుందరాచారి సాహిత్య వారోత్సవాలు వైభవంగా జరిపారు. సుందరాచారి నిలువెత్తు విగ్రహం ప్రతిష్ఠించారు. ఆ వారోత్సవాలు ప్రారంభోత్సవ సభకు అధ్యక్షత వహించే భాగ్యం నాకు లభించింది.

జవహర్‌లాల్ నెహ్రూ ప్రధానమంత్రిగా ఉన్నప్పుడు ఢిల్లీలో ఆయనతో మాట్లాడారు. కుశలప్రశ్నల అనంతరం బాలల సంక్షేమంపై గేయం వినిపించారు సుందరాచారి. ఆ గేయంలోని భావాలకు ముగ్ధులైన నెహ్రూ సుందరాచారిని ఆలింగనం చేసుకొని వంద రూపాయల చెక్‌ను స్వయంగా సంతకం చేసి కానుకగా ఇచ్చారు. ఇది తన జీవితంలో మరువరాని సన్నివేశంగా గుర్తుకు తెచ్చుకొనేవారు శంకరంబాడి. రాష్ట్రపతి రాజేంద్రప్రసాద్ 'మీకేవిధంగా సన్మానం కావాలని అడిగినప్పుడు, రూ. 116/-లు ఒక శాలువా ఇచ్చిన చాలును అన్నారు. కీర్తి విముఖులుగ, నిరాడంబరంగా జీవించారు సుందరాచారి.

1975లో జరిగిన ప్రపంచం మహాసభల తర్వాత, ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం మా తెలుగుతల్లి గీతాన్ని రాష్ట్రగీతంగా గుర్తించి, సభా ప్రారంభంలో ఆ గీతాన్ని పాడాలని ఆదేశం జారీ చేసింది. సుందరాచారి చివరి రోజులు దుర్భరంగా సాగాయి. మిత్రులు అభిమానులు ఆర్థికంగా తోడ్పడినారు. తాగుడు ఎక్కువై ఆరోగ్యం క్షీణించి 1977 ఏప్రిల్ 8న తిరుపతిలో పరమపదించారు. ●

## నాన్న

-కాంచనపల్లి రాజేందర్‌రాజు

ఉద్యోగం అంటూ ఉదయాన్నే లేచి వెళ్ళే నాన్న
ఇంటి పట్టున ఉండలేడు కంటినిండా నిద్రపోలేడు

ఇంటినే కాదు అందర్నీ-ఒంటిస్తంభంలా మోస్తున్న నాన్న
ఎప్పుడూ ఒంటరివాడే

సంపాదనంతా కుటుంబానికే వెచ్చించి
మిగిలింది దాచి పిల్లల్ని మెరుగుపట్టి
పదును పెట్టడం కోసం
ఆంక్షల్ని విధించి తాను శత్రువై
కుటుంబ సౌఖ్యం కోసం
ఇంటా బయట నిరంతర పోరాటం చేసే
నిస్వార్థయోధుడు – నాన్న

ఎవరక్కడ? అని అధికారం చెలాయించే నాన్నే గనక
ఒక్క క్షణం మనసు మార్చుకుని
నా సంపదన – నా ఇష్టం అనుకుంటే ఎవరెక్కడ...?

# గంధర్వ గానహేల - ఘంటసాల

- శ్రీ మంగళగిరి ఆదిత్య ప్రసాద్

ఘంటసాల నిత్య ప్రయోగశాలి. కష్టపడి సాధనచేసి సంగీతాన్ని ఆపోశన పట్టిన విద్వాంసుడు. ఈ ప్రయోగశీలతని ఆయనలో ఆర్ద్రతని మిళతం చేశాడు. ఎన్నో గొప్ప సుగుణాలు ఆయన పాటలో ఉన్నాయి. కాబట్టి ఆయన పాట అజరామరంగా నిలిచింది, నిలుస్తుంది. అందుకనే తెలుగుసాహిత్యానికి నన్నయ్య / పద సాహిత్యానికి అన్నమయ్య కర్ణాటక సంగీతానికి త్యాగయ్య / దక్షిణ భారత సినీ సంగీతానికి ఘంటసాల వెంకయ్య అని నా నమస్కృతులు సమర్పించుకుంటాను.

గాసట బీసటగా ఉన్న తెలుగు సాహిత్యాన్ని నన్నయ్య ఎలా తన పద్యం ద్వారా సంస్కరించారో నిర్దుష్ట స్వరూపంలేని రాగాలకు విస్పష్టమైన స్వరూపాన్ని ఇవ్వటం ద్వారా త్యాగయ్య ఎలా కర్ణాటక సంగీతాన్ని ఆవిష్కరించగలిగాడో, ఘంటసాల సినీ గీతం, లలితగీతం ఇలా ఉండాలి అని సమగ్రంగా సంగీత రసికులకు తెలియజేసిన ధన్యజీవి, స్మరణీయుడు. కాబట్టి సినీ సంగీతంలో ఎన్ని మార్పులొచ్చినా ఆయనపాట సజీవంగా అజరామరంగా ఉంటుంది.

పాట మనిషి హృదయాన్ని సుతారంగా స్పృశించాలి. గుండెలో తడిని రగల్చాలి. మనస్సుని రాగరంజితం చెయ్యాలి. మనిషికి ఏదో అలౌకికమైన ఆనందాన్ని అందించే మార్గాలలో పయనింపజెయ్యాలి. ఈ అద్భుతమైన భావనలన్నీ ఘంటసాల గానంలో పుష్కలంగా ఉన్నాయి.

పాట అందించే అలౌకికానందాన్ని Gaston Bachelard అనే పాశ్చాత్య విమర్శకుడు 'A Voice should draw a Listener into the flicitous space' అని నిర్వచిస్తాడు. ఘంటసాల పాట వింటే ఇలాంటి అలౌకికానందంతో ఏవో లోకాలలో విహరిస్తాం.

ఘంటసాల గొంతులో అద్భుతమైన స్థాయి వుంది. మంద్ర పంచమం నుండి తారాస్థాయి పంచమం వరకు అవలీలగా అతిస్పష్టంగా ఆయన గొంతులో సంచారాలు నడుస్తాయి. గౌళ గాత్రానికి పాటలో సమతూకంగా వేగం ఉండటం ఆయన ప్రత్యేకత. ఆయన గళం వరప్రసాదం.

పాట నాభి (బొడ్డు), హృదయం, కంఠం, రసన (నాలుక)ల ద్వారా వెల్లడి కావాలని శాస్త్రం. దీనినే శారజదేవుడు లాంటివారు మరింత స్పష్టంగా గాత్రం అనేది పర (నాభి), పశ్యంతి (హృదయం), మధ్యమ (కంఠం), వైఖరి (రసన - నాలుక) అనే స్థాయిల ద్వారా రావలని ఉటంకించారు.

పాశ్చాత్యులు కూడా సంగీతానుసంధానికి Bass, Tenor, Alto, Suprano అనే నాలుగు స్థాయిలను చెప్పారు. ఈ స్థాయి భావనలన్నింటినీ పుణికి పుచ్చుకున్న గళం ఘంటసాలది. అలాంటి కంఠం బహుశః లక్షలమందిలో ఒక్కరికి కూడా ఉండకపోవచ్చు. రాగానికి నిర్దుష్టమైన రూపాన్నిచ్చి కర్ణాటక సంగీతాన్ని క్రమ బద్ధీకరించిన వాడు త్యాగయ్య. త్యాగయ్యకు ముందు ఖరహర ప్రియరాగాన్ని సైంధవి రాగం లాగ నిషాదాంత్య రాగంలా పాడుతూ 'రామయ్య పెళ్ళికొడుకాయనే' వంటి చిన్న చిన్న పదాలు మాత్రమే ఆలపించేవారని పూజ్యులు రాళ్ళపల్లి అనంత కృష్ణశర్మగారు (వారి రేడియో ప్రసంగం ద్వారా) చెప్పియున్నారు. త్యాగరాజు ఖరహరప్రియలో ప్రక్కల నిలబడి, చక్కని రాజమార్గము, రామ నీ సమానమెవరు, విడెము సేయవే వంటి కీర్తనలు రూపొందించి ఆ రాగాన్ని నిర్వచించాడు. ఖమాస్, కాపీ వంటి ఔత్తరాహిక (హిందుస్థానీ) రాగాలను కర్ణాటక సంగీతానికి అనుగుణంగా అద్భుతంగా మలచి కీర్తనలను అందించాడు. త్యాగరాజు ఒక గొప్ప సంగీత స్రష్ట. అలాగే ఘంటసాల కూడా తనదైన శైలితో ఇది లలితగీతం, సినీగీతం అని చూపించగలిగాడు. ఘంటసాలకు ముందునున్న లలిత, పాడిన సినీ గీతాలను వింటే ఈ సంగతి చాలా స్పష్టంగా తెలుస్తుంది. ఘంటసాల కూడా ఔత్తరాహిక రాగాలైన రాగశ్రీ, మార్గబీహాగ్, (దీనినే నేను 'ఘంటసాల కళ్యాణి' అని అంటాను) వంటి రాగాలను, రాగచ్ఛాయలను అద్భుతంగా తెలుగు లలిత సినీగీతాల్లో మలిచాడు. త్యాగరాజు కీర్తనల్లోను, ఘంటసాల పాటలోను అద్భుతమైన భావచిత్రం ఉంటుంది. అందువలననే త్యాగయ్యను, ఘంటసాలను దేవునిగా భావించి వారి పేరిట వాడవాడలా ఉత్సవాలు చేస్తున్నారు.

ఘంటశాల కళ్యాణి, రాగశ్రీల గురించి కొన్ని వివరాలు చెప్పాలి.

ముందుగా రాగశ్రీ గురించి...

ఇది ఒక అద్భుతమైన హిందూస్థానీ రాగం. కీ॥శే" ఉస్తాద్ బడే గులాం ఆలీఖాన్ ఈ రాగాన్ని ఎంతో ఆహ్లాదంగా పాడేవారు. ఈ రాగం స్వరాలు హరి కాంభోజి స్వరాలు. ధ ని స గ మ ద ని సా ని దా। గ మ రి స ని స ని దా। మ ద ద ద ద మ ని ని ని మ ద ని స గ మ ద ని సనిద గమ రిస ని స ని దా.. నీ.. రీ... సా.. । దాదాపు మన దేశాక్షిరాగంలా నడుస్తుంది. ఈ రాగంలో ఘంటసాల పాతాళభైరవి చిత్రం కోసం ఎంత ఘాటు ప్రేమయో,' సారంగధర చిత్రకోసం 'ఇది నా చెలీ' వంటి పాటలను అందించాడు. ఈ రాగాన్ని Waltz Beat (త్రిశ్రగతి)తో అనుసంధానం చేసి 'ఎంతఘాటు ప్రేమయో' లాంటి ఒక అద్భుతమైన పాటకు బాణీ కట్టి వినిపించాడు. 'సరస రాగాల సమ్మేళనమే పాట' 'A song is nothing but the combination of an excellent melody and an apt rythm' అని పాటను నిర్వచించవలసి వస్తే కొన్ని వేల పాటల్లో ఈ పాటని పైన చెప్పిన నిర్వచనానికి ఉదాహరణగా చూపించవచ్చు. ఈ రాగంలోని పాటలు దక్షిణాత్య సినీ సంగీత రసికులకు ఘంటసాల మనకందించిన వరం.

'ఘంటసాల కళ్యాణిని చితక్కొట్టాడు' అని సాధారణంగా అంటూంటాం. ఇది వాస్తవం కాదు. ఘంటసాల నేను 'ఘంటసాల కళ్యాణి' అని పిలుస్తున్న రాగంలో చేసిన పాటలు, బహుదూరపు బాటసారి (బేసిక్) 'పలుకరాదటే చిలుకా' (షావుకారు) 'పెళ్ళిచేసుకొని ఇల్లుకట్టుకొని' (పెళ్ళిచేసి చూడు) జయహే జయహే (ఆంధ్రజ్యోతి) బేసిక్, 'చూచెదవేలనో ప్రణయసుందరి' అద్వైతమూర్తి బేసిక్ మొదలైనవి. ఈరాగచ్ఛాయ మూర్ఛన - స గ మ ప ని స - స ని ద ప మ గ రి స అని వస్తుంది. దీనిని హిందూస్థానీ సంగీతంలో మార్గబీహాగ్ అని అంటారు. ఇక్కడ పాట స్వరరచనలో నేను రూపొందించిన ఒక సిద్ధాంతాన్ని

చాలా క్లుప్తంగా చెప్తాను. పాట రూపాంతరం చెందటాన్ని (అంటే Manifest కావడానికి) ప్రయత్నిస్తూ ఉంటుంది. ఇదే సందర్భంలో సంగీత దర్శకుడు స్వర రచనకు ట్యూన్ వెతుకుతూ ఉంటాడు. పైన చెప్పిన Manifest అవుతున్న ట్యూన్‌లను గాని, పాటలను గాని సంగీత దర్శకుడు పరిశీలించి తనకు నచ్చిన Manifest అయ్యే ట్యూన్ ఒకదాన్ని తీసుకుని తను స్వరపరుస్తున్న పాటకు adapt చేసుకుంటాడు. ఆ పైన ఆ పాటకి అందమైన మెరుగులు దిద్ది ఒక సమగ్ర గీతంగా మనకు వినిపిస్తాడు. ఇది స్థూలంగా పాట స్వరపరచడానికి నేను రూపొందించిన ఒక సిద్ధాంతం. అలాగే Manifest అయ్యే ఒక రిథమ్‌ను ఒక బీట్‌గాని, సంగీత దర్శకుడు తను స్వరపరుస్తున్న పాటకోసం adapt చేసుకోవచ్చు. ఇప్పుడు మళ్ళీ ఘంటసాల కళ్యాణికి వద్దాం. పైన మనం అనుకొన్న పాట మూలమైన ఒక మెలోడి (మార్గబీహాగ్)లా సాగే రాగచ్ఛాయను ఘంటసాల ఎక్కడ నుండి adapt చేసుకోగలిగాడో అని 7 సంవత్సరాలపాటు ఆలోచించాను. ఒకసారి 'వివిధభారతి'లో భూలే బిస్రే గీత్ కార్యక్రమంలో సైగల్ పాడిన 'మై క్యా జాద్ హై - జాద్‌హై' అనే పాట విన్నాను. అది విని పరమానందంతో గంతులు వేశాను. ఎందుకనంటే షావుకారు చిత్రంలో 'పలుకరాదటే చిలుకా' సైగల పాడిన ఈ పాటకి అతి దగ్గరగా వుంది. ముఖ్యంగా 'జాద్‌హై' అన్నచోట 'దానిగా' అనే నొటేషన్ చిలుకా అనే చోట స్పష్టంగా వినిపిస్తుంది. కాబట్టి సైగల్ పాడిన ఈ పాటలోని రాగచ్ఛాయను ఒక మెలోడిగా రూపొందించుకొని ఆ మెలోడాని పలుకరాదటే చిలుకా, పెళ్ళి చేసుకొని వంటి పాటలకు adapt చేసుకొన్నాడు. ఈ మెలోడీ ఘంటసాల సృష్టి. ఆయన మేథస్సుకి నిలువెత్తు సాక్ష్యం. కాబట్టే ఈ పాటల రాగాన్ని నేను 'ఘంటసాల కళ్యాణి'గా పిలుస్తాను.

కవిత్వానికి ఆత్మ ఉన్నట్టే సంగీతానికి కూడా ఆత్మ ఉంటుంది. కవిత్వం గాని, సంగీతం గాని ఈ ఆత్మ ఉంటేనే పది కాలాలపాటు మనగలుగుతాయి. సంగీతాత్మలో ఆర్ద్రతతో పాటు భావచిత్రం ప్రధాన భూమిక వహిస్తుంది. భావచిత్రం పాటను దృశ్యమానం చేస్తుంది. అంటే పాటలో ఉన్న భావాన్ని మనోఫలకంపై సాక్షాత్కరింపచేస్తుంది. ప్రతీ త్యాగరాజ కీర్తనలోను, ఘంటసాల పాడిన ప్రతిపాటలోను భావచిత్రం ప్రస్ఫుటంగా ఉంటుంది కాబట్టే త్యాగరాజ కీర్తన, ఘంటసాల పాట అప్పటికీ, ఇప్పటికీ, ఎప్పటికీ మన మనస్సులో స్థిరంగా ఉండగలుగుతుంది. ఇక్కడ చిన్న కథ లాంటి విషయం చెప్తాను. ప్రఖ్యాత సింఫనీ రూపకారుడు బెథొవిన్ త్యాగయ్యకు సమకాలీనుడైన పాశ్చాత్య సంగీతజ్ఞుడు. ఈ ఇద్దరు సంగీతజ్ఞానులు సమకాలికులుగా ఉండబట్టే ప్రపంచ సంగీత చరిత్రలో వీరువురూ జీవించిన 18వ శతాబ్దాన్ని సంగీత స్వర్ణయుగం అన్నారు.

ఒకసారి బెథొవిన్ ఒక సింఫనీ తయారుచేయడానికి రిహార్సల్ రూంకి వెళుతుంటూ ఇద్దరు అంధులు ఒక చెట్టుక్రింద నిలబడి 'వెన్నెల చాలా చల్లగా ఆహ్లాదకరంగా ఉంటుందట! మనం జీవితంలో వెన్నెలను చూడలేని దురదృష్ట వంతులం కదా! మన జీవితాలు వృథాయే కదా!' అని దుఃఖపడుతున్నారు. బెథొవిన్ వారి మాటలు విని చలించిపోయి "మిత్రులారా! మీరు దిగులు పడకండి. నేను మీకు వెన్నెలను చూపిస్తాను. మీరు నాతో రండి" అని వారిని తన వెంటే రిహార్సల్ రూంకి తీసుకువెళ్లి అప్పటికప్పుడు Moonlight Sonata అనే సింఫనీని రూపొందించి ఆ అంధులకు వినిపిస్తాడు. ఆ అంధులు ఆ సింఫనీ విని ఆహా! వెన్నెల ఎంతో బాగుంది కదా! మనం ఈ రోజు వెన్నెలను దర్శించగలిగాము' అని బెథొవిన్‌కి కృతజ్ఞతలు తెల్పి ఆయనకు నమస్కరించారు. సొనాటా అంటే పదం లేక పాట అని అర్థం. మూన్‌లైట్ అంటే వెన్నెల అని మనకందరికీ తెలుసు. 'మూన్‌లైట్ సొనాటా' అంటే వెన్నెల పదం లేదా జాబిలి గీతం అని అర్థం.

బెథొవిన్ తన సింఫనీ లోని భావచిత్రం ద్వారా ఆ అంధులకు వెన్నెలను దర్శింపజేశాడు. అందుకే ఘంటసాల 'చల్లని వెన్నెలలో' అని పాడినా, 'ఓ జాబిలి ఓ వెన్నెల ఓమలయా నిలమా' అని ఆలపించినా అందులో మనకి అద్భుతమైన భావచిత్రం కనిపిస్తుంది. ఈ భావచిత్రం ఈ గీతాలలోని ఆత్మను ఆవిష్కరింపజేస్తుంది. అలాగే త్యాగయ్య ప్రతి కీర్తనలో కూడా భావచిత్రం కీర్తనలోని భావాన్ని సాక్షాత్కరింపజేస్తుంది. కొలువైయున్నాడే (ఆరభి), ఉయ్యాల లూగవయ్యా (నీలాంబరి) వంటి కీర్తనలు వింటే కోదండపాణి కొలువైయుండటం, రామయ్య ఉయ్యాలలూగడం మన కళ్ళముందు దృశ్యంగా కనిపిస్తుంది.

ఇలా త్యాగరాజు కీర్తనలోని ఘంటసాల పాటలలోని భావచిత్రం ఆత్మను మనముందు ఆవిష్కరింపజేస్తుంది. జగన్నాథ పండితరాయలు కావ్యాన్ని 'రమణీయార్థ ప్రతిపాదక శబ్దమ్ కావ్యమ్' అని నిర్వచిస్తాడు. అంటే శబ్దానికి చక్కటి అర్థంతోడైనప్పుడు వచ్చే రస విశేషమే కావ్యం అని. దీనినే ఘంటసాల పాటకీ 'రమణీయ స్వర ప్రతిపాదక శబ్దమ్ సంగీతకావ్యం' అని అన్వయించవచ్చు. ఘంటసాల పాడిన ప్రతిపాట కూడా రమణీయమైన స్వర శబ్దాల సమ్మేళనంతో ఏర్పడిన మహా సంగీత కావ్యమే. ●

## అమృతం కురిసిన వేళ

- కె. శంకరరెడ్డి

అమృతం కురిసిన వేళ ఆనందమే
అనుబంధం ఒలికిన వేళ చిరునవ్వు గంధమే

కష్టాల కడలి నుండి - కులాసాల తీరం వైపు
సాగిపోతే జీవననావ - సంతోషకరమే

విషాదాల బ్రతుకులలో - వివాదాలు చుట్టుముట్టక
ప్రమాదం అనుకున్న బ్రతుకు ప్రమదం వైపు సాగితే

అరణ్యరోదనలను - ఆలకించి ఆదుకుంటే
పుడమియంత వనముగ మారి - పులకించిపోదా !

ఊపిరాగిపోయే క్షణాన - కొత్త ఊపిరి వరమై వస్తే
జీవిలోని జీతాశయం - తిరిగి మొలకలేయదా

వెలుగుతున్న జీవితాన - కటికచీకటావహిస్తే
దరికి చేర్చు కరమొకటి - కనికరము చూపిస్తే

ఆశయాల జీవితంబున - ఆటుపోటు లెన్నెదురైనా
ఉదయించే ప్రతి ఉదయం హృదయమున్న నీ కొరకే

# మా తెలుగు తల్లికి మల్లెపూదండ

- సన్నిధానం సువర్చలా సుబ్రహ్మణ్యం

ప్రపంచం అనూహ్య వేగంతో మారిపోతోంది. దశాబ్దాల క్రితం అల వర్చుకొన్న దృక్పథాలూ, అలవాట్లూ, అభిరుచులూ, సంస్కృతీ, సంప్రదాయాలూ ఒక్కొటీ మరుగునపడుతున్నాయి. చిక్కుముళ్ళు పడుతున్నాయి. తరతరాలకూ తరగిపోతున్నాయి. ఒక్కోచిక్కు ముడిని ఎవరైనా విప్పగల్గితే తెల్గుల సంస్కృతీ సౌరభాలు కప్పురంలా గుప్పుమంటూ దిగంతాలకు వ్యాప్తి చెంది గుబాళిస్తాయి.

ఒకప్పుడు వెలుగుజిలుగులు విరజిమ్మే తెలుగు సూర్యుణ్ణి పరభాషా వ్యామోహమనే గ్రహణం పట్టి మబ్బులుక్రమ్మేస్తున్నాయి. తెలుగుభాష మరుగున పడిపోతుంది. ప్రకాశం తగ్గి వెలవెల పోతుంది. "పకోడికొక పద్యం చెప్పినా" భరతఖండంబు చక్కని పాడియావని ఆంగ్లేయుల మీద ధ్వజమెత్తినా ఆనాటి కవులకే చెల్లింది. "దేశభాషలందు తెలుగులెస్స" అని చెప్పే ధైర్యం గాని, స్వాభిమానం కాని కాగడాలతో వెదికినా ఈ తరం వారిలో కన్పించడం లేదు. పైపెచ్చు దేశభాషలలో తెలుగును "లెస్సు" చేస్తున్నారు. తెలుగు మాట్లాడితేనే తమ అంతస్తుకీ, గొప్పతనానికీ భంగమనుకుంటున్నారు. "వెలకాంతలెందరున్నను కులకాంతకు సాటిరారు గువ్వలచెన్నా" అని మహాకవులన్నట్లు తెలుగుభాషలోని తీయదనం, సౌందర్య, సాలభ్యాలు మరే భాషకూ లేవని ఘంటాపథంగా చెప్పొచ్చు. కృష్ణవేణీ తరంగాల వయ్యారాలను, త్రిలింగదేశపు ప్రాభవాలను, నానా రుచిరార్థ సూక్తి నిధులను, రసరమ్య శృంగార రాగమాలికలను, నారాయణతీర్థ, త్యాగరాజాది కృతుల రాగరస ఝురులను, ప్రకృతి రామణీయ కతలను ఎందరో కవులు తమ గ్రంధ రాజములందు నిక్షిప్తం చేశారు. మనని మనం రక్షించుకున్నట్లుగా పూనుకొని పట్టుదలతో తెలుగుభాషకు పట్టిన గ్రహణాన్ని వదలించేటట్లు చేయాలి. మన పిల్లలకు పసితనం నుండీ తెలుగుదనం అలవర్చాలి. తెలుగు సంస్కృతీ సంప్రదాయలపట్ల అభిరుచిని మమకారాన్ని కలిగించాలి. 'అ' అంటే 'అమ్మ' 'అరటి' అనే చెప్పాలి. 'ఆ' అంటే 'ఆవు' అనీ ఆవకాయ అనే చెప్పాలి కాని అ – అంకుల్ అనీ, ఆ అంటే ఆంటీ అని చెప్పించకూడదు. తెలుగు కాశీమజిలీ, పేదరాసి పెద్దమ్మ, నీతిచంద్రిక వంటి కధలను, దేశభక్తి గేయాలు, జానపదాల వంటి పాటలు, రామాయణ, భారతాల వంటి ఇతిహాసములను పరిచయం చేస్తూ, ఆ గ్రంధకర్తల వైశిష్ట్యాన్ని ఆ కథలను పిల్లలకు చెప్తూ తెలుగు భాషలోని తియ్యదనాన్ని వారికి రుచి చూపించాలి. వస్త్రధారణ అంటే కట్టూ, బొట్టూ సైతం తెలుగువారిది ప్రత్యేకతే అని చెపుతూ, అనర్గళంగా తెలుగు మాట్లాడటం, చదవటం, రాయటం నేర్పాలి. ఈతరాని కప్ప, కిచకిచ లాడని కోతి ఎక్కడా ఉండనట్లే తెలుగురాని తెలుగువారుండరని, ఉండకూడదని తెలియజేయాలి.

గొప్పలకు పోయి మాతృభాషను తృణీకరించకూడదనాలి. కొన్ని చీమలు కలసి ఒక మహాసర్పాన్ని లొక్కెళ్ళినట్లు తెలుగువారంతా ఐక్యతతో పూనుకొని ఒక బాటపై నడిస్తే ఆ స్నేహ పవనాలు పరభాషా కేతువును తొలగించి గ్రహణాన్ని వదిలించి వేయగలవు. తెలుగు సూర్యుడు తప్పక వెలుగుతాడు. చీకట్లు తొలిగిన ఆ వెలుగులో ఎవరి లోపాలను వారు సరిచూసుకొని, భాషా పరిరక్షణా కర్తవ్యాన్ని విస్మరించక కృషి చేస్తే తెలుగుభాష ప్రాచీన వైభవాన్ని తప్పక సంతరించు కుంటుంది. పొట్టకూటికై పరభాషను నేర్చినా, ఆశ్రయించినా స్వభాషనెన్నడూ మరువక అధ్యయనం చేస్తూ, చేయించాలి. ఇంతటి గొప్ప కర్తవ్యం మనవల్లేమవు తుందనుకోక ఎవరికి తోచిన సాయం వారందించాలి. అనంతమైన ఆంధ్ర వాఙ్మయంలో ఎన్నో అనర్ఘ పద్యరత్నాలు, ఆంధ్ర సరస్వతికి ఆభరణాలున్నాయి. ఆ సంపదను భద్రంగా వారసులకందించాలి. పిల్లలు, పెద్దలు కూడా పద్యాలను వల్లించాలి. 'అధికార భాషా సంఘం' ఎంతో కృషి సల్పి తెలుగును ప్రాచీన భాషగా గుర్తించి ఘనత కెక్కించారు. అదెంతో సంతోషదాయకం, ఆ సంతోషం పూర్తిగా అనుభవించకముందే పిడుగుపాటుగా "తెలుగు మృతభాషగా మార బోతుంది" అని యునెస్కో వారు వెలిబుచ్చిన వార్త అధః పాథాళానికి కృంగేట్లు చేసింది. భాషలేని జాతికి మనుగడ లేదన్నది నిజం. జాతిక్షేమం మన భాషా క్షేమంలో ఉంది. భాషాక్షేమం మన చేతిలోనే ఉంది. తెలుగుభాషా పరిరక్షణా కర్తవ్యంలో, ఆ నిర్వహణలో తెలుగువారెవరికీ తీసిపోరని నిరూపిద్దాం! వెనుకంగవేయక మన తెలుగుతల్లికి మల్లెపూదండలను మనసారా సమర్పిద్దాం!

## నువ్వు...!

- అరిపిరాల సువర్ణ

చిక్కులను విడదియ్యకలవాడివి...!
సమస్యలను పరిష్కరించ కలవాడివి...!
దేశం కోసం పోరాడే దేశభక్తుడివి...!

బాధ్యతతో పనులు పూర్తి చెయ్యడంలో
రాత్రి పగళ్ళు శ్రమకోర్చి పని చేసే
కార్మికుడివి... ప్రజల క్షేమం కోసం
అర్థం చేసుకోక విగిన తిమ్మరసు మంత్రివి...!

మానవులందరికీ ప్రేమాభిమానాలు చూపే
ఓ మనిషివి.... బాధలు కష్టాలని
ఎవరికొచ్చినా తీర్చడానికి పరిగెత్తే పవిత్రుడివి...!

ఒకటిగాక వేళ్లలా కలిసుండే ఐకమత్యం
అన్నింటా వుండాలి... పేదరికం సెలవు
పుచ్చుకుంది. మోసం చచ్చిపోయిందనే
వార్త అన్ని దినపత్రికలలోనూ చదవాలి...!

వెన్ను విరుచుకు తిరగకలిగితే నువ్వే
నీతి నిజాయితీల ప్రతిబింబానివి...!

ఊకలోదాక్కున్న బియ్యంలా నీకే
లభిస్తాయి నా ప్రత్యేక గౌరవ ప్రతిష్టలు...
మానవుల హృదయాలలో మురికి పట్టిన
ఈర్ష్యాసూయలను మురికిపోయేట్లు
ఉతికి ఆరేయకలిగిన వాడివి...!

బుడగలాంటి జీవితమే అయి
నప్పటికీను పూజనీయ స్థలాలో
నువ్వుంటావు..................!

# "సమాజమా నీ దారి ఎటు?"

రచన : శ్రీమతి తొడుపునూరి సరోజ

అదొక మహానగరం. ఆ నగరంలోని పెద్ద, పెద్ద వీధులన్నీ చాలా సందడిగా, కోలాహలంగా ఉన్నాయి. ఎక్కడికో ఆ ఉరుకులు, పరుగులు తొందర. హడావిడిగా ఉన్నవారందరూ అందరిలోను ఒకే హడావిడి. అంతటి జన సమ్మర్ధంగల వీధులోని ఒక వీధిలో ఓ రిక్షా జోరుగా, హుషారుగా పోతుంది. అంతటి మహానగరంలో ఒక రిక్షా గురించేంటాయని అనుకుంటున్నారు గదూ! అక్కడే ఉందంటి మరి తమాషా ఆ రిక్షాతోనే ఈ కథ మొదలౌతుంది. గనుక

❊ ❊ ❊

రిక్షా అబ్బి రంగడు పొద్దునే చద్ది తిని బయలుదేరాడేమో మహా హుషారుగా ఉన్నాడు. కూని రాగాలు తీస్తూ రిక్షా జోరుగా, హుషారుగా రిక్షా తొక్కుతున్నాడు. ఇంతలో ఎవరో తనని చప్పట్లు కొట్టి పిలుస్తున్నట్లు విన్పిండంతో ఠక్కున కూనిరాగాలు, ఈలలు ఆపేసి పిలుపు విన్పించిన దిక్కుగా చూసాడు. అల్లంత దూరాన ఓ పెద్దమనిషి తననే పిలుస్తున్నాడు. రిక్షాను అటువైపుగా తిప్పాడు రంగడు. అతనో పెద్దమనిషో, ఏ రాజకీయ నాయకుడో గాని చాలా ఘరానాగా, తలపై గాంధీ టోపితో, ఖద్దరు బట్టలు, ఖరీదయిన కూలింగ్ గ్లాసెస్, మెడలో చైను, చేతికి బ్రాస్‌లెట్, ఖరీదయిన సూట్‌కేసుతో గబగబా వచ్చి రిక్షాలో కూచున్నాడు. సూట్‌కేసుని పదిలంగా భద్రంగా పట్టుకొంటూ ఏ బేరమాడకనే పోనిమ్మన్నాడు. మిట్టమధ్యాహ్నమయిందేమో ఎండ మండి పోతూ, పైన తలమాడ్చేస్తుంటే, చెమట ధారగా కారుతూంటే తుడుచుకుంటూ పెద్దమనిషి చెప్తున్నట్లుగానే సందులు, గొందులు తిప్పుతూనే ఉన్నాడు. అలాగే చేతిలోని సూట్‌కేసుని కూడా మారుస్తున్నాడు.

❊ ❊ ❊

అలా ఎందుకు సూటుకేసులు మారుస్తున్నాడో, పైగా తనని ఎక్కడో దూరంగా ఆపుతున్నాడో, అంతుబట్టలేదు. పైగా ఆశ్చర్యంతో నోటమాట రావడం కూడా లేదు. "గదేంది సారు. నన్ను దూరంగా ఆపి మీరు మాత్రం సూట్‌కేసులు కూడా మారుస్తున్నారంటే" ఆపెద్దమనిషి కోపంగా ఖబడ్దార్ నోరుమూసుకో, నీ కెందుకురా అవన్నీ నేను రమ్మన్న చోటికి రావటం మాత్రమే నీ పని. ఎక్కువగా మాట్లాడకు, నీకు దండిగా డబ్బులిస్తాలే" అంటూ త్వరగా పోనిమ్మాడు పెద్దమనిషి. ఈ తిరుగుళ్ళకు పొద్దున్న తిన్న తిండి అరిగిపోయి, ఆకలితో, నకనకలాడుతూ కడుపులో ఎలుకలు తిరుగుతూంటే "ఇంటికెళ్ళి అన్నం తినొస్తా సారు ఓ పది నిముషాలు వదలండి నన్ను" అంటే, అనాలకునే లోపలే ఆ బాబుగారే, ఎంతో ఆప్యాయంగా, ఆకలేస్తుందా ఇంటికెళ్తే ఆలస్యమవుతుందిగాని, ఇక్కడే తిందాంలే అంటూ" ఓ హోటల్లో తనతోపాటుగా అన్నం పెట్టించాడా బాబుగారు.

❊ ❊ ❊

కడుపు నిండా అన్నం తిన్న రంగడు బాబుగారెంత మంచోరో తనతో సమానంగా నాక్కూడా అన్నం పెట్టించాడు. మరో పదిరూపాయలెక్కువిమ్మంట తప్పకుండా ఇస్తాడు. కలిగిన మారాజు కాదనడులేనని ఆలోచిస్తూ రిక్షాని జోరుగా నడిపిస్తున్నాడు. అయ్యగారిచ్చిన డబ్బుతో సీతాలుకు ఎప్పటినుండో మనసుపడ్డ సింతాకు కోక తీసుకోవాలి. అదిచూసి నా సీతాలు ఎంతో సంబరపడుతూ నా దిక్కుమూసే ఆ సూపులకు నేను సంతోషంతో వాటేసుకుంటే ఆ పిచ్చిది కళ్ళు మూసుకొని కిలాకిలా నవ్వుతుంటే అప్పుడు దానందం సూడాలి. రంగడి ఆలోచనలతో సంతోషం ముఖంలో తాండవిస్తూంది. అలా అలా తిరుగుతండగానే అర్ధరాత్రి గడిచిపోయింది. ఆలోచనలాపి టైం చూసుకుంటే అర్ధరాత్రి గడిచిపోయిందనుకోగానే రంగడిలో నీరసం, విస్సత్తువ కలిగాయి. ఊరిచివర ఆ నిశిరాత్రివేళ, సందడిలేని చోట చిమ్మచీకటిలో రిక్షా దిగి రంగణ్ణి బాగా పొగడుతూ తన చేతిలో ఏదోపెట్టి గుప్పెట గట్టిగా మూసి మరొకవకాశమివ్వకనే చకచకా నడుస్తూ చీకట్లో కలిసిపోయాడు. అలా మెల్లిగా దీపస్తంభం దగ్గరకొచ్చి, ఆనందంగా, ఆ బాబు గారెంతిచ్చారో ననుకుంటూ గుప్పెట విప్పాడు. గుప్పెటలో గాలి కెగిరే నోటుని చూసి హతాశుడయ్యాడు. బాధతో విలవిలలాడి పోయాడు రంగడు. నిస్సత్తువుగా, నీరసంగా, ఉదాసీనంగా, కోపంగా, ఛీ. ఛీ. ఏం పెద్దమనుషులు మాటల్లోనే వీళ్ళు జాలి, ప్రేమ చూపిస్తారు. పొద్దటినుండి తిరిగినందుకిదా ఫలితము అనుకుంటూ బాధతో తన చేతిలోని నోటుని కసిగా నలిపి గట్టిగా నేలకేసి కొట్టబోయేంతలో ఎదురుగా యమభటులాంటి పోలీసులు.

పోలీసులొచ్చి ఏం అడుగకనే తనని, రిక్షాని సోదాచేస్తుంటే తను ఆశ్చర్యంగా చూడసాగాడు. అసలే చికాకుగా నున్న రంగ వాళ్ళ మాటలకు, చేష్టలకు మరీ చికాకు పడసాగాడు. రంగణ్ణి ఎగాదిగా చూస్తూ కళ్ళురుముతూ ఈ నోటు నీకెక్కడిది, ఎవరిచ్చారు. ఇది దొంగనోటు తెలుసా! రాత్రిళ్ళు ఇలా తిరుగుతూ దొంగనోట్ల వ్యాపారం చేస్తున్నావా? నిజం చెప్పు" అంటూ రంగ ఎంత చెప్పినా వినకుండా చితకబాదారు. హేళనగా నవ్వుతూ ఏ ముఠాతో సంబంధముందిరా నీకు. ఎంత చెప్పినా వినక లాక్కెళ్ళి, జైలులో పడేసారు తనని. అలా ఓ నాలుగయిదు రోజులు గడిచిపోయాయి.

❊ ❊ ❊

తెల్లవారి తనని కోర్టుకి తీసికెళ్ళారు. కాని అక్కడ కూడా తనకి న్యాయం జరగలేదు. తననెవరూ పట్టించుకోనే లేదు. తను ఎంతగా చెప్పినా, వాళ్ళ కాళ్ళు పట్టుకొని బ్రతిమిలాడినా తనదంతా అరణ్యరోదనే అయ్యింది. ఆ సమయంలో ఆ బడాబాబు సమయానికి హాజరు కానందున కేసును వాయిదా వేసారు. అలా రెండు, మూడుసార్లు ఏదో సాకుతో వాయిదా వేస్తూనేఉన్నారు. తనని మళ్ళీ జైల్లోనే ఉంచేస్తున్నారు, ఇదీ ఈనాటి న్యాయపద్ధతి ఏం జేస్తాం. మరి కొన్నాళ్ళకు ఆ పెద్దమనిషి రావడంతో మళ్ళీ తనని కోర్టులో ప్రవేశపెట్టారు. ఆ బాబుగారిని చూడగానే రంగ ప్రాణం లేచొచ్చినట్టయింది. ఆ బడాబాబొచ్చాడు. తను న్యాయంగా జరిగినదంతా చెబుతాడు. తనకింక పరవాలేదు, తానింకా విడుదలౌతాడనుకొని సంతోషంతో, మురిసిపోయాడు. ఇంటికెళ్ళగానే తన సీతాలుని తీసుకొని ఊరికెళ్ళిపోవాలి. ఈ దగాకోరు, మోసకారి పట్నంలో ఇంకొక్క క్షణం కూడా ఉండకూడదని గట్టిగా నిర్ణయించుకున్నాడు. అక్కడ తనకున్న పొలాన్ని నమ్ముకొని బ్రతకొచ్చని ఆలోచిస్తున్న ఇక జన్మలో ఈ పట్టణానికి రాకూడదని అనుకున్నాడు గట్టిగా

❊ ❊ ❊

అలా ఆలోచిస్తూండగానే, ఆ బడాబాబు వచ్చాడు. తనదగ్గరికొచ్చి, తనని ఎగా,దిగా చూస్తూ నను ముందెప్పుడు చూడనట్టు వింతగా చూస్తుంటే తాను

గబగబా వెళ్ళి ఆ బాబుగారి కాళ్ళమీదపడి ఏడుస్తూ నన్ను కాపాడండి బాబు ఈళ్ళబారి నుండి రచ్చిచ్చుండి సామి నేనే పాపం ఎరుగనని ఎంత చెప్పినా వినడం లేదు. ఆ రోజు మిరిచ్చిన నోటు ఇంకా నాదగ్గరే ఉంది. దొరా. ఆ రోజంతా తిప్పి సందులల్లో దిగుతూ, సూటుకేసులు మార్చలేదా! హోటల్లో నాకు అన్నం కూడా పెట్టించారు. మరిచారా. మీరిచ్చిన నోటు దొంగనోటని నన్ను పట్టుకొని జైల్లో పెట్టి ఇలా హింసిస్తున్నారు. నిజం చెప్పి నన్ను కాపాడండి అని ఏడ్చేశాడు. బడబాబు నోరు తెరచి నీకేమన్నా దమాకుందా! (మెదడుందా) తిడుతూ వీడెవరో నాకు తెలియదు. అసలెప్పుడూ వీణ్ణి చూడందే. గిప్పుడే సూస్తున్నా. పైగా నీ రిచ్చా ఎక్కానంటావా! హా. హా ఇంతకంటే అబద్ధమింకే మయినా ఉందా! ఈ మాటతోనే తెలుస్తుంది గదా! వీడో అబద్ధాల కోరని. నాలాంటి రాజకీయ నాయకున్నే, నాకెన్నో కార్లు, నౌకర్లు, చాకర్లు మా ఇంట్లో ఉన్నారు. వీడి రిచ్చాలో పోడం నాకేం ఖర్మ. నాకెంతో పలుకుబడీ పేరున్న నన్ను అంతమాటంటావా! సాలే అబద్ధం చెప్పినా అతికినట్లుండాలేరా బద్మాష్ ఇంకా మాట్లాడితే నీ చెమ్డాలొలుస్తా!" అని అరుస్తూ వాణ్ణి ఎప్పటికీ వదలకండంటూ పోలీసులతో కలిసి అక్కడినుండి వెళ్ళిపోయాడు. ఆ బడాబాబు.

వాళ్ళతో, అక్కడున్న వాళ్ళందరితో ఏం చెప్పాడో ఏమో, అందరూ నవ్వుతూ చేయి-చేయి కలిపి బయటికొచ్చాడాయన. నన్ను చూసి పళ్ళు పటపటమని కొరుకుతూ ఇలాంటి పుండాకోరు వెధవల్ని ఊరికే వదలకూడదు. నమ్మితే దేశాన్నే మింగేస్తాడు. డబ్బుకాశపడి ఏదైనా చేస్తాడు. అంటూనే న్యాయదేవత సాక్షిగా అంతా నిజమే చెబుతానని ప్రమాణం చేసికూడా అబద్ధాలనే నిజాలుగా చేసి అందరినీ నమ్మించాడు.

❊ ❊ ❊

ఫలితంగా తనకు ఐదేళ్ళ కఠిన కారాగార శిక్షను విధించారందరూ. మళ్ళీ తననీ నరకకూపంలోకి తోసి ఈ చెరసాలలో బంధించారు-అంటూ తోటిఖైదీ సీనుకి తన కథ నలా విన్పించారు రంగ

❊ ❊ ❊

ఇన్నాళ్ళు పెద్దమనిషిలా చలామణయ్యాడు. ధర్మప్రభువులా. ఘరానా బాబులా విర్రవీగినా వాడిపాపం పండింది. ఒక మంచి నిజాయితిగల ఆఫీసరు వాడి అకృత్యాలన్నీ బయటపెట్టి, దేశద్రోహిలా నిరూపించి, యావజ్జీవ కఠిన కారాగార శిక్షని విధించారట అందరూ చెప్పుకోగా విన్నాను. ఇన్నాళ్ళకి దైవం కళ్ళు తెరిచాడు" అంటూ సీను భుజంపై వాలి కళ్ళనీళ్ళు పెట్టుకున్నాడు రంగడు. జరిగిపోయిన విషయాలు, భార్య జ్ఞాపకం రాగా మనసంతా వికలమయ్యింది. ఓదార్పుగా స్నేహితుని భుజం తడుతూ ఊరుకో రంగా చేయని నేరానికి ఇన్నేళ్ళు శిక్ష ననుభవించావు. ఇప్పటికయినా నిజం తెలిసినందుకు సంతోషించు. వాడు చేసిన తప్పులు నీ నిజాయితి బైటపడి నందుకు. మరింకెందుకీ విచారం. అంటూ నేడో, రేపో నిన్ను వదిలేస్తారు. వెళ్ళి నీ భార్యతో సుఖంగా ఉండు. అని అన్నాడు సీను. కాని నాకలాంటి అవకాశమే లేదు. రాదు కూడా. నేనిక్కడికెలా వచ్చానో తెలుసా!" అంటూ తన జీవితగాథను చెబుతా విను. అంటూ సీను రంగకి చెప్పసాగాడు.

❊ ❊ ❊

నేను తాలుకాఫీసులో ఓ గుమాస్తాని. నా పనేంటో నేను చేస్తా! ఎవరినీ పట్టించుకోను. నాకు ధర్మం, న్యాయమంటే ఎంతో గౌరవం. ఆ బాటలోనే నేను నడవాలని నా అభిప్రాయం. కాని మా పై అధికారి, ఆఫీసరున్నాడే వాడు పరమ ఛండాలుడు. రాక్షసుడు కూడా. ధన సంపాదనే వాడి ధ్యేయం. వాడి ఆలోచనలెప్పుడు లక్షలు, కోట్లు సంపాదించాలి, మేడలు, మిద్దెలు కట్టి, అతి గొప్ప ధనవంతుడై కార్లలో తిరగాలన్నదే వాడి ఆశయం. దాని కోసం వాడెంత నీచమయిన పనిచేయడానికి కూడా సిద్ధమే. పరమకిరాతకుడు. ఒకనాడు ఆఫీసులో ఏదో పనుందంటూ మంజుల అనే స్టేనోని పిలిచి అసభ్యంగా ప్రవర్తిస్తూంటే అనుకోకుండా నేనది చూసినందుకు, ఆ అమ్మాయి వీణ్ణి చెప్పుతో కొడుతుంటే ఇద్దర్నీ ఆపినందుకు, ఓ పక్క సిగ్గు, అవమానం, నేనది చూసి ఆపినందుకు ఉక్రోషం. బయటెక్కడ చెబుతానోనని పగపెంచుకున్నాడు. అవకాశం కోసం ఎదురు చూస్తున్నట్టున్నాడు. అలాంటి సమయం ఓరోజు రానే వచ్చింది.

ఓ రోజున ఉదయాన ఆఫీసుకెళ్ళిందే తడవుగా ఆ ఆఫీసరుని పిలిచి నాకో సూట్‌కేస్ ఇచ్చి అడ్రసు చెప్పి అక్కడ భద్రంగా ఇచ్చి రమ్మన్నాడు. అలాగే ఆయన చెప్పిన అడ్రసు ప్రకారంగా వాళ్ళ చేతికిచ్చేంతలో సడన్‌గా ఆయన కిందకి వంగాడు. సూటికేసు తన చేతిలోనే ఉంది. అదే సమయాన కెమరాలన్నీ క్లిక్‌మంటూ వెలిగాయి. ఎక్కడో దాక్కున్న వీడియోగ్రాఫర్లు, కెమెరావాళ్ళు బిలబిలా బయటికొచ్చారు. ఆ వెంటనే పోలీసులు. ఇదంతా ముందేప్లాను చేసుకున్నాడేమో! పెట్టె తెరవగా అందులో ఎన్నో లక్షల డబ్బు అదీ నా చేతుల్లో, ఇంకే చేయను. ఏం చెప్పినా ప్రయోజనం లేకపోయింది. పైగా రెడ్‌హండ్‌గా పట్టుకున్నారు. దానికిక తిరుగులేదు కదా, కోపం పట్టలేక అక్కడున్న పేపరు వెయిట్ విసరా! అది ఆఫీసరు తలకు తగిలి గాయమయింది ఇదో కేసు. ఆయనపై నేను హత్యాప్రయత్నం చేసానంటూ భయంతో పరుగెత్తితే తరిమికొడుతూ పట్టుకొన్నారు. ఇంకా మరెన్నో కేసులు పెడుతూ తన మాటలేం వినకనే వాళ్ళకి వాళ్ళేతీర్పు చెబ్బుతూ తనకి జన్మఖయిదు శిక్ష వేసారు. ఈ వార్త వినగానే నా భార్య గుండాగి చనిపోయింది. భయంతో కొడుకు పోయాడట, కూతురు పిచ్చిదై పిచ్చాసుపత్రి పాలయింది. ఇలాగయింది నా జీవితం. నేనీ లోకంలోనే అనాథను. ఎక్కడా ఎవరూ లేరు" అంటూ కళ్ళు తుడుచుకున్నాడు సీను. ఎప్పటికయినా ఆ న్యాయదేవత కళ్ళు తెరవక పోతుందా తాడి దన్నే వారొకరయితే వాడి తలదన్నే వాడు రాకపోతాడా వేచి చూడాల్సిందే కాలమే దానికి జవాబు చెబుతుంది. వీళ్ళ అన్యాయాలకు మరెంత అమాయకులు బలిగానున్నారో గదా, ఓ నేతాజీ, ఓ మహాత్ముడు, ఓ శాస్త్రి, ఓ నెహ్రూ వీళ్ళలో కొందరయినా మళ్ళీ వస్తే దేశం బాగుపడుతుందంటూ తన ఆవేదనని వ్యక్తం చేసాడు సీను. రంగ ఒకరినొకరు ఓదార్చుకుంటూ మరేం చేయలేక. ●

## ఆకుపచ్చని జ్ఞాపకం

- పి. పద్మావతి శర్మ

పచ్చిక బైళ్ళపైన ఇసుక దిబ్బల మీద
పారే నీళ్ళలోన ఎగిరే పక్షుల తోనూ
గుడి గంటల చప్పుడులోను - తాతయ్యల ప్రేమలోనూ
నానమ్మల అప్యాయతలోను - అమ్మమ్మ ఆదరణలోను
అమ్మ మమతతోను - నాన్న ఆసరతోను
మిత్రుల ఆటపాటలతోను - గురువుల అదుపాజ్ఞలలోను
పెద్దల సహాయ సహకారములతోనూ
కలగలసిన నా బాల్యం - ఆకుపచ్చని జ్ఞాపకం నా బాల్యం

# సలహాల సుబ్బారావు

- వియోగి

శ్రీమాన్ సుబ్బారావుకు ఆత్మవిశ్వాసం కొంచెం జాస్తి! చదివింది ఆర్ట్సు అయినా తన గురించి తాను చాలా గొప్పగా భావించుకుంటూ ఉంటాడు. ఈ జబ్బు అతనికే గాదు - సగటు ఆంధ్రుడికి ఉందని కొందరి అనుమానం. ఈ ఆత్మవిశ్వాసం ఎందుకు యింతగా స్వైన్ ఫ్లూలా పెరిగిపోయిందంటే అతను ఏ ఆఫీసులో పనిచేసినా కొందరు కొలీగులు అతన్ని సలహాలను యిమ్మని కోరడమే ముఖ్యకారణం. ఆపైన శ్రీమతిగారు కూడా అతను చెప్పిందానికి ఎప్పుడూ అడ్డుపడక పోవడం యింకో కారణం.

కాని ఈ మధ్యనే సుబ్బారావులో కొంచెం 'లో చూపు' కలిగి సలహాలు యివ్వడం మానుకుందామనుకుంటున్నాడు. ఎంతో బలవంతం చేస్తే తప్పించి యివ్వదలచుకోవడం లేదు. ఆయాచితంగా యిచ్చే సలమాలకు విలువ లేదని గ్రహించడం మొదలెట్టాడు. ఈ మధ్య, అదేదో ఆఫీసు గట్రా పెట్టి సలహాలిచ్చి దానికే వేలకు వేలు తీసుకొని వెలిగిపోతున్నారు కొందరని, అతనికీమధ్యే తెలిసింది కూడా. ఆ రోజు ఆదివారం సుబ్బారావు కాలుమీద కాలేసుకుని కాఫీ సేవిస్తూ పత్రికను పఠిస్తున్నప్పుడు బావమరిది రంగారావు మెరుపులేని పిడుగులాగా ఊడిపడ్డాడు.

"బావా సుబ్బారావు! వచ్చేశాడు ఈ రంగారావు!" అంటూ సూట్‌కేసుతో దిగబడిపోయాడు యింట్లోకి. "అదేంటి సడన్‌గా వచ్చావు?!" బోల్డు ఆశ్చర్యపోతూ అడిగాడు సుబ్బారావు. "ఏం రాకూడదా! చెల్లాయి సుహాసినీ - నా రాక మీకేమయినా యిబ్బంది కలిగించిందా?" అంటూ లోపలికి గావుకేక పెట్టాడు. "అదేంటన్నయ్యా! రాక రాక నువ్వొస్తేనే వద్దంటానా?" లోపల నుంచి గరిటె తిప్పుతూ బయటకొచ్చింది. సదరు సుహాసిని సుబ్బారావు భార్య. నువ్వు వస్తానంటే నే వద్దంటానా' అంటూ హమ్ చేసింది కూడా!

"అది కాదోయ్ రంగా! దూరవాణిలో ఒక్క ముక్క చెప్పి ఏడ్వచ్చుగా?" ఎలాగూ రావడం ఖాయం అయింది - మళ్ళీ సెల్లులో సొల్లు ఎందుకు? ఓ రూపాయి ఖర్చు!" చొక్కా విప్పదీసుకుంటూ చెప్పాడు. "అది కాదు రంగా! పొరపాట్న మేము ఎక్కడికన్నా ఊరికి పోయి ఉంటే నీకు యిబ్బంది అయ్యేది కదా!" సమర్ధించుకున్నాడు సుబ్బారావు. "మా బావగారి సంగతి నాకు తెలియదా? ఊరికే ఎప్పుడైనా ఏ ఊరికైనా పోయాడా? ఆదివారాలు కూడా ఆఫీసుకు పోయే బాపతు. పైగా ఊరికి పోవాలంటే మాటలా? బోల్డు ఖర్చు!" అంటూ బాత్‌రూములోకి దూరిపోయాడు రంగారావు. సుబ్బారావు అతని వ్యంగ్యానికి ఖంగు తిన్నాడు.

కాఫీ టిఫెన్లు అయింతర్వాత రంగారావు అస్సలు విషయం చెప్పాడు. ఏదో నీ దయవలన మావాడు ఇంటర్ ఫెయిలయ్యాడు. మా వూళ్ళో ఫలానా బ్యాంకులో క్లాసు ఫోర్ పోస్టులు ఖాళీ పడ్డాయి. ఇక్కడ ఎవరినన్నా పెద్ద తలకాయను పట్టుకొని రికమెంటు చేయించుకుందామని యిలా వచ్చాను" రంగారావు వివరించాడు. "సంతోషం - కాని మీ వాడు ఫెయిల్ కావడానికి నా దయ ఎందుకు? అది మీ వాడి స్వయం ప్రతిభ కదా!" కించిత్తు నవ్వింతిస్తూ సిగ్గుపడుతూ అడిగాడు సుబ్బారావు. "బాగా గుర్తుచేసుకో బావా! మూడేళ్ళ క్రితం నేను మా బుజ్జిగాడ్ని యింటరులో ఏం చేయిస్తే బాగుంటుందని పొరపాట్న సలహా అడిగాను-"

సుబ్బారావు గుర్తు చేసుకున్నాడు. సదరు బుజ్జిగాడు టెంత పరీక్షలు రాశాడు - తదుపరి కర్తవ్యంగా యింటర్ చదవదలచుకున్నాడు - ఏ గ్రూపు తీసుకుంటే భవిష్యత్తులో పనికొస్తుందని అడిగాడు. అప్పుడు తడుముకోకుండా సైన్సు గ్రూపు తీసుకోమని - అందులో మ్యాథ్సు తీసుకోమని తను చెప్పాడు. ఎందుకని అడిగితే ఆపైన బి.టెక్కు లాగించేస్తే ఏదో కంపెనీ వాళ్ళు ఎగురుకుంటూ వచ్చి పాతికవేలు జీతం యిచ్చి బుజ్జిగాడ్ని ఎగరేసుకుపోతారని చెప్పాడు. ఇప్పుడది తన నెత్తిమీద కొచ్చింది.

"అవును మ్యాథ్సు తీసుకోమన్నాను - పాసు కాలేదా?!" "హా! ఆర్ట్సు తీసుకుంటే ఎప్పుడో అయిపోయేవాడు - వాడికి లెక్కలంటే భయమట - అయినా నువ్వు చెప్పావని వాణ్ణి దాంలో పారేశాను. ఇప్పటికీ తేరుకోలేక పోయాడు." రంగారావు ఇంకాసేపు బుజ్జిగాడు ఎంత బాధపడింది, తను సుబ్బారావు మాటను నమ్మి మూర్ఖంగా ఎలా మోసపోయింది విన్నవించుకున్నాడు. "నిజమే రంగా ! చదివించేది నువ్వు - చదివేది వాడు - అటువంటప్పుడు వాడి అభిరుచి మేరకు - తెలివి తేటల మేరకు గ్రూపులు తీసుకోవాలి - చదువుకోవాలి ! కాని నాలాంటి సత్రకాయగాడు సలహా యిచ్చాడని అడ్డమైన చదువులు చదివితే యిలానే ఉంటుంది" అని మోహానికి గంటు పెట్టుకుని అన్నాడు సుబ్బారావు.

ఆ నిష్ఠూరాలను కొంత కాలంలో మర్చిపోయాడో లేదో - కొన్నాళ్ళకు కజిన్ శ్రీశైలం కలిశాడు. సకుటుంబంగా వాళ్ళింటికి వేంచేశాడు, తన భార్య పార్వతికి మెడికల్ చెకప్ చేయించుకుందామని. వాళ్ళతో పాటు అతని పుత్రరత్నం సుబ్రహ్మణ్యం కూడా వచ్చాడు. వాళ్ళ పనులన్నీ ముగిసిన తరువాత ఆరాత్రి తీరిగ్గా ఉన్నప్పుడు అడిగాడు సుబ్రహ్మణ్యాన్ని సుబ్బారావు. "ఒరే సుబ్బిగా! ఇప్పుడేం చేస్తున్నావురా?!" "ఏముంది పెదనాన్న - నీ దయవలన ఉద్యోగాల కోసం చెప్పులరిగి పోయేట్లు తిరుగుతున్నాను-" సుబ్రహ్మణ్యం. "అదేంటిరా! బిటెక్కు చేశావు కదా - క్యాంపస్ సెలక్షన్ రాలేదా?"

"ఆ! అందరికీ ఎందుకొస్తాయి పెదనాన్నా! ఏ కొందరి అదృష్టవంతులకో వస్తాయి. మా కాలేజీలో ఓ అయిదారు మందికి ఆ అదృష్టం కలిగింది. కొన్ని వందల మందికి అది దక్కలేదు. బయట కాంపిటీషన్ ఎలా వుంది? పైగా రిసెషన్ పీరియడు. ఉన్నా వాళ్ళకే ఉద్యోగాలు పోతున్నాయి. సెలక్టు అయిన చాలా మందికి కూడా యింకా అప్పాయింటుమెంటు ఆర్డరు రాలేదు" బాధపడ్డాడు సుబ్రహ్మణ్యం. "పోనీలేరా! నీ చదువు ఎక్కడికీ పోదు - ఇవ్వాళ కాకపోతే రేపైనా మంచి ఉద్యోగం వస్తుంది" ఓదార్చాడు సుబ్రహ్మణ్యం. "అది కాదు అన్నయ్యా! ఆరోజు నీ సలహా వినకుండా వాడిని ఆలైనులో ప్రవేశపెడితే బాగుండేది" శ్రీశైలం చెప్పాడు నసుగుతూ.

"అవును బావగారు! మీరొద్దన్నారని మేము మానుకున్నాం గాని - వాడి చిన్నప్పుడే వాడిని టీవీలో ప్రవేశపెట్టి ఉంటే ఈరోజు రాజులాగా ఉండేవాడు" పార్వతి నిష్ఠూరంగా అన్నది. "నేనేం సలహా యిచ్చానురా?" విస్తుపోయి అడిగాడు సుబ్బారావు. "అదే పెద్దనాన్న! 'ఆటకావాలా - పాటకావాలా' లాంటి ప్రోగ్రాంలో నేను పాటల పోటీల్లో ఒక రౌండులో గెలిచాను. నాన్న నీకు ఫోన్ చేసి చెప్పారు. ఫలానా ఛానెల్ వాళ్ళు నన్ను ఫలానా తేదీకి సిటీకి రమ్మంటున్నారు - నీ ఉద్దేశ్యమేమిటని?" గతం గుర్తుచేశాడు సుబ్రహ్మణ్యం.

సుబ్బారావుకు గుర్తుకొచ్చింది-లోకల్‌గా పాటల పోటీల్లో - సుబ్బు గెలిచాడు. తదుపరి రౌండ్లకోసం ఓ నెలరోజులు సిటీకి రమ్మని, శిక్షణ యిస్తామని భవిష్యత్తులో గొప్ప సింగర్ కాగలడని చెప్పారట. ఆ సందర్భంలో ఓ సారి ఫోన్ చేసి తన సలహా అడిగారు. అప్పుడతను "శ్రీశైలం! పుట్టగొడుగుల్లాగా ఎన్నో ఛానెళ్ళు పుట్టుకు వస్తున్నాయి వాళ్ళ పాపులారిటీ కోసం రకరకాల కార్యక్రమాలు చేస్తూ ఉంటారు. బాగా చదువుకునే కుర్రాడిని ఈ టీవీ కార్యక్రమాలంటూ డైవర్టు చేస్తే చదువు సంతకెళుతుంది. ముందు బాగా చదువుకోమను-ఆ తర్వాత అటువంటివి ఆలోచిద్దాం" అని చెప్పాడు.

"అవును సుబ్బూ! ఇప్పుడు మటుకు మించిపోయిందేం ఉంది - ఇప్పుడు కూడా నువ్వు ఆ సంగీత కార్యక్రమాల్లో పాల్గొనవచ్చు గదా?" సుబ్బారావు అన్నాడు కించిత్తు చింతుస్తూ. దాంతో శ్రీశైలం - పార్వతి - సుబ్రహ్మణ్యం భళ్ళున నవ్వారు. "ఇప్పుడా! అది అప్పుడు చేసి ఉంటే బాగుండేది - ఈ పాటికి గొప్ప సింగరై టాపు లేపేవాడిని చదువు, చదువు అంటూ నీ మాటవిని నాన్న నన్ను నంజుకు తిన్నాడు. ఆ ఛాన్సు మిస్సయింది" సుబ్రహ్మణ్యం చెప్పాడు. "ఈ వయసులో, ఈ కాలంలో పోటీ బాగా పెరిగిపోయింది."

"వాడు ఆరోజు ఆ ఛానెల్ వాళ్ళ మాటవిని ఉంటే నిజంగా యిప్పుడు గొప్ప సింగరై రెండు చేతులతో సంపాదించేవాడు!" పార్వతి. "ఆ! వీడి ఫ్రండే ఒకడు అలా పైకొచ్చి ఇప్పుడు గొప్ప సింగరై మంచి డిమాండులో ఉన్నాడు - సినీ ఫీల్డులో కూడా అడుగుపెట్టాడు - అయినా నిన్ను అని ఏం లాభంలే అన్నయ్యా! మా ఖర్మ అలా కాలింది - నువ్వేదో సిటీలో ఉన్నావని - నీ కన్ని విషయాలు మా పల్లెటూరి వాళ్ళకంటే బాగా తెల్సు అని సలహా అడిగాం - అనుభవిస్తున్నాం. అయినా నువ్వు మా మంచి కోసమే చెప్పి ఉంటావులే!" అంటూ నిష్ఠూరాలు ఆడాడు శ్రీశైలం, పార్వతి కూడా వంత పాడింది.

"అందుకే అంటానమ్మా మీ బావగార్ని ఎవరికీ సలహాలివ్వద్దని. వింటేగా - కాస్త పొగిడితే చాలు - పొంగిపోయి - ఆంజనేయస్వామి లాగా గంతులేస్తూ సలహాలిస్తారు - బాగా అయింది" సుహాసిని బాగా అయిందన్నట్లు సైగలు చేసింది, సుబ్బారావుకు. "చూడు సుబ్బూ! మన రాత ఎలా ఉంటే అలా జరుగుతుంది. నే సలహా యిచ్చినంత మాత్రాన నువ్వు నా మీద ఆధారపడకుండా నీ నిర్ణయం నువ్వు తీసుకోవలసింది. అలా జరగలేదంటే విధివ్రాత అలా ఉంది. ఒకవేళ టీవిలోకి పొమ్మని నేను సలహా యిచ్చినా - అక్కడ ఫెయిలై ఉంటే నన్నే అనేవాళ్ళు మీరు. అందుకే యికమీదట ఎవరికీ సలహాలు యివ్వద్దని నేను అందరికీ సలహా యిస్తాను" సుబ్బారావు చెప్పాడు.

ఇది జరిగి ఒక నెలరోజులయిందో లేదో సుబ్బారావుకు యింకో విషమ పరీక్ష వచ్చింది. అది వాళ్ళ ఆఫీసరు అవతారం రూపంలో వచ్చింది. "చూడు సుబ్బారావు, మా పెద్దమ్మాయి సంధ్యకు సంబంధాలు చూస్తున్నాం. నీకు తెల్సుగా - మా అమ్మాయని - చెప్పుకోవడం కాదు గాని కుందనపు బొమ్మలా గుంటుంది. ఆ వినయం - సౌశీల్యం ఎవరికీ అబ్బవు. అంతా మన ట్రైనింగు ! యమ్మెస్సీ కూడా ఫస్టు క్లాసులో పాసయింది. ఈ కాలం పెళ్ళి అంటే పెద్ద గండం అయిపోతున్నది. ఒకటి సంబంధాలు దొరకడం చాలా కష్టంగా ఉంది. దొరికిం తర్వాత జాతకాలు కుదరడం యింకా కష్టంగా ఉంది - రెండూ అయిన తరువాత అబ్బాయికి అమ్మాయి నచ్చడం మరీ కష్టంగా ఉంది. ఈ మూడు అయింతర్వాత నాలుగోది ఇంక చెప్పక్కర్లేదు నిట్టూర్చాడు ఆఫీసరు.

"ఏంటి సార్ నాలుగోది!" వినయంగా అడిగాడు సుబ్బారావు. "కట్నమయ్యా - కట్నం! అది లేంది ఇండియాలో పెళ్ళిళ్ళు అయ్యేట్టు కనపడ్డం లేదు. అదీ మనస్తోమత పట్టి కాదుట! అబ్బాయి అఘోరించే ఉద్యోగాన్ని బట్టిట! ఆ తరువాత ఆడపడచు లాంఛనాలు - అలక పానుపులు - ఉండనే ఉన్నాయి. పులిమీద పుట్రలాగా అమ్మాయి పెళ్ళి ఖర్చు అంతా ఆడపెళ్ళి వాళ్ళే భరించాలి - ఇదెక్కడి న్యాయమయ్యా సుబ్బారావు?" ఘీంకరించాడు ఆఫీసరు అవతారం. బక్కచిక్కిన సుబ్బారావు వణికిపోయాడు, ఆయన్ని చూసి.

"ఇంతకూ మీ అమ్మాయికి ఓ సంబంధం వెతకాలి - అంతేగదా సార్! ఈ రోజు నుండి - కాదు కాదు - ఈ క్షణం నుండి అదే పనిమీద ఉంటాను. మాకు ఆఫీసు పనికంటే ఆఫీసరు గారి పని ముఖ్యం !" చెప్పాడు సుబ్బారావు రెండు చేతులూ కట్టుకుని. "థ్యాంక్స్! అంత పని చెయ్యొద్దు గాని - ఓ చిన్న పని చెయ్యి చాలు - నాకు ఓ చక్కటి సంబంధం వచ్చింది." ఆఫీసరు ఆగాడు గాలి పీల్చడానికి.

"మీకా - చక్కటి సంబంధమా - ఈ వయసులోనా ! కంగ్రాట్సు !" విస్మయంగా అభినందించాడు సుబ్బారావు. "షటప్! నాక్కాదయ్యా! మా అమ్మాయికి" అరిచాడు అవతారం. "సారీ సార్! ఇక సందేహం ఎందుకు - చేసెయ్యండి" "అదే, అదే, ఆ పని చేసేముందు నువ్వో పని చెయ్యాలి. మీ వూరికి వెళ్ళి వాళ్ళ వంశం గురించి - అతగాడి గురించి వాకబు చేసి నాకు రిపోర్టు యివ్వాలి. ఎందుకంటే అబ్బాయి సొంత వూరు మీ వూరే!" అంటూ ఓ కాగితం అందించాడు. వరుడు శంకర్. అతని తండ్రి మహదేవరావు. తల్లి గౌరమ్మ - యింటి నెంబరు వగైరాలున్నాయి.

"రెండు రోజులు సెలవు తీసుకొని మీ ఊరికి వెళ్ళి ఎంక్వయిరీ చెయ్యి - వాళ్ళ గురించి సేకరించిన సమాచారాన్ని రహస్యంగా నాకు తెలియచెయ్యి. ముఖ్యంగా నేను వాళ్ళ గురించి ఎంక్వయిరీ చేసినట్లు వాళ్ళకు ఏ మాత్రం అనుమానం రాకూడదు. ఎందుకంటే సంబంధం దాదాపు ఖాయం అయిపోయింది. అమ్మాయి-అబ్బాయి కూడా యిష్టపడ్డారు."

"సార్! మరి ఎందుకు సార్ విచారించడం-?" సుబ్బారావు అడిగాడు. "అయినను పోయిరావలె అని కృష్ణ పరమాత్మ అనలా! అలాగే ఎంక్వయిరీ చేయకుండా చేసుకుంటే రేపు ఏదన్నా జరిగితే ఈ ఆడోళ్లు నన్ను నిందిస్తారు - ఒకే! పోయిరా!" సెలవిచ్చాడు.

అంతే! సుబ్బారావు ఆఘమేఘాల మీద పెళ్ళాం - పిల్లలతో స్వంతూరుకు వచ్చి పడ్డాడు. ఎప్పుడూ రమ్మన్నా సెలవులు దొరకలేదని చెప్పే సుబ్బారావు - యిలా చెప్పాచెయ్యకుండా వచ్చేసరికి ఆవూరి ఆబాల గోపాలం సంతోషపడ్డారు. చాలామంది వచ్చి పలకరించి వెళ్ళారు. ఆ సాయంత్రం రంగారావును తీసుకుని ఊరిమీద పడ్డాడు. ఇద్దరూ తమకు తెల్సినవాళ్ళని తెగ ఎంక్వయిరీ చేశారు. కొందరు శంకర్ కుటుంబం వాళ్లు చాలా పెద్ద మనుషులని చెప్పారు. కొందరు దొంగ వెధవలని చెప్పారు. కొందరు వారు సాంప్రదాయ హీనులని చెప్పారు. ఇంకా కొందరు గంపగయ్యాళులు, వారితో మీ ఆఫీసరు అమ్మాయి ఎక్కడ వేగుతుందని అడిగారు కూడ.

తల బొప్పి కట్టి యిల్లు చేరుకున్నాడు. సుహాసిని ఎంక్వయిరీ కూడా భిన్నమయిన అభిప్రాయాలనే వినిపించింది. శంకరంకు యిదివరకే పట్టణంలో పెళ్ళయిందని - గొడవలొచ్చి వదిలేశాడని ఎవరో చెప్పారుట! మరునాడు

మళ్ళీ విచారణకు బయలుదేరాడు రంగారావు సహితంగా రామాయణంలో పిడకలవేటలాగా అతనికో చేదు అనుభవం ఎదురైంది. "ఆగవయ్యా! సుబ్బారావు - రెండు సంవత్సరాల క్రింతట మాతో ఇన్సూరెన్సు చేయించావు గదా - గుర్తుందా?" ఒక ముసలాయన అడిగాడు. ఆయన టీచరుగా రిటైరయితే కొంత డబ్బు చేతికందింది. దాన్ని ఎలా మదుపు చేస్తే బాగుంటుందని సుబ్బారావును అడిగాడు. అదే సమయానికి అతని మిత్రుడు, బీమా ఏజెంటు అప్పారావు రావడం సంభవించింది. యూనిట్ లింకుడు పాలసీలు కొత్తగా వచ్చాయని దానిలో, మదుపు చేస్తే మూడు సంవత్సరాలలో నాలుగురెట్లు అవుతుందని చెప్పాడు. ముసలాయనకు నమ్మకం కుదరక సుబ్బారావును అడిగాడు ఏం చెయ్యమంటావని సలహా కోసం.

"అవును మాష్టారు! ఇప్పుడు కొత్తగా ఇటువంటి యూలిప్పు పాలసీలు వస్తున్నాయి. ఇవి సెన్సెక్సు పెరిగినప్పుడల్లా విలువను పెంచుకుంటాయి. సెన్సెక్సు సెన్సిటివ్ పాలసీలు. మన బ్యాంకుల్లో - పోస్టాఫీసుల్లో మనకొచ్చే వడ్డీ చాలా తక్కువ. ఇదైతే డబుల్ - ట్రిబులు అవుతుంది. ఉదాహరణకు మీరు రెండు లక్షలు యిప్పుడు జమ చేస్తే మావాడు చెప్పినట్లు కాకపోయినా, అధమ పక్షంలో నాలుగు లక్షలు అవుతుంది మూడేళ్ళల్లో." అంటూ అప్పారావును సమర్థించాడు. ఇంకేం, ఆయన రెండు లక్షలు వేశాడట. మొన్న డబ్బుకు యిబ్బంది అయి తీసుకుందామని పోతే కేవలం అరవై వేలు వస్తాయని ఆఫీసు వాళ్ళు చెప్పారట. దాంతో మండిపడ్డాడు. సుబ్బారావుమీద నానా దుర్భాషలు ఆడాడు. సుబ్బారావుకు గుర్తొంచ్చింది - అతనితో పాటు యింకో నలుగురితో కూడా పాలసీలు చేయించినట్లు.

"సారీ - మాష్టారు. నన్ను క్షమించండి. ప్రపంచ ఆర్థిక పరిస్థితి యింత ఘోరంగా దెబ్బతింటుదని నేను కలగన్నానా? కొన్నాళ్ళు ఓపిక పట్టండి - మీ డబ్బులు మీకు వస్తాయి". అతన్ని శాంతింపచేయడానికి ఎంతో సమయం పట్టింది. అతనికి కూల్‌డ్రింకు తాపించి పంపించేసరికి తలనెప్పి వచ్చింది. ఇంతలో అవధాని తగిలాడు - అతడు ఇతనికి గురువు.

"నీకు కాస్తన్న బుద్ధి ఉందా? పిల్లపెళ్ళికి పెట్టుబడిగా నన్ను సిటీలో ప్లాటు తీసుకోమన్నావు. నీ మాట నమ్మి పదిహేను లక్షలు పెట్టి లాస్టియరు ప్లాటు తీశాను. తీరా అవసరానికి ఇప్పుడు అమ్ముదామంటే దాన్ని ఏడు లక్షలకు కూడా కొనేవాడు లేడు. డబ్బంతా తీసుకుపోయి ఎట్లో గుమ్మరించి నట్లయింది. ఆ లాసు ఎవరు కడతారు? నువ్వు కడతావా? పోస్టాఫీసులో వేసుకున్నా కాస్తో కూస్తో వడ్డీ వచ్చేది. ఆఖరికి బ్యాంకులో వేసుకున్నా అవసరానికి వాడుకునే వాడిని. ఇప్పుడేమిటి నా గతి!" అంటూ సుబ్బారావు కాలరు పట్టుకు గుంజాడు, కోపంగా అవధాని. రంగారావు అడ్డుపడి శాంతింపచేశాడు అతికష్టం మీద.

"చూడండి గురువుగారు! మీ మంచి కోరి నేను చెప్పాను. ఈ లోపు రియల్ ఎస్టేటు డౌను అయితే నేనేం చెయ్యను? కొంతకాలం ఆగండి - మీ డబ్బులు మీకొస్తాయి" అంటూ ఓదార్చాడు. "సరే! ఇంకో సంవత్సరం ఆగుతాను. ఒకవేళ నారేటు నాకు రాకపోతే నువ్వే ఆ ప్లాటు తీసుకొని - నా డబ్బులు నాకివ్వాలి!" వార్నింగు యిచ్చి వెళ్ళిపోయాడు అవధాని.

ఇంక ఏం గొడవలు వస్తాయో అని చెప్పి ఆరాత్రే సుబ్బారావు సిటీకి బయలుదేరి వచ్చాడు. మరునాడు ఆఫీసుకు వెళ్ళాడు. అవతారం ఛేంబర్‌లోకి ప్రవేశించాడు ఎంక్వయిరీ గురించి చెబుదామని.

"రావయ్యా సుబ్బారావు, నీ గురించే నేను ఎదురుచూస్తున్నా! నువ్వు వెళ్ళావో లేదో - శంకరం వాళ్ళు వచ్చి నా పీకలమీద కూర్చున్నారు. వాళ్ళకి చాలా గొప్ప సంబంధం వచ్చిందట. కాని ముందు మాట మనకు యిచ్చారు కాబట్టి - మనల్ని ఒక మాట అడిగి దానికి పోదామని వచ్చారు. వెంటనే 'యస్సు ఆర్ నో' చెప్పమన్నారు. అందుకే ఇంక ఆరోజే నిశ్చితార్థం చేసుకున్నామయ్యా! వచ్చే శుక్రవారం పెళ్ళి!" అంటూ ఆఫీసర్ అవతారం చెప్పుకొచ్చాడు, ఆ వివరాలు. సుబ్బారావు యింకేం మాట్లాడలేకపోయాడు.

పెళ్ళి ఘనంగా జరిగింది... అమ్మాయి కాపురానికి వెళ్ళింది. కొన్ని నెలల తర్వాత సుబ్బారావు శంకరగిరి మాన్యాలకు బదిలీ అయ్యాడు. లబలబ కొట్టుకుంటూ అవతారం కాళ్ళమీద పడ్డాడు.

"సుబ్బారావు నీ మూలంగా నా పరువు పోయిందయ్యా! మా అల్లుడి గురించి వాళ్ళ వూళ్ళో అందరితో ఎంక్వయిరీ చేశావట. దాని మూలంగా వారికి పరువునష్టం కలిగిందట-" అంటూ చాలా చెప్పాడు ఆఫీసర్. సుబ్బారావు ఏడ్చుకుంటూ తన ఎంక్వయిరీ మొత్తం చెప్పాడు.

"మరి అంత చెత్త సంబంధం అయినప్పుడు ముందే నాకెందుకు చెప్పలేదు?" "నేను వచ్చే సరికే మీరు నిశ్చితార్థం చేసుకున్నారు కదా సార్!" "అయితే ఏం, పీటల మీద పెళ్ళిళ్ళే ఆగిపోతున్నాయి - నువ్వు ఏ మాత్రం ముందు చెప్పినా మా అమ్మాయికి ఈ ఘోర నరకం తప్పేది!" "నిశ్చితార్థం అయిన తరునాత చెబితే సంబంధం చెడగొట్టడానికి చెబుతున్నాని దండిస్తారని భయపడ్డాను" నీళ్ళు నమిలాడు.

"ఎని హౌ! యూ డిజర్వు పనిష్మెంటు! నిజం తెల్సి నాకు సలహా యివ్వనందుకు నిన్ను క్షమించలేను. సరే! వెంటనే రిలీవు అయి వెళ్ళిపో నీ మొహం నాకు చూపించకు" ఆగ్రహంతో ఆఫీసర్ అవతారం అతన్ని బయటకు పంపించాడు. "అయ్యో! వద్దని చిన్న సలహా యిచ్చి వుంటే తనకిన్ని కష్టాలు తప్పేవి గదాని సుబ్బారావు విచారించాడు.

## నా భాష

**- సాదనాల వేంకట స్వామి నాయుడు**

నా భాష హమేషా తమాషా కాదు
నా భాషా యోషకు ఘోషాలేదు

నా భాష అంతఃపుర కాంత కాదు-
నా భాష స్వేచ్ఛగా విహరించే లేడిపిల్ల!

నా భాష ఢమరుక ఢంకా భయద నినాదం కాదు-
నా భాష మృదుమధుర మంజుల సుస్వనం

నా భాష నిబిడాంధకార సమరం కాదు-
నా భాష భావి భాగ్యోదయ శంఖారావం!

నా భాష కావ్య కళా సౌందర్య భంజకం కాదు-
నా భాష పాఠక జన హృదయైక రంజకం?

# మేధావి

- "విశాల వియోగి"

లోకం గుర్తించకపోయినా సుబ్బారావు తనను తాను మేధావిగా ప్రకటించు కుంటున్నాడు. సుబ్బారావు ఈ మధ్యకాలంలో కొంత విభిన్నంగా ఆలోచించడం నేర్చుకున్నాడు. అందరూ ఆలోచించినట్లు ఆలోచిస్తే తన ప్రత్యేకత ఏముంటుందని అతనికి వచ్చిన సందేహం! పైగా జీనియస్సులందరూ విభిన్నంగా ఆలోచించిన వారే అని ఒక మూర్ఖుడు కూడా సెలవిచ్చాడు అతనికి. యాపిలుపండు రాలి నేలమీదకు ఎందుకు పడాలి? ఆకాశంలోకి కూడ పోవచ్చు గదా అన్న పిచ్చి ప్రశ్న నుండి భూమికి ఆకర్షణ శక్తి పుట్టుకొచ్చిందని అతనికి చిన్నప్పుడు అతని సైన్సు టీచరు సెన్సు లెస్సుగా చెప్పాడు. క్రమక్రమంగా అప్పటినుండి వక్రంగా ఆలోచించడం మొదలుపెట్టాడు సుబ్బారావు. కొన్ని సంవత్సరాల క్రిందటి మాట యిది.

"ఒరే సుబ్బీ! నంద్యాలలో మంచి సంబంధం ఉంది - మనం పోయి చూసి రావాలి రా! రేపే మంచిరోజు." అని బామ్మ చెప్పగానే విని మండి పడ్డాడు. "అంటే మనది మంచి సంబంధం కాదా! అమ్మాయి వాళ్ళది మంచి సంబంధం - అబ్బాయి వాళ్ళది పిచ్చి సంబంధం అనా! అందుకని మనం గంగిరెద్దుల్లా దుడ్లు ఖర్చు పెట్టుకుని పోయి ఆ పిల్లను ఎగాదిగా చూసి రావాలా! నేను రాను - వస్తే గిస్తే దాన్నే రమ్మను - ఇక్కడి కొచ్చి చూడమను" అని మొండికేశాడు. "ఒరే తిక్క వెధవా! మొగపెళ్ళివాళ్ళు పోయి ఆడపెళ్ళి వాళ్ళని చూడటం ఆచారం! అంటే వధువును వరుడు పోయి చూడాలి అది సంప్రదాయం - అంతేకాని వధువు వచ్చి వరుడిని చూస్తే నలుగురు నవ్వి పోతారురా!" అని బామ్మ చిలక్కి చెప్పినట్లు చెప్పింది. మనవడికి. "నో! నో! ఈ ఆచారాలు - సాంప్రదాయాలు బూజు పట్టిపోయినవి! వీటిని నాలాంటి మేధావి దుమ్ము దులపాలి! బామ్మా! నీకేం తెలీదు అమ్మాయి వాళ్ళనే రమ్మని కబురు పెట్టు" అని చెప్పాడు గట్టిగా. "ఒరే తింగరి వెధవా! అది తప్పురా! మొగవాడి దర్జాకు తక్కువరా!" అని తండ్రి అప్పారావు హితబోధ చేశాడు కూడా చాలాసేపు. అది చెవికి వేసుకోలేదు సుబ్బారావు - పైగా వాదించాడు కూడా!

"అస్సలు ఒక్క విషయం ఆలోచించండి. పెళ్ళయిన తరువాత ఆ అమ్మాయి మనింటికి వస్తున్నదా - నేను వాళ్ళింటికి పోతున్నానా? ఆమె కదా వస్తున్నది - కాబట్టి ఆమెకి మన యిల్లు వాతావరణం నచ్చాలి! అంతేకాదు - ఆ అమ్మాయికి నేనొక్కడిని నచ్చితే సరిపోదు. మీరు - అమ్మ - బామ్మ - ఆడపడుచు - మరిది కూడా నచ్చాలి. ఆ పైన మన ఆస్తిపాస్తులు కూడా నచ్చాలి. ఇవన్నీ నేను పోయి చూసొస్తే వాళ్ళకు తెలియవు కదా! అందుకని వాళ్ళనే యిక్కడికి రప్పించండి" అని బిగుసుకుపోయాడు సుబ్బారావు. పుత్రరత్నం పోరు పడలేక అప్పారావు వాళ్ళనే రమ్మని కబురు పంపాడు.

సుబ్బారావు వ్యవహారంలో వాళ్ళకు ఏదో తేడా కనిపించి - వెంటనే వాళ్ళు ఈ సంబంధాన్ని వదులుకున్నారు. వాళ్ళే కాదు ఆ తర్వాత వరుసగా ఓ పాతికమంది వధువులు యితగాడిని అంగీకరించలేదు. దాంతో చివరికి బామ్మ మాట విని తన పద్ధతి మార్చుకుని మాలతిని చూసి ఓకే చేశాడు.

పెళ్ళి తంతు కూడా విభిన్నంగా చేయాలని ముందు పట్టుపట్టాడు. మొగాడే ఆడదాన్ని మెళ్ళో మంగళసూత్రం ఎందుకు కట్టాలి? ఆమెనే కట్టమనండి మొగుడి మెళ్ళో! కాలికి మట్టెలు ఆమెకే ఎందుకు పెట్టాలి - మొగుడికి కూడా తొడగమనండి. ఇలాంటి ఆదర్శభావాలు కొన్ని వల్లించాడు - ఈ సంబంధం కూడా కాన్సిలు కాబోయే దశకు చేరుకునే సరికి అతని తల్లి ఆత్మహత్య చేసుకుంటానని బెదిరించి - ఆ పెళ్ళి తంతంగ కాస్త సాంప్రదాయ బద్ధంగా పూర్తి చేయించింది.

ఆ తర్వాత కూడా 'ఉద్యోగం పురుష లక్షణం అని స్వార్థ పరులు అన్నారు. ఉద్యోగం స్త్రీ లక్షణం' అని నొక్కి వక్కాణించి - మాలతికి యిష్టం లేకపోయినా, బలవంతాన ఉద్యోగంలో చేర్పించాడు. మొదట్లో ఆమె టీచరుగా నరకం అనుభవించినా తర్వాత తర్వాత జ్ఞానోదయం అయి - యింటి నరకం కంటే ఈ స్కూలు నరకం స్వర్గంతో సమానం అని గ్రహించినదై దానిని కొనసాగించ సాగింది. ఆ రకంగా ఆమెకు ఎక్కువసేపు సుబ్బారావుతో గడిపే సమయం తగ్గిపోయింది. కాబట్టి బలుసాకు తింటూ బ్రతికిపోతున్నది.

ఒకసారి ఆమె స్కూలుకు కూడా పోయి వాళ్ళ యాజమాన్యంతో తగూలాడాడు. 'పిల్లలకు పరీక్షలు ఎందుకు పెట్టాలి? దాని మూలంగా వారికి టెన్షన్ పెరిగి మెదడు బలహీనమవుతున్నది. కాబట్టి పరీక్షలు లేని విద్యావిధానం ఉండాలి!" అని బల్లగుద్ది చెప్పి వచ్చాడు. అతని దురదృష్టం కొద్దీ అక్కడికి వచ్చిన పేరేంట్సు ఎవరూ అతన్ని సమర్థించలేదు కాబట్టి ప్రధానోపాధ్యాయులకు పెద్దగండం గడిచి పోయింది. మేధావులను లోకం గుర్తించదని సుబ్బారావు కించిత్తు బాధపడ్డాడు.

ఒకసారి సుబ్బారావు కొలీగు దబ్బారావు భార్యకు సీరియస్సు అయి హాస్పిటల్లో జాయినైంది. "బ్రతకడం కష్టంగా ఉందిరా! ఎటూ చెప్పలేమంటు న్నారు డాక్టర్లు, ఒక్కసారి వచ్చి పోరా నాకు ధైర్యంగా ఉంటుంది" అని చలనవాణిలో వినిపించాడు. సుబ్బారావు, దబ్బారావులు మంచిమిత్రులు అని చెప్పుకుంటారు ప్రజలు. ఆఫీసు నుండి యింటికి వెళుతూ వెళుతూ దబ్బారావును అతగాడి శ్రీమతిని చూడ్డానికి వెళ్ళాడు. ఉత్త చేతులతో వెళితే అతను సుబ్బారావు ఎందుకవుతాడు కనుక? విభిన్న పురుషుడు గదా!

మంచిరోజు పూలమాలను భద్రంగా పట్టుకుపోయాడు. రోజామాల తాజా పూలతో ఘుమఘుమలాడుతూ ఉంది. ఆ సువాసనలకు హాస్పిటల్లో పరివారం - రోగులు యితన్ని విచిత్రంగా చూశారు. అటువంటి చిన్న చిన్న విషయాలు అతను పట్టించుకోడు, పెద్దగా. "ఏరా! సుబ్బారావు! ఇంత ఖరీదైన పూలమాల ఎందుకు తెచ్చావురా! ఎవరైనా పేషంట్లు దగ్గరికొచ్చేటప్పుడు పండ్లు తెస్తారు లేదా బ్రెడ్డు తెస్తారు! నువ్వెందుకు ఏకంగా రోజా పూలమాలను తెచ్చావు" దబ్బారావు అడిగాడు.

"థింక్ డిఫరెంట్ లీ! మీరంతా ఎప్పుడు నేర్చుకుంటారో నన్ను చూసి. పాలు పండ్లు తేవడం రొటీన్! సంథింగ్ యిస్పెషల్ ఉండాలి మనం చేసే పనిలో - అందుకే బాగా ఆలోచించి తెచ్చాను -" సంతోషంగా చెప్పాడు.

"కాని అది యిప్పుడు ఎందుకు పనికొస్తుంది?" డబ్బారావు ప్రశ్న. "మీ ఆవిడకి అదే - మా చెల్లెమ్మకు సీరియసుగా ఉందన్నావు గదా! అర్జెంటు ఆపరేషన్ కూడా చేయాలన్నావు. ఒకవేళ మీ ఆవిడ బక్కెట్టు తన్నేస్తే - మళ్ళీ నువ్వు యిబ్బందిపడి బజార్లు వెతికి పూలదండను తేవడం కష్టమవుతుందని ఈ దండను నీకండగా తెచ్చాను. లేదూ - కర్మచాలక ఆపరేషన్ సక్సెస్ అయి మీ ఆవిడ బ్రతికిందనుకో - అందుకు గుర్తుగా ఆపరేషను చేసిన డాక్టరుకే ఈ దండ వేసేద్దాం!" అని వివరించాడు. "ఒరే సుబ్బారావు! రోజా దండ తేవడంలో యింత కుతంత్రం ఉందా!" అంటూ ఒకటిచ్చాడు డబ్బారావు, సుబ్బారావులోని విభిన్నత్వాన్ని అర్థం చేసుకుని.

రౌండ్సు కొచ్చిన డాక్టరు కూడా సుబ్బారావు మాటలు విన్నాడు. "హూ ఈజ్ దిస్ ఫెలో!" డాక్టరు అడిగాడు. "సుబ్బారావు అని నా కొలీగు!" చెప్పాడు డబ్బారావు. "సైక్రియాట్రీ కేసా? మెంటల్ హాస్పిటల్ లోనుండి పారిపోయి వచ్చాడా?" డాక్టరు అనుమానం. "అబ్బే అదేం లేదండి - ప్రతిదీ విభిన్నంగా ఆలోచించడం యితగాడి అలవాటు." అని వివరించాడు డబ్బారావు. "మీ ఆవిడ కులాసానా?" డాక్టరు అడిగాడు సుబ్బారావును కింద పైన చూస్తూ. "దానికేం గుండ్రాయిలాగుంది?" గర్వంగా చెప్పాడు సుబ్బారావు. "ఆమెకేమన్నా చెవుడుందా?" అనుమాన నివృత్తి కోసం అడిగాడు వృత్తి వైద్యుడు. "చీమ చిటుక్కుమన్నా వినపడుతుంది." గంభీరంగా చెప్పాడు. "పాపం దురదృష్టవంతురాలు!" నిట్టూర్చాడు డాక్టరు.

ఒకసారి మాలతి బాబాయి కూతురు మమత పెళ్ళికి వెళ్ళారు. జంట చూడ ముచ్చటగా ఉందని ఈడు జోడు బాగా కుదిరిందని బంధువులంతా మెచ్చుకున్నారు. అది మనవాడికి నచ్చలేదు. నిజానికి మమత చాలా చక్కగా పాలమీగడతో చేసిన బొమ్మలాగుంటుంది. మమత మొగుడు మాత్రం దుబ్బగా, నల్లగా ఉంటాడు. కొంచెం కళాహీనంగా కూడా ఉన్నాడు. కాని అతని బంధువులందరికి పెళ్ళికొడుకు వెనకాల వున్న లక్ష్మీదేవి కనిపించింది. ఇతగాడికి జ్యేష్ఠాదేవి కనిపించింది.

"కాకి ముక్కుకు దొండపండు!" అని పెళ్ళిపందిరిలో ఓ పెద్దాయనతో అన్నాడు. భూమి గుండ్రంగా ఉందని సైన్సు టీచరు చెప్పిన విషయం మర్చిపోయి, సాయంకాలానికల్లా కొందరు వార్తాహరులు ఆ విషయాన్ని అతని దగ్గరకు వచ్చి చెప్పారు. దాంతో మొదటిసారి మాలతికి సుబ్బారావు మీద కోపం వచ్చింది. మాలతి వాళ్ళ బాబాయివాళ్ళకు కూడా కోపం వచ్చింది.

"వచ్చినవాడు పెళ్ళిచూడాలి - విందు ఆరగించి వెళ్ళాలి కాని - పెద్ద జడ్జిలాగా కామెంట్లు పాసు చేయడమేంటి!" అంటూ పెద్దలు ఆగ్రహించారు. అది గ్రహించి మూడు రోజులుందామనుకున్న మాలతి మరుసటి రోజే ప్రయాణం కట్టించి ఇల్లు చేరుకుంది. ఆ తర్వాత అతగాడికి క్లాసు పీకింది. ఇంకోసారి - మాలతికి జ్వరం తగ్గకపోతే డాక్టరు అయోమయం దగ్గరికి తీసుకుపోయాడు. ఆయన పదిహేను నిమిషాలు స్టెతస్కోపు మాలతి గుండెలకు వీపుకు ఆనించి - చెయ్యి నొక్కి చూసి - రోగనిర్ధారణకు రాలేకపోయాడు. సందేహిస్తూనే ఓ కాగితం తీసుకుని ఫలానా ల్యాబ్‌లో ఈ టెస్టులు చేయించమని రాసి ఆ కాగితాన్ని ఇతగాడికిచ్చాడు. ఒళ్లు మండిపోయి చెప్పాడు.

"సార్! డాక్టర్ గారు! ఇంత ఖర్చు మేము భరించలేము. ఈ టెస్టుల వల్ల బహుశ మీకు నలభై శాతం కమీషన్ వస్తుందనుకుంటాను. ఆ సొమ్మెంతో చెప్పి నాకు మిగిలిన అరవై శాతం ఆదా చేయించండి. ఎందుకంటే టెస్టుల్లో ఏమీ ఉండదని మీకే గాదు మాకు తెలుసు. అస్సలు టెస్టులు కూడా చేయరని తెలుసు. ఏదో వాళ్ళు బ్రతకాలని మీరు - మీరు బ్రతకాలని వాళ్ళు చేస్తారు. టైం వేస్టు ఎందుకు - మనీ వేస్టు ఎలాగూ తప్పించుకోలేము." డాక్టర్ అయోమయానికి బుర్ర తిరిగిపోయింది. "ఇంకెప్పుడూ ఈ ఏరియాలో కనపడద్దని హుకుం జారీచేశాడు. అప్పటికి మందులు రాసిచ్చేస్తూ, మాలతి నెత్తి నోరు బాదుకుంది అతనితో వెళ్ళినందుకు.

ఇంకోసారి, అతని కొలీగు గోవిందరావుకు బైకుమీద వెళుతూ ఉంటే యాక్సిడెంటు అయి కాలు విరిగి హాస్పిటల్లో చేరాడు. సుబ్బారావు అతన్ని చూడ్డానికి వెళ్తూ - ఉత్త చేతులతో వెళితే బాగుండదని పుల్లారెడ్డి స్వీట్లు పట్టుకుపోయాడు. ఒంటినిండా కట్లతో ఉన్న అతనికి షేక్ హ్యాండిచ్చి - స్వీట్లు చేతిలో పెట్టాడు. గోవిందరావు బిత్తరపోయాడు తత్తరపాటుతో అడిగాడు కూడా. "కాలు విరిగి నేనెడుస్తూ ఉంటే స్వీట్లు ఎందుకు తెచ్చావురా?"

"కంగ్రాట్సు చెబుదామని - చిన్నదాంతో పోయింది. వెధవది కాలేగదా విరిగింది. కొన్నాళ్ళకు బాగవుతుంది. అదే చెయ్యి విరిగితే ఎంత బాధపడాల్సి వచ్చేది! కుడి ఎడమల దగా అయ్యేది! ఇంకా తలకు బలమైన గాయం తగల్లేదు. తగిలి ఉంటే అదేదో సినిమాలో లాగా మమ్మల్నందర్ని మరచిపోయే వాడివి. మూతికి దెబ్బ తగిలి పళ్ళు రాలి ఉంటే నీ మొఖం వికారంగా తయారయ్యేది. అస్సలు నువ్వు లారీకింద పడిఉంటే పైకి పోయి ఉండేవాడివి. మేమంతా నీ అంతిమయాత్రకు సెలవు పెట్టుకుని రావలసి వచ్చేది!" అంటూ ఉపన్యసించాడు సుబ్బారావు. తను స్వీట్లు తేవడలోని అంతర్యాన్ని వివరిస్తూ.

"గోవిందరావు భార్య రాధమ్మ ఇతగాడిని మిడిగుడ్లు వేసుకుని చూసింది. అక్కడే వున్న నర్సులు కిసుక్కున నవ్వుతున్నారు. "ఒరే సుబ్బారావు! నువ్వు రాకపోయినా బాగుండేదిరా!" గోవిందరావు. "భలేవాడివే! నేను తప్పకుండా వస్తాను. నువ్వు యిక్కడున్నంత కాలం రోజూ వచ్చి నీ యోగక్షేమాలు విచారించి వెళుతుంటాను" చెప్పాడు. "నాకు మళ్ళీ యిటువంటి అవకాశాలు రావాలి!" దాంతో అవాక్కులయ్యారు గోవిందరావు, రాధమ్మలు. ఇంకా చెప్పాలంటే చాలా ఉంది. అదే వూళ్ళో వూరేగుతున్న అతని దూరపు బంధువు వంశీకృష్ణ యింట్లో దొంగలు పడ్డారు. ఈ విషయం వాళ్ళు ఫోన్ చేసి చెప్పి సహాయం చెయ్యమని అర్థించారు, సుబ్బారావుకున్న పోలీసు పరపతిని వాడుకుందామని. సుబ్బారావులోని డిటెక్టివ్ బయటపడ్డాడు.

దొంగతనం వంశీకృష్ణ తిరుపతికి పోయినప్పుడు జరిగింది. మూడు రోజులు యింటికి తాళం వేసి ఉండటం చూసి - నాలుగోరోజు తెల్లారుతూండగా తాళం బద్దలుకొట్టి దొంగలు దోచుకున్నారు. "ఇంతకీ ఏం పోయిందిరా?" సుబ్బారావు అడిగాడు. "మా ఆవిడవి పాతిక తులాల బంగారం, నా క్యాష లక్ష రూపాయలు - వెండిగిన్నెలు - కెమెరా - ఇంకా కొన్ని -" అని చెప్పబోయాడు వంశీకృష్ణ. "నీకు బుద్ధి ఉందా? ఎవడైనా లక్షరూపాయలు క్యాషు ఇంట్లో పెడతాడా? బ్యాంకులో వేస్తాడు. ఏ పావలా వడ్డీనో వచ్చేది - భద్రంగా

ఉండేది. అవును పాతిక తులాల నగలు మీ ఆవిడకు నువ్వు చేయించావా? మీ మావ చేయించాడా? నువ్వు చేయిస్తే నీకింత డబ్బు ఎక్కడనుంచి వచ్చింది – దాని మీద ట్యాక్సు కట్టావా? నువ్వు చేసేది చిన్న గుమస్తా ఉద్యోగం – ఇంత భారీ ఎత్తున యిల్లు కట్టావు – మళ్ళీ బ్యాంకుల్లో నీ సొమ్ములు మూలుగుతుంటాయి! ఇళ్ళ స్థలాలు కొని పడేస్తుంటావు. వాటిని ఎవడో ఒకడు ఆక్రమించుకుంటాడులే! అయినా యిన్ని రోజులు నీపైన ఇన్‌కమ్‌టాక్సు వాళ్ళు రైడు చేయకపోవడం ఆశ్చర్యంగా ఉంది" అంటూ వాపోయాడు సుబ్బారావు ఏడుస్తున్న బంధువుతో. పటపట పళ్ళు కొరికాడు వంశీకృష్ణ అనబడే బంధువు.

"ఒరే నువ్వు నా బంధువివా రాబందువువివా? శత్రువ్వా?" "వంశీ! నీ ఫ్రెండును రిలేటివ్‌ని కాబట్టే ఇంత బాధపడుతున్నాను. పేపర్లో పోయిన వస్తువుల లిస్టు పడిందనుకో – గ్యారంటీగా ఏసిబివాళ్ళ కళ్ళు నీ మీద పడతాయి. దాంతో ఉన్నది పోతుంది ఉంచుకున్నది పోతుంది. ఇప్పటికైనా నీ అక్రమాలకు ఆనకట్ట వేసి జనజీవన ప్రవంతిలో కల్సిపో?

సుత్తిమెత్తగా చివాట్లు పెట్టాడు సుబ్బారావు. ఫలితం గురించి చెప్పక్కరలేదు. అప్పటినుండి ఆ యింటి కాకి ఈ యింటి మీద వాలడం లేదు ఐదేళ్లు అయినా. మరొకసారి, కొలీగు కళ్యాణి పెళ్ళికి పోయి వాళ్ళ తల్లిదండ్రులకు సలహా యిచ్చాడు. "పెళ్ళి యింత భారీ ఎత్తును జరపాలా?" చుట్టూతా పరిశీలిస్తూ అడిగాడు. "ఏదో బాబు! జీవితంలో ఒక్కసారేగా చేసుకునేది – ముచ్చట మురిపాలు తీర్చుకోవాలిగా!" వాళ్ళ తండ్రి చెప్పాడు, ఆనందపడిపోతూ తన శక్తి సామర్థ్యాలను గుర్తించినందుకు. "నో! నో! ఇక్కడ యింతమందికి భోజనాలు పెట్టి వృధా చేసే బదులు – ఏ అనాధాశ్రమానికో – కళ్యాణి పేరు మీద వెచ్చాలు కొనివ్వాల్సింది. ఆమె పేరు చెప్పుకుని కొన్ని నెలలు భోం చేసేవాళ్ళు. అయినా జీవితంలో ఒక్కసారే పెళ్ళి ఎందుకు చేసుకోవాలి! కాలం మారుతున్నది. కలిసొస్తే ఎన్నైనా చేసుకోవచ్చు" తాపీగా చెప్పాడు.

ఆ మాట పూర్తి కాకుండానే కళ్యాణి తమ్ముడు అతని మెడను బట్టుకుని బయటకు లాక్కొచ్చాడు. "గెటవుట్ యూ ఫూల్!" ఏంటి వాగుతున్నావు?" అంటూ. "విభిన్నంగా ఆలోచించడం మీకు రాదు – నాలాంటి జీనియస్సులు ఆలోచిస్తే మీరు వినలేరు – అయినా మంచి మాటలు ఈ లోకం ఎప్పుడు వింది కనుక !" అని నిట్టూర్చాడు సుబ్బారావు. ఇలా మా సుబ్బారావు గురించి చెప్పాలంటే అదొక రామాయణం అవుతుంది. ●

# రాయల వైభవం - నృత్య రూపకం

**(రాయల ప్రవేశ సూచికగా వందిమాగధుల స్తుతి)**

- అయినాల మల్లేశ్వరరావు

విజయనగర సామ్రాజ్యాధినేతా! సువిశాల సామ్రాజ్య విజేతా! మాతాశ్రీ నాగులాంబికా పుత్ర రత్నమా! పితాశ్రీ తుళువ నరసనాయక హృదయ ప్రతిరూపమా! ఓటమి యెరుగని అసహాయ శూరా! సాము గరిడీల నారితేరిన మహావీరా! యుద్ధ తంత్ర నైపుణ్య పారీణా! ప్రజారంజక పాలనా దురీణా! ఆముక్తమాల్యద ఆంధ్ర కావ్య విరచితా! గోదాదేవి చరిత్ర గ్రంథకర్తా! సర్వజన సమన్యాయ పాలకా! విజయనగర సామ్రాజ్య యిరువది నాలుగవ ఏలికా! సాళువ తిమ్మరసు మంత్రి అప్పాజీ కనుసన్న వర్తనా! భువన విజయ సాహితీ సభాభవన చతురాననా! అష్టదిగ్గజ కవిపోషకా! ఆంధ్ర ప్రబంధకావ్యారాధకా! బహు భాషాకోవిదా! దేశభాషలందు తెలుగు లెస్సనినాదా! కత్తీ కలముల సమనిర్వహణా నైపుణ్యా! రాజ్య కవితా రాజ్యాల పాలకాగ్రగణ్యా! స్వర్ణయుగ పాలనా సృష్టికర్తా! జయీభవ! విజయీభవ! దిగ్విజయీభవ! (అంటుండగా అప్పాజీతో రాయల ప్రవేశం)

పల్లవి: జయీభవ! జయీభవ! విజయ నగర నాయకా!
జయీభవ! జయీభవ! తెలుగుభాష పోషకా!
జయీభవ! జయీభవ! భువన విజయ దీపికా!
జయీభవ! జయీభవ! ఆంధ్రభోజ భూషకా ॥జయీభవ॥

చరణం 1 : అప్పాజీ అండదండ కొండలా ఉండగా
యుద్ధతంత్ర నైపుణ్యం నేర్చినావు నిండుగా
పదిహేను వందల తొమ్మిదిలో ఠీవిగా
సింహాసన మెక్కినావు విజయనగర రాజుగా॥ ॥జయీభవ॥

చరణం 2 : పెద్దన తిమ్మన మల్లన ధూర్జటి సూరన
రామకృష్ణ రామభద్ర భట్టుమూర్తి కవులతో
భువన విజయ సాహితీ సభాగోష్ఠి నిర్వహించి
ఆంధ్రభోజ! తెలుగుభాష లెస్సగా పలికినావు॥ ॥జయీభవ॥

చరణం 3 : అంగళ్ళలో రతనాలను రాసులుగా పోసి
విక్రయించినారట విజయనగర వీధులలో
దేవళాలు గోపురాలు అందమైన కట్టడాలు
నిర్మించి నీ పాలన స్వర్ణయుగం చేసినావు॥ ॥జయీభవ॥

చరణం 4 : ఆంధ్ర మహావిష్ణుదేవు డాజ్ఞాపించాడని
ఆముక్త మాల్యదను ఆంధ్రంలో రచియించి
తెలుగుతల్లి కంఠసీమ వెలుగుదీప్తిగా చేసి
సాహితీ సమరాంగణ సార్వభౌముడైనావు॥ ॥జయీభవ॥

చరణం 5 : కవుల నెంతో ప్రోత్సహించి ప్రబంధాల వెలయించి
శిల్పులను పోషించి శిల్పాలను చెక్కించి
నాట్యకళను ఆదరించి నర్తకీమణుల పెంచి
సంగీతం చిత్రకళల ఆరాధన సలిపినావు॥ ॥జయీభవ॥

చరణం 6 : దివియందలి దేవతలు దీవెన లిడుచుండగా
భువియందు రంజకముగ పాలన గావించినావు
అయిదు వందలేళ్ళకైన మాసిపోని కీర్తినీ
తెలుగునాట సుస్థిరముగ పాదుకొల్పినాడవు॥ ॥జయీభవ॥

# ఆంధ్రుల సంస్కృతీ వైభవం

-ఎమ్.వి.జె భువనేశ్వరరావు

"పసిడిరెక్కలు విసిరి కాలం
పారిపోయిన జాడలేవీ?
ఏవి తల్లీ! నిరుడు కురిసిన
హిమ సమూహములు?"

అన్నారు మహాకవి శ్రీశ్రీ. కాలం పసిడి రెక్కల్ని విసిరి వెళ్ళాలంటే అది శ్రీమాతయై ఉండాలి. తెలుగు అలాంటి సంపద్భరిత సంస్కృతి గల జాతి అనటంలో ఎటువంటి సందేహమూ లేదు. సంస్కృతి అంటే జీవన విధానం. జీవన విధానంలో మానవ సంబంధాలు ముఖ్యం. తెలుగువారి సంస్కృతి అంటే కొన్ని వేల ఏళ్ళ నాటిది. దాదాపు 4000 సంవత్సరాలకు పూర్వపు రామాయణం మహాభారతం. 3000 సంవత్సరాలకు ముందటి ఐతరేయ బ్రాహ్మణం వంటి ఉద్గ్రంథాలలో పేర్కొనబడిన తెలుగుజాతి ప్రపంచంలోనే మొదట్లోనే అవతరించిన మానవజాతి. ఇందుకు తెలుగువారెంతగానో గర్వపడాలి.

భారతదేశంలో హిందీ తర్వాత ఎక్కువ మంది మాట్లాడే భాష తెలుగు. తెలుగువారు ప్రపంచంలోని అన్ని దేశాలలోనూ విస్తరించారు. అప్పయ్య దీక్షితర్ అనే తమిళ కవి, రెడ్డి రాజుల సామ్రాజ్యంలో నివసించారు. ఆయన మాటల్లో తెలుగు జాతి ఔన్నత్యం గురించి వినాలనుకుంటే...

"ఆంధ్రత్వ మాంధ్ర భాషా చాశ్యాంధ్ర దేశ స్వజన్మభూ: తత్రాపి యజుషీ శాఖానాల్పస్య తపస:ఫలమ్!" అనగా "ప్రపంచంలో ఒక మానవుడు తెలుగుజాతిలో పుట్టాలన్నా, ఒక మానవునకు తెలుగు భాష రావాలన్నా, వాడు పూర్వంలో ఎన్నో జన్మలందు పుణ్యం చేసి యుండాలి. "నిజంగా నేటి ఆంధ్రులం ఎన్నో జన్మలందు పుణ్యం చేసిన వారమే కదా మరి! మనది తెలుగుజాతి. మనం తెలుగువాళ్ళం. మనది తెలుగు భాష. "దేశ భాషలందు తెలుగులెస్స" అని చిరకాలంగా ముద్ర వేసుకున్న భాష. ముఖ్యంగా మనది తెలుగు సంస్కృతి. మన సంస్కృతి చెక్కు చెదరకుండా సుభిక్షంగా ఉండేటట్లు చూచుకునే బాధ్యత మనదే. నిజానికి సంస్కృతి అనే మాట సంస్కృత భాష నుండి వచ్చిందే! సంస్కృతం అంటేనే సంస్కరించబడినది అని అర్థం. సంస్కృతిలో సంస్కార భావం ప్రాణం వంటిది. సంస్కరించటమంటే చక్కగా ఉండేటట్లు చేయడం. అయితే ఈ చక్కదిద్దుకోవ టంలో కూడా మన ఆచార వ్యవహారాలు అంతర్భూతమై ఉంటాయి.

తెలుగు సంస్కృతి ఎంతో సుసంపన్నమైనది. ఆంధ్రుల గురించిన లిఖిత ఆధారాలు ప్రధానంగా మెగస్తనీసు రచించిన "ఇండికా" గ్రంథంలోనూ, అశోకుని శాసనాల వల్లనూ లభిస్తాయి. మెగస్తనీసు క్రీ.పూ. 300 సంవత్సరంలో మౌర్యుల ఆస్థానానికి గ్రీకు రాయబారిగా భారతదేశాన్ని సందర్శించారు. ఆంధ్రులకు ప్రాకారావృతమైన 30 నగరాలు, లక్ష పదాతి సైన్యం, 3 వేల అశ్వబలం, రెండు వేల ఏనుగులతో కూడిన సైనిక శక్తి ఉన్నదని వ్రాశాడు. ఆంధ్రదేశం చంద్రగుప్త మౌర్యుని కాలంలోనే మౌర్య సామ్రాజ్యంలో భాగమైంది.

ఏ జాతి సంస్కృతిలోనైనా సాహిత్యానిదే ప్రథమ ప్రాధాన్యం. "సాహిత్యం" సహిత లక్షణం కలది. జాతికి హితం కలిగించటం కోసమే సాహిత్యం పుట్టింది. అందమైన భాషలో, ఆకట్టుకునే కథా రూపంలో శ్రోతకు, పఠితకు నీతిని పదిలంగా మృదువుగా శ్రావ్యంగా అందించాలి. అటువంటి ఉత్తమ లక్ష్యంతో పుట్టిందే సాహిత్యం. తెలుగు సాహిత్యం గురించి తెలుసుకోవాలంటే - తెలుగు భాష మాధుర్యాన్ని చవి చూడాలి.

"ఉగ్గుపాల నుండి ఉయ్యాలలో నుండి
అమ్మపాట పాడినట్టి భాష
తేనె వంటి మందు వీనులకును విందు
దేశభాషలందు తెలుగు లెస్స!
సంస్కృతంబులోని చక్కెర పాకంబు
అరవభాషలోని అమృత రాశి
కన్నడంబులోని తేట తెలుగునందు
వేనవేల కవుల వెలుగులో రూపొంది
దేశ దేశములలో వాసిగించిన భాష
వేయి యేండ్ల నుండి విలసిల్లు నా భాష
దేశ భాషలందు తెలుగు లెస్స!"

అనేక మాండలికాల సమాహారమై సువర్ణహారమై ధగధగ మెరుస్తున్న తెలుగుభాష" ఇటాలియన్ ఆఫ్ ది ఈస్ట్"గా ప్రశంసింపబడింది. తెలుగు భాష గొప్పదనం అంతా ఇంతా కాదు.

"ఆంధ్ర దేశీయ భాష "అజంత" భాష
క్షీరనీరానురక్తి సంస్కృతము గూడి
స్వరుచి, బ్రకటించు భాష - సర్వ ప్రశస్తి
భాష ఒదిగెడు నవధాన బంధమందు"

ఎంతో గొప్పదైన భాష మన తెలుగు భాష. సంస్కృతంలో పాలు నీళ్ళవలె కలిసిపోయి తిరుగులేని భాష అయింది ఇది సర్వత్రా ప్రశంసించు భాషే కాకుండా అవధాన ప్రక్రియల్లో చక్కగా ఇమిడిపోయే భాష కూడా.

"తెనుగునాడు నీది - తెనుగుబిడ్డవు నీవు;
తెనుగుఉన్న నీకు తిపి మెండు, తెనుగు
కన్నె జడల దీర్చి మక్కువ తోడ తెనుగు
తోటలందు త్రిప్పినావు

అని దేవులపల్లి రామానుజరావు తెలుగు పందిళ్ళకు పచ్చతోరణం వెలయింపజేస్తే-

"ఒక్క సంగీత మేదో పాడినట్లు భా
షించు నప్పు విన్పించు భాష
విస్పష్టముగ నెల్ల విన్పించునట్లు స్ప
ష్టోచ్చారణంబున నొనరు భాష
రస భావముల సమర్పణ శక్తియందున
అమర భాషకును దీటైన భాష
జీవులలో నున్న చేవ యంతయు చమ
త్కృతి పల్కులన్ సమర్పించు భాష
భాషలోక పది తెలిసిన ప్రభువు చూచి
భాషయన నిద్దియని చెప్పబడిన భాష
తనర ఛందస్సులోని యందమ్ము నడక
తీర్చి చూపించి నట్టిది తెలుగు భాష.

అని కవి సామ్రాట్ విశ్వనాథ సత్యనారాయణగారు ఆంధ్రభాష అంద చందాలను ఆవిష్కరించారు. వాటి శతక సాహిత్యం నుండి నేటి హైకూ వరకూ మరియు తాటాకు గ్రంథాల స్థాయి నుండి నేటి కంప్యూటర్ యుగం వరకూ నిక్షిప్తమై యున్న తెలుగు సాహిత్యం నిజంగా విశ్వవ్యాప్తమైందే. తెలుగు పద్యం, నాటకం, కథా కవిత్వం, నవలా నాటకం – అన్నీ ఒక దాన్ని మించి ఒకటి ఎదిగాయి. ఇరవయ్యో శతాబ్దమైతే మనకు ఒక ఆధునిక సాహిత్య వైతాళికుడైన కందుకూరి వీరేశలింగం పంతులుని, కన్యాశుల్కాన్నిచ్చిన గురజాడ అప్పారావుని, వ్యవహార భాషావాది గిడుగు వెంకట రామమూర్తిని, ఒక విశ్వనాథుని, ఒక శ్రీపాదని, ఒక పానుగంటిని, ఒక నండూరిని, స్త్రీ స్వేచ్ఛకై కలం పట్టిన చలాన్ని, హేతువాద విశ్లేషణకు పూనుకున్న కవిరాజు త్రిపురనేనిని, శ్రీశ్రీని, దేవులపల్లి కృష్ణశాస్త్రిని, ఉమర్ ఆలీషా, గుర్రం జాషువా, ప్రధాని స్థాయి కెదిగిన బహుభాషా కోవిదుడు పి.వి. నరసింహారావునీ, అంతర్జాతీయ బహుమతి నందుకున్న "గాలివాన" కథానిక సృష్టికర్త పాలగుమ్మి పద్మరాజునీ, వివిధ మాండలికాల్లో నవలలు వ్రాసిన పోరంకి దక్షిణామూర్తినీ, చివరకు మిగిలిందన్న బుచ్చిబాబు, వాయులీనం విన్పించిన చాసో, రత్తాలు రాంబాబును చూపిన రావిశాస్త్రి, భరాగో, కాళీపట్నం, ఎదురీత సాంఘిక నాటక సృష్టికర్త కొండముది గోపాల రాయశర్మ "మా భూమి"ని రచించిన సుంకర వాసిరెడ్డి, పాలేరును వ్రాసిన బోయి భీమన్ననీ ఇంకా ఎంతోమంది సాహిత్యకారుల నందించింది. ఇంకా అందిస్తూనే ఉంది. తెలుగు సాహిత్య గ్రంథాలు భాషా సాహిత్య వికాసాలకు దోహదం చేస్తున్నాయి. తెలుగు సాహిత్యం ఇతర భాషలలోకి, ప్రపంచ భాషలలోకి అనువదితమై అంతర్జాతీయ ప్రతిష్ఠను పొందుతోంది.

కవిత్వంలో కొన్ని వ్యంగ్య చిత్ర కవితల్లాగా కన్పించవచ్చు. చీమకథలు, చిలుక కథలు, పిట్ట కథలు, పొడుపు కథలతో పాటు, పద్యాలతో పాటు, నానా కవితలు, హైకూ కవితల్లో – రచయితలు, రచయిత్రులు ఉత్తమ సంస్కార ప్రభోదక రచనలు చేస్తున్నారు. చిత్రకారుల్లో కూడా సంస్కార భావాలు ప్రచు రంగా ప్రదర్శించే ప్రాజ్ఞులున్నారు. బాపూ రేఖా చిత్రాలున్నాయి. గిరీశాన్ని, మధురవాణిని, కిన్నెరసానిని, ఎంకినీ తన చిత్రాల రేఖల్లో ప్రదర్శిస్తూ ప్రేక్షక లోకానికి సంస్కార భావాలు కలిగేట్లు చేశారు.

చిరకాలంగా తెలుగు సంస్కృతిని సుసంపన్నం చేసిన జానపద కళా వైభవాన్ని మనం విస్మరించరాదు. తోలుబొమ్మలాటలు, యక్షగానం, బుర్రకథ, జముకుల కథలు, కురవంజి, వీధి నాటకాలు, పగటి వేషములు, జంగం కథలు, పిచ్చికూళ్ల వారు, హరికథలు, భాగవతులు, కనక తప్పెట్లు, చెక్క భజన, హరి హరీ పదాలు, బైండ్లవారు, మొదలైన జానపద కళారూపాలు తెలుగు సంస్కృతి వికాసానికి ప్రతిరూపాలుగా నిలుస్తాయి.

జంగం దేవర, చోడిగాడి కలాపం, దేవదాసు నృత్యం, తోలు బొమ్మలాటలో బంగారక్క కౌతిగాడు, ఫకీరు వేషం, డప్పుల నృత్యం, పిట్టలదొర, బుడుబుక్కల జోస్యం, గౌండలమ్మ అశ్వ నృత్యం, లంబాడి గన్నెగాడు, పదితలల రావణాసురుడు, బుడిగే జంగాలు, వాలకం నాట్యం, బుట్టబొమ్మలాట, చెంచులు, ఘట నృత్యం, హరిలో రంగ హరిభజన, జుట్టు పోలిగాడు, విప్రవినోదం, దేవతా కొలువులు, దండగానం, జిత్తుల గారడీ, జంతర మంతర్ పెట్టె, రుంజవాయిద్యం, ఎరుకల సాని, సోది, ఉరుముల నృత్యం, గంగిరెద్దులాట, కొమ్ముదాసరి, బుర్రకథ, భజన, హరికథ, కోలాటం, కాశీ కావడి, హరిదాసు, బతకమ్మ, ఉయ్యాలో నృత్యం, మందుల వారి వేషం, వీరశైవులు, గొల్లసుద్దులు, గొరవయ్యల నృత్యం, చిందు భాగోతం, తప్పెటగుళ్ళు, ఏకాపత్ర యమ, దసరా వేషం, పగటివేషాలు, వీరభద్ర విన్యాసం, శూలాల నృత్యం, గరగల నృత్యం, తోలుబొమ్మలాటలోని ఆంజనేయస్వామి, అల్లాటప్పగాడు, తోడపెద్దు సేవ, పులివేషాలు, అమ్మవారి వేషం, ఆదివాసీల ధింసా నృత్యం, ఇవన్నీ తెలుగు సంస్కృతిని ఉత్తేజపరచి, తెలుగునాట పేరెన్నిక కన్న కళారూపాలే. ఇవి లేకుండా ఏ పండుగ సంపూర్ణం కాదు. ముఖ్యంగా పల్లెటూర్లలో ఈ సాంప్రదాయక కళారూపాలు నేటికి తాండవిస్తాయి. తెలుగు సంస్కృతిని పరిపుష్టం చేసిన ఈ కళారూపాలన్నింటినీ ఒక్కసారిగా ఒకే వేదికపై చూడగలిగే భాగ్యం ఎవరికి దొరికినా వారు అదృష్టవంతులే.

తెలుగువారి హస్తకళా నైపుణ్యాలు కూడా ప్రపంచ ప్రసిద్ధి గాంచాయి. మన రాష్ట్రంలో పేరెన్నిక కన్న చేనేత కారులు ఉన్నారు. కాలానుగుణంగా, సృజనాత్మకతకు మెరుగులు దిద్దుకొంటున్న గద్వాల్, పోచంపల్లి, కొత్తపేట, నారాయణపేట, వెంకటగిరి, పాటూరు, ఉప్పాడ చీరలు, గుంటూరు వెండి జరీ చీరలు అత్యంత ప్రాముఖ్యతను సంతరించుకున్నాయి. పొందూరు ఖద్దరు పంచెలు, ధోవతులతో పాటు ఖద్దరు చీరలు కూడా ప్రాముఖ్యమైనవే అయ్యాయి. హరప్పా నాగరికతా కాలం నుండి వర్ధిల్లుతున్న అతి పురాతనమైన హస్తకళ, కలంకారి, కొండపల్లి, ఏటికొప్పాక బొమ్మలు, బహుమనీ రాజపాలనలో తెలుగు నాట వేళ్ళూనిన చిద్రీకళ, కరీంనగర్ వెండి నగిషీ కళ ఫిలిగ్రీ, పెంబర్తి లోహపు రేకులు, బంజారా కుట్టు పనులు, నిర్మల్ వర్ణ చిత్రాలు, దక్కను రగ్గులుగా ప్రసిద్ధి గాంచిన తెలుగు తివాచీలు, కొంకి సూదుల అల్లిక పనులు, హైదరాబాద్ గాజులు బుడితి, హిమ్రూ, కొమ్ము, దంతపు వస్తువులు, పూసల అల్లిక, శిల్పకళ, వీణ మృదంగాలు, డోక్రా మొదలైన హస్తకళలు మన రాష్ట్రంలో ఉన్నాయి.

ఏ జాతి సంస్కృతినైననూ ఇతరులు ఆదర్శంగా తీసుకొని తమ ప్రాంతంలో అభివృద్ధి చేసుకుంటున్నారంటే నిస్సందేహంగా అవి మహోత్కృష్టమైన సంస్కృతే! మలేషియా, కాంబోడియా, సింగపూర్, బర్మా, శ్రీలంక, నేపాల్, మలాయా, జావా, సుమత్రా, సయాం మొదలైన చోట్ల తెలుగు సంస్కృతి ప్రభావపు ఆనవాళ్ళు గోచరిస్తాయి. ప్రవాసాంధ్రులు అమరావతిలో నున్నా లేక అమెరికాలో ఉన్నా తప్పనిసరిగా తెలుగుజాతి ఔన్నత్యాన్ని చాటి చెప్పేందుకే కృషి చేస్తారన్నది నిర్వివాదాంశం. ప్రపంచపు నలుమూలలా జరుగుతున్న ప్రపంచ తెలుగు మహాసభలు సైతం మన సంస్కృతీ సంప్రదాయాన్ని ఉజ్జీవింపజేసేవే!

తెలుగు సంస్కృతిని ఉన్నత స్థాయిలో నిలబెడుతున్నవి తెలుగు పండుగలు. కట్టుబొట్టు మరియు సాంప్రదాయలే! తెల్లగా తెలవారకుండానే తేట గీతలతో తయారైన తలవాకిలి – తెలుగు ఇల్లాలి చిత్రలేఖన కళాభిరుచికి అద్దం పట్టే అందమైన లోగిలి. ఆమె అలంకార ప్రియతకే కాక, శుచిత్వానికీ నిదర్శనంగా నిలిచే ముచ్చటైన ముంగిలి ప్రతి ఉదయమూ విధిగా చేసే పనే అయినా – పండుగ వేళల్లో ఈ ఇంటి ముందు అలంకరణ మరింత శ్రద్ధగా సాగుతుంది.

ఏ పండుగ వచ్చినా ఇళ్ళూ వాకిళ్ళూ బూజు దులుపుకొని పరిశుభ్రంగా కళకళలాడాల్సిందే. గడపలకు పసుపూ, వాకిళ్ళకు మామిడాకు తోరణాలూ అలంకారాలు కావలసిందే. ఋతుధర్మానికి సరిపడే క్రొత్త రుచులతో పిండివంటలు, తలంటుస్నానాలు, దేవుడి గుళ్ళో పూజలు, కుటుంబాల్లో అందరూ ఒక్కచోట చేరి సంబరాలు జరుపుకునే కోలాహలం... ఇవన్నీ పండగుల తెచ్చిపెట్టే ఆనందోత్సాహాలు! ఋతువు ఋతువులోనూ ఎన్నో పండుగలు,ముఖ్యమైన ముగ్గులు, పండుగ సంక్రాంతి, షడ్రుచుల పచ్చడి

రుచిని చవి చూపించే ఉగాది, రాములవారికి పెళ్లి జరిపించే శ్రీరామనవమి, నవరాత్రులూ, హరికథలూ, పురాణ కాలక్షేపాలతో ఊరంతా ఘనంగా జరుపుకునే వినాయక చవితి, దసరా పండుగ ఉత్సవాలు, బొమ్మల కొలువులు, బతకమ్మ పూజలు, ఈ సంప్రదాయపు కళా ప్రదర్శనలన్నీ, గుండెలు పొంగించుకొనే సంబరాలు సరదాలు! మహాశివరాత్రి, నాగులచవితి, స్త్రీలు నిత్యం చేసుకునే పూజా పునస్కారాలు ఆచరించే నోములు, వ్రతాలు. ఇంకెన్నెన్నో! వీటిలో ముఖ్యంగా తెలుగు వత్సరం ఉగాది – తెలుగు జాతి సంస్కృతిని ప్రతిబింబించే పండుగ. ఈ పండుగనాడు వసంతోత్సవం జరుపుకుంటారు. వసంతం చల్లుకునే సాంప్రదాయం తరతరాల నుండి వస్తున్నది. మల్లియల ఘుమఘుమలు, మామిడి రుచులు, చెరకు తీపులు – అన్నీ కలబోసుకుని వచ్చే ఈ పండుగ రోజు భక్ష్య, భోజ్య, చోష్య, లేహ్యములతో వంటలు చేసుకునే సాంప్రదాయం అనాది నుండి వస్తున్నది. క్రొత్తగా వచ్చిన బెల్లంతోను, చెరకు ముక్కలతోనూ, క్రొత్త మామిడికాయలు, వేపపూతతోనూ ఉగాది పచ్చడి చేసుకునే సాంప్రదాయం మన సంస్కృతికి మాత్రమే స్వంతం.

బొట్టు, కాటుక, వాలుజడ, ఆ వాలుజడలో తురిమిన మల్లెల మాలలు, చెవులకు లోలాకులు, ముక్కుకు మెరిసే ముక్కుపుడక, మెడలో నాజూకైన బంగారు గొలుసు – ఇది తెలుగింటి ఆడపడుచు వేషం. ధోవతీ, లాల్చీ, ఉత్తరీయాలతో అతగాడు – ఇది సాంప్రదాయకమైన తెలుగురూపం. అత్యంత ప్రత్యేకంగా జరిగే మన పెళ్ళిళ్ళు కూడా తరతరాల సాంప్రదాయాల్ని అనుసరిస్తూ... వేడుకగా ఘనంగా కోలాహలంగా జీవితకాలం పాటు వధూవరులూ, వారి బంధువులూ గుర్తుంచుకొనేటట్లు జరిగేదే. మాటలాగా, వేషంలాగా, ఆచారంలాగ, భోజన విషయాలలోనూ, ప్రతిజాతికీ తనదైన ప్రత్యేకత, ఉండి ఉంటుంది. తెలుగు వారి వంటకాలూ, వాటి రుచుల తీరులూ అచ్చంగా తమవే అనుకునే ప్రత్యేకతలు చెప్పుకుంటే చాలానే ఉన్నాయి. ఆవకాయ, గోంగూర అనగానే ఆంధ్ర తేజస్సు గుర్తుకు వస్తుంది. చద్ది అన్నం దగ్గర నుంచీ – చవులూరు కరివేపాకుతో ఘుమఘుమలాడు పైర వంకాయ కూర వరకూ, ముద్దపప్పు దగ్గర నుండి ఊరగాయ పచ్చళ్ళ వరకూ, పూత రేకులూ, పనసతొనలు, తెలుగు లోగిళ్ళను ఘుమఘుమ లాడించే సాంప్రదాయపు వంటకాలెన్నో! ఏ దేశానికి వెళ్ళినా, ఏ రాష్ట్రానికి వెళ్ళినా – అన్నం కోసం ఆవకాయ ముద్దకోసం పలవరించే జిహ్వ వేదన – తెలుగుతనాన్ని పట్టి ఇచ్చే ఒక పరమ రహస్యం.

తెలుగు సంస్కృతి – అన్నపూర్ణగా దక్షిణ భారత ధాన్యాగారంగా పేరు గాంచిన ఆంధ్రప్రదేశ్‌లోని వ్యవసాయ సంస్కృతి ఆసరాగా రూపు దిద్దుకున్నదే. పచ్చని పొలాలు, కృష్ణా గోదావరీ తీరాలు మనలో అంతర్భాగమైనాయి. మన రాష్ట్రీయ పుష్పం కలువ, రాష్ట్రీయ పక్షి పాలపిట్ట, వృక్షం వేపచెట్టు, ఫలం మామిడి పండు, జంతువు కృష్ణ జింక, క్రీడగా ఆరోగ్యాన్నిచ్చే కబడ్డీ, రాష్ట్రీయ చిహ్నాంగా పూర్ణకుంభం – మనకున్న పర్యావరణ, పశు పక్ష్యాదులపైనున్న ప్రేమాభిమానాన్ని, మమకారాన్నీ వెల్లడి చేస్తాయి. త్యాగయ్య గొంతులో తారాడు నాదాలు, మనకి ప్రేరణ. తిక్కయ్య కలంలో తియ్యందనాలు మన ఊపిరి. రుద్రమ్మ భుజభక్తి, మల్లమ్మ పతిభక్తి మన కాదర్శం. తిమ్మరుసు ధీయుక్తి, కృష్ణరాయల కీర్తి మన బలం. ఇవన్నీ అనునిత్యం సజీవంగా నిత్య చైతన్యంతో మన చెవుల్లో మార్మోగుతూనే ఉంటాయి. ఆంధ్రులు ఆరంభశూరులే కాదు. ముగింపు వీరులేనని అంచెలంచెలుగా ఎదుగుతూ ప్రపంచమంతా విస్తరిస్తున్న తెలుగు బిడ్డలు నిరూపిస్తున్నారు. అనకాపల్లి నుంచి అమెరికా వెళ్ళినా కూడా పదపదాన అమృతం తొణికిసలాడే తెలుగుభాషకూ, సంస్కృతికీ పట్టం కడుతున్నారు.

"చెయ్యెత్తి జైకొట్టు తెలుగోడా
గతమెంతో ఘనకీర్తి కలవోడా" అన్నది వాస్తవమే... గతమే కాదు వర్తమానం, భవిష్యత్తూ కూడా ద్విగుణ, త్రిగుణ, ప్రగతివంతంగా తెలుగువాడు ఎదిగాడన్నదీ నిజాలకే నిజం! ఆధునికత సొబగులద్దుతూ తెలుగు సంస్కృతిని వెలుగు సూర్యుడుగా తీర్చిదిద్దటమనే... ఏ ప్రయత్నమైనా ఆనందింపదగ్గదే కదా!


***ఆధార గ్రంథాలు :***

***1. వజ్రభారతి (కృష్ణాజిల్లా రచయితల సంఘం)***

***2. తెలుగువారి సంపూర్ణ పెద్ద బాలశిక్ష (శ్రీ గాజుల సత్యనారాయణ)***


## ధృతరాష్ట్ర కౌగిలి

– శ్రీ ఆచాళ్ళ శ్రీనివాసరావు

పల్లవి : గుండె గొంతుకలోన కొట్టాడుతుంటాది
పదము పదమూ కలిసి పాట నడిస్తాది
ఎంత వరమిచ్చావు గురువా
నీ ఋణమెట్ట తీర్చేది గురువా
మడిసిలో మడిసిని మాటలో సూబెట్టి
లోకాలు మార్చనా గురువా
నీ ఋణమట్ట తీర్చనా గురువా !

చరణం : బొడ్డూనోడయిన, నడ్డొంగినోడయిన
దమ్ముకొట్టుట హానికరము
పొగబెట్టి సెగబెట్టి భూదేవి కళ్ళల్లో
దుమ్ముకొట్టుట నేరతనము
ఊహతో మొదలయితె ఊపిరాగేదాక
ఆర్పలేమీ ధూపము
పొగచెట్టుదీ శాపము...

చరణం : పల్లెల్లో కల్లయిన, ఫారెనూ సరుకయిన
వొళ్ళు గుల్లయి తీరును...
మనిషి మేధని మందు మత్తులో జోకొట్టి
భ్రష్టుపట్టుట హీనము...
ఇల్లాలి పుస్తెనీ, పిల్లడి సదువునీ
చేతులారా తుంచడం
మడిసిగా మరణించడం
మళ్ళీ పశువుగా జన్మెత్తడం...

ముక్తాయింపు : వ్యసనాలు హాసనాలుగా పలకరించి
కడదాకా తోడొచ్చునూ
కట్టెనీ కడదేర్చి కరుణించునూ...

# స్పీడ్ బ్రేకర్

- శింగిసెట్టి సంజీవరావు

"అయ్యో! అయ్యో!"

"అరెరె! అరెరె!"

"ఆc, ఏమయింది, ఏమయింది"

"అయ్యో పాపం"

"అబ్బా నేను చూడలేను బాబు"

"ఆ డ్రైవర్ని పట్టుకోండి"

"ఇంకెక్కడ డ్రైవరు పరారీ అయినట్టుంది"

"ఏం డ్రైవర్లు? ఏం బళ్ళు? మన్ను మిన్ను కానకుండా డ్రైవ్ చేస్తే జనం ముదనష్టపు చావు చావక మరేమవుతారు?"

"ఏదో ముంచుకుపోతున్నట్లు, వెనుక నుండి సునామీ కెరటం తరుముకు వస్తున్నట్టు బండి పరుగులెందుకో? ఆ కెరటం కన్నా ఈ స్పీడు చూస్తే మరింత భయం వేస్తుంది."

"ఇప్పుడు తయారీ అయ్యే సామాన్ల నాణ్యత బొత్తిగా దిగజారి పోయిందంటే నమ్మండి. ఈ బ్రేకులు ఓ మానాన పడి చావవు"

"ఈ పిల్లలేం తక్కువ చదివారా? సైకిళ్లకి, రిక్షాలకి, మోటార్లకి అడ్డంగా వెళ్లకపోతే ఏం? తెలిసింది కొంత. తెలియంది కొంత. నడిరోడ్డు మీద పడి తెగ ఆడేస్తారు, బంతులాటలు, సయాటలు, ఏకంగా క్రికెట్టు కూడా."

"అందుకే కాబోలు పిల్లల గుర్చి ప్లే గ్రౌండ్ల ప్రసక్తే ఉండదు మన పెద్దవాళ్లకి."

"పాపం పసివాళ్లు. వీళ్లేం చేస్తారు, ఆడుకొనే వయసు. తల్లిదండ్రుల కుండాలి కాని పిల్లల్నిలా వీధిలోకి దూడల్ని వదిలేసినట్టు పారిపోనిస్తారా కట్టడి చేయకుండా."

"పిల్లలంటే కన్న తల్లికి ఆ మాత్రం జాగ్రత్త లేకపోతే ఎలా చెప్పండి. కబళించ డానికి కాకపోతే డేగ కన్ను వేసి ఉంచాలి మరి. అయినా అంతా మన భ్రమ కాని ఎప్పుడేది జరగాల్సుందో అప్పుడది జరిగి తీరాల్సిందే. భగవంతుడు ముందే డిజైన్ చేసి సమయం నిర్దేసించి ఉంచుతాడు."

"ఇదేచోట జరిగిన ఏక్సుడెంటులకి లెఖ్ఖా జమా ఖర్చులు లేవు. ఎవరికేమి చీమ కుట్టినట్టయినా ఉండదు. అందరూ రోడ్డు షో చూసేవాళ్లే." "ఈ లోకాలిటీలో ఏదో అమ్మవారి శక్తి పనిచేస్తోందిలా ఉంది. ఆమెకు జరుగుబాటులో తక్కువైయుంది ఏదో."

ఏక్సిడెంటు జరిగినచోట ఆడా మగా పిన్నా పెద్దా గుమిగూడి ఎవరికి ఏం తోస్తే అది బయటికి మాటలు వెళ్లకెక్కారు. "లెండి, దార్లోలెండి. ఇదేం వీధి నాటకమా చుట్టూ చేరి చూడ్డానికి" అంటూ పోలీసులు రంగంలోకి దిగి లాఠీలు ఝుళిపించారు. అక్కడ అదే చోట ఇంతకి ముందు ఎన్నో ఎన్నో ఏక్సిడెంటులు జరిగాయి. ఇప్పుడు జరిగిందిది.

కొన్ని నెలలవరకు ఆ తరువాత బళ్లు సాఫీగానే సాగిపోయాయి. నిస్తబ్దత ఏర్పడినట్టయింది. ఆ తరువాత మళ్లా ఏక్సిడెంట్ల పరంపర కొనసాగే సరికి ఆ లోకాలిటీకి పొలిటికల్ కాన్షస్‌నెస్ ఉన్న ఓ ఆసామి వచ్చి చేరేసరికి అక్కడి వారందరిలో ఒకకొత్త చైతన్యం వచ్చినట్టుంది.

పై అధికారులకి రిపోర్టులు వెళ్లాయి. పేపర్లలో వచ్చాయి. న్యూస్ కవరేజు, కథనాలు టి.వి. ఛానళ్లలో, రేడియో ప్రసారాల్లో, 'ఎఫ్.ఎమ్.' లలో కూడా చోటు చేసుకొన్నాయి. ఇదేం దంపు ఊక దంపని కొంతమంది రిపోర్టులని కొట్టి పారేయకపోలేదు. అమ్మవారిని ఆకలి తీరినప్పుడల్లా ఏక్సిడెంటులు ఆగిపోతున్నాయని హేతువాదం చెప్పేరు మూఢనమ్మకమే అయినా.

వెంటనే ఓ చిన్నపాటి పాలకవర్గం కమిటీ ఏర్పాటయింది. ఒకేచోట ఏక్సిడెంటులు జరిగినదానికి కారణమేమిటి, మధ్యమధ్యలో జరగకపోటానికి కారణం ఏమిటి. వీటన్నింటినీ కూలంకుషంగా పరిశీలించి, ఏక్సిడెంటులు జరగని కాలంలో ఏదైతే సాయపడిందో దానిని పసికట్టి తెలియపర్చగలందులకు ఆర్డరు జారీ అయింది కమిటీ మీద. ఏ వైనం తెలిసిన వెంటనే నివారణ చర్యలు అమలు పర్చడం జరుగుతుందని లోకాలిటీ వారికి హామీ చేరింది. కమిటీతో సహకరించమని లోకాలిటీ వారిని కోరడం కూడ జరిగింది.

అదేమంటే పక్కూరిలో ఓ పుల్లయ్యగారి ఆవు ఉత్తిపోతే దాని ఆలనా పాలనా తగ్గిపోవటం వల్ల అది తప్పించుకొని వచ్చేసిందట, ఆ కోలనీలో ఆకు అలం బాగా దొరకడంతో అక్కడ మకాం వేసిందట, ఎక్కడ ఏది దొరికితే గబగబ మింగేసి ఆ మలుపులో చేరి రోడ్డుకడ్డంగా పడుకొని తీరిగ్గా నెమరు వేసుకొనేదట, వచ్చిన మోటార్లు తప్పనిసరిగా అక్కడ ఆగాల్సిందే. అంత స్పీడుని అదుపులోకి తెచ్చుకోవాలి మరి. ఆ సమయంలో ఏక్సిడెంటులు జరగలేదు సమంజసమే. తీరా పక్కూరు పుల్లయ్య ఆవు గురించి వెదికి వెదికి కొన్ని నెలల తరువాత పట్టుపడితే ఆ లోకాలిటీ నుండి తీసుకుపోయాడట. ఆవు వెళ్లాక తప్పలేదు మొదట నేల బడి పోర్లినా.

ఈ విధంగా ఆవు పారిపోయి రావడం, మళ్లా పుల్లయ్య తీసుకొని పోవడం జరుగుతూనే ఉంది. ఆ కోలనీలో రసిక శిరోమణి శ్రీక్రిష్ణ దేవాలయం ఉండడం మూలన గోపాలుడికి అంకితమయిని ఆవులా ఉంది. ఇదీ సంగతి, ఆవు అడ్డంగా ఆ మలుపులో పడుకోడం వల్ల ఏక్సిడెంటులు జరగకుండా పోయాయని కమిటీ నుండి రిపోర్టులు వెళ్లాయి. కాని పాటించాల్సిన నివారణోపాయం కమిటీ వారు సూచించలేదు. దానిని పై అధికారులకే వదిలేసారు.

రిపోర్టుని బట్టి చూస్తే పక్కూరి పుల్లయ్య అవే ఏక్సిడెంటులు జరగకుండా ఉండడానికి నిజమైన కారణం అని తెలిసిన విషయమే ఏ మాత్రం ఇంగితజ్ఞానమున్నా కామన్ సెన్స్ బట్టి ఆవు ఎల్లకాలం ఆ మలుపులో పడుకుంటే మరి ఏక్సిడెంటులు జరగవన్నమాట. అందుకు ఆవు యజమానికి దాని మూల్యం ముట్టచెప్పి దాన్ని యధారీతిగా అక్కడ వదిలేయాల్సి ఉంది.

అదే ఆవుని కొనాలంటే ఒకటే క్వొటేషను, రూల్సు ఒప్పుకోవు, ఏదో తంటాలు పడి మరి రెండు క్వొటేషన్లు సంపాదించవచ్చు, లోయెస్టు క్వొటేషను అంగీకరించవచ్చు. అయితే పుల్లయ్య ఆవు ఎక్కడ దొరుకుతుంది. మరి ఏ ఆవు అక్కడికే వచ్చి పడుకొంటుందని గ్యారంటీ కూడా లేదు. నాణ్యత దృష్ట్యా, మానవతా దృష్ట్యా ఒకే క్వొటేషనుకే అయినా పుల్లయ్య ఆవునే కొనేందుకు నిర్ణయం జరిగింది. అదను దొరికింది. పుల్లయ్య భాగ్యవంతుడయ్యాడు.

రాను రాను కోలనీలో కొత్తగా చేరిన పొలిటికల్ కాన్షస్‌నెస్ ఉన్న బుర్రకి

పుల్లయ్య ఆవు తనువు చాలించి గోపాలుడినే చేరుకోగా ఒక్క విషయం తట్టింది. ఆ మలుపులో స్పీడు బ్రేకరు వేసేస్తే సరిపోతుంది కదా అని అతను అన్నదానికి తలా ఒక్కడు తల గోక్కున్నాడు. అందరూ తేరుకొని అతన్ని ఎత్తి కుదేశారు. "శభాష్ శభాష్" అంటూ. రోడ్డు సంస్థ వారికి పని అప్పగించడం జరిగింది. స్పీడు బ్రేకరుకి ఎస్టిమేటు వేయడం, సేంక్షను కావడం, టెండర్లు పిలవడం జరిగిపోయాయి. కంట్రాక్టర్లు ముగ్గురేమిటి ఎంతమందో ఎన్నో టెండరు క్వొటేషన్లు అందజేశారు. గడువు తీరిన తరువాత కంపరేటివ్ స్టేట్‌మెంటు, కంట్రాక్టర్ల అనుభవం, వారు ఇంతకి ముందు చేసిన పనుల్లో నాణ్యత పరిశీలించిన మీదట సరైన నిర్ణయం జరిగింది. యుద్ధప్రాతిపాదికలో పని కూడ జరిగిపోయింది. మంత్రిగారి చేత ఆవిష్కరింపబడింది కూడా గొప్పగా జేజేలు మధ్య. ●

## ఆకుపచ్చని పాట ఒకటి (మహాకవి వేటూరి స్మృతిలో)

– శిఖా – ఆకాష్

ఎన్ని పరిమళాల గొంతుతో పలకరిస్తుంది
సుతిమెత్తగా పాటల పరునంపు గాలి
అమాంతం గోదావరి నెత్తుకొచ్చి
హృదయ మైదానంలో పంటచేలను మొలిపిస్తుంది
నీటి ఆకుల అలల మీద
తపః సమాధిలో శృంగార రసాధి దేవతలో
పాటల పద్మం
కిరణాల రెప్పలు విప్పుకుని
సరికొత్తగా గాలిని పరిచయం చేస్తుంది
వేనవేల పాదాలతో వచ్చి పోయే
మృదు మధుర మంద్ర దరహాస చంద్రికా
దీప వసంతోత్సవ సౌందర్య శోభా వికాసం
ఎన్నెన్ని అలలను మీటిందీ
మరెన్ని కలలను పంచిందీ
ఎలా వదులుకోవాలి?
ఎలా కాదనగలదీ గాలి?
వానకు తడిసిన మట్టిపూల సంభాషణేదో విచ్చుకున్నట్టు
తొలిపొద్దు కిరణాల సీతాకోకల తొలిముద్దు తేనె సుగంధాలు విరిసినట్టు
పచ్చనాకుల నదుల్ని భుజానేసుకొని
అరణ్యాల్ని హిమాలయాల్ని నెత్తిన జుట్టుకుని
సుందర స్వప్న సంగీత సాహిత్య ప్రపంచాలు
లేలేత చిరునవ్వు చెలమల చిగురుల గుండా
కాలవ మొగ్గల కళ్ళ పడవలనిండా
వెల్తురు దోనల మొఖమ్మీద
పాటల పిట్టల లే ఎండ
పరిగ పిల్లల్ని
సందమమామ పక్కెల్ని ఏరుకున్నట్లు
ఒక్కో అనుభవ సుస్వర రహసారాన్ని
అనుభూతి తీర నిశ్శబ్దామృత సౌందర్య రహస్యాల్ని పట్టుకుని
పరిమళ్ళలో నీటి మడుగుల్లో
లోలోన తడితడి ఊహల ఉదయాల్ని పదిలపరచుకుని
నిత్యం పలకరించుకుంటూ
ఏకాకితనాన్ని తరిమికొట్టే
ఒంటరి రాత్రుల్ని ఓదార్చే
గొడుగులు విచ్చుకునే వానల్ని
నీడల్ని పెంచుకునే మహావృక్షాల్ని
వెన్నెల వీణల భావతరంగాల్ని
ఆనంద కిరణాల పాటల చరణాల్ని
ఋతువుల రాగరంజిత కల కూజితాల్ని పిలుచుకుంటూ...

❋ ❋ ❋

పాటని ప్రేమించడమంటే
ప్రపంచాన్ని లోలోంచి కొత్తగా నిర్మించడం
వేయి జన్మల వేకువగా విరబూయటం
ప్రపంచం మాతృభాషైన సంగీత సాహిత్యాలకు వినమ్రంగా నమస్కరించడం
నది ఈనిన చేపల సయ్యాట,
వేటగాడి వలలో చిక్కిన పక్షుల పెనుగులాట,
జీవన్వేదనల శ్రుతిలయల సత్యమేదో
పద్యమై అల్లుకుని ఈ దేహదీపం వెలగడం
యుగయుగాల ప్రేమగా ప్రవహించడం
కళ్ళ దోసిళ్ళనిండా ఎండబోసిన పాటల జ్ఞాపకాలు
మరణం చివరి చరణం
పాటల పడవల తీరమ్మీద పరచుకుని
వెతుక్కుంటూ పోవాలి
వెతకడమే దోవగా
ఒక అలవికాని దొంకనేదో ఆసరాగా చేసుకుని
సమస్తలోకాన్నీ ఏరుకుంటూ...
రహస్యాంతర్గుహల్లోంచి బహిరంతర స్పృహల్లోకి
పద్యపాదాల అలలమొగ్గల్ని లోకానికిచ్చి
ఒక చాలాన రహస్యాన్ని తత్త్వంగా పాడుకుంటూ...
పండి వంగిన కాల సంతకం
నాలోలోన కరిగిపోతూ...
మానవతకు మోక్షమిచ్చు పుణ్యక్షేత్రం
ఎప్పటికీ మరణించని ఆకుపచ్చని పాట
తెలుగుతల్లి ప్రాచీన వైభవంగా
తెలుగువెన్నెల మీటుకుంటూ...
తెలుగు పున్నమి తోవవెంట–
*(వేదమెందుకికంత వేమన, జాషువా పద్యమున్నచోట ప్రజలనోట అని పలికిన మహాకవి వేటూరికి)*

# చిన్నతల్లి

- నిష్టల వెంకటరావు

ఆరు ఏడు ఏళ్లుంటాయి చిన్నతల్లికి
పుంఖాను పుంఖాలుగా కులాలున్న భారద్దేశంలో
ఆదేశంలో భాగమైన ఆంధ్రావనిలో
"ఉప్పరాళ్లు" ఉప్పర కులం ఉంది ఎప్పట్నుంచో

నూతులు తవ్వడానికి, కట్టబోయే ఖరీదైన
సిమెంటు మేడల పునాదులు తీయడానికి
అందుకే ఉన్నాం అన్నట్టు రెడీ ఉప్పర్లు
రోజుల్లా కష్టమే, రెక్క డొక్క కాంబినేషన్

చిన్నతల్లి కూడా గొంతుల్లోకి వెళ్తేగాని
సగం నిండే కడుపులు పావైనా నిండవు
"అమ్మీ బేగి పార్రాయె" అనడం యేమిటి
తనూ ఓ సీనియర్ లేబర్ లాగా అదే పరుగు

సాలుమున్నూరు కాలం గోతిపనులుండవు
కాని, రోజూ రిపేరొచ్చే ఓ డొక్కు లారీ
రోడ్డు పక్కన సైటుకి దగ్గరా బ్రేక్ డౌన్
అందులో ఉన్నాయి ఐదొందల సిమెంటు ఇటుకలు

ఆధునిత నాగరికత చాలా బరువైన వస్తువు
డొక్కు లారీలో సిమెంటు ఇటుకలు ఇంకా బరువు
తల్లి ఓ రెండు, తండ్రి ఓ రెండు ఆబరువైన
భారద్దేశ ఇటుకలను వణుకుతూ తలకెత్తుకుంటే

చిన్న తల్లికి తహ తహ, తనూ మోద్దామని
డొక్కు లారీ బడబడ కుదుపులతో
ఇటుకలు కొన్ని మధ్యకు రెండు ముక్కలు
'భారతనారి' అంటె భారత లారీ గోడలలో

తన తల్లి తండ్రి తిండి కోసం చేసే పనులు
తనూ చేయడమంటే ఏం పూచీ చిన్న తల్లికి
అమ్మ నాన్న వారి బరువులతో సైటుకు వెళ్ళేక
విరిగిన అర సిమెంటు ఇటుక ముక్క ఎత్తింది

తిరిగివస్తున్న అమ్మ నాన్నలకి చూసేరా నా ప్రోవెస్
అన్నట్టు చిన్న నవ్వుతో దర్శనమిచ్చింది చిన్నతల్లి
కూతురు ఎచీవ్‌మెంటుకి మురిసేరు పెద్దలు
ఇటుకముక్క పిల్లనెత్తి కెత్తి "సైటు కాడపడీ" అన్నారు

బరువుకి చిన్న తల్లి మెడ నొక్కుకు పోయింది
మొల్తాడులోంచి జారిపోతున్న లాగు పైకి లాగుతూ
సైటుకాడ పడేసింది, కాని భుజం గీరుకుంది
అలవాటైన తేలికపనైతే కద రక్తం చిమ్మదు ?

తిరిగొచ్చింది చిన్న తల్లి డొక్కు లారీ కాడకి
అప్పుడే అమ్మ నాన్న రెండేసి జోడాలు ఎత్తు కెళ్తున్నారు

సైటుకాడ ఇటుకలు పడేసి ముట్టించేరు చుట్టలు
అడ్డపొగ అమ్మచుట్ట, నిలువు పొగ నాన్న చుట్టు

అప్పుడెళ్ళిన అమ్మా నాన్న ఇంకా రాలేదేం చెప్మా చిన్న తల్లి డౌటు
పెద్ద ఐడియా వచ్చి పూర్తి ఇటుక కదిపింది
జారిపోతున్న లాగు పైకి లాగుతూనే ఇటుకనూ లాగింది
ఊపిరి బిగపట్టి మల్లీశ్వరి లా బరువును పైకెత్తింది.

"ఓ వాట్ ఎ ఫాల్ వజ్ దేర్ మై కంట్రీ మెన్"
బరువుని మరితట్టుకోలేక జార్చేసింది కిందకి
జార్చిన బండబరువు ఇటుక పాదం మీద పడ్డాది
పడి చిన్న తల్లి కుడిపాదం పచ్చడి ముద్దే ముద్ద

"ఓలమ్మో, ఓరి బావో సచ్చిపోనానన్రో"
అరుపువిని బేగి పారొచ్చేరు అమ్మ నాన్న
మరణ బాధతో మరి నిలబడలేక చతికిలబడింది.
పాదం మీద బీటలు, ఎర్ర రక్తం ఊటలు

బెంబేలెత్తిన అమ్మ నాన్న పాదం మీద ఇటుకను తీసారు
సొమ్మసిల్లుపోతున్న చిన తల్లి ఇటుక పెట్టిన బాధకి
చెత్తలు ఎత్తే మున్సిపల్ కాంట్రక్టరు మనిషి
పోదు శానిటేషన్ చేసేక పొడిబుగ్గి కుప్ప ఉంది

తటాలున పిడికెడు బుగ్గి రక్తసిక్త పాదం పై
వేళ్ళతో జల్లించి జల్లింది అమ్మ, అదీ ఫస్ట్ ఎయిడ్
సందిట్లో ఎత్తుకుని చిన్న తల్లిని పురింటికి చేర్చారు
బాధపడుతున్న పిల్లని బాధగా చూస్తున్నారు అమ్మ నాన్నలు

మందులేదు మాకు లేదు మేకు గుచ్చుకున్నా బుగ్గే మందు
భారద్దేశ భారమైన ఇటుక గాయం సెప్టిక్ అయిందట
ధర్మాసుపత్రిలో యూజర్ చార్జికి చెప్పు దెబ్బ బుగ్గి మందు?
దిన దిన ప్రవర్ధమానం అవుతూంది. మన చిన్న తల్లి

పాదం అంతా పొంగిపోయి మీదకి పాకి పాకి చిన్నతల్లి
ఒళ్లంతా పొంగిపోయింది, తెలివి పోయింది
బహుశ బుగ్గిమందు వికటించి పొట్టన పెట్టుకుంది
అమాయక ఆరేడేళ్ళ చిన్న తల్లి ప్రాణాన్ని

గోతులు తవ్వి బతికే తల్లి దండ్రులు, చిన్న తల్లి
మృతదేహాన్ని పాతడానికి పెద్ద గొయ్యి తవ్వారు!
మీదికి ఎగిరిపోతున్న ప్రాణాలతో పిల్లను క్రిందకి దింపేరు
ఓదార్చగలిగే ఇరుగు పొరుగుల వారు, అయ్యో
వాళ్ళేం ఓదారుస్తారు? వారి దుఃఖమే పొంగిపొర్లుతూంది

ఆ ప్రాంతానికి ఎవరు వెళ్లినా ఆకాశంలో
చిన్న తల్లి దీనమైన మొహం కనిపిస్తుంది
జారిపోయే లాగు, జారిపోయిన ఇటుక
పచ్చడైన పాదం, పైకి పోయిన ప్రాణం

# వైషమ్యం

- కోడూరు శ్రీ వేంకటేశ్వర స్వామి

జైలు గంటలు రెండుసార్లు మ్రోగటంతో 'టైము రెండయిందా?' అనుకున్నాడు మూర్తి. కీచురాళ్ల చప్పుడు తప్ప మరేం వినబడని మధ్యానిశి. మూర్తి కంటి మీదకి ఎంత ప్రయత్నించినా కునుకు రావడం లేదు. 'ఆలీ మారిపోయాడా? లేక నేనే మారానా? ఎందుకిలా జరిగింది? ఎంత చిన్న సంఘటన అనుకున్నది ఇంత దారుణంగా మనసుల మీద ముద్రవేసి మమ్మల్నిలా విడదీసింది?' మూర్తి ఆలోచనలు ఎంతకీ తెగడం లేదు. "నాలోని నీవే నేనైనాను, నీలోని నేనే నీవైనావు' అని పాడుకుంటూ నాతో గడిపిన ఆలీ ఇలా చేస్తాడని కల్లో కూడా అనుకోలేదు" అనుకుంటూ తల విదిలించాడు నిస్పృహగా మూర్తి.

"ఏదో ఆవేశంలో నేనలా ప్రవర్తించానే అనుకో తనే సర్ది చెప్పొచ్చుగా" అనుకోగానే అంతర్గతమైన విజ్ఞానం మనసుని స్పృశించి, "అవునూ, అదే సూత్రం నాకు వర్తిస్తుందేమో. అతడలా ప్రవర్తించాడనుకుని నేనే సర్దిచెప్పనూ వచ్చు కదా" అనుకున్నాడు. అంతలోనే మూర్ఖత్వం మళ్ళీ ముఖ్యపాత్రై, "ఏం! అతడికి లేని పట్టు విడుపులు నాకు మాత్రం ఎందుకుండాలి. ఆ అవసరం నాకేంటి?" అనుకున్నాడు. అనుకోవడమైతే అనుకున్నాడు గాని, జరిగిన సంఘటన ప్రభావం శరీరం మీదా, మనసుమీదా బలీయంగానే వుంది. కడుపుకి తిండి, కంటికి కునుకూ రెండూ కరువవ్వగా, వర్తమానం పెనుభూతమై ఆలోచనల్ని ఆక్రమించడంతో ఎంతకీ సమస్యకి సాధన దొరకటం లేదు మూర్తికి. వర్తమాన భూతం నుండి విముక్తి కోసం మనసు గతంలోకి పరుగుతీసింది.

ఇక అటు ఆలీ పరిస్థితి కూడా అలాగే వుంది; "ఆకాశమల్లే నీవున్నావు, నీ నీలి రంగై నేనున్నాను" అనుకుంటూ తనతో కలిసిపోయిన మూర్తి ఇలా చేస్తాడని ఊహించనైనా లేదు. మూర్తి మారిపోయాడా? లేక నేనే మారిపోయానా? ఎందుకిలా జరిగింది?" అర్ధరాత్రి దాటినా ఆలీ మనసులో ఆలోచనలు, గదంతా ఆలీ కాళ్ళు కలియ తిరుగుతూనే వున్నాయి. ఉన్నట్టుండి మధ్యలో 'ఇదిలా జరగలేదా? అంతా తన భ్రమేనా' అనిపిస్తోంది. కానీ అంతలోనే గడియారం గంటల శబ్దమో, గోడ మీద కూర్చున్న పిల్లి అరుపులో స్పృహలోకి లాగి భ్రమ కాదని తెలియజేస్తూ నిస్పృహలోకి నెడుతున్నాయి. ఇదంతా వాస్తవమే, వర్తమానమే అనుకోగానే లోతైన లోయలోకి జారిపోతున్న భావనలో కూరుకుపోతుంది ఆలీ మనసు. తిరిగి తిరిగి మరి తిరగలేక మంచం మీద నడుం వాల్చాడు. కునుకుకి దూరమైన మనసు గతంలోకి జారిపోతుంది. మూర్తి, ఆలీ ఇద్దరి మనసులూ జారిన గతం లోయలోకి పరికిస్తే;

❊ ❊ ❊

"ఒరే మూర్తీ! పండుగ పూట కూడా ఆ పడకేంట్రా, ఎన్నిసార్లు లేపాలి? లే త్వరగా" ముసుగుతన్ని పడుకున్న సత్యమూర్తిని లేపింది నీళ్ళ బిందెని కిందకి దించుతూ మూర్తి తల్లి శాంత. స్నానానికి కాలవకెళ్ళిన తండ్రి ఇంకా రాకపోవడంతో 'లేస్తా, లేస్తా' అంటూ నీలుగుతున్నాడు మూర్తి. "అదిగో ఆలీ కూడా వచ్చేశాడప్పుడే లే" అనగానే ఒక్క ఉదుటున లేచి నోట్లో వేప్పుల్లా, భుజం మీద తుండు వేసుకుని కాలవకి బయల్దేరాడు ఆలీతో కలిసి. ఉదయం కాలవకెళ్ళి స్నానం చేయడం దగ్గర్నుంచి రాత్రి చదువుకుని పడుకునే వరకూ ఇద్దరూ కలిసే చేస్తారే పనైనా. ఒంటరిగా ఏ ఒక్కరినీ చూసి ఉండరా ఊళ్ళో. మూర్తి వస్తున్నాడంటే ఆలీతో కలిసే అని అర్థం. 'అదిగో ఆలీ' అంటే పక్కన మూర్తి ఉన్నాడని చెప్పక్కర్లేదు. అందరూ స్కూల్లో ఎదురెదురు మతంగాళ్ళు అని పిలుస్తూ సరదాగా నవ్వుకుంటారు.

మూర్తి గుళ్ళోకెళ్ళినా, వెంటే ఆలీ కూడా వెడతాడు. మూర్తి బయటికి వచ్చేవరకూ గుడి అరుగుమీద కూర్చుంటాడు. ఆరోజు, "సారీరా! ఆలస్యం అయింది" అన్నాడు గుళ్ళోంచి బయటికొస్తూ మూర్తి. "నువ్వెళ్లింది గుళ్ళోకే గదరా! సారీ దేనికి. ఆలస్యం అయితే అవుతుంది" అంటూ మూర్తి చేతిలో తామరాకులో చుట్టిన ప్రసాదం అందుకుంటూ "ఇంతకీ ఈ రోజు ప్రసాదం ఏమిటి?" అన్నాడు. "నీ కిష్టమైందే. చక్కెర పొంగలి రా!" అన్నాడు ఆప్యాయంగా మూర్తి అరుగుమీద ఆలీకి ఎదురుగా కూర్చుంటూ. "చాలా బాగుందిరా మూర్తీ ఈ రోజు ప్రసాదం" అన్నాడు ఆలీ చెయ్యి కడుక్కుంటూ.

"సరే గానీ, ప్రసాదం తినడానికి నీకేం అభ్యంతరం ఉండదా?" అన్నాడు మూర్తి ఆలీ భుజం చుట్టూ చెయ్యి వేస్తూ. "అభ్యంతరం ఎందుకు?" ఆశ్చర్యంగా అడిగాడు ఆలీ. "ఏం లేదు. మొన్న అమ్మ ప్రసాదం పెట్టబోతుంటే పాషాగాడు ప్రసాదం అనగానే చెయ్యి తీసేశాడు. ప్రసాదం కింద పడిపోడంతో అమ్మ కొద్దిగా నొచ్చుకుందనుకో, అది వేరే విషయం. మరి నీకెందుకు లేదా అభ్యంతరం అని అనుమానం వచ్చింది"

"ఏరా! నేనీ రోజే తింటున్నానా ప్రసాదం. అయినా అలా చేశాడంటే మీ ప్రసాదంలో ఏదో మహత్యం ఉందన్న నమ్మకమో, భయమో పాషాగాడి మనసులో ఉందన్నమాట. అందుకు నువ్వు సంతోషించాలి. అయినా వాడి పిచ్చిగానీ, ప్రసాదంగా కాకపోతే పదార్థంగా తినొచ్చుగా. నైవేద్యం పెట్టకపోతే తింటాడుగా. అయినా ఎవడిపిచ్చి వాడికి ఆనందం. మతం అభిమతంగా వుండాలి గాని, అర్థంలేని అపోహలతో ఉండకూడదన్నదే నా అభిప్రాయం"

ఆలీని మరింత ఆరాధనా పూర్వకంగా చూస్తున్న మూర్తితో ఆలీ అన్నాడు. "ఏది ఏమైనా వైష్ణవాలయాల్లో ప్రసాదంగా చేసే పులిహోర, చక్కెర పొంగలికి వచ్చే రుచి మరింకెక్కడా రాదు. ఆ రెండూ నాకెంతో ఇష్టం. అందుకే నువ్వు గుళ్ళోకి వెళ్ళినపుడల్లా ఈ గట్టుమీదే కాచుక్కూర్చుంటాను"

"నువ్వు నిజంగా చాలా గొప్పవాడివిరా" అన్నాడు మూర్తి ఆరాధనగా చూస్తూ. "ఏ! నువ్వు బ్రాహ్మణుడివైనా రంజాన్‌కి మా ఇంటికొచ్చి ఖీర్ తాగడంలేదా. అయినా మన భావాలు మనవి. వాళ్ళ అభిప్రాయాలు వాళ్ళవి" అన్నాడు ఆలీ. ఆలీ చేతిని ఆప్యాయంగా స్పృశిస్తూ అన్నాడు మూర్తి.

"నీకో విషయం తెలుసా ఆలీ! పూరీ జగన్నాథుని రథం యాత్ర ప్రారంభించగానే ఒక ముస్లిమ్ కుటుంబం ఇంటిముందు ఆగిపోతుందట. అక్కడ వారు హారతిస్తేగాని ముందుకు కదలదుట. ఇది ఆనాదిగా వస్తున్న, నడుస్తున్న తంతు. ఆ జగన్నాథుడికే లేని అభ్యంతరాలు మనకెందుకు? ఏమంటావ్" "అవును మనకెందుకూ" అని నవ్వుకుంటూ బయల్దేరారిద్దరూ.

❊ ❊ ❊

ఆలీ, మూర్తి ఇద్దరూ మంచి మార్కులతో పదో తరగతి పాసై, కాలేజీ చదువుకి పట్నం బయల్దేరారు. వారిద్దరి స్నేహం మీదున్న నమ్మకంతో వారిద్దర్నీ ఒకే గది అద్దెకి తీసుకుని చదువుకోడానికి అనుమతించారు తల్లిదండ్రులు.

పొద్దునే లేచి ఆలీ చేస్తున్న పని చూసి ఆశ్చర్యపోయాడు మూర్తి. వెంటనే అతడు చేస్తున్న పనేమిటో అర్థం కాలేదు. ఆలీ శ్రద్ధగా కూర్చుని ఒక చెంచాతో వినాయకుడి విగ్రహానికి పాలు పడుతున్నాడు. చెంచా వినాయకుడి తొండం దగ్గర పెట్టగానే చెంచాలో పాలు మెల్లగా తగ్గుతున్నాయి.

“ఏంట్రా ఆలీ! ఏం చేస్తున్నావు?” అసలు ఆలీ ఆ పని ఎందుకు చేస్తున్నాడో అర్థంకాక అడిగాడు మూర్తి. “అరే! నువ్విప్పుడే నిద్ర లేచినట్లున్నావు. నీకు తెలియదు కదా! వినాయకుడి తొండం దగ్గర చెంచాతో పాలు పెడితే తాగుతున్నాడట్రా!” కళ్ళు పెద్దవి చేస్తూ చెప్పాడు ఆలీ. “ఏంట్రా! నీకేమన్నా పిచ్చా? వినాయకుడు పాలు తాగడమేమిటి. ఎవరు చెప్పారు నీకు?” చిరాగ్గా అన్నాడు మూర్తి. “పిచ్చీ కాదు వెఱ్ఱీకాదు. నిజంగానే. కావాలంటే టీవీ పెట్టి చూడు. పొద్దుట్నుంచీ ఇదే వార్త. దేశం మొత్తం ఇదే జరుగుతోంది. అన్ని ప్రదేశాల్నుండి చూపిస్తున్నాడు” కాసేపు టీవీలో ఈ తంతంతా గమనించిన మూర్తి నవ్వుకున్నాడు.

“ఏరా మూర్తీ! చూశావా? ఇప్పటికైనా నమ్ముతావా?” అన్నాడు ఆలీ. “నువ్వు పట్టావుగా తాగాడా?” నవ్వుతూనే అన్నాడు మూర్తి. “వినాయకుడికి మత భేదాలేవీ లేవనుకుంటా, శుభ్రంగా తాగాడు. కావాలంటే చూడు” అంటూ మళ్ళీ పాలు పడుతూ అన్నాడు ఆలీ. కాసేపు తేరిపార చూసి అన్నాడు మూర్తి. “ఒరే ఆలీ! ఆకులు అలాలు తినే వినాయకుడు పాలు తాగడమేమిటి? భక్తి ఉండడం తప్పు కాదు. కానీ అది పిచ్చిగా పరిణమించకూడదు” “అంటే ఇదంతా అబద్ధం అంటావా?”

“కాకపోతే నిజంగానే వినాయకుడు పాలు తాగుతున్నాడనుకుంటున్నావా? అయినా వినాయకుడికి పాలు తాగాలనిపిస్తే తొండంతో తీసుకుని తాగలేడా? మనం చెంచాతో పట్టాలా? అక్కడ జరిగేదేమిటంటే, వినాయకుడు పాలు తాగడేమో అనే భయంతో మనం చెంచాని కొద్దిగా ఒంచుతాం. అప్పుడు చెంచాలో పాలని విగ్రహం పీల్చడం జరుగుతుంది. నువ్వింకాసేపు అలాగే పడితే, విగ్రహం పీల్చుకునే శక్తిని కోల్పోయి పాలు కిందకి కారటం కూడా జరుగుతుంది”

“అంతేనంటావా?” అన్నాడు ఆలీ. “కాకపోతే మరేమిటి? వినాయకుడు పాలు తాగుతున్నాడు, మేరీ మాత విగ్రహం ఏడుస్తోంది. సాయిబాబా విగ్రహం లోంచి తేనె కారుతోంది. తలుపుల మీద ‘ఓ స్త్రీ రేపురా’ అని వ్రాయకపోతే దయ్యం ఇంట్లోకి వచ్చేస్తుంది అంటూ పనిలేని వాళ్ళు జనాలని పిచ్చోళ్ళని చేస్తుంటారు. ఈ టీవి వాళ్ళకి ఏదో ఒక వార్త కావాలి. అందుకే ఇలాంటి వాటికన్నిటికీ ప్రచారం కల్పిస్తారు. చెయ్యకూడని హడావుడి అంతా చేసేసి, ‘ఇదంతా మూఢనమ్మకం’ అని తేల్చేసి మరో వార్తకోసం బయల్దేర్తారు. అంతకు మించి ఏమీ లేదు” అన్నాడు మూర్తి.

తన వంక తేరిపార చూస్తున్న ఆలీతో మళ్ళీ మూర్తే అన్నాడు “అలాగని నేను దేముణ్ణి నమ్మనని కాదు. కానీ భగవంతుడ్ని ఇలా తమ పేరు ప్రఖ్యాతుల కోసం వినియోగించుకోడాన్ని మాత్రం ఖండిస్తాను. నిజమైన భక్తుడు ప్రచారం కోసం గాని, సంపదల కోసం గాని ఆశించడు అని నా అభిప్రాయం” “నీ అభిప్రాయంతో నేను షరతులేమీ లేకుండా ఏకీభవిస్తాను” అన్నాడు నాటక ఫక్కీలో నవ్వుతూ ఆలీ.

❊ ❊ ❊

“అంకుల్! అంకుల్! మా మామయ్య దెయ్యాల్ని పిలిచి ప్రశ్నలడిగితే సమాధానాలు చెబుతున్నాయి తెలుసా? అంటూ వచ్చింది ఇంటివాళ్ళ పాప యామిని. “ఏంటీ! నిజంగా?” అన్నాడు న్యూస్ పేపర్‌లోంచి తల బయటికిపెట్టి ఆలీ. “ఆ అవున్రా దెయ్యాలన్నీ మన గుమ్మం దగ్గరలైన్లో నిలబడున్నాయి. నువ్వెప్పుడు పిలుస్తావా అని. కానీ” అన్నాడు పుస్తకంలోంచి తల తిప్పకుండానే మూర్తి. “అదేంటో చూద్దాం రా. అన్నిటి గురించీ తెలుసుకోవాలి కదా” అని మూర్తితో అని, “మీ మావయ్యని పిల్చుకురామ్మా” అన్నాడు ఆలీ యామినితో. ఆ పిల్ల తూనీగలా పరుగెత్తింది.

“ఆ చిన్నపిల్లతో సమానంగా ప్రవర్తిస్తున్నావురా ఆలీ నువ్వు” నవ్వుతూనే అన్నాడు మూర్తి. “ఏదైనా తెలుసుకునే వరకూ ప్రతి మనిషీ ఆ విషయంలో చిన్న పిల్లాడేరా!” “సరే తెలుసుకో” అంటూ పుస్తకంలో మునిగిపోయాడు మూర్తి. పుస్తకంలో అయితే తలదూర్చాడు గానీ, అదేమిటో చూద్దామనే ఉత్సుకత మాత్రం అతడికీ వుంది.

“నా పేరు రాజేష్. యామిని మావయ్యని” అని పరిచయం చేసుకుంటూ ఒక పెద్ద కాగితాన్ని తీసి నేలమీద పరిచాడు. ఆ కాగితం మీద ఒక చోట సున్నచుట్టబడి దాంట్లో ‘ఒరిజినల్ ప్లేస్’ అని వ్రాసివుంది. అలాగే ఇంగ్లీషు అక్షరాలు, అంకెలు వరుసగా వ్రాయబడి ఉన్నాయి. మరో మూల మరికొన్ని సున్నాలు చుట్టబడి వాటిల్లో ‘ఎస్’, ‘నో’ ‘డౌట్’ అని వ్రాయబడి ఉన్నాయి. రాజేష్ ఒక తెలికైన పాత పదిపైసల నాణెం తీసి ఒరిజినల్ ప్లేస్ అని వ్రాయబడి ఉన్న సున్నలో పెట్టి, “ఇప్పుడు ముగ్గురు వేళ్ళు పెట్టాలి దీని మీద” అన్నాడు. ముగ్గురు వేళ్ళు పెట్టాలనటంతో ఆలీ మూర్తిని కూడా పిలిచాడు. మూర్తి, ఆలీ, రాజేష్ ముగ్గురూ ఆ నాణెం మీద వేళ్ళు పెట్టారు. రాజేష్ మంద్ర స్వరంతో “ఓ ఆత్మగారు! దయచేసి వచ్చి మా ప్రశ్నలకి సమాధానం చెప్పండి” అన్నాడు. ఓ పది పదిహేను క్షణాల తర్వాత నాణెం కొద్దిగ కదిలీకదలనట్టు కదిలింది. “ఆ వచ్చింది ఆత్మ. ఇప్పుడు చూడండి” అని రాజేష్ కళ్లు మూసుకుని,

“ఓ ఆత్మగారు! భారతదేశానికి స్వాతంత్ర్యం వచ్చిందా లేదా?” అని అడగగానే మెల్లగా నాణెం కదిలి ‘ఎస్’ అన్న అక్షరం దగ్గర ఆగింది. చూస్తున్న యామిని చప్పట్లు కొట్టింది. ఆలీ, మూర్తి పరిశీలనగా చూస్తున్నారు. “మూర్తీ, ఆలీ గార్ల భవిష్యత్తు ఎలా ఉంటుంది?” అని అడగగానే, ఎస్, నోల మధ్య కాసేపు సంచరించి, చివరికి జి, ఓ, ఓ, డి అని ఇంగ్లీషు అక్షరాలని చూపింది. అలా ఓ అరగంట సేపు ఎవరిష్టమొచ్చిన ప్రశ్నలు వాళ్ళు వేశారు. కొన్నిటికి ఖచ్చితంగానూ, కొన్నిటికి సందిగ్ధంగానూ, కొన్నిటికి తప్పు సమాధానాలు వచ్చాయి. ఆ తర్వాత ఆత్మని వెళ్ళిపొమ్మని అభ్యర్థించి, కాగితాన్ని చుట్టేస్తూ రాజేష్, “చూశారుగా! ఆత్మ ఎలా సమాధానాలు చెప్పిందో” అన్నాడు. “అవునవును” అన్నాడు ఆలీ. “మరే” అన్నాడు మూర్తి.

రాజేష్ వెళ్ళిపోయాక మూర్తే అన్నాడు “నాణెం కదలడానికి నిజంగా ప్రేతాత్మ కారణం అంటావా అలీ” అన్నాడు బొంగురు గొంతుకతో. “పది పైసలు, మూడు వేళ్ళు, పిలవంగానే ఆత్మ వచ్చి దాంట్లో వచ్చి కూర్చోవడం. ఆత్మలున్నాయా లేదా అనే విషయం పక్కన పెడితే, ఇదంతా చాలా అసంబద్ధంగా వుంది. తర్కానికొస్తే, ప్రేతాత్మ ఈ విషయంలో నిర్దోషి అని వితర్కించగలను గానీ, ఈ విషయాన్ని విశదీకరించడం మాత్రం నాకన్నా నువ్వు చేస్తేనే బాగుటుంది మూర్తీ!” అన్నాడు ఆలీ.

“మరి నాణెం ఎలా కదిలింది?” వీరి సంభాషణ ప్రకారం ‘వీళ్ళు దీన్ని నమ్మడం లేదు’ అని నిర్ధారించుకున్న యామిని అడిగింది. “నీ వేలి కొసని

రెండు చేతి వేళ్లతో సున్నితంగా పట్టుకొంటే లోపల నాడి కొట్టుకోవడం తెలుస్తుంది చూడు" అన్నాడు ఆలీ. వెంటనే యామిని అతడు చెప్పినట్లే పట్టుకుని "అవును అంకుల్ నిజమే. అయితే దానికి దెయ్యానికి సంబంధం ఏమిటి?" అంది. "దానికి దెయ్యానికి సంబంధం ఏమీ లేదు. ఆ నాడి స్పందన (వైబ్రేషన్స్) నాణెం మీద ప్రభావం చూపుతాయి కదా" అని ఆమె ముఖంలోకి చూశాడు. ఆలీ ఆమెకి అర్థం అయిందా లేదా అని. అంతలో మూర్తి అన్నాడు.

"అలా ముగ్గురి వేళ్ళలోని నాడుల స్పందన మూడు రెట్లయి, నాణెంలో చలనం తీసుకువస్తాయి" "అంతేకాదు, మన మనసులో ఉద్రేకం వల్ల నాడి కొట్టుకునే వేగం కూడా పెరిగి అది నాణెం కదలికకి మరింతగా తోడ్పడుతుంది. దానికి తోడు మనం సమాధానం పొందాలనే ఉత్సుకతతో నాణెం కదలికని నియంత్రించి అసంకల్పితంగా ముందుకు తీసుకెడతాం" అన్నాడు ఆలీ. విషయం తార్కికతకి లోబడుతుండటంతో "మరి అది సరైన సమాధానం ఎలా చూపెడుతుంది" అంది యామిని సందేహాన్ని నివృత్తి చేసుకునేందుకు.

"అది సరైన సమాధానం చూపించడం కాదు. మనకు తెలిసిన సరైన సమాధానం వైపు నాణెన్ని మనమే కదుపుతాం మనకు తెలియకుండా" అన్నాడు ఆలీ. "అసలు మూడువేళ్ళకి, ఆత్మకి సంబంధం ఏమిటి? మూడు వేళ్ళు పెడితే వచ్చే ఆత్మ ఒక్క వేలికి ఎందుకు రాదు. అసలు ఆత్మ కదిపే పక్షంలో వేళ్ళతో ఏం పని? ఇక సరైన సమాధానం చూపడం అనే విషయానికి వస్తే, ఏ పనైనా జరగడానికి, జరక్కపోవడానికి ఉండే సంభావ్యత అంటే ప్రాబబిలిటీ ఏభై శాతం కదా. అలా భవిష్యత్తు గురించి అడిగిన వాటిల్లో కూడా ఆత్మ చెప్పే వాటిల్లో జరిగేవి ఏభై శాతం ఉంటే, జరగనివి ఏభై శాతం ఉంటాయి. జరిగితే నమ్ముతాం. జరక్కపోతే దానికి కారణాలు వెతుక్కోవడమో లేక ఈ తంతుని నమ్మకపోవడమో చేస్తాం. నమ్మినవాళ్ళు ప్రచారం చేస్తారు" నవ్వుతూ అన్నాడు మూర్తి.

"నమ్మని వాళ్ళు మీలా విమర్శిస్తారా" అంది యామిని నవ్వుతూ. "కాదు. వాస్తవాన్ని గ్రహిస్తారు" అన్నాడు ఆలీ చనువుగా యామిని నెత్తిన మొట్టుతూ. "పోనీ ఆత్మ చెప్పేవన్నీ నూటికి నూరు శాతం నిజమవుతాయని నువు హామీ ఇవ్వగలవా? అయితే నీ టెన్త్ క్లాసు పబ్లిక్ పరీక్షల్లో ఏ సబ్జెక్ట్‌లో ఎన్ని మార్కులొస్తాయో అడుగు. నిజమవుతాయేమో చూద్దాం" అన్నాడు మూర్తి.

"ఆత్మకి అన్నీ ఖచ్చితంగా తెలియాలని లేదుగా. కాస్త అటు ఇటుగా ఉండొచ్చు" అంది యామిని నవ్వుతూ. "అంతగాడికి దాన్ని అడగటం ఎందుకు? జరిగిన దాన్ని మంచో చెడో అనుభవిస్తే పోలా... చూడు యామినీ, తార్కికంగా ఆలోచించు. వితండవాదంతో ఒరిగేదేం ఉండదు" అన్నాడు ఆలీ. "ఒకే. థాంక్యూ!" అంటూ లేచింది. ఆలీ వంక ప్రశంసాపూర్వకంగా చూశాడు మూర్తి

❊ ❊ ❊

అవిభాజ్యమైన వారి స్నేహం తోడుగా ఆడుతూ పాడుతూ చదువులు ముగించి, ఒకే ఊళ్ళో ఉద్యోగాల్లో స్థిరపడ్డ ఆలీ, మూర్తి కలిసి పుట్టిపెరిగిన ఆ ఊరికొచ్చారు. అప్పుడు జరిగింది అనూహ్యంగా, కాకతాళీయంగా ఆ సంఘటన. ఆ రోజు ఆలీ, మూర్తి కలిసి టీవీ చూస్తున్నారు. ముంబయిలో చెలరేగిన మత ఘర్షణలతో దేశం అట్టుడుకుతోంది. టీవీ ఛానళ్ళన్నీ అవే వార్తల్ని నిరంతరాయంగా ప్రసారం చేస్తున్నాయి. టీవీలో వార్తలు చూస్తూ ఉద్రేకానికి గురైన మూర్తి, "ఇస్లామ్‌లో పెరుగుతున్న తీవ్రవాదము, హిందువులలో పెరుగుతున్న అనైక్య ధోరణులు వారి వారి మతాలకే కాక యావత్ ప్రపంచానికి ముప్పు తెస్తున్నాయి" అన్నాడు.

"అంటే కేవలం ఇస్లామ్‌లోనే తీవ్రవాదం ఉందనా నీ ఉద్దేశ్యం. థాంక్స్" అంటూ లేచిపోయాడు ఆలీ. హిమావన్నగం ధరిత్రిలో దిగబడిపోయినట్టు, సతత సుజలా ప్రవంతియై వర్ధిల్లు భాగీరథి ఆవిరియైపోయినట్లు, అఖిల విశ్వానికి తేజస్సును ప్రసాదించే మార్తాండుడు మాయమై అంధకారాన్ని మిగిల్చినట్లు వారిద్దరి మైత్రికి అవరోధం ఏర్పడింది. బాల్యం నుండి ఇరువురి అమృత హస్తాలలో ఆప్యాయంగా ఎదిగిన వారి మైత్రి చేయని నేరానికి దోషియై వధ్యశిలపై నిలబడింది, అంతిమ అవకాశంగా క్షమాభిక్షకై అభ్యర్థిస్తూ, ఇక నిర్ణయాధికారం కాలానిది మాత్రమే.

❊ ❊ ❊

తీపి జ్ఞాపకాల గతం నుండి ఇద్దరూ బయట పడేసరికి రేయి తెల్లారి పోయింది. ఇద్దరిలోనూ అంతర్మథనం. నిముషాలు గంటలై, గంటలు రోజులై, రోజులు వారాలై అలా నెల దాటిపోయింది. ఇద్దరి మనసులకి అజీర్తి చేసింది వాస్తవం జీర్ణం కాక. భానుడు జైత్రయాత్రని ముగించుకొని పశ్చిమాద్రితో సమాగమానికి బయల్దేరుతున్నాడు. దాపునున్న మసీదు ప్రాంగణంలో పవిత్ర రంజాన్ మాసపు మగరిబ్ ప్రారంభమైంది. ప్రార్థన ముగించుకుని ఉపవాస దీక్ష విరమించడానికి పళ్ళ ముక్కలు పోసిన పళ్ళెం చుట్టూ కూర్చున్నారందరూ. పళ్ళ ముక్కలు తిని ఆనాటి ఉపవాస దీక్ష ముగించిన ఆలీ మనసులో ఏదో భావం కదలాడి కదలాడి సంఘర్షణగా రూపుదిద్దుకుంది. మనసులో అనుకున్నాడు. 'మూర్తి మనసు గురించి తెలిసీ ఏదో నవ్వులాటకి అలా మాట్లాడి వుంటాడని భావించకుండా నేనెందుకలా ప్రవర్తించాను? నాదే పొరపాటు. నాదే పొరపాటు. ఇప్పుడే వెళ్ళి మూర్తిని హత్తుకుని పంకిలమంటిన నా భావాల్ని అతడి స్నేహ స్నానంతో పరిశుభ్రం చేసుకోవాలి' అనుకుంటూ ఒక్క ఉదుటున లేచి బయల్దేరాడు. బయల్దేరాక మళ్ళీ అనుమానం. 'ఇన్నాళ్ళ నా ఈ మూర్ఖత్వపు పట్టుదలని మూర్తి క్షమిస్తాడా? ఒకవేళ క్షమించకపోతే నాకు మిగిలిన ప్రాయశ్చిత్తం ఏమిటి? ఏదైతే అది కానీ. ప్రయత్నం నాది, భారం అల్లాది' అనుకుంటూ ముందుకు సాగాడు.

అదే సాయం సంధ్య. దగ్గర్లోని రంగనాథాలయంలో జరుగుతున్న అర్చన. మరో ప్రక్కన ఆ రోజు పురాణంలో భాగంగా గోదా కళ్యాణ ఘట్ట విశ్లేషణకై రావలసిన వక్తకై భక్తుల ఎదురుచూపులు. మంద్రంగా స్పీకర్‌లోంచి వినబడుతున్న కృష్ణలీలా తరంగిణి. అర్చనానంతరం మంటపం మీద ధ్యాన ముద్రలోనున్న మూర్తి. సెకన్లు నిమిషాలుగా, నిముషాలు గంటలుగా పరివర్తనం చెందుతున్నాయి. ధ్యానం నుండి బయటికొచ్చిన మూర్తికి నిశ్శబ్దంలో నుండి ఉద్భవించిన ప్రణవం కర్ణద్వయాన్ని ఛేదించుకుంటూ బయటికొచ్చింది. ఆ ప్రణవం ఇన్నాళ్ళుగా నిర్జీవంగా నున్న మనసుకి ప్రాణంకాగా అనుకున్నాడు. 'నిజంగా నేనెంత మూర్ఖుణ్ణి? సరదా కోసం నా ప్రాణానికి ప్రాణమైన మిత్రుడికి కష్టం కలిగించాను. ఎంతో సామరస్యంగా ఎదిగిన స్నేహాన్ని నిష్కారణంగా నిస్త్రాణని చేశాను. తప్పుచేసి ఒప్పుకోలేక మరో తప్పు చేశాను. ఇన్నాళ్ళ మా స్నేహపు వారధిని బీటలు వారించాను. నా ఈ పశ్చాత్తాపం నా మనసుని దహించక ముందే ప్రాయశ్చిత్తం చేసుకోకపోతే నా నెచ్చెలి హృదయంలో నేరస్తుడిగానే మిగిలిపోతాను. అలా జరగడానికి వీల్లేదు. ఆలీ నా పశ్చాత్తాపాన్నీ అంగీకరించినా, అంగీకరించకపోయినా, క్షమాభిక్ష నర్థించి ప్రాయశ్చిత్తం చేసుకోవలసిందే'

అనుకుంటూ మనసు వేగాన్ని కాళ్ళకి జోడించి ఆలీ ఇంటివైపు మళ్ళించాడు మూర్తి.

మూర్తి ఇంటిదగ్గర లేకపోవడంతో ఆలీ, ఆలీ ఇంటి దగ్గర లేకపోవడంతో మూర్తి నిరాశచెందారు. ఇద్దరి స్నేహంలోని నిర్మలత్వం ఒకేవిధంగా ఆలోచింప జేసింది. ఇంటి దగ్గర లేని ఆలీ తప్పకుండా మేం తరచు కలుసుకునే కాలువ గట్టు మీద వుంటాడు అని మూర్తి, మూర్తి అక్కడే కలుస్తాడని ఆలీ అనుకోవడం కాకతాళీయం మాత్రమే అనుకోడానికి వీలులేదు. ఎవరేమనుకున్నా. అది వారి స్నేహపు బలం అని వారనుకోవడం సహగమనం చేస్తున్న వారి స్నేహపు ఔన్నత్యం మాత్రమే. స్నేహ వారధి బలంగా వుండాలంటే ఎదుటి వారి పంథాలో ఆలోచించినపుడే బలంగా వుంటుందని వారిద్దరి స్నేహమే నిదర్శనం.

ముందుగా అక్కడికి చేరిన మూర్తి, వెనుక నుండి తన కళ్ళు మూసిన ఆలీని తక్షణమే గుర్తించి, "నువ్వు నా కళ్ళు మూసి, నా మనసు కళ్ళు తెరిపించావురా ఆలీ!" అన్నాడు కళ్ళ నీళ్ళ పర్యంతమవుతూ. "ఇన్నాళ్ళు నా కళ్ళు మాత్రం మూసుకుపోలేదా. నీ స్నేహపు మాధుర్యం నా కళ్ళు తెరిపించబట్టే ఇలా నీ కళ్ళు మూయడానికి సాహసించగలిగానురా" అంటూ ఆలింగనం చేసుకున్నాడు ఆలీ. పరస్పరాలింగన సౌఖ్యం అనుభవించాక ఇద్దరూ ఆనంద బాష్పాలు తుడుచుకున్నారు. "క్షమించరా ఆలీ! నీ మనసు కష్టపెట్టాను" గాద్గది కంగా అన్నాడు మూర్తి.

"ఛఛ. ఏంట్రా. నేను మాత్రం నీ మనసు కష్టపెట్టలేదా? అయినా మిత్రుల మధ్య క్షమాపణలెందుకు... అయినా మనిద్దరం ఒకర్ని విడిచి మరొకరం ఎలా ఉండగలిగాంరా?" అన్నాడు ఆలీ. "మనం వేరుగా ఎక్కడున్నాంరా! నువ్వు నా గురించే ఆలోచిస్తూ వున్నావుగా" "నీకెలా తెలుసు?" ఆశ్చర్యంగా అడిగాడు ఆలీ. "ఎలాగంటే... నేను నీ గురించే ఆలోచిస్తూ గడిపానుగా. కనక మనం వేరుగా వున్నామనుకోవడం భ్రమ మాత్రమే. వేరుగా వున్నా, ఒకరి గురించి మరొకరం ఆలోచిస్తున్నాం కనుక ఒకటిగానే వున్నామన్నదే సత్యం" అన్నాడు మూర్తి.

"అవును వైవిధ్యం ఎక్కడలేదు? మీ హిందుత్వంలో ఎన్ని శాఖోపశాఖలు లేవు. అయినా అవి విభిన్న సంప్రదాయాలకి చిహ్నం అనుకోవాలి. అలా అనుకుంటే మా ముసల్మానుల్లో మాత్రం షియాలు, సున్నీలు అనీ, క్రైస్తవంలో క్యాథలిక్కులు, ప్రొటెస్టెంట్లు అనీ శాఖలు లేవా. శాఖలు వేరైనా వాటన్నిటి పరమార్థం ఒక్కటే కదా. కనుక నువ్వన్నట్లు వైవిధ్యం భ్రమ మాత్రమే. అన్నాడు ఆలీ. "అంతేకాదు, ప్రపంచంలో ప్రతిదీ ద్వైతంలా కనబడినా చివరికి అద్వైతమే నిలుస్తుంది. పరమాత్మ నుండి జీవాత్మ వేరన్నట్లు భ్రమింపజేసినా, చివరికి పరమాత్మలో విలీనమవుతుంది. కనుక వేరన్నది భ్రమ. ఒక్కటే అనుకోవడం సత్యం. వైవిధ్యం తప్పుకాదు అది వారి వారి జీవన విధానం. ఆచార వ్యవహారలకి సంబంధించినది. దాన్ని అంతవరకే పరిమితం చేసి వైషమ్యాల వరకూ వెళ్ళకుండా ఉంటే సర్వమానవ సౌభ్రాతృత్వాన్ని నెలకొల్పడం అసాధ్యం కాదు. మన స్నేహం అందుకు నిదర్శనమైనందుకు నాకు చాలా ఆనందంగా వుంది" అన్నాడు మూర్తి.

"అవును మూర్తీ! నువ్వన్నట్లు వైవిధ్యాలని ఆచార వ్యవహారాలకి పరిమితం చేసి, వైషమ్యాలకి తావివ్వకుండా జీవించే సమాజ స్థాపన పెద్ద కష్టమేం కాదు కదా" అంటూ మూర్తిని మనస్ఫూర్తిగా ఆలింగనం చేసుకున్నాడు ఆలీ. "మనం ఆచరిద్దాం... ఆదర్శంగా నిలుద్దాం... అటువంటి సమాజాన్ని ఆశిద్దాం" అన్నాడు మూర్తి ఆలీ భుజం చుట్టూ చేతులేసి దగ్గరికి లాక్కుంటూ. ●

## తెలుగు తల్లికి వందనం

- పూసల రజనీ గంగాధర్

సీ॥ అలనాడు నన్నయ్య ఆంధ్రీకరించిన
తొలితెల్గు పలుకుల జిలుగులేవి?
తిక్కన్న ఎర్రన్న తీయ తేనియ జిల్కు
పరువాల తెలుగుల పలుకులేవి?
శ్రీనాథ కవిరాజు సీసాల సొగసులు
పోతనార్యుని భక్తి పూతలేవి?
అష్టదిగ్గజ కవులల్లిన కావ్యాల
కమ్మనైన పరిమళమ్ములేవి?

తే॥గీ॥ ఇట్టి ప్రశ్నలు మదిలోన చుట్టుముట్ట
తెలుగుకన్యకు నుదుటను తిలకమద్ది
రచయితల సంఘమనియెడి రథము నందు
పట్టిదెచ్చిన మహులారా ! వందనమ్ము.

సీ॥ కృష్ణరాయలు నాడు కృతికర్త, భర్తయై
బహుకావ్యముల కాంతి బరచినట్లు
'మండలి' మరి 'గుత్తి కొండయు' 'పూర్ణచంద్'
కొండంత అండగా నుండు కతన
తగ నచ్చు నిడిన "తెలుగు మణి దీపాలు"
వెలుగు దీపమ్ములై వెలుగు గాక!
"వజ్రభారతి" తెల్గుభారతి శిరముపై
వజ్రకిరీటమై వరలుగాక!

తే॥గీ॥ మీరు జరిపిన తొలిసభ తీరుజూచి
అట 'తివారి'యె మురిసిన మాట నిజము
తెలుగు తల్లికి నిట్టుల వెలుగులిడిన
వారథుల్, రథసారథులార! వందనమ్ము

సీ॥ కృష్ణమ్మ సాక్షిగా కృషిసల్పి సాహితీ
లోకమున్ బాధ్యులైన సాకుచున్న
మీదుసేవల నికమీద మరచుటెట్లు?
అట్లు మరచిన వాడాంధ్రుడెట్లు?
ఆంధ్ర వధూటి మోమానందముల్ చింద
సిగముడులను విప్పి చిక్కుదీసి
తిరువీధి శోభను దీర్చినారు

ఆ॥వె॥ తెలుగునాడె మీకు దీర్చలేనట్లుగా
పడినదయ్య ఋణము ప్రాజ్ఞులార!
కవులను మరి లలిత కళల పోషకులార!
అందుకొనుడు మాదు వందనములు.

# ద్రౌపది (ఒక అవగాహన)

-కోడూరు శ్రీ పాండురంగారావు

చతుర్విధ పురుషార్థ సాధనకతి ప్రధానమైన గార్హస్థ్యాశ్రమ జీవనమునకు భార్య, భర్త, సంతానము, సత్యమనేవి మూలకంబములు. ఇట్టి ధర్మము వేదప్రోక్తము. మహాభారతము భారతీయ విజ్ఞానకోశము. ఆంధ్ర మహాభారతము తెలుగువారికి జీవనాడి. తరతరాలుగా తెలుగువారు మహాభారతముతో ఎంతగా మమేకమయ్యారనేది "తింటే గారెలే తినాలి, వింటే భారతమే వినాలి" అనే లోకోక్తి చెప్తుంది. భాగవతము పురాణము. రామాయణ మహాభారతములు ఇతిహాసములు. అనగా ప్రాచీన చరిత్రలు. ఇతిహాసములు రెండు రకములు.

"పరిక్రియా పురాకల్పా ఇతిహాస గతిర్విధా
స్యాదేకనా యకా పూర్వా, ద్వితీయా బహునాయకా!
ఏక నాయకుడు కలది పరిక్రియ. – రామాయణము
అనేక నాయకులు కలది పురాకల్పము – భారతము.

మహాభారతము వేదధర్మమునకు వ్యాఖ్యానము. కనుకనే పంచమ వేదమై, భారత జాతికి ఆరాధ్యము మరియు ననుసరణీయమునైనది.

❋ ❋ ❋

జీవనమునకు గృహస్థాశ్రమము ప్రధానమైనది. దానికి మూలకందము గృహిణి. గృహిణి ధర్మమును ఆదర్శంతముగ పాటించిన శకుంతల కులసతి. వేదప్రోక్త సర్వధర్మజ్ఞ. అంతే యుత్కృష్టముగ గృహిణి ధర్మమును త్రికరణ శుద్ధిగా నమ్మి నిర్వర్తించినది ద్రౌపది – ధర్మజ్ఞ, ధర్మస్వరూపిణి.

❋ ❋ ❋

పాండవ కౌరవుల అస్త్ర విద్యాభ్యాసము పూర్తియైన పిదప ద్రోణాచార్యులవారు కోరిన గురుదక్షిణ చెల్లించటంలో కౌరవులు ఘోరంగా విఫలులైతే పాండవులు ఘనవిజయం సాధించారు. ఇది వారి ప్రథమ విజయం.

"వీరెవరయ్య ద్రుపద మ
హారాజులై యిట్లు కృపణులయి పట్టువడన్
వీరికి వలసెనె ? యహహ, మ
హారాజ్యమదాంధ కారమది వాసెనొకో" అన్న ద్రోణుని

పలకరింపు వ్యంగ్యగర్భమై, ప్రతీకారప్రసంగమై బంధితుడైయున్న ద్రుపదునకు పుండుపై కారమద్దినట్లయినది. తీరని అవమాన కారణమైనది.

ద్రోణుని సంహరింపగల కుమారుడు, అర్జునునకు భార్యకాగల కుమార్తెయు కావలెనని ద్రుపదుడు పుత్రకామేష్టిని చేశాడు. యజ్ఞకుండము నుండి అగ్నిజ్వాల వంటి శరీరముతో ఖడ్గ కవచధారియై రథికుడైన కుమారుడు, దివ్యతేజముతో ఒక కుమారిక యుద్భవించారు. ద్రుపదుని కుమారునకు దృష్టద్యుమ్నుడనియు కుమార్తెకు కృష్ణయనియు పేర్లు పెట్టినది ఆకాశవాణి. ద్రుపదుని కుమార్తె కృష్ణ–ద్రౌపదిగ ప్రసిద్ధయైనది.

దివ్య తేజోమయ మూర్తియైన ద్రౌపది నల్లనిది. నీలవర్ణము అనంతత్వమునకు చిహ్నము. అనంతమైన ఆకాశము నలుపు. అతి విశాలమైన అపార పారావారము నలుపు. ఆది పరాశక్తియైన శ్రీలలితాదేవి చిదగ్ని, కుండ సంభవ. అయోనిజయు నిత్య కన్యయునైన ద్రౌపది యజ్ఞకుండ సముద్భవ.

"అహల్యా ద్రౌపదీ తారా తారా మండోదరీ తథా
పంచకన్యాస్మరేన్నిత్యం మహాపాతక నాశనమ్' అని పెద్దలు చెప్తారు.

శ్రీకృష్ణుడు నారాయణుడు. ఆది పరాశక్తి నారాయణి. అంటే నారాయణుని చెల్లెలు. పరాశక్తి స్వరూపమైన కృష్ణ నారాయణి శ్రీకృష్ణునకు చెల్లెలు. స్వర్గారోహణపర్వంలో ద్రౌపది లక్ష్మీ అంశతో జన్మించినదని చెప్పాడు వ్యాసుడు. అవును భాగ్యదేవతయే. ద్రౌపదిని పెండ్లాడిన పిదపనే పాండవులు కష్టములు తీరి గట్టెక్కారు. అపూర్వ, అసామ్యశక్తి సామర్థ్యములు కలిగియు కానలలో ప్రచ్ఛన్న వేషాలతో భుక్తికి భిక్షాటనమే ఆధారంగా బ్రతికిన పాండవులు వివాహానంతరమే హస్తిన నేలపై తిరిగి కాలుమోపి పాలకులై ఇంద్రప్రస్థమును నిర్మించుకొని దిగ్విజయ యాత్రలు చేశారు. రాజసూయ యాగము చేసి చక్రవర్తులుగ ఇరువది మూడు సంవత్సరములు పాలన చేశారు.

❋ ❋ ❋

తీర్థ యాత్రల కేగిన పార్థుడు ఉలూపి, చిత్రాంగదలను వివాహం చేసికొని, ద్వారకలో సుభద్రను ద్రౌపది ఏమంటుందోనని అతని శంక. సుభద్రతో అన్నాడు "మనమివ్విధంబున జనునప్పుడు ద్రుపదరాజ పుత్రి యప్రియంబులు పలుకునో, యప్పరమ పతివ్రత పలుకు నిక్కువంబగుం గావున..." అర్జునుడు ద్రౌపదిని పరమ పతివ్రత యన్నాడు. భర్తమదికెక్కిన ద్రౌపది మహనీయురాలు.

సుభద్ర ద్రౌపదికి మ్రొక్కింది. అప్పుడు ద్రౌపది శాంతముగ సౌమ్యముగ సుభద్రతో అంటుంది.

"పంకజాక్షి నీ పతి ప్రతిపక్ష వీర
విజయుడయ్యెడు, నీవును వీరపుత్ర
జనని వగుమని దీవించె సంతసంబు
తోడ వసుదేవపుత్రి నా ద్రుపద పుత్రి"

అరిషడ్వర్గాల కతీతమైన వ్యక్తిత్వం గల ద్రౌపది సుభద్రను సవతిగ భావించలేదు. అర్జునుడామెకు భర్తయనియే చెప్పినది. సుభద్రను తనకు సహోదరిగానే భావించినది. ద్రౌపది ధర్మ స్వరూప. ఆమె ఔన్నత్యము అట్టిది.

❋ ❋ ❋

రాజసూయము ముగిసినది.
మయసభ అపూర్వ అద్భుత సృష్టి.

దుర్యోధనుని మయసభా సందర్శన కౌతుహలమొక కీలక సన్నివేశము. ద్రౌపదిని దుర్యోధన పరాభవ హేతువందురు గాని దుర్యోధనుని పరాభవమునకు కారణము దుర్యోధనుడే. మరెవ్వరును కాదు. వ్యాసభారతమున ద్రౌపది నవ్వినట్లుగ లేదు. ఆంధ్ర మహాభారతమున "..... పాండవులును ద్రౌపదియు నగిరి" అనియే యున్నది. అనగ సరస మృదు దరహాసమే గాని పరాభవ పూర్వక పరిహాసము కాదు.

నీరులేని చోట నీరు కలదని భ్రమించి పట్టుపుట్టంబెగనెత్తి యడుగులు వేయుటయు, సారపూరకాసారంబును సమతలంబని భ్రమించి వలువ తడియనీటబడి భంగపడుటయు మొదలుగాగాయి విపర్యవస్త్వావస్థలం గాంచిన నెవ్వరేని నవ్వకుండిన చిత్రముగాని, నవ్వినదోషమేమి?

మయసభలో దుర్యోధనుడు స్వయంకృతాపరాధముచే భంగపడినాడు. దీని పర్యవసానమే జూదక్రీడ యందురుగాని యది సరికాదు. గమనార్హమైన, విషయమేమన, ద్రౌపది దుర్యోధనుని అవమానించలేదు. అవమానించినదని దుర్యోధనుడును అనలేదు. ఇంద్రప్రస్థమునుంచి హస్తినకు తిరిగి వచ్చిన దుర్యోధనుడు కాచినకందుగల పసిడివలె అయినాడు "సకల జన మనోనయనోత్సవం - బయిన తత్సభాలక్ష్మీ తన మనోనయనంబుల కగ్నిజ్వాలయై మహా దాహంబు సేయుటయు...". అదీ అసలు కారణం ఆ అసూయాగ్ని కౌరవనాశన హేతువయినది. అంతియకాని పాంచాలి పగలబడి నవ్వినదనుట సభ్యము కాదు.

పాండవులతో పాటు హస్తినా పురమునకు వచ్చిన ద్రౌపది గాంధారికి నమస్కరించినది. అది ఆమె సౌశీల్యత. పెద్దలయందుగల వినయ విధేయతలకు ప్రతీక. ద్రౌపదిని చూడవచ్చిన గాంధారి కోడండ్రు ఆమె సౌందర్యమునకు విస్మితులైనారు.

"అఖిల లావణ్యపుంజంబు నబ్జభవుడు
మెలతగా దీని యందు నిర్మించెనొక్కొ
కానినాడిట్టి కాంతి యేకాంతలందు
నేలలేదని సామర్ష హృదయలయిరి"

అపూర్వమును, అసామాన్యమును, అద్భుతమునైనట్టిది ద్రౌపది యొక్క సౌందర్యము. కనుకనే సాటిస్త్రీలు అసూయగ్రస్తులైరి.

ఆమె ధర్మ సంస్థాపనార్థము యజ్ఞకుండమునందుద్భవించిన పూత చరిత. ఆరాధనీయమైన మహత్తర శక్తి, ముట్టిన కాల్చు నిప్పు. కనుకనే ఆమెను అన్యథాభావన చేసిన దుర్యోధన కీచకాదులు సెగదగిలిన శలభములయి పోయారనగా నితరులెంత?

దుర్యోధనుని వ్యధ పాంచాలి నవ్వినదని కాదు. తన బాధను శకునితో నీవిధంగా చెప్తాడు.

"నీవును జూచి తట్టి సభనేని వినం బడదే యుగంబులన్
భూ వలయం బులో నది యపూర్వము సర్వ మనోజ్ఞ మిష్ట భో
గా వహమేక్రియం బడసెనయ్య? మహాత్ముడు దాననేమి సం
భావిత భాగ్యుడయ్యెను బ్రభాకర తేజుడు ధర్మజుండిలన్"

అట్టి సభావైభవమే దుర్యోధనుని కంటి నలుసై ఈర్ష్యకు కారణమైనది.

"ఏమి సేయుదము? పాండవుల లక్ష్మి యెవ్విధంబున మన కపహరించి కొననగు?" అన్నదే దుర్యోధనుని నిరంతరాలోచనము, మరియు విచార కారణము. ద్రౌపది తనను పరాభవించినదని దుర్యోధనుడు శకునితో ననలేదు. జూదక్రీడ కొడంబడజేయుటకై తండ్రితో కావాలని అబద్ధం చెప్పాడు.

"...... కవాట ఘటితంబు వివృతంబుగా వగచి చొరంబోయి తత్కవాట స్ఫటిక శిలాఘట్టిత లలాటుండనైన నన్నుం జూచి యనేక సహస్ర విలాసినీ పరివృతయైయున్న ద్రౌపది నగియె...." అనే అబద్ధాన్ని చెప్పాడు. ఆ పరాభవాగ్నిని చల్లార్చుకోవటానికే యీ జూదం అంటాడు. ధృతరాష్ట్రుని నమ్మించి, ఒప్పించటానికి తన తెలివి తక్కువ తనమనే నిజానికి ద్రౌపది అనేక సహస్ర విలాసినీ పరివృతమయి నవ్విందనే అబద్ధాన్ని అద్దాడు.

కౌరవుల విజయమనటానికి వీలులేకపోయిన పాండవుల పరాజయంతో దురోదర క్రీడ ముగిసింది. కులపాలికయైన కృష్ణను సాధారణ వనితగా భావించిన దుర్యోధనుడు "పరుపుళ్ళ గలిసి తనయిలు పరువడి దదువంగ" ద్రౌపదిని దాసిగ తీసికొని రమ్మని ప్రాతికామిని పంపాడు. పిలువబోయిన ప్రాతికామితో :

"మున్నుదన్నోటువడి మరి నన్నునోటు; పడియెనో, నన్ను మున్నోటు వడి విభుదు
గ్రన్న దన్నోటు వడియెనో యన్న నాకు; నెఱుగ జెప్పుము దీని నీ వెఱుగు దేని?"

అంటుంది ద్రౌపది.

అంతటి మహాసభలో ద్రౌపది ప్రశ్నకు బదులీయగల విబుధులే లేకపోయిరి. ఈ ప్రశ్నకే విధముగ సమాధానము చెప్పినను ద్రౌపది అధర్మ విజితయని రూఢియగును. అంతటి ధీమంతురాలు ద్రౌపది.

ఏకవస్త్ర అయినను ఆమె సభకు రాక తప్పలేదు. ధృతరాష్ట్రుని కడకేగిన ఆమెను సభలోనికి తీసికొనిపోవవచ్చిన దుశ్శాసనునకు భయపడి గాంధారి దాపునకేగి, తానేక వస్త్రనని చెప్పినను ఆతడు వినలేదు. ఆమెను సభకు దెచ్చిన విధమిట్లున్నది.

"అవనజాననం గురుకులాపశదుండు గడంగి రాజసూ
యావభృథంబునందు వసుధామర మంత్ర పవిత్రవారిధా
రావళిజేసి పావనములైన శిరోజములందెమల్చి పా
పావహుడీడ్చి తెచ్చె సభకందరు సంభ్రమమంది జూడగన్"

సభయంతయు స్తబ్ధయైనది. 'అయ్యో! అయ్యోయని మనముల నివ్వెఱ బోయిరే గాని యిదేమని యనగల మగవాడే లేకపోయినాడు. కురువృద్ధులు, గురువృద్ధులు ప్రతిమలైరి. అట్టి సభయందు వికర్ణుడొక్కడు ద్రౌపది అధర్మ విజితయనియు, సభకీడ్చి తెచ్చుట అమానుషమనియు ననినాడు. కాని కర్ణుడు వికర్ణుని మాటలను త్రోసిపుచ్చి అనేక భర్తృకయైన ఆమె బంధకియనుచు వివస్త్రను గావించి తెచ్చినను ధర్మవిరోధంబు లేదని బాహాటముగ పల్కుట కర్ణుని దౌష్ట్యమునకు పరాకాష్ఠ. కర్ణుని అనుచిత, అసభ్య సంభాషణయే ద్రౌపదీ వస్త్రాపహరణమునకు దారి తీసినది. కౌరవుల రాక్షస కృత్యాన్ని దైవమే స్వయంగా అక్షయ వస్త్రంతో ఎదుర్కొన్నాడు., పాంచాలిని ఆదుకున్నాడు.

అధర్మమున కిది యొక ఘోర పరాజయం

ఆ సందర్భములో భీముని ప్రతిజ్ఞ దుశ్శాసనుని మరణశాసనమే.

కర్ణుని నోటితీట అంతటితో ఆగలేదు. జూదమున నోటు పడని వానినొకని భర్తగా పొందమని ద్రౌపదితో అనుట నీచాతినీచము. కర్ణుని అనుచిత ప్రసంగమే ద్రౌపదిని "తన రమ్య పృథూరుతలంబు నెక్కగా రమ్మని..." దుర్యోధనుడు సన్న చేయుటకు దోహదమై, దుర్యోధనుని మరణ విధ నిర్ణాయకమై ముగిసినది.

ఈ సందర్భములను జాగ్రత్తగా పరిశీలించినచో ఒక విషయ మవగత మగును... దుశ్శాసనుడు తన వద్దకు వచ్చినప్పుడు "...... నన్ను ముట్టకు మేక వస్త్రనైయున్న దాన" నని ద్రౌపది అన్నది. అప్పుడు దుశ్శాసనుడు "నీవేక వస్త్రవైతేమి విగత వస్త్రవైతేమి...." అంటాడు.

"ఇట్టిదానిని విగతవస్త్రం జేసి తెచ్చినను ధర్మవిరుద్ధంబులే" దని కర్ణుడు అంటాడు.. ధర్మమంటే ఏమిటో తెలిసినవాని వలె.

కర్ణుని మాటయే వేదంగా భావించే అప్రయోజకుడు దుర్యోధనుడు అందులకు "...... యిప్పాండవులయు ద్రౌపదియు వస్త్రంబుల పరిహరింపుము" అని దుశ్శాసనుని ప్రేరేపించాడు.

అంటే ఇదంతా ఒక పథకం ప్రకారం జరిగినది. ద్రౌపదిని వివస్త్రను చేయాలన్నది వారి ప్రణాళిక. ద్రౌపది యొక్క బాహ్య సౌందర్య సందర్శనైక దుష్ట భావనారోగ పీడితులా దుష్టచతుష్టయమన్నది అసలు నిజం. అందుచేతనే వారతిఘోరంగా చంపబడ్డారు. పరమపతివ్రతయైన ద్రౌపదిని ఎవ్వరైనా ఎప్పుడైనా మతిభ్రమణంతో అన్యథా భావిస్తే వినాశం తప్పదని ఆనాటి ఎచ్చరిక.

ద్రౌపది ధర్మజ్ఞ. దుశ్శాసనుణ్ణి, దుర్యోధనుణ్ణి చంపుతానని వడముడి భీషణ ప్రతిజ్ఞలు చేసినప్పుడు కౌరవుల అంతఃపురాలలో దుర్నిమిత్తములు తోచినాయి. తన కుమారులను రక్షించుకోవాలనే భావనతో ధృతరాష్ట్రుడు ద్రౌపదికి వరములిచ్చాడు. రెండు వరాలతో పాండవులను దాస్యవిముక్తులను చేసిన ద్రౌపది మూడవ వరం కోరుట క్షత్రియ కాంతకనుచితమని ధర్మసూక్ష్మతను ఆచరించి వివరించిన ధర్మజ్ఞ.

* * *

విదురుడు ధర్మము తప్పనివాడు. నీతిమంతుడు. ఒక యోగి.

అనుద్యూతానంతరము ద్రౌపదీ సహితులయి పాండవులు అరణ్యవాసానికి బయలుదేరారు. ధర్మజునితో విదురుడంటాడు. "వినుతార్థ ధర్మంబులందు విచక్షణ సుందరాంగి ద్రుపదతనయ..." అని. విదురుని దృష్టి ద్రౌపది యొక్క సమర్థతకు, ఆత్మ సౌందర్యానికి సంబంధించినదేగాని బాహ్య సౌందర్యానికి సంబంధించినది కాదు. అంగము అనగా రీతి లేక విధము. సుందరమనగా ఆదరపాత్రమైన అని అర్థము. అనగా ప్రశస్తములైన ధర్మాధర్మములందు విచక్షణ గలిగి ఆదరణీయమైన విధముగా ప్రవర్తించగలది ద్రౌపది యన్నది విదురుని భావము. విచక్షణ అన్న పదమునకు "విశేషేణ చష్టే విచక్షణః- చక్షిజ్ వ్యక్తాయాం వాచి" అన్నది అమరసింహుని వాఖ్య. - అనగా ధర్మాధర్మ విషయములందు ఆదరపాత్రమైన విధముగ ప్రవర్తించగలదని విదురుని భావము. ఇంత వివేచన చేయగలిగితే విదురుడెంతటి ధర్మమూర్తియో తెలుస్తుంది. ద్రౌపదియొక్క సౌశీల్యము, ధర్మ నిరతియు తెల్లమగును.

ఇరువది మూడు సంవత్సరములు మహారాజ్ఞిగ బ్రతికిన ద్రౌపది రాజకీయపు కుట్రలచే భంగపడి నతశీర్షయై, విముక్తకేశయై దుఃఖాక్రాంతయై, బాష్పధారా పరిక్లిన్న వక్షయై భీకరారణ్యములకు తరలిపోతుండే దృశ్యం ఆమె ఓర్పునకు, గాంభీర్యమునకు నిలువెత్తు నిదర్శనము. అరణ్యవాసమునందుండగ సత్యభామ ద్రౌపది వద్దకు వచ్చి పాండవులు ఆమె యందు అత్యంతానురాగము కలిగి యుండుటకు హేతువేమని అడుగుతుంది. "మందా! మంత్రమా?" అని ప్రశ్నిస్తుంది. కోపమును తమాయించుకున్న ద్రౌపది సత్యభామతో అంటుంది. "సౌందర్యవతివైన ఓ! సత్యభామా నీవు పురుషోత్తమునకు భార్యగా తగవు. మందులు మంత్రాలతో భర్త నదుపులో ఉంచుకోవాలనే ప్రయత్నం తెలివిలేని ఆలోచన. కులస్త్రీ ధర్మమే మాత్రమున్నా కాదు. నా భర్తలకు నేనే స్వయంగా సేవలు చేస్తాను. భర్త సేవలకై సేవకులను నియోగించను. అందువలన భర్తకు భార్య సన్నిహితమౌతుంది. అన్యోన్యానురాగమధికమై ప్రేమాస్పదురాలు అవుతుంది. మందులు, మంత్రాలు నిష్ప్రయోజనాలు. భర్తకనిష్టమైనవి చేయక భర్తతోడిదే లోకంగా బ్రతుకగల స్త్రీ ఉత్తమ గృహిణి అవుతుంది. క్షత్రియులకు బహుభార్యత్వము దోషము కాదు. భర్త అనురక్తుడైన సవతిని సోదరిగ భావించటం ఉత్తమ గుణం సుమా! పరుషములు గాక మృదు మధురములైన వచనములు గల స్త్రీ భర్తను సంతోషపెట్టగలుగుతుంది. ఇట్టి అవగాహన కలిగి భర్తలయందను రక్తయైన ద్రౌపది ఉత్తమ గృహిణి.

ద్రౌపది అబల కాదు - సబల. కామ్యక వనములోని తృణబిందుని ఆశ్రమంలో ఉన్నప్పుడు సైంధవుడు ఆమెను అపహరింప ప్రయత్నించినప్పుడు ద్రౌపది సైంధవుణ్ణి కొట్టి క్రిందపడవేసింది. ఎట్లా?

"పాప వినిశ్చయుండు సతి పయ్యెద కొంగు గడంగి పట్టినం
గోపముతో నుదల్చికొని కోమలియున్ వెసవాని ద్రోయుడుం
బోపడివాడు చిత్రముగ భూమి తలంబున ద్రెళ్ళె మారుత
క్షేప విభగ్నమూలమయి చెచ్చెర ద్రెళ్ళు మహీరుహంబునాన్"

అరణ్యవాసానంతరం పాండవులు అజ్ఞాతవాసము నిమిత్తము విరటుని రాజ్యమునకు వెళ్ళారు. విరటుని భార్య సుదేష్ణ వద్దకు వెళ్ళినది. మాలిని అనే పేరుతో సైరంధ్రిగా కొలువు చేయ సంకల్పించినది. వేషము మార్చినది. వలపలకు కేశములను ముడిచి కొప్పు పెట్టినది. మాసిన చీరకట్టి పయ్యెదతో వక్షో భాగమంతయు కప్పికొన్నది. పుర ప్రజలు ప్రశ్నించినప్పుడు "గట్టువాలుదాన యన్నది". ద్రౌపది సుధేష్ణ యడిగిన ప్రశ్నల కుత్తరములిస్తూ "మహారాజ్ఞీ! నేను సైరంధ్రి వృత్తిచే జీవించుదానను. నాకు అయిదుగురు భర్తలు. కాని నేను ప్రస్తుతము నియమానుసారముగ ఏడాది పాటు దీక్షాపరురాలనై యున్నాను. నేను నీ వద్ద ఉంటాను. కేకయ రాజపుత్రీ! ఇంతకు ముందు ద్రౌపదీ దేవి మందిరములో ఉండెడిదానను. నీచమైన పనులు నేను చేయను. నా గౌరవమును నీవు కాపాడగలిగినంతవరకు నీకు సేవచేయగలను. వివిధములైన లేపనములు తయారుచేయుట, పలువిధములుగ వేనీ బంధములు కూర్చుట, మనోజ్ఞ మాలికారచనము, చిత్ర విచిత్ర విధములగ శోభాయమానమైన రీతులలో తిలకముదిద్దుటయు మొదలగునవి నానేర్చిన విద్యలు. పరపురుషులతో సంభాషింపను. నన్నెవరైన పరాభవించిన నాభర్త ఐదుగురు గంధర్వులు సహించరు. కనుక నా రక్షణమును గూర్చి బెంగపడవలదు. నమ్రతతో, నైపుణ్యముతో నిన్ను సేవిస్తాను. కనుక నిర్భయంగా కొలువులోనికి తీసుకో" అన్నది ద్రౌపది.

అజ్ఞాతవాసమింకొక మాసమున్నదనగా మత్స్యదేశపు సేనాధిపతి సుధేష్ణకు సోదరుడు అయిన కీచకుడు సుధేష్ణ మందిరమునకు వచ్చాడు. అతడు బలదర్పితుడే కాదు కామాంధుడు కూడా. మధిర కోసం అక్క వద్దకు వచ్చిన అతడు ద్రౌపదిని చూచాడు. అపూర్వమైన ఆమె సౌందర్యము సింహబలునికి మతి పోగొట్టింది. కాని వాయి కట్టలేకపోయినది. నిగ్రహమును కోల్పోయినాడు. తన కోర్కెను అక్కకు చెప్పాడు. కుదరలేదు. మోహాంధుడై అర్థంలేని ప్రలాపము లతో ద్రౌపది వద్దకు వెళ్ళి "నీలాంటి అందగత్తెనింత వరకు నేనెక్కడా చూడలేదు. ఎవ్వరిదానవు? నీ పేరేమిటి? అని ప్రశ్నించాడు. ఆమె వినీ విననట్లూరకున్నది. విమోహుడై "కలువరేకులబోలు కన్నులు, ముత్యాలవంటి పన్నులు గలదానా, ఓ సుందరీ! పరస్త్రీ సాంగత్యం వలన కలుగు పాపానికి భయపడను. కాని మదనుని శరాఘాతములకు తాళలేకున్నాను. నన్ను కనికరించు" అన్నాడు.

అంతవరకు అవనతవదనయై, చింతాక్రాంతచిత్తయై యున్న పాండవ పట్టమహిషి తోక త్రొక్కిన త్రాచువలె తల ఎత్తింది. కీచకుడెంత నీచుడో ఆమెకు అర్థమైంది. రూక్షేక్షణములతో కటువుగ అన్నది.

"దుర్వారోద్యమ బాహువిక్రమ రసాస్తోక ప్రతాపస్ఫు ర
ద్గర్వాంధ ప్రతివీర నిర్మథన విద్యాపారగుల్ మత్పతుల్
గీర్వాణా కృతులేవురిప్డునిను దోర్లీలవెసంగిట్టి గం
ధర్వుల్ మానము ప్రాణముం గొనుట తథ్యంబెమ్మెయిన్ గీచకా"

ఆమె భర్తలు దుర్వారోద్యమ బాహు విక్రమ రసాస్తోక ప్రతాపస్ఫురత్ గర్వాంధులు కారట. అట్టి గర్వాంధులైన ప్రతివీరులను తెలికా మట్టుపెట్టగల విధమును విద్య తెలిసినవారట. గీర్వాణాకృతులట. గంధర్వులట - అంటే సుందరులట. (మానవులలో అందము గంధర్వాంశమని ప్రతీతి). "ఓ కీచకా అట్టి నా భర్తలు నీ ప్రాణము హరింతురు సుమా" అన్నది. అంతేకాదు కీచకా అనటం సంబోధన మాత్రమే కాదు. అందులో ఒక తీవ్రమైన ఎచ్చరిక యున్నది. అది కీచకుని పాలిటి మరణ మృదంగమే.

మేఘ సందేశంలో కాళిదాసు కీచక శబ్దాన్ని వాడాడు.

"శబ్దాయంత్ మధురమనిలైః కీచకాః పూర్యమాణాః
సంసక్తాభిస్త్రి పురవిజయో గీయతే కిన్నరీభిః....."

కిన్నరస్త్రీలు త్రిపురాసుర విజయగాథను మనోహరంగా గానం చేస్తుండగా వాయువులు కీచకములందు దూరి మధురమైన శబ్దమును చేస్తూ సంగీతం సమకూరుస్తున్నాయట. వెదురులోనికి గాలి ఎప్పుడు దూరగలదు పగిలినప్పుడు. కావున కీచకమనగా పగిలిన వెదురు. చెఱకుగడకు గాని వెదురుగడకు గాని పగులు ఒక వ్యాధి. అట్టి గడలను నరికి వేరుచేస్తారు. అటులనే ఓ! కీచకా పాపేచ్ఛగలవాడవైన నీవు వ్యాధి గ్రస్తుడవు కనుక వధ్యుడవని సూచన.

అంతటి ధైర్య స్థైర్యములు గల ధీమంతురాలు ద్రౌపది. అంటే ద్రౌపది సౌందర్యమును విపరీత భావంతో పొగడటం కీచక లక్షణమన్న మాట. కీచకుడు తననైచ్యాన్ని సమర్థించుకున్నాడు. కాని బలవన్మరణం తప్పలేదు.

స్త్రీ ఎంతటి కష్టమునైనా ఓర్పుగ భరిస్తుంది. కాని అవమానాన్ని భరించలేదు. విరటుని కొలువులో కీచకుడు అవమానించాడు. "ఒడిచి తలపట్టి తిగిచి మహోగ్రవృత్తిగొంకు కొసరించుకయు లేక కూలదాచె."

కౌరవసభలో వలె విరటుని కొల్వునను ద్రౌపదికి జరిగిన అన్యాయమును, పరాభవమును ఎవ్వరును నివారించలేకపోయిరి. మీదు మిక్కిలి ధర్మమునర్థించిన ఆమెను ధర్మజుడు మందలించాడు.

"పలు పోకల బోవుచు, వి
చ్చలవిడి నాట్యంబు సలుపు చాడ్పున నిచటన్
గులసతుల గఱువచందము
దొలగగ నిట్లునికి దగునె తోయజ వదనా" అన్నాడు.

ధర్మజుని పలుకులు ములుకులై ఆమె అభిమానమును తూట్లు పొడిచినాయి. రోషకషాయిత స్వరంతో "ఓ! కంకభట్టూ! నా భర్త నటుడు. వేషములు మార్చుచుండును. పైపెచ్చు జూదరి. అట్టివానికి భార్యనైన నేను నాట్యకత్తెనే. జూదరి భార్యకు గౌరవమెట్లు కలుగుతుంది" అని తన వ్యధను అన్యాపదేశంగా వ్యక్తపరిచిన మాటకారి ద్రౌపది.

కీచకుని ప్రవర్తన విని సుధేష్ణ "నిన్నవమానించిన వారిని శిక్షిస్తాను. దుఃఖించకు" అన్నది. ద్రౌపది కోరుకునేది కీచకుని మరణం. శిక్షించటం కాదు. అందుచేతనే సుధేష్ణతో అన్నది.

"నీవింత యలుగ నేటికి
నా వంతయు పౌరజన మనఃఖేదము నా
క్కావంత దిక్కకుండగ
లావంతులు మత్పతులు గలరు పగదీర్పన్" అని అన్నట్లుగానే భీమునిచేత కీచరకుని వాని సోదరులను చంపించినది.

❊ ❊ ❊

సంజయ రాబారం ముగిసిన పిమ్మట పాండవుల దూతగ శ్రీకృష్ణుడు ధృతరాష్ట్రుని వద్దకు వెళ్ళినప్పుడు ఎటులైన సంధి చేయమని కోరిన ధర్మజుని మాటలు ద్రౌపదికి రుచించలేదు. ఆత్మగౌరవమే ఊపిరిగ బ్రతుకుతున్న ద్రౌపది గద్గదకంఠియై కృష్ణునితో అంటుంది.

"కృష్ణా అయిదూళ్ళ బిచ్చము సంగతి నాకనవసరము. కౌరవులను క్షమించి వదలివేయుట అవివేకము, అసమర్థతకన్న వేరుగాదు. ఆనాటి పరాభవము నా హృదయములో కంటకమై నిలిచిపోయింది. వారి అంతం చూడక నిశ్చింతను కాను. వారు బ్రతికి ఉండగ హస్తినలో అడుగుపెట్టను. ఇది నా దృఢ నిశ్చయము. సంధిచేస్తావో, మరేమి చేస్తావో నీ యిష్టం. కృష్ణా! నీవు నా యందు దయగలవాడవు. ఆనాడు విడివడిన నాకుంమతలమును మరచిపోకు" అని తన కేశములను చూపినది. దుశ్శాసనుని రక్త స్పర్శ జరిగిన పిదపనే వేణీబంధము కావించినది.

## సంబరం

- అవనిగడ్డ సూర్యప్రకాష్

విశ్వంభర పూదోటలో విరిసిన తెలుగు పుష్పాలను
ఏరుకొచ్చి - ఒక మాలగా గుదిగుచ్చి
భావ్యసమైక్యతా మాధుర్యాన్ని క్రుమ్మరిస్తారట-
పాయలు పాయలుగా విస్తరించుకుపోయిన
పురా సంస్కృతిని పునరావృతం చేసి
భాషాపరిజ్ఞానాన్ని వాటి మెదళ్ళకెక్కిస్తారట-
నెర్రె లిచ్చిన తెలుగు హృదయ క్షేత్రాల్లో
సామరస్య హలాల దున్ని
సంఘీభావ బీజాలు నాటుతారట-
పువ్వు పువ్వుకి మధ్య కట్టినట్టి
అడ్డుగోడలు కూల్చివేసి
మమత లతలు అల్లుతారట-
పాత రోత కొత్తవింద పదుగురిలో చెల్లుమాట
పాడుబడ్డ శిధిలాలకు మరో కొత్తబాట-
ఈ తెలుగు సంగమం కావాలి అందరికి
ఆనందాల తిరునాళ్ళు ఆటగా...,
ఈ తెలుగు చెలిమి పొంగాలి అందరిలో
సంబరాల పరవళ్ళు పాటగా....,

# తెలుగుభాష సజీవంగా యుండటానికి అవరోధాలు

- డా॥ త్రిపురనేని హనుమాన్ చౌదరి

ప్రతివ్యక్తీ చేయవలసింది మన ఇంటిపేరును, మనపేరునూ ఇంగ్లీషు అక్షరాలతో కుదించకుండా ఉండటం. టి. హెచ్. చౌదరి అని వ్రాసే బదులు త్రిపురనేని హనుమాన్ చౌదరి అని వ్రాయడం తెలుగువారికి ఇంటిపేరు ప్రత్యేక ఆభరణం. మరే భాష మాట్లాడేవారికి ఇంటిపేర్లు లేవు. ఈ వైశిష్ట్యాన్ని మనం నిల్పుకోవాలి. మన సంప్రదాయం, మన పేరుకు ముందు ఇంటిపేరు వ్రాయడం. అంతేకాని పేరు తర్వాత కాదు. కొంతకాలం నుండి, అమెరికా వాళ్లననుకరిస్తూ, హనుమాన్ చౌదరి త్రిపురనేని, రావుసూరపనేని అంటూ వ్రాయడం నవీనం అని కొందరలా వ్రాస్తున్నారు, పులిని జూచి నక్క వాతపెట్టుకున్నట్లుగా. ఈ దుష్ట సంప్రదాయాన్ని మనం విసర్జించాలి.

పిల్లలందర్నీ విద్యాలయాలకు పంపించాలనే అభియానంలో ఆకాశవాణి ద్వారా ప్రతిదినం ప్రభుత్వం ఒక సందేశాన్ని ప్రసారం చేస్తోంది. దాని సారాంశం "మీ పిల్లల్ని ప్రైవేట్ స్కూళ్లకు పంపవద్దు. ప్రభుత్వపాఠశాలల్లో ఉచితంగా మధ్యాహ్న భోజనం, ఫీజులేని విద్య లభిస్తుంది. విశేషించి బోధన ఇంగ్లీషులో ఉంటుంది. ఈ సందేశం వల్ల తెలుగు నిరసించబడుతోంది. అ... అమ్మ, నా... నాన్న అనే బదులు A for apple, R for Rahul, S for Sonia అని చెబుతుంటే ఏ సంస్కృతి చిరుప్రాయంలోనే నూరిపోస్తున్నాం? శ్రీరాముని దయచేతను, ఆరూఢిగ సకల జనులు ఔరా యనగా, ధారాళమగు నీతులు... చవులుబుట్ట..."కు బదులుగా Twinkle twinkle little star అనీ, అమ్మకు బదులు Mummy అనీ, నాన్నకు బదులు daddy అని చెబుతుంటే తెలుగుపై ప్రేమగాని, గౌరవంగాని, నీతి నియమాలుగాని, ఎలా అలవడుతాయ్? నీతి చంద్రికలోని కథలు, వేమన, సుమతి శతక పద్యాలు, భర్తృహరి సుభాషితాలు కంఠస్థం చేయిస్తేనో వినిపించి అర్థసహితంగా వ్యాఖ్యానిస్తేనో, తెలుగు యందభిరుచియే గాక, నీతి, సంస్కృతి, సచ్చింతన అలవడుతాయి. కాబట్టి పాఠశాలల్లో S.S.C వరకూ తెలుగు మాధ్యమంలోనే బోధన జరగాలని, ఆ నియమం ప్రభుత్వం తీసుకురావలని మనం కోరాలి.

బ్రిటిష్ ఈస్ట్ ఇండియా కంపెనీ (బ్రిటిష్ ప్రభుత్వం కాదు, కేవలం ఆ దేశపు ఒక కంపెనీ) మనల్ని పాలిస్తున్నప్పుడు 1838లో కంపెనీ వ్రాతగాడైన మెకాలే అనే ఆయన బ్రిటిష్ పార్లమెంటుకు ఒక అభ్యర్థనను పంపాడు. దాని సారాంశం "భారతదేశంలో పాఠశాలలు లేని గ్రామాలు లేవు. పరంపరాగత పద్ధతిలో, భారతీయ విద్య బోధింపబడుతోంది, వారి వారి భాషల్లో, ఇదే గనక కొనసాగితే మనం ఎక్కువకాలం పాలించలేం. ఆ పద్ధతికి, ఆ బోధలకూ స్వస్తి చెప్పి, ఆంగ్లేయ భాషలో, మన బోధనాంశాలను విద్యార్థులకు చెప్పాలి. ఇలా చేస్తే అనతికాలంలో, కేవలం రంగు, రక్తం మాత్రమే భారతీయమై; ఆకాంక్షలలో తలపుల్లో, వలపుల్లో వేషభాషల్లో, మూల్యాలలో, ఆచరణ సరళిలో బ్రిటిష్ వారిగా యుండే, మనకు విశ్వాస పాత్రులైన దేశస్థులు తయారవుతారు... వీరి ద్వారా మన పాలన చాలాకాలం సాగుతుంది" ఈ మెకాలే అభ్యర్థనను బ్రిటన్ ఆమోదించింది. భారతీయ విద్యావిధానం త్యజింపబడి, ఆత్మ న్యూనతను, విదేశ భావ దాస్యాన్ని పెంచే విద్యావిధానం మనమీద రుద్దబడింది. అందుకే రామలీలా ధాపర్లు, రొమిలా థాపర్లుగా పేరు మార్చుకున్నారు. స్వాతంత్ర్యం కోసం పోరాడిన సమయంలో పాశ్చాత్య విద్యా విధానంలో విద్యావంతులైన నాయకులయందు దేశభక్తి, వారసత్వపు స్పృహ, ఆత్మగౌరవం, న్యూతనా భావలేమి వల్ల మన భాషలూ, పేర్లూ, ఆచారాలూ పూర్తిగా నశించలా.

కాని స్వాతంత్ర్యానంతరం, మీదు మిక్కిలి గత పదిసంవత్సరాల నుంచి, తిరిగి అభారతీయ ఆధిపత్యంరావడంతో, విశేషించి మన రాష్ట్రంలో స్వదేశాభిమానం, స్వభాషాభిమానం త్వరత్వరగా అస్తమించ నారంభించాయి. ఏలినవారి అభీష్టం మేరకు, ప్రభుత్వ పాఠశాలల్లో బోధనా మాధ్యమం తెలుగుకు బదులుగా ఇంగ్లీషు అవుతోంది. ఇంగ్లీషు ఘనతకు ప్రభుత్వం వంతపాడుతోంది. బ్రిటిష్ వాళ్ల పాలన సమయంలో పాఠ్యాంశాలు అభారతీయంగాయున్నా, S.S.L.C వరకు బోధనా మధ్యం మాతృభాష తెలుగే! ప్రస్తుతం దేశవాసులుగా యున్న అభారతీయుల (resident non-indians, RNIS) పాలన వల్ల, తెలుగును ఈసడించి ఇంగ్లీష్‌కు పట్టం కట్టడం దేశభాషా ద్రోహక చర్యకాదా?

సంస్కృతికి వాహిక భాష. ఆ భాషా సాహిత్య కళల ద్వారానే, సంస్కృతి సజీవంగా యుంటుంది. నీటి ప్రవాహం లేకపోతే, నది అదృశ్యమైనట్లు (ఉదాహరణ: సరస్వతి నది) భాషపోతే ఆ భాష ద్వారా వర్ధిల్లిన సంస్కృతి, జీవన సరళి, వైయక్తిక, సామాజిక మూల్యాతా నశిస్తయ్. సహిష్ణుతను, సహనాన్ని, భిన్నత్వమాన్యతనూ, ప్రకృతిని మన్నించి, దానితో సహకరించి (సంహరించి కాదు) జీవించడాన్ని నేర్పే భారతీయ దృక్పథం, సంస్కృతి భారతీయ భాషలతో ముడిపడియున్నాయి. భాషకు లిపి ప్రత్యేకం, మరో లిపిలో భాషకు మాధుర్యం, సౌందర్యం ఉండవు. అందుకే మనం మాతృభాష, మధురభాష తెలుగునూ, దాని లిపినీ, తదుచ్చాఋరణనూ, తదుపయోగ పద్ధతిని (ఉదాహరణకు మన పేర్లు వ్రాసే క్రమం సంక్షిప్తత చేయమి) గౌరవించి, సజీవంగానే గాక, నిత్యనూతనంగా చేసుకుంటూ యుండాలి. మన సర్వాంగీణాభివృద్ధికి, సంపత్సృష్టికి, సమృద్ధికి, దేశ ప్రపంచస్థాయిలో విచార వినిమయం, వాణిజ్యాలకై ఆంగ్లభాషాచాతుర్యం ఎంతైనా అవసరం. ఐహికాముష్మికాలు రెండూ సమానంగా అవసరమే. భుక్తి, ముక్తి రెండూ అభిలషనీయాలే. అందుకే తెలుగుతోపాటు ఇంగ్లీషునూ నేర్చు కుందాం. భార్య గృహస్థాశ్రమంలో ఎంత అవసరమో, ఎంత మహత్వంతో కూడిందో, ఆంగ్లభాష మనమంచికి అంత అవసరం. భార్యకోసమై తల్లిని మరువచ్చా? క్రిందుపఱచవచ్చా? కాదు. అలాగే భార్యవంటి ఆంగ్లభాషయున్నూ, తల్లి వంటి తెలుగూ అవసరమే. పూజ్యమే. సంవర్ధనీయమే. ●

## అమ్మ

- దావకర్ల సాయి అభిషేక్

అమ్మ అమ్మ మామంచి అమ్మ
అందరికన్నా మంచిది అమ్మ
అడిగినవన్నీ తెస్తుంది తెచ్చినవన్నీ ఇస్తుంది
కడుపునిండా పెడుతుంది
కళ్లనిండా పడుకోమంటుంది
ముద్దులు ఎన్నో ఇస్తుంది
మంచిగ ఉండాలంటుంది
బాగా చదువని చెబుతుంది

# ఆంధ్రోద్యమ కవిత్వం

- ఆచార్య గోగినేని యోగ ప్రభావతి దేవి

భారతదేశంలో భాషాప్రయుక్త రాష్ట్ర ప్రతిపాదనకు నాంది పలికినవారు ఆంధ్రులు. స్వాతంత్ర్యోద్యమంలో కూడా చిత్తశుద్ధితో పాల్గొని ఆంధ్రులు త్యాగధనులయ్యారు. దాస్య శృంఖలాలనుండి భారతమాతకు విముక్తిని కలిగించడమే ప్రధమ కర్తవ్యంగా భావించారు. కొన్ని సందర్భాలలో దేశ స్వాతంత్ర్యం కోసం రాష్ట్రవాంఛను కూడ పణంగా పెట్టారు. సైమన్ కమీషన్ వచ్చిన సందర్భంలో ప్రత్యేకరాష్ట్ర వాదనను విస్మరించి ఆంధ్రులు ప్రదర్శించిన ఆదర్శం మరువలేనిది. ఆ విధంగా ఒకప్రక్క దేశంకోసం, మరోప్రక్క రాష్ట్రం కోసం ఉద్యమాలు నిర్వహించి తుదకు స్వతంత్ర భారతదేశంలో మొట్టమొదటి భాషా ప్రయుక్త రాష్ట్రంగా ప్రత్యేక ఆంధ్రరాష్ట్రాన్ని సాధించారు.

ముఖ్యమంత్రి రాజగోపాలాచారి ఆంధ్రుల ప్రయోజనాలను విస్మరించి తమిళనాడు అభివృద్ధికి ప్రాధాన్యమిచ్చారు. కృష్ణానదీ జలాలను తమిళనాడుకు మళ్లించడానికి కృష్ణ, పెన్నారు ప్రాజెక్టులపై శ్రద్ధ చూపారు. మొత్తంమీద నాగార్జునసాగర్ ప్రాజెక్టు నిర్మాణం జరిగింది. ఆంధ్ర రాష్ట్ర స్థాపన ఒక్కటే ఆంధ్రుల ప్రయోజనాలు కాపాడగలదని ప్రముఖ గాంధేయవాది స్వామి సీతారాం, ఆ తరువాత పొట్టి శ్రీరాములు ప్రాణత్యాగంతో 1953 అక్టోబరు ఒకటిన ప్రత్యేక రాష్ట్రం ఆవిర్భవించింది. అనంతరం 1956 నవంబరు ఒకటో తేదీన హైదరాబాదు రాజధానిగా ఆంధ్రప్రదేశ్ అవతరించడం జరిగింది.

ఈ ఆంధ్రోద్యమాన్ని ఆధారం చేసుకొని తెలుగు సాహిత్యంలో ఆవిర్భవించిన కవితా స్వరూపాన్ని పరికించుదాం.

తమ గేయ కవితా నీరాజనంతో తెలుగు తల్లిని సమర్చనం చేసిన వారిలో శంకరంబాడి సుందరాచారి గారి

'మా తెలుగు తల్లికి మల్లెపూదండ' మకుటాయమైనది. అందరి చెవుల్లో మారుమ్రోగేట్లు తెలుగు తల్లికి జైజైలు పలికిన సుందరాచారి గారి ఈ గీతం వింటే తెలుగువారి హృదయం దేశభక్తితో ఉప్పొంగుతుంది.

ఆంధ్రరాష్ట్ర సిద్ధిని దృష్టిలో పెట్టుకొని దేవులపల్లి కృష్ణశాస్త్రి
"జయ మహాంధ్ర జనయిత్రీ
జయ ప్రియాంధ్ర జనయిత్రీ"

అంటూ అందరి కలలు పండుతాయని దీవించారు.తెలంగాణ, కళింగాణ, కోస్తా, రాయలసీమ కలిసిన విశాలాంధ్ర గృహంలో తెలుగు తల్లికి మంగళ హారతులు వెలగాలని ఈ కవి కోరారు.

తెలుగు మట్టిలో గల మహత్తర శక్తిని, ప్రేమానురక్తిని, భక్తిని, అంకిత భావాన్ని జంపన చంద్రశేఖరరావు గారు

"తెలుగు తల్లి పాలలో కలదు భక్తి"

అని ఆంధ్రుడిగా పుట్టడమే ఎంతో అదృష్టమని వర్ణిస్తారు.

"వీర సంతతి మేము – వీర రక్తము మాది
మేటి జాతయినను – సాటి రాదోయి యే!

అన్న ఆచార్య నాయని కృష్ణకుమారి గారి కవిత సాటిలేని తెలుగు మేటి వీరత్వం కళ్ళకు కడుతుంది.

కొండేపూడి లక్ష్మీనారాయణ గారి 'పాదరా ఓ తెలుగు వాడా' అనే గీతం, తరువాత ఎంతో ప్రజాదరణ పొందిన మరో గేయం వేములపల్లి శ్రీకృష్ణ శాస్త్రిగారి 'చెయ్యెత్తి జై కొట్టు తెలుగోడా' అంటూ సాగిన ఈ గేయాన్ని పల్లెపట్టుల్లో కూడ వీరావేశంతో పాడుకుంటూ ఆంధ్రోద్యమాన్ని ముందుకు నడిపారు.

ఆంధ్రోద్యమ కాలంలో ప్రసిద్ధి చెందిన మరో గేయం పులుపుల వెంకట శివయ్య గారిది.

'వెనక తరముల వారి వీర చరితల సిరులు
నార్వోసి త్యాగంపు నీర్వెట్టి పెంచరా
విరిసి సుఖములు పండురా పలనాడు
వెలలేని మాగాణిరా!"

కాంగ్రెస్ వారి, బెజవాడ రాజగోపాలరెడ్డి గారి ప్రోత్సాహంతో పైడిపాటి సుబ్బరాయశాస్త్రి 'త్రిలింగమంటే మనదేనోయ్' అనే పాటను రాశారు.

"త్రిలింగ దేశం మనదేనోయ్
తెలుంగులంటే మనమేనోయ్"

అంటూ సాగిన ఈ కవితలో పండిత రాయల్నీ, ఖడ్గ తిక్కననూ, మల్లినాథ సూరినీ, గణపతి దేవుణ్ణీ స్మరణకు తెస్తాడు కవి. ఒకప్పుడు ఆంధ్రదేశంలో రత్నాలు రాసులు పోసి అమ్మేవారనే విషయాన్ని కూడ గుర్తు చేస్తారు.

నిజాం రాష్ట్ర ఆంధ్ర మహాసభ ఆవిర్భవించి సభలద్వారా నాయకులు ప్రజల్ని చైతన్య వంతుల్ని చేస్తుంటే మరోవైపు కవులు కూడ ఈ ఉద్యమానికి కవితా బలం అందించారు. దాశరథి గారి గేయ సౌందర్యాన్ని దర్శించుదాం.

"కోటి తెలుగుల బంగారు కొండ క్రింద
పరచుకొన్నట్టి సరసు లోపల వసించి
ప్రొద్దు ప్రొద్దున అందాల పూలు పూయు
నా తెంగాణ తల్లి కంజాతవల్లి"

కవిలో మెదిలే కవితల తలపులు హృదయద్వారాలు తెరిపిస్తాయి. కోటిమంది ఆంధ్రులు నివసించే తెలంగాణ భూమిని బంగారు భూమిగా, రమణీయ సౌందర్యసీమగా కవి వర్ణించి మూగవోయిన కటి తమ్ముళ్ళ గొంతులను పలికిస్తానంటాడు. చైతన్యరహిత సమాజానికి చైతన్య బలాన్నిచ్చే వారిలో కవి కూడ ఒకరని గుర్తుచేస్తారు దాశరథి.

ఆంధ్రరాష్ట్ర సిద్ధికై అసువులు అర్పించినట్టి అమరజీవి పొట్టి శ్రీరాములు ప్రాణత్యాగం తెలుగు కవులను తట్టి లేపింది. ప్రపంచ చరిత్రలో అరుదైనది ఈ తెలుగు బిడ్డ అత్మత్యాగం. దీనితో తెలుగు గడ్డ ధర్మవీరానికి జీవగడ్డ అని రుజువు చేసుకుంది.

1952లోనే 'ఆంధ్రరాష్ట్ర గీతా రత్నములు' అనే పుస్తకాన్ని రాసిన అనపోతు లక్ష్మణరావు పొట్టి శ్రీరాములు మహాత్యాగ నిరతిచే రేకెత్తిన ఆవేశాన్ని జోహారు జోహారు ఓ ఆంధ్ర వీరా అని పొందుపరిచారు.

"ఈ ఫస్టోబరు శుభవేళ
నిన్నటి మన స్వరూపం స్మరించి
నేటి మన స్వభావం గ్రహించి
రేపటి మన సమాజం కోసం
కలసి మెలసి శ్రమించుదాం"

అంటూ పూర్వ వైభవాన్ని గుర్తు చేస్తూనే ప్రస్తుత సామాజిక అనారోగ్యాన్ని ఎత్తిచూపుతారు శ్రీశ్రీ. "నా నిఘా ఎప్పుడూ భవిష్యత్తు మీదే ఉంటుంది" అంటారు శ్రీశ్రీ.

ఆంధ్రరాష్ట్రావతరణ సందర్భంలో జాషువా నవ్యాంధ్ర రాష్ట్ర రమణిని కొన్ని కోరికలు కోరుకుంటారు.

"సంగమింపగ రాదు జలధియందొక చుక్క
దివ్యాంధ్ర మధుర నదీ జలాలు
జారిపోరాదు సస్యశ్యామలముగాక
దేశాన కడకు బెత్తెడు పొలంబు"

అంటూ ఆంధ్ర నదీ జలాలు సముద్రంలో కలవకుండ ఆనకట్టలు నిర్మించాలని, దేశంలోని భూముల్ని వ్యవసాయ యోగ్యంచేసి సస్యశ్యామలం చేయాలని రాష్ట్రాభివృద్ధిని కాంక్షిస్తూ సూచనలిస్తారు.

కనుపర్తి వరలక్ష్మమ్మ గారు
"తమరె తమ యింటి పెద్దలై తనరు కతన
అందరొక మాట మీదనింపొంద నిలిచి
స్వీయ రాష్ట్రంబు నభివృద్ధి సేయవలయు
నాంధ్ర పుత్ర పుత్రిక లిక నహరహంబు"

ప్రజాకవి కాళోజీ 'ఏమానందము ఏమానందము' అంటూ పేద ప్రజల పక్షాన ప్రజాసమస్యల్ని ప్రజల భాషలో గేయకవితా రూపంలో అందించారు.

"తొలికోడి కూసింది – తెలుగు వాకిళ్ళలో
తెఱిచి చూసింది – తెలుగు కన్నియ తలుపు!

అంటూ ఆంధ్రప్రదేశ్ అవతరణాన్ని చిమ్మచీకటిని శిధిలం చేసి తూర్పు వాకిట పొడచిన పొద్దు పొడుపుగా అభివర్ణిస్తారు.

'అదో నవంబరు ఒకటి, నవాంబరమ్ము
దాల్చి, ఆంధ్రావనీ మాత, తక్కినట్టి
కోటి కొమరుల నొడిజేర్చ కొంగుజాపి
భాగ్యనగరికి విచ్చేసి భాగ్యమనుచు'

అనివానమామలై వరదాచార్యులు తెలంగాణాలోని తక్కిన కోటిమంది బిడ్డల్ని కూడ ఒడిని చేర్చుకోడానికిఆంధ్రమాత కొంగుచాపి భాగ్యనగరానికి వచ్చిందని రసవత్తరంగా వర్ణించారు.

దాశరథి ఆంధ్రప్రదేశ్‌ను 'మహేంద్రోదయం' గా అభివర్ణించడమేగాక అవతరణను తెల్లవారుటతో పోల్చారు. తెలుగు ఊరులు, తెలుగు వారలతో నిండిన కావ్యాలు ఆవిర్భవించాలని ఆశించారు.

తొలినాళ్ళలో ఆంధ్ర రాజధాని కర్నూలు పట్టణం కావడంచేత అక్కడ తుంగభద్రా నది ప్రవహించడంచేత ఆ నదిలో కాళ్ళు కడుగుకొని ఆంధ్రరాష్ట్ర పీఠమధిరోహించమని తెలుగు తల్లిని జంధ్యాల పాపయ్య శాస్త్రి అభ్యర్థిస్తారు.

"రాష్ట్ర సిద్ధి కొరకు రక్తమ్ము కార్చిన
కవిని నేను గాంధి కవిని నేను
బడలి బడలి తల్లి బాస కూడెము సేయు
కవిని నేను దేశ కవిని నేను."

అన్న తుమ్మల జాతి శ్రేయస్సు కొరకు ప్రాణాలర్పించి ధన్యజీవియైన పొట్టి శ్రీరాముల త్యాగనిరతి నిట్లు అభివర్ణించారు.

ఆంధ్రరాష్ట్రావతరణకు కారకుడైన పొట్టి శ్రీరాములును కరుణశ్రీ 'శుభోదయము' ఖండికలో ప్రస్తుతించారు.

"సాగిలి మ్రొక్కరా తెలుగు జాతికి భాగ్యవిధాతయౌ మహా
త్యాగికి అర్ధనూట పదహారులు జీవిత సుప్రభాతముల్
యుగ హవిస్సుగా పలికె; ఆయన తపస్సులోన 'శ్రీ
బాగు ఫలించెరా' తెలుగు బాగుకు మూలము పొట్టి బాబురా"

ఈ విధంగా ఆంధ్ర రాష్ట్రోద్యమం అటు తెలుగు కవులకు ప్రేరణ నివ్వడమే గాక అటు ప్రజలను కూడ కర్తవ్యోన్ముఖులను గావించింది. ●

## పరిపూర్ణ మహిళ

రచన : శ్రీమతి కె. వసంత ప్రకాష్

నేను పసిపాపనై ఆకలికి ఏడ్చినపుడు
అమ్మ నా కన్నీటిని తుడిచి గోరు ముద్దలతో
బుడి బుడి నడకల, అడుగులు తడబడి
జారి మెట్లపై దొర్లిపడి రక్తం చిందిన
మోకాలు చూచి అమ్మ మనసు గిలగిల లాడి
నాన్నకు నన్నందిస్తే మోకాలి దెబ్బ లే?
అప్యాయంగా భుజాన వేసుకొని వీపు నిమురుతూ
చిట్టి తల్లీ ఈ చిన్న దెబ్బలే కాదు,
జీవితంలో మరెన్నో దెబ్బలు తట్టుకునే
ఆత్మస్థైర్యం, మనో నిబ్బరం రంగరించి పోశాను
నీకు విద్యాబుద్ధులే భవిష్యత్తుకు పునాది
జీవితం అంటే ప్లస్, మైనస్ లే కాదు.
అన్నీ ప్లస్‌లే కాదు మైనస్‌లు కూడా వుంటాయి
అలా జీవితంలో ఒడిదుడుకులను వివరిస్తూ
ధైర్యాన్ని రంగరించి పోశాడు
అప్పుడూ, ఇప్పుడూ సంఘాన్ని చదువుతున్నా
డాక్టరేటు కోసం కాదు సుమండీ
ఆత్మ విశ్వాసం, మనోబలం ఆభరణాలుగా
'ఆశ' అనే విలువల వలువలని ధరించా
పరిణతకే మారు పేరు నేను సంపూర్ణ మహిళను
అగ్గిపుల్ల వెలుగునిస్తూంది, దుర్వినియోగం చేస్తే ప్రాణాల్ని హరిస్తుంది
మహిళా! వెలుగునే కోరుకో, ప్రాణం తీసే అగ్గిపుల్ల కాకు
నీ జీవితమే నందననం, ఆనందమయమవుతుంది.

# ఆంధ్రప్రదేశ్ విశిష్టత

- పన్యారం సాంబశివరావు

ఆంధ్రప్రదేశ్‌కు చెందిన రుద్రమదేవి భారతదేశ ప్రప్రథమ మహారాజ్ఞి. ఆంధ్రప్రదేశ్ భారతదేశ ప్రప్రథమ భాష ప్రయుక్త రాష్ట్రం. ఉపగ్రహప్రయోగంలో, మూడంచెల పంచాయితీరాజ్ అమలులో, తెలుగు చలనచిత్రం 'తిలదానం'కు అంతర్జాతీయ అవార్డులో ఇలా ఆంధ్రులన్నిట్లా ప్రథములై అగ్రగాములై దేశమేలిన ఘనులు. అమరజీవి, ఆంధ్రకేసరి, కందుకూరి, గురజాడ, గుఱ్ఱం, గిడుగు, శంకరంబాడిలు తెలుగు తల్లి ముద్దుబిడ్డలు. కాకతీయ, విజయనగరం, బొబ్బిలి, పల్నాటి, కొండవీటి, వేగినాటి తెలుగు తల్లి వీరపుత్రులు. అపార ఖనిజ సంపదతో సుందర నందనవన ప్రదేశాలతో ఆంధ్రప్రదేశ్ అలరారుతోంది. జ్ఞానానికి కల్పవల్లి మన తెలుగు తల్లి. తెలుగు తేజం విశ్వవ్యాప్తమైనదీ వెలుగు నిజం.

తెలుగు భాషా దినోత్సవాలు:- మాతృదేవత, మాతృదేశం, మాతృభాష సర్వదా వందనీయాలు.

ఫిబ్రవరి 21 - అంతర్జాతీయ మాతృభాషా దినోత్సవం.

ఆగష్టు 29 - తెలుగు భాషా దినోత్సవం - గిడుగు జయంతి.

సెప్టెంబర్ 9 - తెలంగాణా భాషా దినోత్సవం - కాళోజీ జయంతి.

**మూడు ప్రాంతాల ముచ్చట్లు:-** కోస్తా ఆంధ్ర ప్రాంతం - అన్నపూర్ణగా, రాయలసీమ ప్రాంతం - రతనాల సీమగా, తెలంగాణా ప్రాంతం - కోటి రతనాల వీణగా ఖ్యాతిగాంచాయి. ఈ మూడు ప్రాంతాలు తెలుగు తల్లి (ఆంధ్రప్రదేశ్) ముద్దుబిడ్డలు. కనుక ఆంధ్రప్రదేశ్‌లోని ఈ మూడు ప్రాంతాలు ఇలాగే ఏకమై కలిసి ఉంటేనే చూడ ముచ్చటగా ఉంటుంది. ముక్క చెక్కలై ఆ బంధం విడిపోతే ముచ్చెమటలే. ప్రాంతీయ, ఆర్థిక, ఉద్యోగ కోటాలు, పంపిణీ వాటాలు, ప్రత్యేక ప్యాకేజీలు తదితర అంశాలలోని పెక్కు అనుమానాలను అసమానతలను అవగాహనా లోపాలను అపోహలను తొలగించుటకై మూకుమ్మడిగా ఈ మూడు ప్రాంతాల నాయకులు లేనిపోని భేషజాలకు పంతాలకు పట్టింపులకు పోక అన్ని అంశాలపై నిష్కల్మషంగా నిర్మొహమాటంగా నిస్సంకోచంగా కూలంకషంగా ముచ్చటించుకొని ఏకాభిప్రాయంతో ఒక అవగాహనకు వచ్చి ముసాయిదా రూపొందించుకొని తదనుగుణంగా ఒప్పందాలకు ఆమోదముద్ర వేసి చట్టబద్ధత కల్పించి ఉమ్మడి ప్రణాళిక అమలుకై చిత్తశుద్ధితో కట్టుబడ కలసి కట్టుగా కృషి చేయడంలో సఫలీకృతులు కావాలి. అలా జరుగుటకై మూడు ప్రాంతాల విభజనను, ప్రత్యేక రాష్ట్ర నినాదాన్ని నిరసిద్దాం. ఆంధ్రప్రదేశ్‌లోని ఈ మూడు ప్రాంతాల పురోభివృద్ధికై ప్రగతిబాటలోనే పయనిద్దాం. అప్పుడు ఆంధ్రప్రదేశ్ ఋణాంధ్రప్రదేశ్‌గా కాక భారతదేశానికే అగ్రగామిగా తలమానికంగా జలయజ్ఞం ఋణాలమాఫీ వంటి పలు సంక్షేమ పథకాలతో సమైక్యాంధ్రతో స్వర్ణాంధ్ర హరితాంధ్రప్రదేశ్ విశానికే మన ఆంధ్రప్రదేశ్ ఆదర్శప్రదేశ్. ●

---

# మాతృభాష శ్రీ హిమంగళం

- యసి. దామోదరరావు

మనభాష యెలాంటిదంటే-

కం: తెనుగును మించిన మధురిమ
కనలేమీ జగతియందు కలియుగమందున్
తెలుగుకు తేనెను పూసిన
ఘనులారా బ్రహ్మరాణి! కచ్ఛపిపాణీ!

అలనాటి తెనుగు భాష ఔన్నత్యము-

చం: తులనములేని మాధురిలో దుగ్దము చక్కెర తేనె తీపితో
పలుకుల పాయసమ్మనెడు పద్యసుధార సధార పంచగా
చలపతి కోడలా రమణి శారదా మాతయే మెచ్చినట్టి మా
తెలుగున పద్య మల్లుటయే దీటగు మార్గము భాషలన్నిటన్

ఉ: నన్నయ విశ్వనాధ రసనాగ్రములందున ననాట్యమాడితా
మన్నన పొందె మా తెనుగు మాత మహీక్షితు పూజ్య విశ్వమే
అన్నువు పొందె మాధురికి అంబస రస్వతనుంగు పుత్రిగా
వన్నెలు చిందె నీ ప్రతిభ వందనమమ్మ శతమ్ము నీకివే.

మరినేడు-

మత్తకోకిల: అమ్మ బాసకు పుట్టినింటనె అంటి అంటని భావమా
"మమ్మిడాడిల" దాగడి ధాటికి మాతృభాషకృషించగా
కమ్మనైనది మాతృభాషని కన్నతల్లిగ చూడగా
ముమ్మరమ్ముగ సంబరమ్ములు మూడు రాత్రులపండుగ

అందుకే-

ఉ: స్వాగత పుష్ప మాలికలు స్వాగత తోరణ భూషణాలతో
వాగధి దేవతార్చనతో వాగ్మివంతుల భాషణాలతో
యాగపు దీక్షతో మరియు రాజసమొప్పెడు రీతినేడిటన్
సాగును సద్విమర్శలును చర్చలు గోష్ఠులు భాష పుష్టికై.

ఆశిద్దాము-

కం: తెలుగును మరచిన జాతికి
వెలుగులు మృగ్యమ్మంటుచు విజ్ఞాపించున్
పలుప్రతిపాదనములతో
"తెలుగు రచయిత సభలు" గతి నొసగుననుచున్.

రండి స్వాగతిద్దాము మనస్ఫూర్తిగా-

కం: స్వాగతము తెలుగు భాషకు
స్వాగతము ప్రతినిదులకు రసాస్వాదులకున్
స్వాగతమభిమానుకును
స్వాగత మీ గద్దబిద్ద సంబరములకున్
"ద్వితీయ ప్రపంచ తెలుగు రచయితల సభలు"
నిర్విఘ్నముగా సాగాలని, తెలుగు భాషాపురా
ప్రాభవమునకు పునాదిగా భావిస్తాయని ఆశిస్తూ

# అమెరికాలో తెలుగు సంఘాలు తెలుగు భాష (గత స్మృతులు)

- కాలనాథభట్ట వీరభద్రశాస్త్రి

1986 జూన్ నెలలో నేను నా భార్య అమెరికా హ్యూస్టన్ రాష్ట్రానికి వచ్చాం. అమెరికా రావడమే అదృష్టంగా భావించేమాకు, ఇక్కడ తెలుగు సంఘాలు వున్నాయని తరచూ ఏవో కార్యక్రమాలు నిర్వహిస్తారని, తెలుగు భాషాభివృద్ధికి ఇతోధికసేవ చేస్తున్నారని విని ఉప్పొంగిపోయాం. 1986 దీపావళికి ఏర్పాటయిన కార్యక్రమానికి తొలిసారి హాజరయ్యాం. అయ్యారే! ఎక్కడచూసిన తెలుగుతనం వుట్టిపడుతోంది. పట్టుచీరల ఫెళపెళలూ, లంగా వోణీల తళుకులు, లాల్చీ పైజామాల హుందాతనం.....ఓహ్ తెలుగు గడ్డమీదకాని వున్నామా అనిపించింది. పసందైన ఆంధ్ర వంటకాల విందు, ఆప్యాయతతో కూడిన పలకరింపులు, ఆదరణలు ...బహుశా స్వదేశంలో స్వరాష్ట్రంలో కూడా ఇంత చక్కటి అనుభూతి కలుగలేదు. మధ్య మధ్య విరామ సమయంలో చిన్నపిల్లల ముద్దుమాటలతో పాటలు, శ్లోకాలు, పెద్దవారి హాస్య ప్రసంగాలు, కొంతమంది లలిత సంగీత గానం..... ఈ కార్యక్రమాలు విందులా పసందు చేసింది. అక్కడ వున్న ప్రవాసాంధ్రులలో మాతృభాష మీదవున్న మమకారం, ఆడపిల్లలకు కూడా తపన ఈ కార్యక్రమాలలో ప్రస్ఫుటించింది. ఇలా పిల్లలకు తర్ఫీదు ఇచ్చే స్కూళ్ళుకూడా వున్నాయని తెలిసింది. 1986 అక్టోబర్‌లో చికాగో వెళ్ళినప్పుడు అక్కడ శ్రీమతి లక్ష్మీ అనే ఆవిడ కర్ణాటక సంగీత పాఠశాల నడుపుతుందని విన్నాను. 1987 ఫిబ్రవరిలో శాన్‌ఫ్రాన్సిస్కో మా తమ్ముడు ఇంటికి వెళ్ళి ఒక నెల వున్నాము. అక్కడ కూడా బాట అంటే బే ఏరియా తెలుగు అసోసియేషన్ వుంది. వారుకూడా పండుగలకు పబ్బాలకు తెలుగు కార్యక్రమాలు నిర్వహిస్తూవుంటారని విన్నాను.

తిరిగి హ్యూస్టన్ వచ్చాక ఉగాది కార్యక్రమం జరిగింది. ఈ సారి మామూలువాటితో బాటు నేను రచించిన ఓ నా మంచి దేవుడా అనే నాటికను ప్రదర్శించాము. సాధారణంగా హాస్యపూరితమైన ప్రదర్శనలకే ఎక్కువ మొగ్గు చూపుతారు. ఇంతేగాక మధురవాణి అని పత్రిక కూడ స్థానికుల రచనలతో ప్రచురించేవారు. హ్యూస్టన్ తెలుగు సంఘంవారు నిర్వహించిన అతిముఖ్యమైన కార్యక్రమం 1989 జూలై నెలలో సప్తమ తానా మహాసభలు... ఈసభల నిమిత్తం మన దేశం నుంచి కవులను, పండితులను, కళాకారులను ఆహ్వానించారు. రెండు రోజులపాటు హ్యూస్టన్ యూనివర్సిటీ క్యాంపస్‌లో మహావైభవంగా జరిగింది. పద్మశ్రీ యార్లగడ్డ లక్ష్మీప్రసాద్ ఆనాటి తానా సప్తమ మహాసభలకు ఏదో ఒక పత్రిక తరుపున ప్రతినిధిగా హాజరయినట్లుగుర్తు. ఆ మహాసబల సందర్భంగా ప్రచురించిన ప్రత్యేక సంచిక మధురవాణికి నేను సంపాదకత్వం వహించే భాగ్యం కలిగింది. ఈ మహాసభలలో ముఖ్యంగా చెప్పుకోతగింది తిరుపతి అన్నమాచార్య ప్రాజెక్టు డైరెక్టర్ డాక్టర్ మేడసాని మోహన్ చౌదరిగారి అష్టావధానం, పృచ్ఛకులుగా కొంతమంది ఇండియా నుండి వచ్చినవారున్నా, అతిక్లిష్టమైన నిషిద్ధాక్షరి పృచ్ఛకులుగా అమెరికా వాస్తవ్యులు డా.జగదీష్‌గారు. అవధాని కవితా ప్రవాహంలో ప్రతి అక్షరానికి తరువాత చెప్పబోయే అక్షరాన్ని వూహించి నిషేదించేవారు. వారెవా! నిజంగా కమనీయ దృశ్యమే. ఈ అవధాన ప్రక్రియ అమెరికాలో జరగడం ఇదే తొలిసారి. 1990 జూన్ లో మేము ఇండియా వెళ్ళిపోయాం. క్రమేపి విదేశాలలో పలు ప్రాంతాలలో తెలుగు సంఘాలు చాలాల నెలకొల్పబడ్డాయి. కొంతమందైతే అనేక సామాజిక సేవా కార్యక్రమాలలో తమవంతు సాయంకూడా అందజేయడం జరుగుతూవుంది. ముఖ్యంగా చెప్పుకోతగ్గది లయన్సు వారితో కలిసి తానావారు నేత్ర వైద్యంలో ఎంతోమందికి నేత్రాలు తెప్పించిన సంఘటనలు కూడావున్నాయి. 1994 నుంచి అనుకుంటా అప్పాజోశ్యుల విష్ణుభొట్ల ఫౌండేషన్‌వారు ఇండియా వచ్చి ప్రతి సంవత్సరం రకరకాల ప్రక్రియలలో పోటీలు నిర్వహించి ప్రతిభామూర్తి అనే పురస్కారం పేరుతో ఒకరిని యాభైవేల రూపాయల నగదుతో సత్కరిస్తున్నారని విన్నాను.

1994 అక్టోబర్‌లో విజయవాడలో జరిగిన అఖిలభారత తెలుగు రచయితల సమ్మేళనంలో డాక్టర్ వంగూరి చిట్టెన్‌రాజు తమ ఫౌండేషన్ పేరుతో ఒక సంస్థను నెలకొల్పి ఔత్సాహిక రచయితల రచనలను ప్రచురిస్తామని, అలాగే తెలుగు భాషాభివృద్ధికి తమ సంస్థద్వారా పాటుపడతామని వక్కాణించారు. అన్నట్లుగానే కొన్ని కథా, కవితాసంకలనాలను ప్రచురించారు. మళ్ళీ మేము 12 సంవత్సరాల తరువాత 2002లో అమెరికా ఆస్టిన్ నగరానికి వచ్చాము. అప్పటికే ఆస్టిన్ నగరంలో రచయితల, కవుల పేర్లు ఇండియాలో ప్రచురణ అయ్యేపత్రికలలో కనపడసాగాయి. ఆస్టిన్ నగరం తెలుగు కవులకు కాణాచి, కథలకు గ్రంథాలయం. మేము వచ్చిన కొత్తలోనే 2003 సంవత్సరం సంక్రాంతి సంబరాలు జరిగాయి. 1990 కి 2002 కి తేడా ప్రస్ఫుటంగా తెలుస్తుంది. పిల్లల దగ్గరినుంచి పెద్దల వరకూ నిపుణత పెరిగింది. 2003 మార్చి 15న టెక్సాసు తెలుగు సాహితీ సదస్సు జరిగింది. అది ఆస్టిన్ తెలుగు సంఘంవారు, వంగూరి ఫౌండేషన్‌వారు సంయుక్తంగా నిర్వమించిన ప్రత్యేక హాస్య సదస్సు. విషయం హాస్యరసం. వక్తలా స్వతహాగా హాస్యప్రియులు. ఆనాటి సదస్సులో స్థానిక రచయితలు, కవులు కవితాధారలు కురిపించారు. సభాప్రారంభానికి పూర్వమే తెలుగు రుచుల వంటకాలతో విందు. ఆతర్వాత పసందైన హాస్యరసపానం. ఉగాది కార్యక్రమాలలో యువకులు విజృంభించారు. నటనతోను, పాటలతోను, నృత్యంతోను తమకు తామేసాటి అనిపించేవిధంగా ప్రదర్శనలిచ్చారు. దరిమిలా సిలికానాంధ్ర సంఘంవారు హైదరాబాదులోని రచన మాసపత్రిక సంయుక్తంగా శ్రీ సిరివెన్నెల సీతారామశాస్త్రిగారు న్యాయనిర్ణేతగా గేయరచనపోటీలు నిర్వహించారు. యావత్ ప్రపంచం నుంచి అనేక గేయాలు వచ్చాయని వాటిలో కొన్నిటిని మాత్రమే ఎంపిక చేయడం జరిగిందని, కొన్ని 2003 అక్టోబర్ 4వ తేదీన జరిగిన సిలికానాంధ్ర మహోత్సవాలలో గాయకులు పాడారని విన్నాను. గత పది సంవత్సరాల నుంచి తెలుగులో వెబ్‌సైట్లు ఎన్నో వెలిసాయి. ఎందరో ఔత్సాహికులకు తమ రచనలను ఈ వెబ్‌సైట్లలో ప్రచురించుకొనే సౌలభ్యం కలుగజేయడం శ్లాఘనీయం. ఇలాంటి వాటిలో నాకు తెలిసినంత వరకు తెలుగు పీపుల్ డాట్ కామ్ ఆంధ్రఫోక్స్ డాట్ నెట్ ఇత్యాది వెబ్‌సైట్లు ఎన్నో వున్నాయి. ఇప్పుడు ప్రింట్ మీడియా కన్నా ఎలక్ట్రానిక్ మీడియాకే రానురాను ప్రాచుర్యం కలుగుతోందని భావిస్తున్నాను. మరొక విశేషం ప్రవాసాంధ్రుల కృషిఫలితంగా తెలుగు సంస్కృతి గిన్నీస్‌బుక్‌లో కూడా స్థానం పొందింది. ఇందుకు ఆద్యుడు శ్రీ కూచిబొట్ల ఆనంద్ ఎందరో ప్రవాసాంధ్రప్రముఖులు వున్నారు. ఎన్నో తెలుగు సంఘాలు వున్నాయి. కాకపోతే నాకు పరిచయమైన సంఘాలలో కొంతవరకే వుదహరించగలిగాను. అన్ని ప్రస్తుతింపలేకపోయాను. ●

# శ్రీ కృష్ణదేవరాయల విజయ పరంపరలకు శ్రీకారంచుట్టిన "దోని యుద్ధం"

- చొక్కపు నారాయణస్వామి

శ్రీకృష్ణదేవరాయల పట్టాభిషేక మహోత్సవాలు శుక్ల సంవత్సరం శ్రీ జయంతి రోజున అత్యంత వైభవంగా జరిగినట్లుంది. ఈ జయంతి 1509 లో ఆగష్టు 8 రోజులకు సరిపోతుంది. ఈ మహోత్సవాల సందర్భంగా రాజధాని నగరం శోభయమానంగా తీర్చిదిద్దినారు. రాయల బంధు, బలగాలు, మండలాధిపతులు, దండ నాయకులు, అమర నాయకులు, ప్రాంతీయ దొరలు, బహువిధ కానుకలు తీసుకొని తరలివచ్చినారు. కవులు, పండితులు, అవధానులు, గాయకులు, కళాకారులు అత్యంత ఉత్సాహంతో రాజధాని చేరుకున్నారు. నాగరికులు, జానపదులు గుంపులు గుంపుగా వచ్చినారు. విజయనగర రాజధాని నగరం అతిధులతో కిటకిటలాడుతుంది.

ఈ మహోత్సవాలకు మహా సముద్రాల నుండి, మహా నదుల నుండి పవిత్ర జలమును బంగారు కలశాలతో శాస్త్ర సమ్మతంగా తెప్పించారు. అష్టాదశ వాద్య ఘోషణనల రవళిలో శుభయోగ శుభలగ్న శుభ ముహూర్తంలో వేదపండితులు పురోహితులు మంత్రోక్తంగా రాయలకు అభిషేకం చేశారు.

మంగళ స్నానానంతరం దివ్యాంబర దివ్యాభరణాలతో అలంకరించి కళ్యాణ వేదికయందు బంగారు పీఠముపై కూర్చుండ జేసారు. షోడశ ధానాలు సహస్ర గోధానలు చేయించారు. ఈ తతంగాలు ముగియగానే రాయలకు వజ్రకిరీట ధారణ అపరచాణుక్యుడయిన మహా ప్రధాని తిమ్మరుసు ఆశీస్సులతో వైభవోపేతంగా జరిగింది. ఈ వైభవాన్ని కన్నులారాగాంచిన కవులు గాయకులు సంతోషభరితులై రాయల కీర్తిని వేనోళ్ళ గానం చేసినారు. దేశం నలుమూలల నుండి వచ్చిన జానపదులు, కళాకారులు భారతీయ సంస్కృతికి అద్దంపట్టే సాస్కృతిక ప్రదర్శనలతో దర్శకులను అలరింపజేశారు.

రాజనగరులోను, సామ్రాజ్యం దేవాలయాలలోను విశేష పూజలు జరిపించారు. మృష్టాన్న భోజనాలతోపాటు భూరిదానాలు జేయించారు. పట్టాబిషేక మహోత్సవాలలో పాల్గొన్నవారికి, తిలకించ వచ్చిన వారలకు అతిధిమర్యాదలను ఘనంగాజేసారు. ఈ సంబరాలు ఒకటి రెండు రోజుల్లో ముగియలేదు. అవి నెలలకొద్ది కడువేడుకగా కొనసాగాయి. ఒకవిధమగు తన్మయత్వం నెలకొంది. అయితే చారులు నిద్రపోతున్న భల్లూకంలా ఒక కన్నుతెలరచుకొని శత్రువుల ఆలోచనలను, కదలికలను పసిగట్టుతున్నారు. వారు ఎప్పటికప్పుడు మహాప్రధానికి నివేదిస్తున్నారు. వీటిన్నింటిని బేరీజు వేస్తే విజయనగర రాజకీయ వాతావరణం నివురుగప్పిన నిప్పులా లోలోన రగులుతూ వుంది.

ఒకవైపు సవతి సోదరులు అంతర్గత కుట్రలు, మరోవైపు కళింగుల రాజ్య విస్తరణ కాంక్ష ఇంకో వైపు ఉమ్మెత్తూరు, శ్రీరంగ పట్టణపాలకుల తిరుగుబాటు, అంతకుమించి దక్కన్ సుల్తానుల జిహాద్ ప్రకటన. ఈ ఉపద్రవాలను అధిగమించడానికి మహాప్రధాని రాయలకు నివేదించారు. సాహసవంతుడు, ప్రతిభావంతుడు, రాజకీయచతురుడ, సమయస్ఫూర్తిగల రాయలు మంత్రితో మండలి ఆలోచనలు, సమాలోచనలు జరిపి, ఒక కార్యచరణను రూపొందించారు. యుక్తి, శక్తి, కార్యదీక్షలతో కదం కదిలించారు.

ప్రధమంగా సవతి సోదరులను విజయనగరము నుండి రహస్యం చంద్రగిరికి తరలించి అక్కడ వారిని బంధీలుగా జేశారు.

'జిహాద్' ప్రకటన ప్రకటించిన బహమనీ సుల్తాను మహ్మూద్ షా (1482-1518) అహ్మద్‌నగర్, బిరారు, గోల్కొండ, బీజాపూర్ సుల్తానులను కూడగట్టుకొని ప్రజండ సైన్యంతో విజయనగర సేనలమీదకి దూసుకువస్తున్నాడు. ఈ వార్త అందగానే రాయలు చతురంగ బలగంబులతో శరవేగమున దూసుకు పోయాడు. ఇరు సేనలు "దోని" దగ్గర 'డీ' కొన్నాయి. యుద్ధం భీకరంగా జరిగింది. బహమనీ సుల్తాను గాయాలపాలై గుర్రం మీదనుండి కూలిపోయినాడు. గుర్రపు గిట్టలకింద చితికిపోయే సమయంలో ఒక సిపాయిచే రక్షింపబడ్డాడు.

ఈ సంఘటనతో దక్కనీ సుల్తానులు, వారి సైన్యం వెన్నుచూపి కాలికి బుద్దిచెప్పి బీదరువైపు పరుగులు తీవారు. రాయల సైన్యం వారిని వెంటాడింది. గోల్కొండ రాజ్యంలోని కోవిలకొండ గిరిదుర్గం చేరగానే బీజాపూర్ సుల్తాను యూసప్ ఆదిల్‌ఖాను సైన్యాన్ని కూడగట్టుకొని ఎదురుతిరిగాడు. మళ్లీ భీకరయుద్ధమే జరిగింది. ఈ యుద్ధంలో సుల్తానుల సైన్యంలో చాలాభాగం విజయనగర సైనికుల కరవాలాలకు ఎరఅయ్యారు. రాయల కత్తికి యూసప్ ఆదిల్‌ఖాన్ తల ఎగిరి పోయింది. కోవిలకొండ గిరిదుర్గం రాయలకు స్వాధీనం అయ్యింది. ఆ తరువాత రాయలు చెల్లాచెదురుగా పడివున్న సైనికుల శవాలను ఒక పెద్దగోతిలో సమాధి చేయించాడు.

శ్రీకృష్ణదేవరాయలు అఖండ విజయముతో రాజధాని చేరుకున్నాడు. దోని సీమ రక్షణకై మా పూర్వీకులైన చొక్కపు వంశీయులను దండ నాయకునిగా నియమించారు. 1510 ప్రాంతంలో మా పూర్వీకుల స్వస్థలమైన విజయ నగరమును( హంపిని) వదిలి దోనా సీమకు వచ్చారు. ఈ యుద్ధం జనవరి 1510లో జరిగి ఉండవచ్చును. ఈ విధంగా 'దోని' యుద్ధమే శ్రీకృష్ణదేవరాయల పరంపరలకు శ్రీకారం చుట్టింది. ఈ 'దోని' రాయల జీవిత చరిత్రలో సువర్ణాక్షరాలతో లిఖింపదగింది. ●

## వానలో ఒకరోజు

- దివాకర్ల వెంకట అభిషేక్

తెల్లవారింది - తెలివివచ్చింది
తలుపు తీశాను - చల్లగా వేసింది
తల ఎత్తి చూశాను - నల్ల మేఘం ఉరిమింది
గాలి ఎక్కువయ్యింది - అమ్మ కేక వేసింది
వానజల్లు కురిసింది - వాకిట్లోకి వెళ్లాను.
చినుకులు పడ్డాయి - నాఒళ్లు తడిసింది.
సరదా వేసింది - గంతులు వేశాను
నాన్న చూశారు - నన్ను తిట్టారు
జడివానగా మారింది - బడికి తాళం వేశారు.
హుషారు హెచ్చింది - కరెంటు పోయింది.
చెట్లు వానలో తడిశాయి - ఆకుపచ్చగా మెరిశాయి.
పిట్టలు ఎక్కడో దాక్కున్నాయి - పిల్లలందరం ఆడేము

# మృతభాషల అంచున మాతృభాషాస్థితి

- డా॥ పి. వి. సుబ్బారావు

"నాన్నా! అమ్మ కొట్టిందినన్ను/ అన్నం తిననందుకు కాదు!

నాన్నా ! అమ్మ కొట్టిందినన్ను/ పాఠం చదవనందుకు కాదు!

నాన్నా ! అమ్మ కొట్టిందినన్ను/ అమ్మని అమ్మా! అని పిలిచినందుకు!"

ప్రపంచీకరణ ప్రభావంతో ఇటువంటి మమ్మీ, డాడీ సంస్కృతి విస్తరించింది. ఇంగ్లీషు కాన్వెంటు విద్యపట్ల మోజుపెరిగింది. తెలుగు మాధ్యమ పాఠశాలలపట్ల ఏహ్యభావం ఏర్పడింది. మమ్మీలు మమ్మీలని పిలవనందుకు పిల్లలను దండించే స్థితి దాపురించింది. కాన్వెంటు స్కూళ్ళలో తెలుగులో మాట్లాడినందుకు కఠినంగా శిక్షించి అవమానించే సంఘటనలు తెలుగుజాతి సిగ్గుతో తలవంచుకునే స్థితిలో ఉన్నాయి. అటువంటి విద్యాసంస్థలపై ప్రభుత్వం ఉదాసీనతతో వ్యవహరించడం గర్హనీయం.

కార్పోరేట్ కళాశాలల్లో ఇంటర్మీడియట్‌లో తెలుగు పాఠ్యాంశాన్ని అణగ ద్రొక్కి సంస్కృతాన్ని స్వైరవిహారం చేయిస్తున్నారు. ఈ కళాశాలల దౌష్ట్యాన్ని నియంత్రించే స్థితిలో ప్రభుత్వం లేకపోవడం శోచనీయం. ప్రభుత్వం డిగ్రీస్థాయిలో తెలుగు మాధ్యమాన్ని ప్రవేశపెట్టినప్పుడే (19010) సర్వీస్ కమీషన్ పరీక్షల్లో తెలుగు మాధ్యమ పట్టభద్రులకు 5 శాతం బోనస్ మార్కులు కలుపుతామన్న ప్రకటన ఆచరణసాధ్యం కాలేదు. ప్రపంచీకరణ ప్రభావం మమ్మీడాడీల సంస్కృతి విజృంభణ ప్రభుత్వ ఉదాసీనతలవల్ల తెలుగు భాషావ్యవహర్తల సంఖ్య గణనీమంగా తగ్గుతుందన్న వాస్తవాన్ని అంగీకరించవలసిందే. యునెస్కో గణాంకాలననుసరించి "ఏ భాషా వ్యవహర్తల సంఖ్య 30 శాతానికి ఆ భాష మృతభాషని వారి అంచనా". ఇప్పటికే 3వేల వరకు మృతభాషలుగా మారామని నిర్ధారించి మన వారిని హెచ్చరించారు. సానుకూల దృక్పదంఉన్న భాషావేత్తలు అంత ప్రమాదం లేదని తోసిపుచ్చినా ఉపేక్షాభావం వహిస్తే ప్రమాదం తప్పదు.

**భాషా పరిరక్షణకు సూచనలు:-** 1. ప్రభుత్వం కార్పోరేట్ విద్యాసంస్థలను కఠినంగా గుర్తింపు రద్దువంటి చర్యలతో హెచ్చరించి తెలుగు మాట్లాడేవారిని ప్రోత్సహించాలి.

2. కార్పోరేట్ కళాశాలల్లో ఇంటర్మీడియట్‌లో విధిగా తెలుగు మాతృభాషగా ఉన్నవారికి తెలుగు పాఠ్యాంశాన్ని బోధించేచర్యలు తీసుకోవాలి.

3. ప్రభుత్వం గతంలో డిగ్రీస్థాయిలో తెలుగు మాధ్యమంలో పట్టభద్రులకు ప్రకటించిన 5 శాతం బోనస్ మార్కులను సర్వీసు కమీషన్ ఉద్యోగాల్లో విధిగా అమలు చేయాలి.

4. అధికారభాషా సంఘాలను పటిష్టంగా ఏర్పాటుచేసి అవగాహనా సదస్సుల ద్వారా తెలుగు భాషా వికాసాన్ని పెంపొందించాలి. తెలుగుభాష ప్రాచీన ప్రతి పత్తిని తక్షణమే అమలుపరచి భాషాపరిశోధనల కృషిని ప్రోత్సహించాలి.

6. ప్రత్యేకించి తెలుగుభాష అమలుకు ఒక మంత్రిత్వశాఖను ప్రభుత్వం ఏర్పాటుచేసి తెలుగుభాషా పరిరక్షణకు గణనీయంగా కృషిచేయాలి. 7. పదవ తరగతి వరకు ప్రతి విధ్యార్ధి విధిగా తెలుగు చదివే విధంగా చట్టంచేయాలి.

8. ప్రాధమిక పాఠశాలల్లో అర్హులైన తెలుగు ఉపాధ్యాయులను నియమించి తెలుగు భాషాభివృద్ధికి కృషిచేయాలి.

9. రచయితల పుస్తక ప్రచురణకు ఎక్కువ నిధులు కేటాయించే విధిగా ప్రభుత్వమే గ్రంధాలయాలన్నింటిని కొనేఏర్పాటుచేయాలి.

10. ప్రతిభాషాభిమాని, భాషోద్యమ కార్యకర్త రచయితలు అవగాహనా సదస్సులద్వారా తెలుగుభాషా వికాసానికి కృషిచేయాలి.

పై సూచనలు పాటించి మధురమైన మన మాతృభాషకు మృతభాష కాకుండా పరిరక్షించుకొందాం.

## అక్షర ప్రణుతి

- చిమ్మపూడి శ్రీరామమూర్తి

వందనం అక్షర కిరణమా! –హరి
చందనం కవితా చరణమా!
శ్రీవాణీ సదనమా!
స్నిగ్ధరు చిరు వదనమా!
జ్ఞాన భావజాలధిరతనమా!.......
కవి తలలో మెరిసిన నవ కవితల సుగంధమా!
గురుబోధలలో వెలసిన విద్వత్మకరందమా!
మానవతా బంధమా! విశ్వంభరదెందమా!
అందాలకు అందమ! నాకందుమా! ......!!

నలువరాణి మాగాణిలో ధాన్యమా!
నరుని నాల్కనలరిన సౌజన్యమా!
జాతి జీవస్తన్యమా; జగతికి చైతన్యమా!
కవి లేఖని చేసుకున్న పుణ్యమా!.......!!

మోదువారు గుండెల కౌమోఘమా!
మోక్షదాతవౌ మోహనరాగమా!
శ్రుతిలయల సరాగమా! కృతి కుసుమపరాగమా!
విశ్వశాంతి రాగయాగమా!............!!

కవనవన సుమాలకు మధుమాసమా!
ప్రపంచ తెలుగు సభల ప్రభల హాసమా!
సత్కృతీ నివాసమా! సంస్కృతి సావాసమా
మాపవాళి దిక్కువు నీవే సుమా!.......!!
విరించి ప్రోక్త చతుర్వేదసారమా!
వినూత్నకళా సరసిజకాసారమా!
చదువుల శ్రీకారమా! పదవుల ప్రాకారమా!
విశ్వాత్మకమౌ ప్రణవాకారమా!............!!

రాతి గుండెలను మార్చిన మౌనమా!
రాలను కరింగించు సామగానమా!
మానవాళి ప్రాణమా! మహిమాన్వితనయనమా!
తమస్సుకే ఉషస్సునిడు స్వరప్రసూనమా!.......!!

# తెలుగు ఆటల్లో తన్నుడు బంతాట విశిష్టత (ఒక పరిశీలన)

- నడమల గంగాధరరెడ్డి

తెలుగు ఆటల్లో తన్నుడు బంతి ఆట ఒకక్రొత్త ఆట. ఆటలు ఆడిన మనం మన తన్నుడు బంతాటను అందరితో ఆడించడంద్వారా తెలుగువారికి ఆటల్లో ఆత్మగౌరవం తీసుకురాగలం. తెలుగు భాషకు ప్రపంచవ్యాప్తంగా ఎంతటి గౌరవం వుందో అంతే గౌరవమర్యాదలను తెలుగు ఆటకూడా సొంతం చేసుకునేందుకు ప్రతి తెలుగువారు పాటుపడాలి. పంతొమ్మిది కోట్ల తెలుగు ప్రజలు చేయిచేయి కలిపి తన్నుడు బంతి ఆడితే అంతర్జాతీయ అత్యున్నత క్రీడా వేధికైన ఒలింపిక్స్‌లో తన్నుడు బంతి పరుగులిడుతూ తెలుగువారి సత్తా ప్రపంచానికి చాటిచెబుతుంది.

**తెలుగు క్రీడా ఇతివృత్త నవల 'వాలంటైన్ చరిత్ర' లో తన్నుడు బంతాట**

తెలుగునాట నరహరి గోపాలకృష్ణ చెట్టిగారి రంగరాజు చరిత్రముతో ప్రారంభమైన నవల సాహిత్య ప్రక్రియ ఇటు తెలుగు సాహిత్యాన్ని, అటు పాఠకులను ఎంతగానో రంజింపజేసింది. ఇప్పటివరకు మన తెలుగు నవలాకారులు హాస్య, సామాజిక, చారిత్రక, మనోవైజ్ఞానిక, అపరాధ పరిశోధనవంటి అంశాలను ఇతివృత్తాలుగా స్వీకరించి మంచి నవలలు రచించారు. అయితే పాశ్చాత్య నవల రచయితలు మరొక్క అడుగు ముందుకువేసి అక్కడ ప్రజలు ఇష్టంగా ఆడే ఆటలను సైతం కథావస్తువులుగా స్వీకరించి అద్భుతమైన క్రీడా నవలలను రచించి ప్రజల అభిమానాన్ని చూరగొన్నారు. తెలుగులో క్రీడా నవల లేదనే లోటును తీరుస్తూ తొలిసారిగా 2008లో నడమల గంగాధరరెడ్డిగారు తాను రూపొందించిన తన్నుడు బంతాటనే ఇతివృత్తంగా తీసుకుని వాలెంటైన్ చరిత్ర అనే నవలను వెలువరించి పాఠకుల అభిమానాన్ని చూరగొన్నారు.

**తన్నుడు బంతి ఆట ఆడువిధానం**

తన్నుడు బంతాట క్రీడామైదానం 52మీటర్లుతో చతురస్రాకారంలో వుంటుంది. ఫీల్డ్ మధ్యలో వృత్తం వుంటుంది. చతురస్రాకారపు ఫీల్డ్‌లోని నాలుగు మూలల్లో మూలకు ఒకటిచొప్పున మొత్తం నాలుగు గోల్ ఏరియాలు వుంటాయి. 5వ సైజు నిమ్మపండు పసుపు రంగుగల బంతిని వాడుతారు.

తన్నుడు బంతాట పదియంది ఆటగాళ్ళుగల రెండు టీముల మధ్య జరుగుతుంది. మ్యాచ్‌నందు రెండు ఇన్నింగ్స్ వుంటాయి. ప్రతి టీమ్‌కు ఒక గోలింగ్ (తన్నుడు) ఇన్నింగ్స్ ఇస్తారు. ప్రతి ఇన్నింగ్స్ 40 నిమిషాల నిడివి కలిగి వుండును. ఇన్నింగ్స్ మధ్య 15 నిమిషాల వారామం వుంటుంది. స్టాప్ అండ్ గో ద్వారా సమయాన్ని లెక్కిస్తారు.

టాస్ నందు మొదటి ఇన్నింగ్స్‌లో తన్నుడును కోరుకున్న టీమ్ తమ నిర్ణీత సమయంలో ప్రత్యర్థులైన స్టాపర్స్‌ను ఛేదించి వీలైనన్ని గోల్స్ చేస్తుంది. అటు తరువాత రెండవ ఇన్నింగ్స్‌లో గోలింగ్‌కు దిగిన స్టాపర్స్‌టీమ్, మొదట గోలింగ్ చేసిన మొత్తం గోల్స్ కంటే ఒకటి ఎక్కువ చేస్తే గెలిచినట్లు లేకుంటే ఓడిపోయినట్లు ప్రకటిస్తారు.

ప్లే ఫీల్డ్‌లోని మధ్యలోగల వృత్తం నందు ప్రతిటీమ్ నుండి నలుగురు ఆటగాళ్ళు పాల్గొంటారు. వృత్తంలోని అటగాళ్ళు బాల్‌ను చేతులతో మాత్రమే పాస్ చేసుకుంటూ ఆడవలయును. వృత్తం బయటగల ఫీల్డ్‌లో ప్రతి టీము నుండి 6 మంది ఆటగాళ్ళు పాల్గొంటారు. ఇక్కడ బాల్‌ను కాళ్ళతో మాత్రమే ఆడవలయును. సర్కిల్ ప్లేయర్లు సర్కిల్‌లోనే, ఫీల్డ్‌లోని ప్లేయర్లు ఫీల్డ్‌లోనే వుంటూ ఆడవలయును.

అంపైర్ ఆటను ప్రారంభిస్తూ విజిల్ వేయగానే వృత్తం మధ్యలోగల స్టాపర్ త్రో అఫ్ చేయడంతో ఆట ప్రారంభమవుతుంది. వృత్తంలోని నలుగురు స్టాపర్స్ బంతిని వృత్తంలోపలనే ఆడుకుంటూ సమయాన్ని వృధాచేస్తూ వుంటారు. అదే సమయంలో వృత్తంలోని నలుగురు గోలర్స్ (త్రోయర్స్) బంతిని స్టాపర్స్ వద్దనుండి తీసుకుని వృత్తం బయటగల గోలర్స్‌కు పంపి గోల్స్ వేయుటకు ప్రయత్నిస్తుంటారు. వృత్తంలోని ఆటగాళ్ళు ఎవరైననూ బంతిని తమవద్ద 3 సెకన్ల కంటె ఎక్కువసేపు పట్టుకున్నా, అలాగే బంతిని పట్టుకుని మూడు అడుగులకంటే ఎక్కువ వేసినా ఇద్దరి మధ్యలోనే బాల్ పాస్ జరిగినా బంతినేలకు తగిలి ఫౌల్‌గా ప్రకటించబడును. కావున బంతిని తమ మధ్య చేతులతో పాస్ చేసుకుంటూ ఆడవలెను. స్టాపర్స్ తప్పుచేస్తే త్రోయర్స్‌కు బంతిని యిస్తారు. ఇప్పుడు త్రోయర్స్ బంతిని వృత్తం బయటకు పంపాలంటే వారిమధ్య కనీసం ఒక్కపాస్ అయినా జరిగివుండాలి. అలాగే త్రోయర్స్, స్టాపర్స్ నుండి బంతిని పొందినట్లయితే ఒక్కపాస్ అవసరం లేకుండానే సర్కిల్ బయటకు బంతిని పంపవచ్చు.

వృత్తం నుండి బయటకుచ్చిన బంతిని ఫీల్డ్‌లోగల 6 మంది గోలర్స్ టీమ్ ఎవరైనను క్యాచ్ పట్టుకుని 3 సెకన్లు లేదా 3 అడుగుల కంటే బంతిని కలికి మార్చుకుని ఆడవలయును. ఇక్కడ గోలర్స్ టీమ్‌లోని క్రీడాకారుడు ఒక్కడు మాత్రమే ఆడి గోల్ వేస్తే ట్రిబుల్ గోల్‌గాను, అలాగే గోలర్స్ టీమ్ క్రీడాకారులు మాత్రమే ఒక్కరి కంటే ఎక్కువమంది కలిసి గోల్ వేస్తే డబుల్ గోల్ గాను, ఒకవేళ ఫీల్డ్ స్టాపర్స్ (చెక్కర్స్) బాల్‌ను తాకిన తరువాత గోల్స్ టీమ్ కనుక గోల్ చేస్తే సింగిల్ గోల్‌గా పరిగణిస్తారు.

ఫీల్డ్‌లోని 6 గోలర్స్ బాల్‌ను ఆడే సమయంలో బాల్‌ను బౌండరీ లైనును దాటించినా లేదా మధ్యలోని వృత్తంలోనికి పంపినా ఫౌల్‌గా పరిగణించి వృత్తంలోని స్టాపర్స్‌కు బంతి ఇవ్వబడుతుంది. ఫీల్డ్‌లోని ఇద్దరు స్టాపర్స్ (చెక్కర్స్) బంతిని ఆడే సమయంలో బంతిని బౌండరీలైనును దాటించినా మరియు సర్కిల్ లోపలికి పంపినా ఫౌల్‌గా పరిగణించి గోలర్స్ టీమ్ వారికి ఎక్స్‌ట్రా గోల్‌గా ఇస్తారు. గోల్ పడినా లేదా పడకపోయినా ప్రతిసారి ఆట వృత్తంలోని స్టాపర్స్ నుండియే తిరిగి ప్రారంభమవుతుంది.

మ్యాచ్ ఫలితం టై అయినప్పుడు ప్రతి టీమ్‌కు నాలుగు గోల్డెన్ ఫోర్ ఫ్రీ కిక్స్ ఇచ్చి ఫలితాన్ని పొందాలి. ఆటను నియమాలకు అనుగుణంగా నిర్వహించేందుకు ఒక సర్కిల్ మరియు ఫీల్డ్ అంపైర్, ఒక స్కోరర్, మరియు నలుగురు లైన్ అంపైర్‌లు, ఒక రిఫరీ వుంటారు.

తన్నుడు బంతాట యొక్క మరింత సమాచారమునకై వెబ్‌సైట్ www.tannudubanti.webnode.com ను చూడగలరు. ●

# సాహిత్యంలో అభివ్యక్తమైన సంస్కృతి

- విశ్వనాథ సత్యనారాయణ

సంస్కృతి అనే పదం కొన్ని సందర్భాలలో అవగాహనకు అతీతంగా వుంటుంది. మనకేదో అర్థమవుతుంది. కాని అదేమిటో మనకు స్పష్టంగా తెలియదు. సామాజిక సంస్కృతి, జాతి సంస్కృతి, ఆత్మ సంస్కారం అనేవి దానిని వ్యక్తీకరించే కొన్ని పదాలు. ఆయా సందర్భాలలో ఈ పదం ఉపయోగించినా, మనకు అర్థమయ్యేది అస్పష్టమే. అయినా, ఆ పదం మనకు అర్థమైనట్లే కనిపిస్తుంది. సాంఘిక నియమాలకు లేదా రాజకీయాలు సాహిత్యం ఇతర విషయాలను గురించి వ్యక్తి భావనకు అది భిన్నమైనది. అది మానవహృదయాలపై గతకాలపు ప్రభావాలకు సంబంధించినది. గత కాలపు నాగరికతల సంస్కృతి గురించి మనం ప్రస్తావిస్తాము. ప్రతి తాత్వికరతి దాని అనుయాయుల మనస్సులపై దాని ముద్ర వదులుతుంది. ఆ ప్రభావాన్నే సంస్కృతిగా పేర్కొనవచ్చు. తెలుగు సాహిత్యం అధ్యయనం చేసినప్పుడు, దానిలో జీవనం సాగించినప్పుడు, నిమగ్నమైనప్పుడు, దానిలోని భావాలు, వ్యక్తీకరణ సౌందర్యాస్వాదనకు తగిన ప్రత్యేకమైన మనో ప్రవృత్తి ఆ వ్యక్తి ఏర్పడుతుంది. దానిలోనే నీవు జీవిస్తావు. నీవు ఆ విధంగా జీవిస్తున్న దానిలోని ఠీవి, సొంపు, సౌందర్యం వల్ల ఉత్తేజం పొందుతావు.

తెలుగు సాహిత్యం ఈ లక్షణాలన్నిటికి భాండారం వంటిది. సొంపు, సంగీత మాధుర్యం అనేవి తెలుగు భాష ప్రధాన లక్షణాలు. సాహిత్యం ఎప్పుడు ఆ భాషలోని విశిష్ట లక్షణాలకు పెంపొందుతుంది. నన్నయ్య కాలం నుండి నేటి దాకా తెలుగు సాహిత్యం రాజమండ్రి నుండి హైదరాబాదు వరకు పయనించింది. ఏ కవి కూడ తాను జీవిస్తున్న సమాజపు ప్రభావాన్ని లేక రాజకీయ భవనా సరళి ప్రభావాన్నుండి తప్పించుకో జాలడు. తూర్పు చాళుక్యుల కాలంలో తెలుగు సాహిత్యం ప్రారంభమైనది. తెలుగు సాహిత్యానికి బీజాంకురాలు కన్నడ సాహిత్యంలో ఉన్నాయని చరిత్రకారులు చెబుతారు. నన్నయకు ముందే కన్నడ సాహిత్యంలో మహాకవులు ఉన్నారు. నన్నయ, నారాయణభట్టు కన్నడ కవి 'పంప' నుండి ఎంతో విస్తృతంగా అనుకరించినట్లు చెప్పబడుతున్నది. నన్నయ ఉపయోగించిన ఛందోరీతులు అంతకు ముందు కావ్య రచనకు యత్నించని తెలుగు కవులు ప్రయోగించినవే.

పంప కాని నన్నయ కాని తమ ఛందో రీతులను సృష్టించలేదు. సంస్కృత భాష నుండే దేవి కవితా సంప్రదాయాల నుండి వారికవి సంక్రమించినవి. భారతదేశంలో ఇతర భాషలలోని మహాకవులందరి వలెనే నన్నయ కూడా సంస్కృత సంప్రదాయపు అడుగుజాడలను అనుసరించాడు. తూర్పు చాళుక్య సామ్రాట్టులు సంస్కృత భాషా సంస్కృతికి చెందినవారు. వారి అధికారభాష సంస్కృతం.

వాల్మీకి రామాయణాన్ని చదవడం కన్నా పాడుకోవడమే ఎక్కువని తరచు చెబుతుంటారు. వాద మనేది "శృతి" అంటే వినబడినది. అందుచేత సాహిత్యానికి మూలాధారం సంగీతంలోనే ఉన్నదని చెప్పవచ్చు. దానిని ఆలా పనగా చదివి ఉండి తీరాలి. శాస్త్రీయ సంగీతానికి ఆత్మ వంటిదైన లయ సాహిత్య పటనంతో ప్రవేశించి ఉండాలి. సంస్కృతంతో సహా ఏ భాషలోనైనా చందో రీతులన్ని లయబద్ధమైనవి. సాహిత్యం ఎన్నడు మపులికంగా సంగీతా న్నుండి విడవడలేదు. కవిత్వంలో పరుసాలను ఉపయోగించరాదనే వరకు కొందరు ఆధునిక విమర్శకులు పోయారు. ప్రాచీన సంస్కృత భాషావేత్తలు విధించిన సూత్రాలంటే వారికే మాత్రం లక్ష్యం లేదు. కవిత్వ భాష మధురంగా, కోకిల పాటగా, ప్రియ వధువుభాషలో ఉండాలని వారు వాదిస్తారు. సంగీతం కేవలం సెలయేట మృదురవళి కాదు, ఆకుల గలగల కాదు. గంభీరమైన వాటిలో సైతం సంగీతం ఉన్నది. గ్రహాల సంగీతాన్ని వ్యక్తం చేయడంలో సంగీతమనే పదానికి అర్థం ధ్వనుల మేళనం. సంగీతం వస్తు ధర్మం తెలుగు సాహిత్యంలోని ప్రాచీన సాహిత్యం ఈ విధమైన ధ్వనుల మేళనం సాధించిందే కాని, ఆధునిక విమర్శకులు వాదిస్తున్నట్లుగా కలరవాలు కాదు.

తెలుగు సాహిత్యంలో మహనీయుల సంఖ్య తక్కువేమి కాదు. వారిలో ప్రతి ఒక్కరికి వారి సొంత శైలి ఉన్నది. అందులో ప్రతి ఒక్కటి అద్భుతమైనది. ఇంగ్లీషు సాహిత్యంలో మిల్టన్ గురించి కార్లయిల్ అభివర్ణించినట్లుగా కొందరు దివ్య సంగీతం సృష్టించారు. వారు కవితా గానం చేసిన శైలి యొక్క వైబవం వల్లనే ప్రాచీన రచయితలు అంతటి ఔన్నత్యాన్ని సాధించారు. నన్నయ శైలి పరమోత్కృష్టమైనది. అందులో విశిష్టత ఉన్నది. ఆయన ఎవరికీ అందని ఎత్తు పోయాడు. ఆయన సంగీతం తెలుగు జాతికి జీవం పోసింది. తిక్కన మరో వీణ చేపట్టాడు. తెలుగువారి మహోన్నత కవులలో ఆయనది తదుపరి స్థానం. విశ్వాంతరాళ మహోన్నత స్థాయి నుండి ఆయన దిగివచ్చి సామాన్యునికి అవగతమైన సరళిలో గానం చేశాడు. తెలుగును ఆయన తన ఇష్టానుసారం వంచి, మెలికలు తిప్పాడు. తెలుగు ఛందో రీతులను ఆయన అసంఖ్యాకంగా కొత్త పోకడలు కల్పించాడు. మరో ఒకరిద్దరిని మినహాయిస్తే తెలుగు కవులంతా ఈ ఇద్దరు మహాకవుల అడుగుజాడల్లోనే నడిచారు.

17వ శతాబ్దంలో తెలుగువారు దాదాపు దక్షిణ భారతమంతటికీ అధిపతులైనారు. తంజావూరులో, మధురలో తెలుగు రాజ్యాల రాజధానులు వెలసినాయి. దక్షిణ దేశపు అంచున తెలుగు సాహిత్య వాహిని వెల్లువై ప్రవహించింది. తంజావూరు, మధుర నాయక రాజులు స్వయంగా గొప్ప కవులు. వారి పాలనలో తెలుగు సాహిత్యం కొత్త పోకడను సంతరించు కొన్నదని చెప్పక తప్పదు. తెలుగు భాష సంగీతం లయకు సంబంధించినంత వరకు ఆ దక్షిణశైలి అందచందాలలో మహోన్నత స్థాయినందుకొన్నదనడం నిర్వివాదాంశం. సాహిత్యంలోనే కాక తదితర లలిత కళలు సైతం నాయకరాజుల పాలనలో అత్యద్భుతంగా పరిణతి చెందాయి.

**కొత్త స్వరం :** ఆసేతు హిమాచల పర్యంతం ఉన్న సంస్కృతులన్నిటికి మూలం సంస్కృత సంప్రదాయంలోనే ఉన్నది. ఈ దేశంలో ఏ సాహిత్యం స్వతంత్రంగా అభివృద్ధి చెందలేక పోయింది. తెలుగు సాహిత్యం సంస్కృత సాహిత్యపు ముద్దుబిడ్డ వంటిది. తెలుగు సాహిత్యపు తొలి మహోపాధ్యాయులు సంస్కృత భాషను తెలుగు భాషకు మాతృకగా అంగీకరించారు. దేశంలోని ఇతర ప్రాంతాలలోని భాషలపై సంస్కృత ప్రభావం అంతగా ఉన్నట్లు కనిపించదు. కాని తెలుగు సాహిత్యం మాత్రం సంస్కృత సాహిత్య రూపాలను యథాతథంగా స్వీకరించింది.

సాహిత్యం ప్రధానంగా భావవ్యక్తీకరణకు సంబంధించిన సంగీతమని చెబితే, సంగీతం స్వర. లయబద్ధమైనదని ఒప్పుకుంటే సంస్కృత సాహిత్యం అడుగుజాడల్లో నడిచినందుకై తెలుగు సాహిత్యాన్ని తప్పు పట్టనవసరం లేదు. ప్రాచీన సంస్కృత సాహిత్యం శిఖరిణి, పృధ్వి వంటి ఛందో రూపాలను ప్రధానంగా ఎంచుకొన్నది. తెలుగు సాహిత్యం దీనికి భిన్నంగా మత్తేభం, చంపకమాల, ఉత్పలమాల ప్రధాన వృత్తాలుగా ఎంచుకొన్నది. సంస్కృత వృత్తాలకు వీటి వ్యత్యాసం వాటి నడకలోనే ఉన్నది. సంస్కృత వృత్త లక్షణమైన దీర్ఘ సమాసాలు, తెలు సాహిత్యం స్వీకరించగా ఒక కొత్త తరహా స్వరం, గమము సమకూడింది. అదే విధంగా నూతనమైన తెలుగు సాహిత్యం అవతరించినప్పుడు అనేకమైన వినూత్న శోభలు ఏర్పడినవి.

మరో విషయాన్ని విస్మరించరాదు. ఏ సాహిత్యమైనా ఆ భాషమాట్లాడే ప్రజల జీవితం, సంప్రదాయాలు, సహజమైన పోకడల వ్యక్తీకరణ మినహా మరేమీ కాదు. పద్యంలో ప్రాస, యతి మొదలైన స్వల్ప అంశాలు ఆ జాతి ఆత్మ వ్యక్తీకరణలు మినహా మరేమీకాదు. మానవాళి భూమండలంపై వివిధ ప్రాంతాలలో నివసిస్తున్నది. వివిధ నదులు ప్రహిస్తున్నాయి. ఎక్కడికక్కడ నేల ఒక్కొక్క తరహాకు చెందినవి. శీతోష్ణస్థితులలో కూడా వైవిధ్యం ఉన్నది. ఇవన్నీ కూడా మానవ జీవితంపై ఏదో విధంగా ప్రభావం చూపుతాయి. ఇక్కడ తెలుగు దేశంలో కృష్ణ, గోదావరి నదులు ప్రధానమైనవి. అవి ప్రహించే నేల స్వభావాన్నిబట్టి ఈ మహానదులు జిల్లాలకు వాటి వాటి ప్రత్యేక లక్షణాలున్నాయి. అన్నం తదితర ఆహారపదార్థాలు వాటిని భుజించే వ్యక్తుల నాదులలో కొన్ని ప్రత్యేక లక్షణాలు కనిపిస్తాయి.లా ప్రత్యేక జాతి శరీరావయువాలు, కంఠం వారు భుజించే ఆహారం ప్రభావానికి అనుగుణంగా మారుతాయి. ఆ విధంగా భారతావనిలో ఆంధ్రప్రదేశమనబడే ప్రాంతంలో నివసించే ప్రజలకు ప్రత్యేకంగా వారి స్వంత లక్షణాలున్నాయి. వారి సంప్రదాయాలు, అలవాట్లు ఇతరుల వాటికన్నా కొంత భిన్నంగా ఉన్నాయి. కట స్వరపేటిక చాలా సున్నతమైనది. అన్ని ధ్వనులను వారు స్పష్టంగా పలుకగలరు. సంస్కృతాన్ని తెలుగువారు చదివినప్పుడు ఇతర ప్రాంతాల వాసులు వారిని ప్రశంసిస్తారు. అచ్చులు, హల్లులను తెలుగు ప్రజలు విస్పష్టంగా నిర్దిష్టమైన ధ్వనులతో ఉచ్చరిస్తారు. అటువంటి కంఠ స్వరంకల ప్రజలు తమ సాహిత్య గతమైన సంగీతాన్ని స్పష్టత, ధ్వని మాధుర్యంతో గరిష్ఠ స్థాయికి పెంపొందించుకోగలరు. తెలుగు సాహిత్యాలు ఈ ధ్వని సాహిత్యానికి, లయకు ప్రతిబింబం.

**వాగ్గేయకారుల పాత్ర :** సాహిత్యంలోనే కాక ఇతర కళలలో కూడా తెలుగు సంస్కృతి విశిష్టత మహోన్నతమైనది. శిల్పం, చిత్రకళ మినహా సంగీతం, నృత్యం, దేశీనాటకం వంటి కళలన్నీ కూడా భాష ద్వారా వ్యక్తీకరణకు అతీతమైనది కాదు. భాష అనేది ఎప్పుడు ఈ కళలకు సాధనంగానే ఉంటుంది. త్యాగరాజు, అన్నమయ్య, క్షేత్రయ్య వంటి స్వరకర్తలు, మహాకవులుగా ఖ్యాతిగాంచారు. ఈ దేవ సంస్కృతికి సంగీతం ఎంతగానో దోహదం చేసింది. ఈ సంగీత స్వరకర్తలు తెలుగు సాహిత్యం సంస్కృతి సుసంపన్నం కావడానికి ఎంతగానో దోహదం చేసినట్టు చెప్పడం జరుగుతున్నది. సామాన్య ప్రజల నుండి, నానుడి నుండి, సామెతల నుండి వారి నిత్యజీవితంలో వేళ్లు పాతుకుపోయిన మాట విరుపుల నుండే ఈ వాగ్గేయకారులు వాటిని సేకరించుకొన్నందునే ఈ మహా కళాకారుల కీర్తనలు అద్భుతమైనవిగా రూపొందినవి. ఇవి వాటిని సామాన్యుల హృదయాలకు సన్నిహితం చేసినవి. త్యాగరాజు తెలుగు జాతి ఉదాత్త, ఆధ్యాత్మిక ప్రవృత్తులను సేకరిస్తే క్షేత్రయ్య తెలుగు వారి శృంగార సౌందర్యారాధనా ప్రవృత్తులను ప్రతిబింబించాడు. సంగీత నాట్య రంగాలలో ప్రస్తుతం తమిళనాడు సాధించిన మహోన్నత స్థాయి తెలుగు సంస్కృతి ప్రభావం ఫలితమేనని చెప్పవచ్చు. తెలుగువారు రెండు శతాబ్దాల క్రితం తమిళదేశాన్ని పరిపాలించారు. తెలుగు సంస్కృతి వారి కళలపై చెరగని ముద్ర వేసింది. త్యాగరాజు తెలుగు జాతికి చెందినవాడు. ఆయన మాతృభాష తెలుగు. ఆయన తెలుగు బ్రాహ్మణ వంశంలో జన్మించాడు.

భారతావని అంతటా కళలన్నిటికీ సంగీతంలో మూలం ఒక్కటే. సామవేదం దానికి నాంది. అది షడచ విభక్తలపై ఆధారపడినది. తదుపరి వేదాలలో సైతం అది సప్త విభక్తికమైనది. ఈ సప్త "స్వరాలు" పైన భారతీయ సంగీతమంతా రూపొందింది. అయితే ఈ స్వరాలు వేర్వేరు రీతుల్లో ఉచ్చరించబడినవి. మరీ స్పష్టంగా చెప్పాలంటే వేర్వేరు రాష్ట్రాలకు చెందిన గాయకుల కంఠాలలో అవి వేర్వేరు రూపాలు ధరించాయి. మానవుడు భుజించే ఆహారం, అతని మాండలికాలు, యాసలు, ఆయా ప్రాంతాలకు చెందినవారు అచ్చులు హల్లులను ఉచ్చరించే రీతిని రూపొందించాయి. ఉత్తరాదిన ఈ స్వరాలు తివిర స్వరాలుగా విభజించబడినవి. ఉత్తర ప్రాంతం ముస్లిం సంపర్క ప్రభావానికి ఎక్కువ లోనైనది. దక్షిణ ప్రాంతంలో అతి తక్కువ. హిందూస్థానీ, కర్ణాటక సంగీత సంప్రదాయాలు భిన్నమైనవిగా కన్పించవచ్చు. అయినా ఆ రెండు ఒక కుదుటి నుండే పెరిగినవి. వాటి రెండింటికి ప్రమాణం ఒకటే, స్వరాలు ఒకటే. అయితే వారు గానం చేసే రీతి భిన్నంగా ఉంటుంది. హిందూస్థానీ సంగీతా చార్యులలో తాన్సేన్ ప్రథముడైతే, కర్ణాటక సంగీతానికి త్యాగరాజు ఆద్యుడు. వారిలో అనేకమైన రీతులుండవచ్చు. కాని అవన్నీ త్యాగరాజనే ఒక సంగీత విద్వాంసేని చుట్టూ భ్రమిస్తూంటాయి.

అదే విధంగా భరతముని సాట్య శాస్త్రం నుండి అనేక నృత్య సంప్రదాయాలు ఆవిర్భవించాయి. భరతుని నాట్యం కూచిపూడి శైలిలో పరాకాష్ట నందుకొన్నదనేది సర్వజనామోదం పొందింది. స్వతంత్రంగా అభివృద్ధి చెందినట్టు చెప్పుకునే నాట్యకళా కేంద్రాలు కొన్ని తమిళనాడులో ఉండవచ్చు. అయితే తమిళనాడుకు చెందిన వీధి నాటకం తదితర కళారూపాలు వాటికి అంకురం తెలుగు సంస్కృతి ప్రభావంతోనే ఉన్నట్లు రుజువు అవుతుంది.

**భక్తి మార్గం :** సంగీతంలోని, నాట్యంలోని భాష, కవిత్వాంశాలను గురించి చెప్పడం ఈ వ్యాసం ప్రధానోద్దేశం. సంగీత కృతులలో సాహిత్యం సంగతి అటుండనిచ్చి. నృత్యరూపాలు ప్రధానంగా దానిలోని శృంగారాంశాన్ని ప్రదర్శిస్తాయి. భాను మిశ్ర రసమంజరి కర్త. దానిలో విభిన్న రకాల నాయికలను వర్ణించాడు. నాట్య సాహిత్యానికి అది మూలాధారంగా పేర్కొనవచ్చు. దాదాపు ఈ నృత్యాలన్నీ మానవుని మనసులో హృదయంలోని శృంగారావస్థను చిత్రించేవే. ప్రణయ భావనకు చెందిన గాఢమైన, మధురానుభూతులను వాడుకోవడం జరిగింది. భావాలు, అభినివేశాలు అనేకం. నృత్యాలలో ఈ శృంగార వ్యవస్థను వైభవోపేతంగా చిత్రించడం జరిగింది. మిగిలిన చోట్లవలెనే తెలుగు దేశంలో కూడా ఈ శృంగార వ్యవస్థను ఒక శక్తి భావనకు చెందినదిగా

చిత్రించే ధోరణి ఉన్నది. కృష్ణాజిల్లాలో చిన్న గ్రామమైన మొవ్వలోని గోపాలుని పరంగా క్షేత్రయ్య వలె భగవంతుని సంభోధనలో కీర్తన రచించినవారు పలువురున్నారు. కొన్ని సందర్భాలలో అది అశ్లీలంగా, జుగుప్సాకరంగా సైతం ఉంటుంది. అయినా దానిలో అంతర్గత వాహినిగా భగవద్భక్తి భావన ఉంటుందని చెప్పక తప్పదు. సంస్కృతంలో జయదేవుడు రచించిన గీత గోవిందం గురించి కూడా అదే వర్తిస్తుంది. సాంఖ్య వేదాంతంలో కన్నా, సృష్టి గురించి తాత్విక వేదాంత వివరణలలో దీని సిద్ధాంత మూలం ఉన్నదనవచ్చు. వేద సంసర్గలతో సాంఖ్య వేదాంతం మెరుగుపడినది. అచేతన ప్రకృతి సచేతనమైనవి. ఈ రెండింటి సంగమపు ఉదాత్త సృష్టే మహత్తరమైన శక్తి ఆరాధన. నాట్యాలు ప్రధానంగా శారీరకమైన స్త్రీ పురుష ప్రేమను చిత్రిస్తాయి. అందులో సర్వదా పురుషుడు కృష్ణావతారం ధరించిన విష్ణు భగవానుడు. స్త్రీ గోపిక, ఆ స్త్రీ నిజంగా స్త్రీ కానవసరం లేదు. పురుష భక్తుడే తరచు గోపిక అవుతాడు. అయితే శృంగార జీవిత వివిధావస్థలను, సంయోగం వల్ల కలిగే సుఖాన్ని, వియోగం వల్ల కలిగే దుఃఖాన్ని ఈ నృత్యాలు చూపుతాయి. ఈ ప్రణయ భావనను అత్యంత సుందరంగా, సున్నితంగా, వైభవోపేతంగా చిత్రించడంలో తెలుగు సాహిత్యం అత్యంత సంపన్నమైనదిగా చెప్పవచ్చు.

దీనివలెను, తదితర రూపాల కవిత్వంలో శ్రీకృష్ణ భగవానుడు ప్రధాన పాత్ర కావడంతో సాహిత్యంలోకి గ్రామీణ జీవిత కర్ణనలు అపారంగా ప్రవేశించాయి. గోపాలకుల వర్గానికి శ్రీకృష్ణుడు ప్రభువు. ఆయన పొలాల్లో అడవుల్లో సంచరించాడు. ఆవుల మందలకు కాపరి ఉన్నాడు. సాయంత్రం వాటిని ఇళ్లకు తోలాడు. ప్రతి ఆవు దాని యజమాని ఇంటికి సురక్షితంగా చేరేట్లు చేశాడు. మేతకై తిరుగుతున్న ఆవుల గిట్టలు రేపిన ధూళి భగవానుని దేహాన్ని అలముకొన్నది. ఆయన ఒక కొత్త దేవుడుగా, ఒక కొత్త వ్యక్తిగా కనిపించాడు. అట్లా సకలావస్థలలోను ఆయను గురించి గానంచేసిన కవులకు, భక్తులకు ఆయన ప్రేమ పాత్రుడు ఈ రకమైన కవిత్వం గోపిక వివిధానుభూతులు వర్ణనలతో సవపన్నమైనది. భగవానుడిపట్ల గోపికలు ఈ ప్రేమ కామోద్వేగంగా, లైంగికంగా అన్వయం చెప్పే ధోరణి విదేశీయులలో ఉన్నది. శ్రీకృష్ణుడు అవినీతిపరుడని అట్టి వ్యక్తిని సర్వోన్నత స్థాయికి తీసుకుపోవడం దారుణమని వారు వాదిస్తారు. దాని మర్మం వేరే ఉన్నది. ఆవుల మందలను కాచినప్పుడు శ్రీకృష్ణుని వయసు 10 సంవత్సరాలకు మించి లేదు. గోపికలు ఆయనకన్నా వయసులో ఎంతో పెద్దవారైన గృహిణులు. వారు యవ్వనంలో ఉన్నారు. శ్రీకృష్ణుడు పసివాడు. వారిమధ్య లైంగిక సంబంధం గురించి మాట్లాడటం నిజాన్ని తారుమారు చేయడమే కాక లోకజ్ఞానానికి సైతం విరుద్ధం. తమకు గల మహోన్నత జ్ఞానంవల్ల ఆయనను భగవానుడుగా గుర్తించిన గోపికలు ప్రదర్శించిన సంపూర్ణమైన నిస్సంశయమైన శక్తి భావన మినహా మరేమీ కాదు.

**భక్తి మార్గం** : గ్రామీణ జీవనశోభ ఈ గీతాలలోనే కాక తెలుగు సాహితీ రూపమైన శతకాలలో సైతం వర్ధితమైనది. శతకం అంటే నూరు పద్యాలతో కూడిన చిన్న పుస్తకం. భారతదేశంలోను ఈతరత్రాను ఏ ప్రాంతంలోని భాషలోనే ఇట్టి సాహిత్యము రూపము కనిపించదు. ఇది తెలుగు భాషలోనే జనించింది. తెలుగువారి మేధస్సంపద దాని మూలం. స్వల్ప విషయాలపై రచించబడిన చిన్న పుస్తకాలు ఇతర భాషలలో ఉండవచ్చు. కాని ఈ రకమైన కవితారూపం ఎక్కడా కనిపించదు. శతకం శక్తి ప్రధానమైనది. తరచుగా కవితావేశ భరిత గానం కావచ్చు. ఈ కవితా రీతి పాఠకుని హృదయాన్ని తేలికగా ఆకట్టుకోవడానికి ఉద్దేశించినట్లు కనిపిస్తుంది. చిన్న కావ్యాలలోనేకాక ప్రాచీన గ్రంథాలలో సైతం అది విస్తృతంగా కనిపిస్తుంది. ఎంతసేపు ఉదాత్త భావనలనే పట్టుకొని వేలాడుతాము. ఎల్లప్పుడు కొంత క్రిందకి వచ్చి సరళమైన మృదువైన వ్యక్తి గతాంశాలతో వినోదించవలే వస్తుంది. పోతన రచించిన భాగవతంలో సుదీర్ఘమైన సౌందర్యవర్ణనలున్నాయి. అందులో ప్రత్యేకించి శ్రీకృష్ణుని జీవిత వృత్తాంతాన్ని వర్ణించే దశమ స్కంధం ప్రత్యేకించి పేర్కొనదగినది. శ్రీకృష్ణుని జీవిత కథా రచనలో ఈ విధమైన ప్రకృతి సౌందర్య వర్ణనలు అనివార్యం. తెలుగు సాహిత్యంలో కవులందరికిని కృష్ణుడే ప్రధాన ఇతివృత్తం. భారతదేశంలోని మహాకవులందరు తాము స్వయంగా ఊహించి కవితా భావనలేవి సమకూర్చవలసిన అవసరములేని ఇతివృత్తం గనుకనే శ్రీకృష్ణ స్తవంతో తమ కవిత్వం ఆరంభించారు. భక్తిభావన, సౌందర్య, వర్ణన, గ్రామీణ జీవితం గురించిన అభిప్రాయాలు మొదలగూ గల అన్ని రకాల భావనలను వ్యక్తం చేయడానికి శతకం అనువైన రూపం సమాజంపై విమర్శ, మానవుని నీతి బోధ, మానవుల్లోను సమాజంలో నగల లోపాలను చెండాడడం శతకాలలో ప్రధానాంశాలుగా ఉన్నాయి. ఒక నిరంకుశుని బంధాలలో చిక్కుపడిన జనసమూహానికి సహాయం చేయవలసిందని దైవాన్ని ప్రార్థిస్తూ రాసిన శతకాలు కొన్ని ఉన్నాయి. వాటివల్ల వెంటనే ఫలితం చేకూరినట్లు చెప్పబడుతున్నది. అటువంటి మహిమాన్విత సంఘటనల వల్లనే కొన్ని శతకాలు విఖ్యాతమైనాయి.

వందలాదిగా శతకాలున్నా తెలుగు సాహిత్యంలో రెండు మూడు శ్రేష్టమైనవి ఉన్నాయి. అందులో ఒకటి ధూర్జటి రచించిన కాళహస్తీశ్వర శతకం. అది స్వరమాధుర్యానికి ప్రసిద్ధం. మరొకటి కాసుల పురుషోత్తం రచించిన ఆంధ్ర నాయక శతకం. ఈ రెండవదానితో తెలుగు భాష నిజమైన విశిష్టతకు లక్షణమైన ప్రత్యేక శైలిలో భావాలు వ్యక్తీకరణ మహోన్నత స్థాయినందుకొన్నది. ఏ భాషలోను ఇతరులను తీవ్రంగా నిందించడం, అన్యాపదేశంగా అపహాస్యం చేయడం గ్రీఆమ్యంలో వ్యాఖ్యానాలు చేయడానికి అవకాశం లేదన జాలము. ఇతరులను గురించి చెడుగా మాట్లాడటం, ఇతరుల చర్యల్లో తప్పులు వెదకటం మానవస్వభావంలో భాగం. తమ లోపాలను గురించి తెలుసుకొనకుండా ఇతరుల లోపాలను గురించి మాట్లాడరాదని చెప్పినప్పుడు జీసస్ క్రైస్ట్ బహుశా ఈ విషయాన్నే దృష్టిలో ఉంచుకొని ఉంటాడు. మానవ స్వభావంలోని ఈ లోపాన్ని దైవ భక్తి వైపు మళ్లించడానికి వినియోగించు కోవడంలోనే కాసుల పురుషోత్తం ఘనత ఉన్నది. మరెవ్వరూ అట్టి యత్నం ఎన్నడూ చేయలేదు. ఆయన చేసిన యత్నం అత్యద్భుతం. మాటలు విరుపులో ఆయన అఖండుడుగా కనిపిస్తాడు. అట్టి పదజాలం తెలుగు భాషలో అపారంగా ఉన్నది. ఆంధ్ర మహా కవిత్రయంలో ఒకరైన తిక్కన్న కన్నా గొప్ప కవిగా కొందరు చెబుతున్న నాచన సోమన్న తెలుగు భాషకు సహజసిద్ధమైన "వ్యంగోక్తుల" ప్రయోగంలో విశిష్టత ప్రదర్శించాడు. తెలుగువారు ప్రత్యేకతగల ఒకజాతి. శారీరకంగా చురుకైనవారు. దేహంలోని ప్రతి అవయువాన్ని కదిలించుతూ తరచుగా ముఖ కవళికలు మార్చగల సమర్థులు. నడుస్తున్నప్పుడు

నాట్యం చేస్తున్నట్టుగా చేతులు ఊపుతారు. శారీరకమైన ఈ లక్షణాలన్నీ వారి చురుకైన ఆత్మ బహిర్గత లక్షణమే. ఈ చురుకుదనం వారి భాషను ఇతరులపై నర్మోక్తు లాడడంలో సంపన్నం చేసింది. తెలుగు సాహిత్యంలోని ఈ పోకడను చూపిన రచయితలే నిజమైన తెలుగు కవులు. తిక్కన్న తెలుగు సాహిత్యమంతటిలో మేటికవిగా సర్వులు అంగీకరించారు. ఆయన పద్య రచన తెలుగు జాతికి చెందిన ఈ స్వభావానికి దర్పణం వంటిది.

**సమన్వయమై మేళనం :** ఈ పరిశీలనవల్ల తెలుగు ప్రజలు తమ స్వభావంతో స్థిరత్వం లేనివారుగా కనిపిస్తారు. వారు చపలత్వం కలవారనిపించుకోవచ్చు. కానీ అది నిజం కాదు. వారు ఉచ్చనీచాల విచిత్రమైన కలయిక. ఆ రెండు వారిలో సమన్వయమైనవి. తెలుగు సాహిత్యంలో మరోరూపమైన ఉదాహరణ ఈ విషయాన్నే రుజువుపరుస్తుంది. ఈ ఉదాహరణమనేది పరిమాణంలో శతకం కన్నా చాలా చిన్నది. దాని సరళి పూర్తిగా భక్తిపరమైనది. భగవానుని విష్ణువైనా, శివుడైనా వారిద్దరి అసంఖ్యాకం సప్త రీతులలో కవి స్తోత్రం చేశాడు. సంస్కృత భాష, తెలుగు భాష విభక్తి ప్రత్యాయాల విషయంలో సుసంపన్నమైనవి. మిగిలిన భాషలు ఇతర పదాల సహాయంతో వ్యక్తం చేస్తే ఈ రెండు భాషలు విభక్తుల సహాయంతో వ్యక్తం చేయగలవు. మరి ఈ విభక్తులెందుకు? అని వాక్య నిర్మాణంలో పదాల క్రమ నిర్దేశానికి సంబంధించినవి. విభక్తిరహిత భాషలలో ఈ పద క్రమంలో చాలా ముఖ్యమైనది. ఈ భాషలో దానిని కారక అంటారు. నామవాచకానికి క్రియలకు గల సంబంధరీత్యా వాక్యాన్ని అర్థం చేసుకోవడానికి తోడ్పడ్డ వ్యాకరణ యుక్తమైన వాక్యనిర్మాణాన్నే కారక అంటారు. ప్రతి నామవాచకం ఏవో విభక్తి ప్రత్యయం కలపడంత క్రియ యొక్క అర్థాన్ని మారుస్తుంది. నామవాచకానికి క్రియకు మధ్య ఎనిమిదవ సంబంధం అనేది లేదు. ఉదాహరణ కావ్యం భగవంతుడిని ఈ ఏడు విభక్తుల రూపంలో స్తోత్రం చేస్తుంది. మరో వ్యక్తి సంబోధించడానికి ఉపకరించే పదమే సమబుద్ధి. మిగిలిన ఆరు విభక్తి రూపాలకు విధంగా మరో వ్యక్తిని సంబోధించడముతో ప్రమేయములేదు. అందులో ఒకటి కర్తకు సంబంధించినది. మరొకటి కర్మకు సంబంధించినది. మూతవది ఆ పనికి ఉపకరించే సాధనానికి సంబంధించినది. నాలుగవది ఎవరి కోసం ఆపని చేస్తున్నారో వారి పేర్కొనడానికి ఉపకరించేది. ఈ విభక్తులన్నిటిలోను భగవంతుని సంబోధించడం జరుగుతుంది. సాహిత్యాన్ని సృష్టించిన మేధా సంపన్నులైన తెలుగు రచయితలు మానవానుభూతి యొక్క సర్వస్వాన్ని సాక్షత్కరింప చేసుకున్న మహత్తరమైన నిరాకార స్థితిలో లీనం కావాలని కాంక్షించిన మహర్షులు. అటువంటి సాహితీ రూపాలను కనుగొన్న సాహిత్యం అట్టి సాహితీ రూపాలతో తన్మయత్వం చెందేజాతి ప్రజలను తేలికగా భావించడానికి వీలులేదు. వారు భగవత్సాక్షాత్కారము పొంది దేనిని పట్టించుకోనట్లుగా బయటికి కనబడుతు నియమబద్ధ జీవనము సాగించారు. తెలుగు స్వభావాన్ని చరిత్ర ఆది నుండి గమనించవచ్చు. అది విరోచితమైన జాతి. అయినా మౌలికంగా శాంతి కాముకమైనది. ఈ విధమైన చాంచల్యానికి అడుగున సృష్టి యొక్క నిజమైన విలువలు మపులికమైన అవగాహన ఉన్నది.

**నృత్యసాహిత్యాల మేళనము :** కాలం మారింది. దేశ స్వరూపం ఏదో భిన్నమైనదిగా కనిపిస్తున్నది. దృక్పథాలు మారినవి. సమాజం, విద్య, రాజకీయాలు, సాహిత్యం నూతనాకృతికి పరిణతి చెందినట్లుగా కనిపిస్తున్నాయి. విద్య అనేది నేటి కాలంలో పూర్తిగా పాండిత్యం అయినది. దానికొక పద్ధతి ఏర్పడినది. ప్రాచీన భారతదేశంలో అలాగలేదు. ప్రాచీన భారతావనిలో అధిక సంఖ్యాకులు విద్యా విహీనులని చెప్పడం వాస్తవానికి సరిగా అర్థం చేసుకొనక పోవడమే అవుతుంది. ప్రజానీకానికి విద్య పుస్తకాల విద్యగాక, సంచార భిక్షువులు, నాటకాలు తదితర కళా ప్రదర్శకుల ద్వారా జరపబడుతుండేది. ప్రాచీన కాలంలో ఇవే విస్తృత ప్రచార సాధనాలుగా ఉండేవి. ఈ రకమైన నాగరికత వ్యాప్తమై ఉన్న రోజుల్లో మహత్తరమైన నృత్య నాటకం ఆవిర్భవించింది. దానిలో నృత్య, సాహిత్యాల సుందరమైన సంలీనం జరిగింది. దాని పేరు యక్షగానం. ప్రాచీన భారతదేశంలో అటువంటి రూపాలు అనేకం ఉండేవి. అయితే ఈ రెండు సమగ్ర వ్యక్తీకరణ కనుక యక్షగానం అధిక ప్రాధాన్యం పొందింది. అది ఎంతో చిత్రమైనది. ప్రాచీన సంస్కృత అలంకార శాస్త్ర గ్రంథంలోని భరతముని శాస్త్రీయ గ్రంథంలోని నిగూడాంశాల సమ్మేళనం. కూచిపూడి నృత్య ఆద్యుడైన సిద్ధప్ప ఈ మహత్తర రూపాన్ని సృష్టించారు. అది 16వ శతాబ్దంలో ఆవిర్భవించింది. తాళాలలోని వివిధ పోకడలు పురాణాలు, వేదాలు, ఉపనిషత్తులలోని వివిధ రాగాలు అన్నిటి మేళనంగా యక్షగానం రూపొందింది. ఇది రస సిద్ధాంతానికి అత్యధిక ప్రాధాన్యం ఇచ్చిన రూపం. సంగీత శాస్త్ర విద్వాంసుడు ఒక ప్రత్యేక సరళిలో పాడే రాగాన్ని యక్షగానంలో సామాన్యుని సాధారణ అనుభూతికి తగినట్టు మార్చడం జరుగుతుంది. సామాన్యుల హృదయంలోనికి సూటిగా పోయేటట్లుగా దానిని మలచడం జరుగుతుంది. తాళం, రాగం, పదం, అభినయం అన్నీ ఒక్కటే. అవన్నీ కూడ నిరాకారమైన భావన ఒక వ్యక్తీకరణ. వ్యక్తిత్వం కాకముందు దానికి రూపంలేదు. ఈ మహత్తర సత్యం ఆధారంగానే మన ప్రాచీన కళలు నిర్మితమైనవి. కూచిపూడి కళా సంప్రదాయం ఈ సందేశాన్ని భారత దేశమంతటికి చాటి చెప్పింది. తమిళనాడులో వేళ్లు పాతుకుపోయింది. దానిలో పాటలు తెలుగు భాషలో ఉన్నాయన్న కారణంగా తమిళనాడులోని కొందరు సంగీత కళాకారులు ఈటీవల దానిని వ్యతిరేకిస్తూ వచ్చారు. తెలుగు భాషలో తెనుగు దేశపు నృత్యాలలోనూ తెలుగువారి వీధి నాటికల్లోను తమ హృదయాలలోని నిజమైన మాధుర్యం సరళత్వాలకు ప్రతిబింబం ప్రజలకు కనిపించింది. కనుకనే దక్షిణాపథమంతటా తెనుగు సంస్కృతి చెరగని ముద్ర వదిలింది. నేటికి కూడా తమిళనాడులో బిచ్చగాళ్లు తెలుగు పాటలు పాడుతూనే బిచ్చం అడుక్కుంటారు. మధుర, తంజావూరు నాయకరాజుల పాలనలోనే తెలుగు యక్షగానం మహోన్నత స్థాయి నందుకొన్నది. ఆ రోజులలో ప్రతి ఒక్కరు సాహితీవేత్త. వారి ఆస్థానాలు కవి, పండితులకు నిలయాలుగా ఉండేవి. వారు సంస్కృతంలో తమ గ్రాంధిక శైలిలో రచనలు చేశారు. అయినా వారిలో ఎవరూ ఈ రూపాన్ని పట్టి చూడకుండ వదలలేదు. ప్రతి కవీ ఒక యక్షగాన ప్రబంధాన్ని రచించారు. తెలుగు సాయిత్యంలో ఈ రూపాన్ని అత్యంత ప్రతిభతో రచించినవారు శ్రీ విజయరాఘవ నాయకుని పట్టమహిషి రంగాజమ్మ. ఆమె అపార మేధా సంపదగల బహుముఖ ప్రజ్ఞాశాలిగా ఖ్యాతి గాంచారు. నాట్యకళ ఆమెకు కరతలామలకం. ఆమె అత్యున్నత స్థాయికి చెందిన రచయిత్రి. రాజు ఆమెకు చేయించిన కనకాభిషేకం వల్లనే ఆమె ఆధిక్యత విదితమవుతుంది. ఒక సాహితీవేత్తకు కనకాభిషేకమంటే ఆ వ్యక్తిని సరస్వతీదేవి అవతారంగా

భావించినట్టే విదితమవుతుంది. సరస్వతీదేవికి సయితం ఇది అసాధారణమైన గౌరవం. తెనుగు సాహిత్యంలో కనకాభిషేకం గౌరవం పొందిన ఇద్దరు కవుల జీవితకాలంలో సహస్రాబ్దాల వ్యవధి ఉన్నది. అందులో ఒకరు శ్రీనాధుడు. ఆయన పద్యాల అంతర్గత సంగీతాన్ని గ్రీకు గాధలకు చెందిన ఆఫ్సీయన్ తంత్రీ వాద్యంతో పోల్చవచ్చు. ఆ పిమ్మట ఆ మహత్తర గౌరవం పొందినది రంగాజమ్మ. ఆమె విద్వాంసురాలు. కవయిత్రి నాటక రచయిత్రి. నర్తకిగా ఈ కళలన్నిటికి సంగమ స్థానమైన కళాకారిణిగా శ్రీనాధుని కన్నా ఆమె అధికురాలు. తెలుగు సాహిత్యవియన్మండలంలో మహాప్రకాశభరితమైన గ్రహ సముదాయం వలె నిలిచే శ్రీనాధుని ఆధిక్యతను కించపరచడం కాదు. సాంప్రదాయక తెలుగు సాహిత్యాన్ని మాత్రమే ప్రమాణంగా తీసుకుంటే రంగాజమ్మ ఆయన సరస నిలువజాలదు. ఆ మాటకొస్తే ఆయన సరసన నిలువగల వారెవ్వరూలేరు. ఆయన వాణి మాధుర్యం అసమానమైనది. అది తెలుగు జాతి వారని కంఠస్వరాలలో సహజ మాధుర్యం.

దాని సౌందర్యాలు, నాజూకులు, అసంఖ్యాకమైన మలుపులు, భావ వ్యక్తీకరణలు దేశీ నృత్య వివిశ పద్ధతులను ప్రవేశపెట్టడం వల్ల యక్షగానం నూత్న సృష్టి అయినది. అది జాతి జీవనాన్ని మార్చినది. ప్రజలు ఉదాత్త భావాలతో కళాత్మకమైన అలవాట్లతో జీవనము గడిపేట్టు చేసింది. వారు యక్షగానాల పరిభాషలో సంభాషించారు. వారి ఊహలు యక్షగాన పధాన్ని అనుసరించాయి. యక్షగానాలు నిరక్షరాస్యులను అక్షరాస్యులుగా చేశాయి. పాండిత్యాన్ని అది లేనివారికి కల్పించింది. దాని ద్వారా నిఘంటువులు, శాస్త్రాలు, ఆధ్యాత్మిక తత్వరహస్యాలు ప్రజలకు సంక్రమించాయి. అమూల్యమైన జ్ఞానాన్ని వారు అన్వేషించుకోవలసిన శ్రమ తప్పిందిశీ యక్షగానాల రూపంలో సరస్వతి వారి గుడిసెల చీకటి కోణాలను సందర్శించి తన వెలుగుతో నింపింది. సామాన్యుల హృదయాల్లో సంస్కృతి మపులికాంశాలు ప్రతిష్టితమైనవి. యక్షగానంలో ప్రస్తావితంగాని శాస్త్ర విజ్ఞానమంటూ లేదు. వేదాల పరమార్ధాన్నే కాక భౌతికశాస్త్ర పరిజ్ఞానాన్ని సూతం ప్రజలకు లభింపజేసింది. ఇంతటి మహత్తర కళారూపం త్వరితగతిన అంతరించి పోతుడటం శోచనీయం. ఈ దేశంలో అంతరించిపోతున్న కళలను పునరుద్దరించడానికి యత్నం అంటూ జరిగితే అందులో యక్షగానానికి ప్రాధాన్యం ఇవ్వాలి. ఇంగ్లీషు సాహిత్యంలో తలమునకలైన ఆధునిక తెలుగు సాహిత్య విమర్శకులకు దేశీయ సాంస్కృతిక రూపాలను ఇంగ్లాండులోని రూపాలతో పోల్చడం పరిపాటి అయినది. ఇంగ్లీషు సాహిత్య చరిత్రలోని గుడాంశ భరితమైన నాటకాలు మహిమాన్విత సంఘటనలకు చూపే నాటకాలు మొదలైన వాటిని పేర్కొంటుంది. ఆధునిక నాటకానికి యక్షగానం నాందిగా ఈ విమర్శకులు పేర్కొంటుంటారు. ఆధునిక నాటకం రెండు విధాలు. ప్రాచీన సాంస్కృతిక నాటకాలు, కొత్త షేక్స్పియరియన్ తరహావి. ఏవిధంగా చూసినా ఈ నాటకానికి యక్షగానం మూలం అని చెప్పటానికి వీలులేదు. దాని పుట్టుపూర్వోత్తరాలు కేవలం స్థానికమైనవి.

ఈ యక్షగానమనేది ప్రాచీన తెలుగుజాతి జీవనదిలో ప్రధానమైనదిగా వచ్చిందనటానికి ప్రాచీన కాలపు మహా కవులనేకులు దీవి నుండి కథావస్తువులను భావాలను స్వీకరించినారన్నదే నిదర్శనం. యక్షగానం తెనుగు ప్రజల వాస్తవ జీవనాన్ని చిత్రించింది. ప్రాచీన రచయితలు దాని ప్రభావం నుండి తప్పించుకోలేక పోయారు. కవితా వర్ణనలు, గ్రామీణ జీవన వర్ణనలు జీవితంలో సంభవించిన సంఘటనలు ప్రాచీన కవుల మహా కావ్యాలలో చోటు చేసుకున్నాయి. శ్రీనాధుడు, పింగళి సూరన్న ఈ మహా నుండి ఎంతో స్వీకరించారు.

మహాకవులలో పరిమిత ఆవేశాలు భావాలు కనిపించ జొచ్చాయి. ఏవో కొన్ని వేల గ్రామాలలో కూడిన ప్రాచీన రాజ్యాలు సమగ్ర వ్యవస్థగా ఉంటుండేది. వారి సంస్కృతికి, భావనకు, మనుగడకు ఆ రాజ్యపు రాజధాన్ని రాజు నివాస కేంద్రంగా ఉంటుండేవి. కోట శత్రు వశమయ్యే వరకు శత్రువు దేశాన్ని జయించినట్టుగా భావించేవారు కాదు. ఆ విధంగా రాజనగరు ఆ ప్రజ సముదాయపు సంస్కృతికి భాంధాగారంగా ఉండేది. ఆ రోజుల్లో ఈ రాజ్యాలు అన్నీ ఒకే తరహాగా ఉండేవి. నాటి రాజదానులన్నీ ఒకే నమూనాలో ఉండేవి. కవి తన కథాకథనానికి ఉపక్రమించినపుడు కధానాయకుడు నివసించే పురవర్ణనతో ప్రాంభించేవాడు. పట్టణాన్ని, దాని కోట గడలను, సౌధాలను, వీధులను, వివిధ వృత్తుల ప్రజలను వర్ణించేవాడు. ప్రతి కావ్యారంభ భాగం ఆ ప్రాంతపు సంస్కృతికి దర్పణం వంటిది. అత్యున్నతులు, అత్యల్పులును ఒకే శ్రద్ధతో వర్ణించడం జరిగేది. మహా కావ్యాలలో సైతం క్రింది వర్గాల వారిని ఉపేక్షించలేదనడానికి నిదర్శనాలున్నాయి. ఈ భాషలో పాండిత్యం ఆర్జించదలచుకొన్న ప్రతి విద్యార్థి అధ్యయనం చేయవలసిన పంచ కావ్యాలలో ఒకటైన సామ్రాట్టుకి అయిన శ్రీకృష్ణ దేవరాయలు రచించిన ఆముక్త మాల్యద మానవాళిలోని అట్టడుగు వర్గానికి చెందిన ప్రజల ఇళ్లు, నిత్య జీవితాల, భావాల వర్ణనలతో నిండి ఉన్నది. ప్రాచీన కావ్యాలలో కధా సంవిదానంలో దేని దారి దానికున్నవి. ఆ కవులలో ప్రతి ఒక్కరు తమ ఇష్టానుసారంగాఈ కళకు మార్గాన్ని కల్పించుకొన్నారు. ఈ విషయాలలో ఆది కవి నన్నయ్య తెలుగు కావ్య సాహిత్యానికి నాంది పలికిన పెద్దన మహోన్నతులు. కధాకధనం కళతో వారు మహోన్నత స్థాయినందుకొన్నారు. ఈ గొప్పకళలో వారు వాల్మీకి స్థాయికి సైతం చేరుకొన్నారా అనిపిస్తుంది. శ్రీకృష్ణ దేవరాయలు కథ చెప్పడంలో వినూత్నమైన, ఆసక్తిదాయకమైన రీతిని సృష్టించారు. మహా కావ్యమైన ఆముక్త మాల్యదలో నుండి కొన్ని ఉదాహరణలు చూపడం ఆవశ్యకం. ఇళ్ల ద్వారాలపై అలంకారణగా వ్రాసిన చిత్రాలకు సైతం ఆ సామ్రాట్టు తన వర్ణనలలో వదలలేదు. ద్వారాల కిరువైపులా విష్ణు భగవానునికి చేతుల్లా ఉండే శంఖ, చక్రాల చిత్రాలు ఉండేవి. కవులు సాధారణంగా వర్ణించే విపణి వీధి, పూలు, తదితర విలాస వస్తువుల అంగళ్లు కల వీధి. ఆనాటి ప్రజల సంస్కృతి, నాగరికత, సౌందర్యానికి ప్రాచీన మహా కావ్యాలు పూవులకు ఇచ్చిన ప్రాధాన్యమే నిదర్శనం. జీవితంలోని ముఖ్యమైన ఏ దశను, పదార్ధాన్ని వర్ణించకుండా ప్రాచీన కావ్యాలు వదలలేదు. ప్రాచీన తెలుగు కవులలో మొదటివాడైన నన్నయ్య సైతం పశుగణాల వర్ణన సందర్భంలో పరవశం చెందకపోలేదు. తెలుగు భాషకు చెందిన స్వంత ఛందోరూపమైన సీస పద్యాలలో ఆయన దానిని వర్ణించాడు. పశుగణాలలో వివిధ ఆజతులను, వాటి తీరును, వాటి రంకెలను, వాటి రంగులను ఆయన విపులంగా వర్ణించాడు. ఆ పశువుల రంకెలు వినిపిస్తాయి. వాటి తలలపై గల కొమ్ములు కనిపిస్తాయి. ఇదంతా ఆయన ఒక్క పద్యంలో సాధించాడు. నన్నయ అంటే అదీ; ఇదీ సాహిత్యం వెనుక ఉన్న రహస్యం. ప్రజల సంస్కృతి మహా కవుల రచనలు ఒకే మనుగడకు రెండు రూపాల వ్యక్తీకరణలు.

# కలం శ్రామికులు - జర్నలిస్టులు

- ప్రొఫెసర్ పి.బాబివర్ధన్

అచ్చు కుటాలు అవతరించడమే జర్నలిజం ఆవిర్భావానికి నాంది అనేది ఎవ్వరూ కాదనలేని నిజం. అయితే ఆ అవతరణ వెనుక ఎందరి తపన, మరెందరి తపస్సు ఉందో కొందరికే తెలుసు. శుద్ధగ్రాంధికపు వాసనల నుంచి జర్నలిజానికి దారి మళ్లించి..... సామాన్యునికి అర్థమయ్యే భాషను పత్రికల్లోకి ఎక్కించగడం వెనుక ఎన్నో ఉద్యమాలు, పోరాటాలు జరిగాయన్న నిజం ఎందరికి తెలుసు?

జర్నలిజం నిఘంటువులో కొత్త పదాలు చోటు చేసుకోవడానికి, జర్నలిజం చరిత్రలో తెలుగు జర్నలిజానికి విశిష్ట స్థానం కల్పించడానికి కృషిచేసిన "అసలైన" జర్నలిస్టులు బహుకొద్దిమందే అయినా వాళ్ల చేసిన సేవ మాత్రం చాలా ఎక్కువ. విచిత్ర రీతుల్లో తెలుగు జర్నలిజం అభివృద్ధిధ చెందింది. తెలుగు పత్రికలన్నీ ఏదో ఒక ఆశయం గురించి ప్రారంభమయినవే. మతవ్యాప్తి కోసం కొందరు పత్రికలు స్థాపిస్తే, సంఘ సంస్కరణ కోసం ఇంకొందరు, జాతీయోధ్యమానికి ఆయుధంగా ఇంకొందరు, సామిత్య పోణ కోసం మరికొందరు ఇలా తలోరకంగా పత్రికల్ని ప్రారంభించారు. కొన్ని పత్రికలు నీటిమీద బుడగల్లా ఆదిలోనే అంతమైపోయాయి. మరికొన్ని పత్రికలు పాఠకుల గుండెల్లో శాశ్వితంగా నిలిచిపోయాయి. దీనికంతటికి కారణం ఆయా పత్రికల్లో పనిచేసిన జర్నలిస్టుల అభిరుచి, ఆశయ నిర్వహణలే.

సంఘ సంస్కరణలోనూ, జాతీయోద్యమంలోనూ ఓ ఊపుఊపిన పత్రికల స్థాయి విలువ జర్నలిస్టుల సామర్థ్యం మీద సత్తా మీద ఆధారపడే మిగిలాయి. పత్రికల్లో పని చేయడంవల్ల సంఘ బహిష్కరణకు గురైన జర్నలిస్టులు మనకున్నారు. నిజాలు నిక్కచ్చిగా వెల్లడించినందుకు బ్రిటీష ప్రభుత్వంచేత 'దేశ ద్రోహ' నేరాన్ని మోసిన పాత్రికేయులూ మనకున్నారు. తెలుగు జర్నలిజం చరిత్ర అంత గొప్పది. అయితే ఇంత విశిష్టత కలిగిన తెలుగు జర్నలిజంలో 'తొలి పత్రిక ఏది' అనే విషయంలో ఇప్పటికీ వాదోపవాదాలు జరుగుతూనే ఉన్నాయి.

తెలుగులో మొదటి పత్రిక 'సత్యదూత' అనేది కొందరి వాదన. అయితే దీనికి సంబంధించిన ఆధారాలు మాత్రం ఎక్కడా దొరకవు. కానైతే ఇది మతవ్యాప్తి కోసం ప్రారంభించిన పత్రిక కనుక జర్నలిజం కోవలోకి వస్తుందా? అనేది ఇప్పటికీ బదులు దొరకని ప్రశ్నే. కనుక తొలి తెలుగు పత్రిక 'వృత్తాంతిని' అని కొందరు, కాదు 'వర్తమాన తరంగిణి' అని ఇంకొందరూ ఇలా వాదోప వాదాల్ని సాగదీస్తూనే వున్నారు. ఏదేమైన గత రెండు దశాబ్దాల ప్రపంచ చరిత్రలో ఏ జాతి జాగృతమైనా, ఏ ఉద్యమం ఊపిరిపోసుకున్నా, ఏ విప్లవం విజృంభించినా వాటి వెనుక పత్రికలే అసలైన ఆయుధాలుగా పని చేశాయనడం సత్యదూరం కాదు. మరి ముఖ్యంగా ఆంధ్రులు జీవన స్రవంతిలో పత్రికలు గొప్ప స్థానాన్ని ఆక్రమించుకున్నాయనడం కూడా ఎవ్వరూ కాదనలేని నిజం.

ప్రజలకు - ప్రభుత్వానికి మధ్య వారధిలా పనిచేస్తూ 'ఫోర్త్ ఎస్టేట్'గా వ్యవహారంలో వున్న పత్రికలు ఒక జాతి చరిత్రకు అసలైన ఆనవాలని చెప్పడం అతిశయోక్తి కాదు. మొగలుల కాలంలో సైతం 'వాక్విహ్నవీ' అనే పేరుతో రాజ్యం నలుమూలలా (జర్నలిస్టులు) విలేకరులు ఉండేవారు. వార్తల్ని వ్రాసి రాజప్రసాదానికి చేరవేయడం వీళ్లపని. ఇది రాజరికానికి పనికివచ్చిన కమ్యూనికేషన్ ప్రకియ. అప్పట్లో అన్నీ చేతిరాతలతోనే జరిగేవి. ఆ తరువాత బోలెడంత అభివృద్ధి, కావలసినంత విజ్ఞానం అందుబాటులోకి వచ్చింది. 'బెంగాల్ గెజిట్' అనే పేరుతో 1780 జనవరి 20న మన దేశంలో మొదటి వార్త పత్రిక అవతరించింది. ఆ తర్వాత లెక్కలేనన్ని పత్రికలు. మొదటి ప్రపంచ యుద్ధం రోజుల్లో తెలుగు పత్రికలకి గడ్డురోజులొచ్చాయి. ఇక భారత జాతీయోద్యమం పత్రికల రూపురేకల్నే మార్చివేసింది. భాషాపత్రికలపై ఏవేవో చట్టాలు రూపొందించి బ్రిటీషువాళ్లు అనేక నిర్బంధాలు విధించారు. ఎన్నో ఒడిదుడుకుల్ని, ఎదురు దెబ్బల్ని తట్టుకొని ఇరవయ్యో శతాబ్దపు మొదటి దశలోకి వచ్చేసరికి తెలుగు జర్నలిస్టు గట్టిపడ్డారు. ఇది గొప్పమలుపు. ఎందరో జర్నలిస్టులు అవ'తరించింది' ఈ దశలోనే.

దేవగుప్త శేషాచలపతిరావు 1887లో స్థాపించిన 'దేశాభిమాని' తొలి తెలుగు పక్ష పత్రిక. కాని ఇదే తొలి దినపత్రిక అన్నవాళ్లు కూడా లేకపోలేదు. ఆ తర్వాత రాజమండ్రి నుంచి శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రి సంపాదకత్వంలో 'గౌతమి' అనే మరో పత్రిక వెలువడింది. ఆ తర్వాత 'శశిలేఖ' ఈ ఒరవడిలో వచ్చిందే ఆంధ్ర పత్రిక. మిగతావన్నీ కాలగర్భంలో కనుమరుగైపోయినా ఎప్పటికీ నిలిచింది అప్పటి ఆంధ్రపత్రిక. ఆ తర్వాత వచ్చింది ఆంధ్రప్రభ. ఇది తెలుగు జర్నలిజాన్ని కుదిపేసింది. 'ప్రభ' ఆవిర్భావంతోనే తెలుగు జర్నలిజంలో ప్రజా సేవ, సాహిత్య సేవ, స్వాతంత్ర్య సముపార్జన అనే ఆశయాల స్థానంలో వ్యాపార దృక్పధం కాలుమోపింది. ఫలితంగా వామపక్షాలు కూడా పత్రికలను స్థాపించే దశ, అవసరం ఆ తర్వాత కలిగింది. కమ్యునిజం అంటే అసలు గిట్టక వామపక్షాల పేరువింటే వెన్నులోంచి చలిపుట్టుకొచ్చేటంతటి నిరసన భావం చూపిస్తూ అప్పటిలో కొన్ని పత్రికలు వీరిని దుయ్యబట్టడమే ఆశయంగా పెట్టుకొని సాగాయి. తమదైన సొంత గొంతుకతో వామపక్షాలు పత్రికల్ని ప్రారంభించాయి. 1940లో వామపక్ష పత్రికలు ప్రత్యేక ఒరవడిలో సాగితమ 'ప్రత్యేకత'ను నిలుపుకున్నాయి. ఈ దశలో వచ్చిందే పీపుల్స్ పార్టీ 'జనవాణి'. తాపీ వారు ఈ పత్రికలోనే తన కలాన్ని కరవాలంగా మార్చారు. జర్నలిజం అవసరం మరింత పెరగడంతో.... 'స్వేచ్ఛ' ఎక్కువయ్యింది. ఫలితంగా 'నిషేదాలు, అండర్ గ్రౌండ్' వంటి పరిణామాలు పత్రికలకు శ్రీకారం చుట్టింది. ఈ పరిస్థితి లోనే. ఆ తర్వాత ఎన్నో మలుపులు మరెన్నో కుదుపులు. అయితే తెలుగు జర్నలిజంతో పాటు అభివృద్ధి చెందుతూ, జర్నలిజాన్ని అభివృద్ధి పరచిన ఘనత 1902లో ప్రారంభమయిన 'కృష్ణాపత్రిక'కు దక్కింది. ఈ పత్రికకు సంపాదకులుగా దాదాపు మూడు దశాబ్దాలపాటు పనిచేసిన ముట్నూరి కృష్ణారావు తన సంపాదకీయ చాతుర్యంతో జనజాగృతికి జీవం పోశారు. అటు రాజకీయం, ఇటు సాహిత్య, సాంస్కృతిక రంగాలకే బోలెడు కొత్త పదాల్ని ప్రవేశపెట్టి వ్యావహారికానికి శ్రీకారం చుట్టిన నార్ల వెంకటేశ్వరరావు కూడా ఈ పత్రిక పుత్రులే.

సమదర్శిని, జనవాణి, కొండెగాడు, కాగడా, కొరడా వంటి పత్రికల్తో తెలుగు జర్నలిజానికి నగిషీలు చెక్కిన మహాశిల్పి తాతాజీ ప్రేరణే ఎందరో జర్నలిస్టులను తయారు చేసిందనడం సమంజసం. నార్లవారు కూడా ఈ స్కూల్ నుంచి వచ్చిన విద్యార్థే.

రెండు వందల సంవత్సరాల బానిసత్వం తర్వాత భారతదేశానికి స్వాతంత్ర్యం వస్తే అంతటి ఘనమైన వార్తను సైతం 'India got Independence' అని ఓ చిన్న సింగిల్ కాలమ్‌లో రాసిన పత్రికా ప్రముఖులున్న దశలో..... ఆ దిశను మార్చిన ఘనత తాపీవారిదైతే.... ఆ మార్గాన్ని మరీ విశాలం చేసిన ఖ్యాతి ఆ తర్వాత వచ్చిన ఆయన శిష్య వర్గానికి లభించింది. ఇక పండుగలకు, పబ్బాలకు ప్రత్యేక వ్యాసాలు రాయించడంలో ప్రఖ్యాతి గాంచింది 'ఆంధ్రపత్రిక'. ప్రత్యేకాంధ్ర ఉద్యమంలో దీని పాత్ర ప్రముఖమైందే. దీని అనుబంధ 'సాహితీ' పత్రిక 'భారతి' అనేకమంది కవుల్ని సృష్టించంది. తెలంగాణ వీరుడు సురవరం ప్రతాపరెడ్డి నేతృత్వంలో ప్రారంభమైన 'గోలకొండ' పత్రిక.... నిజాం నిరంకుశ పాలనపై అంకుశంలా పని చేసింది. ఇంతవరకు జరిగింది ఒక దశ అయితే 1974 నుంచి తెలుగు జర్నలిజం గొప్ప మలుపు తిరిగింది. గ్రామీణవార్తలకు, తెలుగుదనానికి ప్రాధాన్యమిస్తూ 'ఈనాడు' పత్రిక విశాఖలో ఉదయించింది.

గతంలో మందకొడిగా సాగినా ఇప్పుడిప్పుడు ఆధునికత్వాన్ని సంతరించుకుని నూతన మార్గంలో పయనిస్తున్న పత్రిక 'ఆంధ్రభూమి. ఇలా చెప్పుకుంటూ పోతే తెలుగు జర్నలిజం చరిత్ర భాషకు అందనంత ఉంది. వివేక వర్ధిని, సతీహిత బోధిని ద్వారా జర్నలిజాన్ని ఒక ఉద్యమంగా భావించి నడిపిన వీరేశలింగం మొదలు కొక్కొండ వెంకటరత్నం పంతులు, ఖాసా సుబ్బారావు, చిలకమర్తి లక్ష్మీ నరసింహం, శింవలెంక శంభూప్రసాద్, గో.రా. శాస్త్రి వీరంతా తెలుగు జర్నలిజం చరిత్రలో మరపురాని మహనీయులే. వందేమాతరం, నవయుగ, కృష్ణాపత్రిక ఆంధ్రకేసరి వంటి పత్రికలు వందేమాతరం వంటి ఉద్యమాలకు ఊపిరిపోసిన దేశాభిమాని, దేశమాత, సత్యాగ్రహి వంటి పత్రికలు ఉప్పు సత్యాగ్రహానికి కొమ్ముకాచిన నాటి జర్నలిజం యావత్తూ ఆశయాల కోసం నిలిచింది. ఎందరినో ప్రముఖ జర్నలిస్టులుగా మలిచింది.

ఒకపక్క సాహిత్యానికి స్థానం కల్పిస్తూ మరోపక్క ప్రజా సమస్యలకు, సంఘ సంస్కరణకు బాసటగా నిలుస్తూ జర్నలిజానికి అసలైన అర్థాలు చెప్పారు నాటి జర్నలిస్టులు. మరి నేడో? పత్రికల్ని స్థాపిస్తున్నది పెట్టుబడిదారులైతే (ఒకవేళ కొద్దోగొప్పో ఆశయాలున్న) జర్నలిస్టులకు స్వేచ్ఛ దొరికేదెక్కడ? తాము చూసింది నిజమని తెలిసినా, తాము రాయాల్సింది నిజాలనివున్నా ఆ అవకాశం ఎందరికి??

ప్రతిపక్షాలు విఫలమైనచోట 'ఫోర్త్ ఎస్టేట్' అయిన పత్రికలే ఆ స్థానాన్ని భర్తీ చేయాలన్న పడికట్టు పదాల్లోని అంతరార్థం ఏమిటి? ఒకపక్క రాజకీయ నాయకులు, మరోపక్క వారికి అండగా నిలిచే పోలీసు వ్యవస్థ అనుక్షణం బెదిరిస్తూ అవస్థల పాల్జేస్తుంటే జర్నలిస్టుల భవిష్యత్తు ఏమిటీ? రాజ్యాంగం కల్పించిన పత్రికా స్వేచ్ఛలోని విలువేమిటి? 'కలం' జర్నలిస్టు చేతిలో....'బలం' కాపిలిస్టు చేతిలో ..... ఏవిటీ తిరకాసు. ఎక్కడుంది లోపం? ఇలాంటి వ్యవస్థలో బతికేస్తున్న జర్నలిస్టు గతం జ్ఞాపకాల్ని నెమరవేసుకుంటూ.... ఊహల పల్లకీలో ఊరేగాల్సిందేనా?? మరలాంటప్పుడు జర్నలిజం భవిష్యత్తేమిటి? జర్నలిస్టు కర్తవ్యం ఏమిటి? 'నిజం' యిజం అయినచోట.... భేషితానికి తావుండదు. మాలిన్యం అంటని అక్షరమే లక్ష్య, లక్షణాలొక్కటై మార్గదర్శకత్వం వహిస్తుంది. అక్షరాన్ని అమ్మకానికి పెట్టకుండా ప్రజల నమ్మకాన్ని మోస్తున్న జర్నలిస్టులకే జననీరాజనాలు.... ఘ(మ)న జేజేలు.

## తెలుగు భాష

- శనపతి పాపారావు నాయుడు

కం॥ శ్రీరాము డల్ల యేసులు
ప్రారంభము నుండి భాష ప్రజ్ఞను జూపెన్
సారాంశమేది యైనను
ధీరాంబుధి "తెలుగుభాష" దివ్యంబలరెన్.

కం॥ శ్రీయౌ "సిరియు"ను "సంపద"
శ్రీయౌ "సౌభాగ్య" "గరిమ" "సిద్ధి" యు "బుద్ధి"న్
శ్రీయౌ "శుభము"ను "కీర్తి"యు
శ్రీయౌ "తెలుగన్న భాష" స్థిరముగనిల్చున్

కం॥ "మమ్మీ" యనగా నర్థము
"అమ్మా" యని పిలుపుగాదు నయముగ దెల్పన్
లెమ్మా "యెండిన శవమ"ని
మమ్మాటికి "నాంగ్ల పదము" మూలము బల్కెన్

ఉ॥ మద్యము రీతిగాను "మన మాంగ్లము నేర్చుచు" మాతృ భాషనే
దధ్యయనంబు మాని, తెలుగన్నది నేర్పక నుద్యమంబుగా
మిధ్యగు నార్థికంబును, సమీకరణంబుకు దాస్యులౌచుథానీ
విద్యనరిష్టమంచు నభివృద్ధికి దెచ్చిరి నేటి కాలమున్

ఆ॥వె॥ పాడు "కోకిల" కిల పాటలన్నియు వచ్చు
పాడుకో "కిలకిల" పాటలన్ని
పాడుకోకిల "పరభాష" పాటలనిల
పాడు "తెలుగుపాట" పసిడిమూట

ఆ॥వె॥ "భారత"ంబు, "గీత", భక్తి "రామాయణం"
"భాగవతము" తెలుగు బల్కె కవులు
వసుధగెల్చె భక్తి, వైరాగ్యనీతులు
"శతక" సుమము లెన్నొ చాటె తెలుగు.

శా॥ భాషా పండితులెల్ల వేళ మనసా పాఠ్యాంశముల్ జెప్పగా
దోషాలేమియు లేనిరీతి పదోత్సాహమందించ్య
వేషాలేమియు గిట్టవంచు "ప్రభుతే" విన్పించె నిచ్చంగిగా
దోషాసక్తులు తోర మాయెనుగదా తోషంబుపెంపొందగా.

తే.గీ. తెలుగు "పద్యంబు" ప్రాపంచ తేజమలర
వచన రచనైన "శ్రీశ్రీగ" వన్నెదెచ్చె
కళల కాణించి మనభాష కాంతి రేఖ
పూర్వవైభవ మందించు "పుడమికవులు"

తే॥గీ॥ "విజయ"మన్నట్టి "వాడ"లో విపినవీధి
ప్రగతి నడిపించ "నాంధ్రకు" ప్రాణమైన
"విజయవాడ"ను నిల్పిరి "విశ్వకవుల"
సభలు జరిపించి "తెలుగన్న" సత్తజూపు.

# తెలుగువారి అవధాన వైశిష్ట్యం

- డాక్టర్. సర్వా సీతారామ చిదంబర శాస్త్రి

తెలుగునాట వెలసిన నూత్న సాహిత్య ప్రక్రియల్లో 'అవధానం' ఒకటి. అవధానం ఒకకళ. చతుష్షష్టి కళల్లో అవధానం ఒక కళగా పేర్కొనబడింది. డు - ధా ఞ - ధారణ పోషణయో:-అనే ధాతువుకు 'అవ' అనే ఉపసర్గ చేర్చి, ల్యుడంతం చేయగా 'అవధాన' అనే పదం ఏర్పడుతుంది. దీనిని 'వధాన'మని కూడ వ్యవహరిస్తారు. మనస్సు యొక్క ఏకాగ్రతయే అవధానం అనబడుతుంది. అవధానమనేది కవిత్వ సాధనాల్లో ఒకటిగా చెప్పబడింది. అవధానాన్ని సక్రమంగా నిర్వహించి సభ్యులను ఆనందపరచాలంటే అవధానం చేసేవారికి చక్కని కవిత్వధార అవసరం. కవిత్వానికి అవసరాలయిన శక్తి, నైపుణ్యం, వ్యుత్పత్తి, అభ్యాసాలతో పాటుగా అవధానికి సమయస్ఫూర్తి, ఆశుధార, ధారణ ముఖ్యంగా ఉండాలి. పృచ్ఛకులు అడిగే తల తోకలేని అనగా అసంబద్ధాలు, అశ్లీలాలు, నిరర్ధకాలయిన ప్రశ్నలను ఒక దారికి తెచ్చి వాటిని సరియైన పద్ధతిలో అందంగా, అర్ధవంతంగా ఉండేటట్లు చెప్పి అడిగినవారికి వినేవారికి ఆనందాన్ని కలిగించవలసిన పని అవధానిది. కనుక అవధానికి నవనవోన్మేషశాలినియైన ప్రతిభతోపాటు సమయస్ఫూర్తి, లోకజ్ఞత చాలా అవసరం. అంతేకాక అవధాని పృచ్ఛక ప్రశ్నలకు సమాధానాలు చెప్పేటప్పుడు ఎక్కువగా ఆలోచించరాదు. ఆలోచనతో కాలయాపన కానిస్తే సభ్యులు గుసగుసలు పోయి గొణుగుతారు. అసమర్ధునిగా భావిస్తారు. కనుక ఎప్పుడూ నోరాపకుండా అవధాని ఏదో ఒకటి చెబుతూనే ఉండాలి. ముఖ్యంగా అప్రస్తుత ప్రసంగ విషయంలో చమత్కారయుతంగా సభను ఆకట్టుకునే విధంగా హాస్యయుత ప్రసంగం జరగాలి. అందువల్ల కవిత్వంలో మాధుర్యం ఉండాలి. అదే సభ్యుల్ని ఆకర్షిస్తుంది.

కవిత్వం నేర్చిన ప్రతివాడూ అవధాని కాలేడు. కవుల్లో నూటికి ఒక్కడు అవధాని అవుతాడేమోకాని అందరూ కారు. దీనినే తిరుపతి వేంకట కవులు తమ నానారాజ సందర్శనంలో ఇలా చెబుతారు.

"కోటి బ్రాహ్మణులలో గొమరొప్పనొక్కండు
    చదువుకొనంగ నిచ్చను వహించు
చదివినవారు లక్షలు కల్గినను నందు
    బండితుడొక్కండు బయలుదేరు
నట్టి పండితులలో నరయ వేయికినొక్క
    రుండు కవీశ్వరుండుండునేమో
అట్టి కవీశ్వరులందు నూటికినొక్క
    రుండవధానియైయుండునేమొ......"

అవధానం చేయాలంటే అవధానికి లోకజ్ఞత, శ్రావ్యంగా పాడడం, ధారణాశక్తి ముఖ్యావసరాలు. అప్పుడే సభారంజకత్వం కావించగల్గుతాడు. దానికై అవధాని శాస్త్రాలు బాగా చదవాలి. పాండిత్యం అలవరచుకోవాలి. మాట్లాడేటప్పుడు సభ్యులడిగిన విషయాన్ని చక్కగా ఆకళించుకొని, ఎవరికీ విరోధం కాకుండా, ఎదుటివారి మనస్సును నొప్పించకుండా హత్తుకొనేటట్లుగా చెప్పే నేర్పుండాలి.

ఇలా లేకపోతే కవులకు, అవధానులకు పరాభవం తప్పదు. వీరికేనా? పృచ్ఛకులు కూడా ఇలాగనే ఉండాలి. వారడిగే ప్రశ్నలకు అవసరమైతే వారు తగిన సమాధానాలు చెప్పేటట్లుండాలి. లేనిచో అవధానిగారి వల్ల సభలో పరాభవం పొందవలసి వస్తుంది. మరి ఈ రోజుల్లో శబ్ద, అర్ధ, ఛందో వ్యాకరణాలంకార పరిజ్ఞానం లేని వారు పృచ్ఛకులుగా ఉండవలసిన పరిస్థితి ఏర్పడడం శోచనీయం.

అష్టావధానం, శతావధానం, సహస్రావధానం, మహా సహస్రావధానం, తృణావధానం, నాట్యావధానం, నేత్రావధానం, గణితావధానం - ఇలా అనేక పేర్లతో అవధానాలు నిర్వహించబడు తున్నాయి. కొంతమంది కొన్ని కొన్ని అవధానాల్లో దిగ్దంతులై మంచి పేరు సంపాదించారు. నేత్రావధానంలో పిశుపాటి చిదంబర శాస్త్రి, కొప్పరపు సోదర కవులు, క్రొత్తపల్లి ఘన శ్యామల ప్రసాదరావు మున్నగువారు విఖ్యాతినొందగా, నాట్యావధానంలో ధారా రామనాధ శాస్త్రి గారు ఎంతో ప్రశస్తినొందారు. అష్టావధానాల గురించి అందరికీ తెలిసిందే. 13వ శతాబ్ది వాడగు పెద్దయామాత్యుడు మొదలుకొని భట్టుమూర్తి, చరిగొండ ధర్మాన మొదలుగా నేటి మాడుగుల నాగఫణి శర్మ, డా॥ గరికపాటి నరసింహారావు, డా॥ రాళ్లబండి కవితా ప్రసాద్, డా॥ కడిమెళ్ళ వరప్రసాద్, కోట లక్ష్మీ నరసింహారావు, వద్దిపర్తి పద్మాకర్, కట్టమూరి చంద్రశేఖరం, బృందావనం బాల సుబ్రహ్మణ్యం, డా॥ పాలపర్తి శ్యామలానంద ప్రసాద్ మున్నగు వారెందరో ఈ అవధానవిద్యలో నిష్ణాతులై రాణించి లబ్ధప్రతిష్ఠులైనారనడంలో అతిశయోక్తిలేదు.

**1. నిషేధకరి :-** అవధాని ఏ అక్షరాన్ని చెప్పాలనుకుంటారో గ్రహించి దానిని పృచ్ఛకుడు వద్దనాలి.

**2. న్యస్తాక్షరి:-** ఒకనాల్గక్షరాల పదాన్ని తీసికొని ఒక్కొక్క అక్షరాన్ని ఒక్కొక్క పదంలో ఏదో ఒక సంఖ్య ప్రకారం నాల్గక్షరాల్ని నాల్గుపాదాల్లో అడిగిన సంఖ్యలో ప్రయోగించి చెప్పాలి. అయితే పృచ్ఛకునకు ఛందోజ్ఞానం అవసరం. లేనిచో అభాసుపాలే.

**3. సమస్య:-** అవధానంలో చాలా ముఖ్యమైనది, చమత్కారయుతమైనది సమస్యాపూరణం. అర్ధం పర్ధంలేని విధంగా పృచ్ఛకుడు ఒక సమస్యను తయారుచేసి ఇవ్వగా అవధాని దానిని సార్థకం గావిస్తాడు. అలా చేయడంలోనే అవధాని ప్రతిభావ్యుత్పత్తులు, శక్తి ఇమిడి ఉంటాయి.

**4. వర్ణన:-** ఏదైనా ఒక అంశాన్ని గూర్చి ఫలానా ఛందంలో చెప్పుమని పృచ్ఛకుడు అడుగగా దానిని అవధాని చెప్పడం.

**5. దత్తపది:-** నాల్గు పదాలు ఇచ్చి ఒక్కొక్క పదాన్ని గ్రహిస్తూ నాల్గు పాదాల్లోను ఆ నాల్గు పదాల్ని ఉంచి అడిగిన అర్ధంలో పద్యం చెప్పడం.

**6. ఆశువు:-** అప్రయత్నంగా అలవోకగా అడిగిన అంశాన్ని గూర్చి పద్యం చెప్పడం.

**7. పురాణ పఠనం:-** ఏదైనా ఒక గ్రంథంలోని కొన్ని పద్యాలు చదువగా

అవధాని ఆ పృచ్ఛకుడు చదివిన గ్రంథం పేరు, కవిపేరు చెబుతూ సందర్భాన్ని వివరించి ఆ పద్యాల భావం తెలుపుట.

**8. అప్రస్తుత ప్రసంగం:-** అవధానంలో అతి ముఖ్యమైనది ఇది. అవధాని యొక్క లోకజ్ఞత, వాక్చాతుర్యం దీనిలోనే వ్యక్తమవుతుంది. అవధాని శక్తిని, ధారణను తప్పుద్రోవ పట్టించడానికి ఈ అంశం తోడ్పడుతుంది. పృచ్ఛకుడు అడిగే తల తోక లేని ప్రశ్నలకు ఓర్పుతో హాస్యంగా అవధాని సమాధానాలు చెప్పాలి. దాటవేయరాదు. సభారంజకత్వం దీనిపై ఆధారపడి ఉంటుంది.

ఆపై ఏ పృచ్ఛకుడు ఏ ఏ ప్రశ్నలు అడిగారో తెలుపుతూ వారికి తాను చెప్పిన పద్యాన్ని తిరిగి గబగబా చెప్పాలి. ఇవి అవధాని గారి ధారణపై ఉంటుంది.

**ఆశువు :** ఒక అవధానంలో 'దూరదర్శన్ చిద్విలాసం' గూర్చి చెప్పుడనగా డా॥కడిమిళ్ళ వరప్రసాద్ గారి పద్యం

"ప్రేక్షకుల యోర్పు సతతము పరీక్షసేయు
దూరదర్శిని నేర్పు ప్రస్తుతిని గాంచు
సంత చద్దికి నంజు రెండింతలట్లు
ప్రకటనలు వేలు, విషయమ్ములొకటి రెండు".

నందిగామ సంపూర్ణ అష్టోత్తర శతావధానంలో 'తెలుగు తల్లికి బుల్లి చెల్లి పుట్టింది – మరకొ చెల్లి పుడుతుందా' అని మొవ్వా భాస్కరశాస్త్రి గారు అడుగగా డా॥మేడసాని మోహన్‌గారు చెప్పిన ఆశువు.

"విలసనంబుగ పూర్వ వైభవవిస్ఫురగతులొప్పగా
తెలుగు తల్లి ప్రసన్న హేలల దీప్తమై అలరారగా
అలరు కాంతులు విస్మరింపగ ఆత్మవేదన మీరగా
తెలుగు తల్లికి బుల్లి చెల్లిని తెచ్చుటెట్టుల సోదరా!"

ఇలా చెప్పుకుంటూ పోతే ఎన్ని అయినా చెప్పవచ్చును. మచ్చునకు ఏవో కొన్ని పద్యాలు మాత్రమే. అవధాన విద్యను ఇంకా ఇంకా పెంచి పోషించే ఉదారులు, సాహిత్యాభిమానులు ముందుకు రావాలి. తెలుగువారి ఖ్యాతిని ఖండ ఖండాంతరాల్లో చాటిచెప్పే అవధాన విద్య ఎంతగానో ఎదగాలి.

'జయంతితే సుకృతినో రససిద్ధాః కవీశ్వరాః

# కృష్ణరాయ ప్రశస్తి

– ఆర్యమురారి బాలాజిరావు

సీ. శ్రీరామ వల్లభ చిన్మయ రూప ని
    రంతర ధ్యాన ముద్రా పవిత్ర !
విమత వృక్ష కుఠార ! వైదిక సహకార !
    సామంత రాజన్య సంస్తుతార్య !
క్షామరహిత సుభిక్ష పాలనాదక్ష
    యాచక సురభూరుహేంద్రభోజ !
విపుల కావ్య స్రష్ట విబుధ పోషిత హస్త
    పంచశతాబ్యుత్సవ ప్రశస్త !

తే. సరస సాహిత్య సంగీత సమవినోది
సమర చాతురీ సంవేది శత్రుభేది!
శుద్ధ పాండితీ వైభవ సుకవి చంద్ర
కృష్ణదేవరాయ నృపేంద్ర కీర్తి సాంద్ర !

సీ. కర్ణాటక, తమిళ కటక వలయమైన
    సువిశాల మండల శోభితమ్ము
పావనమౌ తుంగ, భద్రానదీ, పెన్నా
    కృష్ణల పరివాహ ఋతువనమ్ము
ద్రాక్షా రసాలాది లతగుల్మవృక్షాది
    సుందరోద్యానాల మందిరమ్ము
అష్టదిగ్గజ కవులాది కళాకార్లు
    కాలు మెట్టిన యట్టి కవన భూమి

తే. సమర మందున జంకని సాయుధజన
యువ పరమ విచిత్రంబైన యుద్ధభూమి
భళిర ! విఖ్యాతి పొందెను ఘలువ జాతి
విజయ నగరంబనవెరవ విమత జాతి

కం. ధరణీ రమా రమణు లెం
దరి వలచెను కీర్తి కాంత తమ వలెనెన్నన్
పరలోకమేగియు నిహ
స్మరణీయుడ వైతివీవు సన్నుత చరితా

సీ. అలసాని యల్లిక కాలంబమైనట్టి
    శృంగార కావ్యాల తృష్ణలేరి?
ముక్కుతిమ్మనగారి ముద్దు పల్కుల నెల్ల
    మురిపాన వినియెడి ముగ్ధలేరి?
భోరుమనగ భట్టు మూర్తి నోదార్చెడి
    యార్ద్ర హృదయులైన యాప్తులేరి?
రామకృష్ణుని రసరమ్య వాక్చాతురి
    కానంద సంభరితాత్ములేరి?

తే. సూరనాదిగ సత్కవి సూరివరుల
సతము సన్మానమొనరించు సరసులేరి?
నాకమేలగ నీవేగ లోక వినుత
తరలివచ్చిరో? నీవెంట ధరణివీడి

మం.ద్వి. రాయలేలిన యట్టి రత్నాల సీమ
రాళ్ళసీమగ మారె "రామ రామ" నుచు
పలవరింతు నేడు తలపోసి జనులు
శీతాద్రి సమధీర, శ్రీకృష్ణరాయ.

# తెలుగుకు ప్రాచీన హోదా సరే... మరి ఆధునిక హోదా మాటేమిటి?

- డా॥ వి.వి. కృష్ణశాస్త్రి

"సరిగ్గా తొమ్మిది గంటలకు కాల్చేస్తాను" అన్న మాట మీ చెవిన బడితే ఏ ఉగ్రవాది మాటగానో, ఏ నక్సలైటు మాటగానో అనుకోకండి. సరిగ్గా తొమ్మిది గంటలకు "కాల్" చేస్తాను అని (అంటే మొబైల్‌లో ఫోను చేస్తాను అని) ఈనాటి యువతరం మాటకు అర్థం. ఒకనాడు ఒక సంస్కృత పదాన్ని, ఒక తెలుగు పదాన్ని కలిపితే మాష్టారుగారు కొట్టేవారు. "దుష్టచెట్టు" అన్నందుకు తెలుగు మాస్టారుగారు తెగబాధ పడిపోయారు. "దుష్ట" అన్నది సంస్కృత పదం, "చెట్టు" అన్నది తెలుగు పదం. ఈ రెంటినీ కలపరాదు అని పెద్ద లెక్చరిచ్చేవారు. అలాగే పాలాభిషేకం అని అనకూడదు అని (క్షీరాభిషేకం అనాలని) తెగ బాధపడిపోయేవారు. అసలు "విజయవాడ" కూడా ఆయన దృష్టిలో తప్పే. "విజయ" అన్నది సంస్కృత పదం, "వాడ" అన్నది తెలుగు పదం. కాబట్టి "విజయవాడ" తప్పు "విజయవాటిక" అనాలనీ బల్లగుద్ది మరీ చెప్పేవారు. అప్పటి మాష్టారులు కొట్టి చెబితే, ఇప్పటి యువతరం కొట్టి పారేస్తుంది. తెలుగు, ఇంగ్లీషు, హిందీ, ఉరుదూ కలిపి కలగాపులగం చేస్తే మూతిని ముప్పై వంకర్లు తిప్పే యాంకర్ల నోటి నుండి వచ్చేదే అసలైన భాషని భావిస్తే గ్లామరుతో వెలుగుతూ గ్రామరు లేని భాష మాట్లాడే వెండితెర దేవుళ్ళను, దేవతను పూజిస్తే, పత్తులురాని గాయకులు పాటలను, నాయకులు (హీరోల) డైలాగులూ వింటుంటే "తెలుగుకు ప్రాచీన సంగతి పక్కన పెట్టి - ఆధునిక హోదా మాటేమిటి" అని అనిపిస్తుందో లేదో ఒక్కసారి ఊహించుకోండి!!

తెలుగు సభల్లో ఇంగ్లీషు మాట్లాడే మరో వర్గం ఈ మధ్య తయారైంది. 'టెల్గూ ఈజ్ ఏ బ్యూటిఫుల్ లాంగ్వేజ్. ఉయ్ హావ్ టూ ఇంప్రూవ్ టెల్గూ స్పీకింగ్. మైడాటర్ వెంట్‌టూ అమెరికా, షీ హాజ్ ఫర్‌గాటెన్ టెగులూ, మై గ్రాండ్సన్ డజన్‌ట్ నో టెలుగూ ఎటాల్. టూబీ ఫ్రాంక్ వాట్ ఈజ్ హియర్! అవర్ కంట్రీ ఈజ్ ఎడస్ట్‌బిన్నండీ" అనే శోకాలు తీసే సోకాల్డ్ పెద్దమనుషులు వర్గం అందరికీ ఆశ్చర్యం కలిగిస్తుంది. ఈ దస్టుబిన్నులోనే నిన్నటిదాక ఉండి ఉద్యోగాలు చేసి, పిల్లల్ని కని ఇవ్వాళ పిల్లలు నాలుగు డాలర్లు సంపాదించగానే "ఇండియా.... అమెరికా వాళ్ళు ఉమ్మి వేసే దస్టుబిన్ను" లా ఉంది అనగడానికి ఈ పెద్దమనుషులకు మనసెలా ఒప్పుతుందో తెలియడంలేదు. "మొన్నీ మధ్యనే మా అల్లుడు రమ్మంటే అమెరికా వెళ్ళొచ్చానండీ, నిజం చెప్పాలంటే అక్కడ మరుగుదొడ్లు కూడా మన బెడ్రూముల కన్నా విశాలంగా అందంగా ఉంటాయండీ" అంటూ అమెరికా అల్లుళ్ళను తెగ పొగిడేవాళ్ళు కూడా ఉన్నారు. (అసలు ఇంతకూ ఆ అల్లుడు ఈ మామను రమ్మనేది ఎందుకో తెలుసా. అమ్మాయి ప్రెగ్నెంటయింది. ఇంటి చాకిరి చెయ్యడానికి 'అత్త'తో కలిసి రమ్మని ఆఘమేఘాలమీద టిక్కెట్లు పంపిచాడట)

("అమ్మాయికి అమెరికా సంబంధం వద్దంటే విన్నావా" అంటూ బండెడు చాకిరీ చేసే ముసలాయనను, ముసలావిడను కార్టున్లుగా "బాపూ" గీసి, వాస్తవానికి ఎంతో దగ్గరగా చూపించి, కొంటె బొమ్మల బాపు "గానేకాక" వాస్తవచిత్రకారుడు భాపు" అనిపించుకున్నాడు.)

మహా భారతకాలంనాటికే ఆంధ్రజాతి ఉన్నది అని, చిన్నప్పటి కృష్ణునితో మధురలో మల్లయుద్ధం చేసిన చాణూరుడు ఆంధ్రుడేనని, ఐతరేయ బ్రాహ్మ ణంలో ఆంధ్రుల ప్రసక్తి ఉన్నదని, విశ్వామిత్రుడు తన కుమారులను శపించే గాధలో ఆంధ్రులను ఉటంకించాడని, కామసాని గూడూరు శాసనంలో తెలుగు ఉన్నదని, నన్నయ్యకు వెయ్యేళ్ళ ముందే తెలుగు అక్షరాలు ఉన్నాయి, అమరా వతిలో మొదటి ఆంధ్రలిపిలో 'నాగబు' అనే పదం దొరికిందని, హాలుడి గాధా సప్తశతిలో తెలుగు మాటలున్నాయని, పండరంగడి శాసనంలో తెలుగు పద్యాలు న్నాయని, బ్రాహ్మిలిపి నుండి తెలుగు లిపి పుట్టిందని, నిశుంభుడనే రాక్షసుణ్ణి 'ఆంధ్ర' విష్ణువు జయించి శ్రీకాకుళం రాజధానిగా పాలించాడని శాతవాహనుడు ఆంధ్ర రాజ్యాన్ని అభివృద్ధి చేశాడని ఆ నాటికే భాష అభివృద్ధి పొందిందని, మనం వాదించి, వాదించి నిరూపించి, రుజువుచేసి, ఆధారాలు చూపించి, సాక్ష్యాలు అందించి, అనుసంధానించి బల్లగుద్ది మరీ చెప్పి "ప్రాచీన హోదా" అందు కున్నాం. మనకన్నా ముందే అరవవాళ్ళు "ప్రాచీన హోదా" అందుకున్నందుకు అక్కసుతో, కుళ్ళుతో కసితో మనం నిక్కి, నీల్గి దిక్కు దిక్కులా తిరిగి ఆ హోదా అందుకున్నాం. కేంద్రప్రభుత్వం ఒప్పుకున్నాక "చూశారా మనమూ సాధించాం" అంటూ చంకలు గుద్దుకున్నాం. సద్దుమణిగి, చతికిలబడి, ఊరుకున్నాం.

కాకపోతే అంతకుమించి ఏంచేశామో చెప్పండి? ప్రాచీనహోదా లభించిన తరువాత రావలసిన కోట్లు వచ్చాయా? అందుకు కృషి చేశామా? ప్రభుత్వం చేయాల్సింది చేసిందా? ప్రతి చిన్న విషయానికి గగ్గోలు పెట్టే మనం తెలుగు భాషను బ్రతికించుకోవడానికి ఏం చేశాం, ఏవ చేస్తున్నాం "ఈ ప్రభుత్వం ఇంతేనండీ, ఈ నాయకులు ఇంతేనండీ" అంటూ తేలికగా చప్పరించి, ఉచితంగా కామెంటు ఒకటి పారేసి ఊరుకుంటున్నాం. తప్పును ప్రక్కవాడి మీదకి త్రోసివేయడం మనకు వెన్నతో పెట్టిన విద్య. "మీ అమ్మ చావుబతుకుల మధ్య ఉన్నది బాబూ" అంటే "రోజూ ఆస్పత్రులచుట్టూ ఎవరు తిరుగుతారండీ, చచ్చిపోయిన తరువాత ఖరీదైన ఫొటో కట్టించడానికి బంగారు ఫ్రేము వేయించి (మన దగ్గర డాలర్లున్నాయి కదా) ఖరీదైన ప్లాస్టిక్ పూలదండ (వాసన లేనిది) వేద్దాం (మామూలు పూలదండైతే పూలు వాడిపోగానే మార్చాలి. అంత టైము లేదు. అంత వళ్ళు వంగదు మనకు) అనుకునే మనస్తత్వం అలవడింది. మాతృమూర్తి అయినా మాతృభాష అయినా మనకు ఒకటే. ఇప్పటికే అక్షరమాల నుండి (ఌ, ౡ) అసలు అక్షరాలు అదృశ్యమైనాయి. "ఇ, ఈ"లకు బదులు "యి, యీ"లు "ఉ, ఊ" లకు బదులు "వు, వూ"లు వ్రాసే ప్రబుద్ధులు ఉన్నారు. "ఋ,ౠ"లను ఎప్పుడో మ్రింగి జీర్ణించుకున్నాం. "ఙ,ఞ"లు ఎటు పారిపోయాయో తెలియదు. చ పైన వత్తు, జ పైన ఒత్తులను దూరం చేసుకున్నాం. "న" ను "ణ"ను ఒకలాగే పలుకుతాం. 'ళ'ను 'ల'ను ఒకలాగే ఉచ్చరిస్తాం. "పెళ్ళాం" అనడానికి "పెల్లాం" అంటాం. "భర్త" అనడానికి బదులు "బర్త" అంటాం. వత్తులు పలకలేము. సంధులు చేయలేము. అవ్యయం అంటే తెలియదు. విభక్తులంటే తెలియదు. తెలుగువాడికి మాత్రమే సొంతమైన

పద్యం అంటే తెలియదు. ఏది నోటికి వస్తే అది వ్రాసి అదే తెలుగు కవిత్వమని చెప్పుకుంటాం. (తెలుగు కవిత్వం ఇలా ఉంటుందా అని నలుగురు నవ్విపోవడానికి) ఫ్రీగా పంచిపెట్టి లక్కీడీప్ కూపనుపెట్టినా, ఆకర్షణీయమైన బహుమతులు అందిస్తామని చెప్పినా పుస్తకాలు కొనేవాళ్ళులేని కవిత్వం దాదాపు 95 శాతం వస్తుందీ రోజుల్లో. "ఎందుకు?" అనే ప్రశ్న వేసుకుంటే వచ్చే సమాధానం ఒకటే ప్రతీదీ కాజువల్‌గా "అనాసక్తిగా" తీసుకోవడం. సీరియస్‌గా (తీక్షణంగా) తీసుకోకపోవడం, ఎవరికోసమో జీవించడంలో ఆనందం లేనట్లే ఏదో వ్రాసి "అచ్చుబోసి" వదిలిపెట్టడంలో కూడ ఆనందం లేదు. తెల్లారేసరికల్లా "అర్జంటు కవులు" పుట్టుకొస్తున్నారు. భాషాశాస్త్రం తెలియనివారు పుస్తకాలు చదవని వారు, భాషమీద పట్టులేని వారు కవిత్వపు సౌందర్యాన్ని చూడలేనివారు, మాత్ర, గణం, యతి, ప్రాస, భావావేశపు పోకడ తెలియనివారు సవాలక్ష ముద్రారాక్షసాలతో భాషామతల్లిని 'దిగంబరి'ని చేసి నాలుగు వీధుల్లో తిప్పుతున్నారు. తెలుగు ఫలకాలు (బోర్డులు) పెట్టుకోవడానికి తెలుగువారు నామోషీ పడుతున్నారు. తెలుగులో మాట్లాడడం "తక్కువ తనం"గా భావిస్తున్నారు. "ధోషశల్యబంలేతోచు సంపన్న సాహితీ పాలనమున" అని రాయప్రోలు ఏనాడో మొత్తుకున్నాడు. ఇంక మనకెందుకండీ "అరవవాణ్ణి చూసి అక్కసు?" వాళ్ళు వాళ్ళ భాషా సాహిత్యాలను సంస్కృతిని ఎంతో ప్రియంగా చూసుకుంటున్నారు. చట్టసభల్లో అరవం మాట్లాడుతారు. అరవబోర్డులు పెట్టుకొని ఆనందపడతారు. రాష్ట్రేతర ప్రాంతాల్లో నివసించేవాళ్ళు కూడా అరవ సంఘాలు పెట్టుకొని సంస్కృతిని బ్రతికించుకుంటున్నారు. భాషను ఆధునీకరించి పదును పెట్టుకుంటున్నారు. శాస్త్రీయ గ్రంథాలు వెలయిస్తున్నారు. బెంగుళూరులో, ఆగ్రాలో, కలకత్తాలో అరవ పత్రికలు అందుబాటులో ఉంటాయి. వాళ్ళను చూచి అయినా మనం బుద్ధి తెచ్చుకొని భాసా సాహిత్యాలను ప్రోది చేసుకొని, రక్షించుకొని, అభివృద్ధిలోనికి తెచ్చుకొని భాషను, సాహిత్యాన్ని నరనరంలో ప్రవహించే జీవనదులుగా చేసుకుంటే తప్ప తెలుగుకు బ్రతుకులేదు. "యునెస్కో"వారి అభిప్రాయం ప్రకారం మరో ఇరవై ఏళ్ళలో అంతరించిపోయే భాషల్లో తెలుగు కూడా ఒకటి అట! కనీసం ఇప్పుడైనా మనం "కళ్ళు" తెరిచి, నిజం అరసి. భాషామతల్లికి తగు రక్షణ కల్పించాలి. దీని కోసం (1) తెలుగును మీ పిల్లలకు నేర్పండి. (2) తెలుగు ప్రాంతానికి దూరంగా ఉన్నవాళ్ళు తెలుగు సంఘాలు నెలకొల్పుకోండి. (3) తెలుగు పుస్తకాలు చదవండి. (4) తెలుగులో అపూర్వ సాహిత్య గ్రంథాలను సేకరించండి (5) నెలకొక తెలుగు పద్యమైనా బట్టీ పట్టండి (6) తెలుగులో వ్రాయడం నేర్చుకోండి (7) తెలుగులో సాఫ్ట్‌వేర్ అభివృద్ధి పరచండి (8) తెలుగులో ఎస్.యం.ఎస్ లు పంపండి (9) సామూహికంగా తెలుగు పండుగలు జరపండి (10) తెలుగులోని ప్రముఖ వ్యక్తుల పుట్టిన తేదీలను, పుణ్యతిధులను సాధ్యమైనంత వరకు గుర్తు పెట్టుకోండి (11) మంచి తెలుగు కావ్యాలను, సినిమాలను, మంచి సినిమా పాటలను ఆదరించండి (12) తెలుగులో శాస్త్రీయ విజ్ఞాన గ్రంథాలు వచ్చేలా ప్రోత్సహించండి (13) సాంకేతిక విద్య (టెక్నికల్ ఎడ్యుకేషన్)ను తెలుగులో బోధించండి (14) తెలుగు వెబ్‌సైట్లు, తెలుగు బ్లాగులు ప్రారంభించండి (15) అన్నింటినీ మించి తెలుగులో మాట్లాడండి. ●

## తెలుగు పద్యము - దాని విశిష్టత

- అధికార్ల నీలకంఠం

ఉ॥ భారతదేశమందు గల భాషలయందతి లెస్సయైనదై
తోరపు కీర్తి సంపదల తోడ విరాజిలు తెల్గు భాషలో
వీర విహారమున్ జరుపుపెక్కు తలమ్ముల యందు పద్యమే !
చేరగ రావు పద్యమును చేరగ వచ్చిన యవ్వి చిత్తగున్

ఉ॥ విద్యలయందు శ్రేష్ఠమగు విద్య కవిత్వము, దానిలో కనన్
పద్యము వ్రాయుటన్నయది భాషకు భూషణమౌను చక్కగా
పద్యము రాగ యుక్తముగ పాడిన నయ్యది. కర్ణపేయమై
గద్యము కంటె పద్యమధికమ్మగు, కందము వ్రాయదిట్టయౌ.

శా॥ బంగారమ్మగు భాష; దీని నగలే పద్యమ్ము తెల్లన్ సదా
శృంగారమ్మును గూర్చు కాయమునకే చూడంగ స్వర్ణమ్ము, పై
నింగిన్ చేరిన కీర్తి దెచ్చునిలపై నిత్యమ్ము పద్యమ్ము నే
భంగిన్ జూచిన నౌను పద్యకవియే ప్రాజ్ఞుండుయోచింపగన్.

చ॥ తెలుగును మాటలాడునెడ తేనియలూరుచునుండు, నింకనా
తెలుగున పద్యమే చదువ దేవతలైనను మెచ్చకుందురే?
కలదతి మోద మెయ్యెడల గాయకులున్ గళమెత్తి పాడగా
పలువిధ కీర్తులన్ బడయ వచ్చును పద్యకవీంద్రు లెల్లడన్.

ఉ॥ పాత బడంగ లేదిలను పద్యము వర్ధిలు నిత్యనూత్నమై
ఖ్యాతిని పొందుచుండె నధికమ్ముగ దేశవిదేశ మూల లం
దీ తెరగున్ కనుంగొనగ నెందరొ దెల్పుచునుంద్రునిక్కమున్
వ్రాతలెరుంగు వారిపుడు వ్రాయుడు పద్యము లెన్ని, యొన్నియోన్

ఉ॥ పద్యము జూడగా తెలుగువారి గృహమ్ముల పాడిపంటయౌ
పద్యము వేయి వర్షముల బంగరు పంటయు నౌను గాదె! యీ
పద్యము తెల్గులో నెపుడు పాడుము తీయగ తెల్గుబాల! నీ
పద్యములోని తేజము, ప్రభావము మ్రోలగ నెల్లదిక్కులన్

ఉ॥ పద్యములందె భారతము వ్రాసిరినాడు కవిత్రయమ్ము! నా
పద్యములే లిఖించె తన భాగవతమ్మున పోతనార్యుడున్
పద్యము మాదు సొత్తనుచు వ్రాసిరి రామ చరిత్ర నెందరో
పద్యము లే కదా! తెలుగు భాషకు ప్రాణము వ్రాయుడెల్లరున్.

ఉ॥ పద్యము లెప్పుడో తెలుగువారి మనమ్ముల నిండి యుండె, నా
పద్యము లెట్లు తీయబడు? బైటకు, సాధ్యమె? కాదు కాదిలన్
గద్యము పద్యమున్ కలసి కయ్యములాడగ నిల్వజాలునే?
గద్యము; పద్యమెంతయునౌ కన్నులు విప్పి విదల్చిచూడగన్.

ఉ॥ బద్దెన, పెద్దనార్యుడును, పాపయశాస్త్రియు నెందరెందరో!
ముద్దుగ పద్యముల్ కవనముల్ కడుజసేసియె మోక్షమందిరే!
కొద్దిగ శ్రద్ధ జూపునెడ కోరిక దీరగ మంచి పద్యముల్
ఇద్దర వ్రాయ వచ్చు; కొనుడియ్యవె వందనముల్ ముదమ్మునన్.

# మరపురాని మనస్వి

- డా॥ ఎల్లూరి శివారెడ్డి

హైదరాబాదు నగరానికి నడిబొడ్డు అబిడ్సు. అబిడ్సు నుంచి ఒకరోడ్డు గత చరిత్రను నెమరేసు కుంటూ కాచిగూడ స్టేషన్ వైపు తిన్నగా సాగిపోతోంది. అబిడ్సు నుంచి కొంత దూరం సాగిపోతే కుడివైపు ఆంధ్రదేశంలో మహనీయంగా వెలిసిన ఒక సాహితీ సంస్థ ఠీవిగా కనిపిస్తుంది. ఆ సంస్థలోపికి ప్రవేశిస్తే ఎడమవైపు మూలగదిలో పత్రికలు పారచూస్తూనో, సందర్శకులతో సంభాషిస్తూనో, గ్రంథావలోకనం చేస్తూనో, కార్యాలయ వ్యవహారాలను సమీక్షిస్తూనో ఒక విశిష్ట వ్యక్తి దర్శనమిస్తారు. మనిషి పొట్టిగా ఉన్నా మనసు మంచుమలతో పోటీచేసే వ్యక్తి ఆయన. డెబ్బది అయిదు వసంతాలు మీదపడ్డా ఆయన ఉత్సాహం తగ్గలేదు. కార్యదక్షత మొక్కపోలేదు. ఆయన పాద ధ్వనులకు, కంఠధ్వనులకు పరువం తగ్గలేదు. వారు డా॥ దేవులపల్లి రామానుజరావు గారు. ఆ సంస్థే ఆంధ్ర సారస్వత పరిషత్తు. రామానుజరావు గొప్ప మేధావి. ప్రముఖ సాహితీవేత్త. పత్రికా నిర్వహణదక్షులు. సంస్థా సక్రమ నిర్మాణ శీలురు. వాగ్మి, ప్రోత్సాహకులు. సాంస్కృతిక విజ్ఞాన చక్షువులు. తెలంగాణ వైతాళికులు.

వారి జన్మస్థలం ఓరుగల్లు మండలం. 1917 ఆగష్టు 25నాడు జన్మించారు. హనుమకొండలో పాఠశాల విద్య పూర్తి చేశారు. మద్రాసు విశ్వవిద్యాలయం నుంచి పట్టభద్రులయ్యారు. యల్.యల్.బి. పట్టా నాగపూరు విశ్వవిద్యాలయం నుంచి పొందారు. ఆ తరువాత శోభ పత్రిక నడిపారు. 1941లో వరంగల్లులోని శబ్దాను శాసన ఆంధ్ర భాషా నిలయానికి కార్యదర్శిగా ఉండి దిగ్విజయంగా రజతోత్సవాన్ని జరిపించారు.

1945-46లో వరంగల్లులో యువజన కాంగ్రెసుకు అధ్యక్షులుగా వున్నారు. రామానుజరావు గారి దక్షత గమనించి సురవరం వారు గోలకొండ పత్రికకు ఉప సంపాదకులుగా రమ్మని ఆహ్వానించారు. దానికి అంగీకరించి ఆ పత్రికతో ప్రగాఢ సంబంధం ఏర్పరచుకున్నారు. ఇలాగ తొలిదశలోని ఉత్సాహం తరువాత జీవన ప్రణాళికకు పునాదిగా నిలిచింది. కార్యరంగం హైదరాబాదుకు మారింది. తరువాత వారు ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడెమీ కార్యదర్శిగా, అధ్యక్షులుగా, ఆంధ్ర సారస్వత పరిషత్తు అధ్యక్షులుగా, విశ్వవిద్యాలయాలు, తెలుగు అకాడమీ పాలనా మండలి సభ్యులుగా, ప్రపంచ తెలుగు మహాసభలకు కోశాధికారిగా, నగర కేంద్ర గ్రంథాలయ సంస్థ సంచాలకులుగా ఎంతటి సేవలందించారో అందరికీ తెలుసు. వారు నిర్వహించిన తక్కిన పదవులు, బాధ్యతలు అపారం. ఇక్కడ ఏ సంస్థ పచ్చగా ఉన్నా అందులో రామానుజరావు గారి హస్తోదకం ఉంది. వారి ఆలోచనల అభిసేచనం ఉంది.

రామానుజరావు గారు రచించిన గ్రంథాలు, సంపాదకత్వ బాధ్యతలు స్వీకరించిన గ్రంథాలు ఇరవై అయిదు దాకా ఉన్నాయి. వారి రచనలో వైవిధ్యం ఉంది. పచ్చతోరణం వంటి కవితారచనలో 'ప్రకృతి రామణీయకము', పడతి కామనీయకము సరళ రమ్యముగా చిత్రితమయినవని ఆచార్య సి. నారాయణ రెడ్డిగారు అన్నారు. వారి రచనకు ప్రతిధ్వనులున్నాయి. కాని వారి రచనలలో ప్రతిధ్వనులుండవు. వారి సారస్వత నవనీతము సాహిత్య విమర్శ అనుభవ సంపుటి. తెలుగు సీమలో సాంస్కృతిక పునరుజ్జీవనము తెలంగాణ పద్దపాట్లకు, పొందిన వెన్నుపోట్లకు సాహితీరూప దర్పణం. వారి "యాభై సంవత్సరాల జ్ఞాపకాలు" చదివి ఆనందింపదగినది. అధ్యయనం చేసి ఆలోచింపదగినవి. వారి రచనలు స్వయం సమగ్రాలు. వారి అభ్యుదయ దృక్పదానికి సూచకాలు. వారి విజ్ఞానానికి కేతనాలు.

రామానుజరావుగారి వ్యక్తిత్వానికి సమయపాలన, నియమపాలన రెండు కళ్ళు. వారు సాంస్కృతిక రంగంలో అడుగువేసిన నాటినుంచి చేపట్టిన ప్రతి పని నిర్ణీత సమయ పరిధిలో పూర్తి కావలసిందే. ఏపనికైనా సమయపాలనా దక్షులైన వ్యక్తుల్నే నియమిస్తారు. రామానుజరావు గారికి నియమాలంటూ ఏమీలేవు. క్రమశిక్షణే వారి నియమం. క్రమశిక్షణలో వారు మధ్యందిన మార్తాండులు. సంస్థల వినాశనానికి క్రమశిక్షణ రాహిత్యం అసలు కారణం అని అంటుంటారు. ఈ విషయం చాలా మందికి తెలిసినా పాటించి, ఆచరింపచేయటంలో శ్రద్ధచూపరు. కాని ఈ విషయంలో వీరికి గట్టి పట్టుదల. ఉత్తరాలకు బదులురాయడం మొదలుకొని, విశ్వవిద్యాలయ పాలనామండలి సభ్యులుగా వ్యవహరించే విషయందాకా ఏ విషయం తీసుకున్నా. వారికి క్రమశిక్షణలో రాజీలుండవు. సంస్థలకు సంబంధించిన సొమ్మును ఖర్చు చేయడంలో మాడపాటివారి పద్ధతిని ఎన్నోసార్లు గుర్తు చేస్తారు. వారికి ప్రమాణాల మీదనే కాని పరిమాణాల మీద విశ్వాసం లేదు.

దేవులపల్లివారు సురవరం ప్రతాపరెడ్డి గారికి ఆప్తులు. ఏ సభకు వెళ్ళినా సందర్భం చూసుకొని సురవరం వారి పేరు ప్రస్తావించక మానరు. ప్రతాపరెడ్డిగారు మరణించి సుమారు నలభైయేళ్ళు దాటాయి. వారి రచనలు చాలావరకు అలభ్యం. సురవరం ప్రతాపరెడ్డిగారి ప్రథమ కుమారులు శ్రీ యస్.యస్.రెడ్డి గారి సహకారంతో రామానుజరావుగారు ప్రతాపరెడ్డి గారి గ్రంథాలు పన్నెండిటిని 'సురవరం ప్రతాపరెడ్డి వైజయంతి' పేరిట ముద్రించటంలో అత్యంత శ్రద్ధ తీసుకున్నారు. రెండేళ్ళ సమయంలో ఈ పన్నెండు పుస్తకాలు ప్రచురించటానికి వారి సమయపాలన ఏకాగ్రత మొదటి కారణం. ప్రతాపరెడ్డి గారికి వారుచేసిన సేవ విలువ కట్టరానిది. ప్రతాపరెడ్డి గారి పేరిట ఏదైనా ఎవరైనా చేస్తే అది వారే చేశారు.

దేవులపల్లి వారి అభిరుచులు, ఆశయాలు ఉదాత్తమైనవి. వారి వ్యక్తిత్వానికి వన్నె తెచ్చింది అపారశేముషీ వైభవం. ఎన్నో విషయాలు వారు చెబుతూ వుంటే ఎదుట ఉన్నవారు చకితులై వింటారు. భారత జాతీయ నాయకుల వ్యక్తిత్వాలను తెలిపే సంఘటనలు, సూక్తులు, పుంఖాను పుంఖంగా ఉదాహరిస్తూ గంటలకొద్దీ సంభాషిస్తారు. సాంస్కృతిక విషయాలను విశ్లేషించి సమదృష్టితో విషయాల్ని బేరీజు వేస్తారు. సాహిత్య విషయాల్లో వారి అభిప్రాయాలు నిగ్గుదేలినవి. పండితులకే పరిమితమైన ఛందో వ్యాకరణాలంకార విషయావగాహన ఒక్కటే విమర్శకాదని వారి అభిప్రాయం. మనో వికాసానికి, జాతి జాగృతికి, పేదల, దళితుల ఉద్ధరణకు పనికి వచ్చే అంశాల ప్రాముఖ్యాన్ని ఒత్తి చెబుతారు. తెలుగు విమర్శకుల్లో రాళ్ళపల్లి వారంటే అమితమైన అభిమానం. రాళ్ళపల్లి వారి వ్యక్తిత్వం వారిని ఎంతగానో ఆకర్షించింది. వారిలాగా విషయతత్వం చెప్పటం విమర్శ పరమార్థమని రామానుజరావుగారి అభిప్రాయం. రచనల వెనుక బిత్తికగా నిలిచిన చారిత్రక, సాంస్కృతిక

విషయాల్ని వారు అనుశీలించి చూపుతూ విషయాలు వివరిస్తారు. ప్రాచీన సాహిత్యాన్ని గురించి చేసే ప్రసంగాల్లో అందులోని చారిత్రక విషయాన్ని విశ్లేషించి చూపుతారు. ఆంగ్ల, హిందీ, ఉర్దూ రచనలు అధ్యయనం చేయటం వల్ల వారి దృష్టి బహు విషయాలను ప్రస్తరించి చూపుతుంది. వారికి సంస్కృత సాహిత్యానికి గురించిన సమ్యగవగాహన ఉంది.

ఏ విషయం మీదనైనా సాధికారికంగా, సందర్భోచితంగా ప్రసంగించటంలో వీరికి ప్రత్యేకత ఉంది. ప్రతి చిన్న సంఘటనకు సంబంధించిన తేదీలను కూడా గుర్తుంచుకొని విషయాన్ని సమగ్రంగా ఉదహరిస్తారు. రామానుజరావు గారి కంఠ ధ్వనికి కూడ ప్రత్యేకత ఉంది. వారు వక్తృ కంఠీరవులు. వారి గళానికి ఠీవి, భాషకు దర్జా ఉన్నాయి. ఈనాడు తెలుగు రాజధానిలో విద్వత్సభలకు, సాంస్కృతిక సభలకు అధ్యక్షులుగానో, ముఖ్యఅతిథులుగానో సారథ్యం వహించే వారిలో డా॥ రామానుజరావు గారు, ఆచార్య సి.నారాయణరెడ్డిగారే అగ్రేసరులు. రామానుజరావు గారి భాషణలో విషయ ప్రాధాన్యం, విషయ వివేచనం సరిపాళ్ళలో ఉంటాయి. వారి ఉచ్చరణలో ఒక సౌందర్యం ఉంది. ప్రామాణిక తెలంగాణ భాషకు ప్రథమోదాహరణం వారిదే. తెలంగాణ తెలుగులో తీయదనం, నుడికారపు సొంపు వారి భాషలో తొణికిసలాడుతుంది. వారు ఏ గ్రంథాన్ని గురించి అభిప్రాయం ఇచ్చినా దాని నేపథ్యాన్ని తెలుపుతారు. ఆంగ్లంలో అనర్గళంగా భాషించగలరు. ఉర్దూలో ఉరకలు వేసే ప్రసంగాలు చేయగలరు. ●

## జిలుగు వెలుగుల తెలుగు

- జి.వి. రమణ

కృష్ణా, గోదావరి జలాల మాధుర్యం
మామిడిపండ్ల మధుర రస్వంత తీయదనం
అమృతం – మకరందాలకు సరితూగే తీపిదనం
తర తరాల వెలుగు – మన తేనెలొలుకు తెలుగు.

అ,ఆ లు పలుకుతుంటేనే ఆమని హాయిగా రాగాలు ఆలపించినట్లు
వెన్నెల వర్షం కురిసినట్లుగా; పసందైన విందుభోజనం చేసినట్లుగా
అంతులేని ఆనందంతో మైమరచి ఓలలాడినట్లుగా
దివిలోని పారిజాతంలా; గగనంలోని ధృవతారలా
ఇదీ మన భాషా సౌరభం; ఇదీ మన భాషా వైభవం.

సాటిలేని మేటి ఘనాపాటి మన తెలుగుభాష
రాయలు నచ్చి, మెచ్చి, నెత్తిన పల్లకీలో ఊరేగించిన భాష
పగటి సూర్యునిలా; నిండు చంద్రునిలా భాసించే భాష

పరభాషా వ్యామోహంతో మాతృభాషను మరవద్దు
మన తెలుగు భాషను నిరాదరణకు గురిచేయవద్దు
తెలుగు భాషను తల్లిని వృద్ధాశ్రమం దరి చేరనివ్వవద్దు

తెలుగు పద్యం తరగనిధనం – చెరగని వైభవం
తెలుగు భాషావ్యాప్తి సేవలో తరిద్దాం
గురుతర బాధ్యత గుర్తుంచుకుందాం
తరతరాలుగా తరగని వెలుగైన తెలుగును రక్షించుదాం
జన్మసాఫల్యత చేకూర్చుకుందాం.

## మ్యూజియంలో పెళ్ళి

-డా॥ రమణ యశస్వి

తాళిబొట్టు నుదుటిబొట్లు
పండి'పోయిన' పెళ్ళికి
బండగుర్తులుగా మ్యూజియంలో
మిగలనున్నాయి.
అంతరిస్తున్న
ఆచారాల జాబితాలోకి
జరజర బిరబిర
జారిపోతున్నాయి.
పెళ్ళికి ముందే
కళ్లెం తెంపుకొని
శృంగారపు కోర్టుల్లో
నయం భయంలేని
నవయువ జంటలు తయారై
తమాషా చేస్తున్నాయి.
చీరకట్టులు
కాలిమెట్టెలు కనుమరుగై
తలంబ్రాలు నూతన 'బ్రా'లని
పొరబడే రోజులు
తరలి వచ్చేశాయి.
అబార్షన్ మాత్రలకు మల్లే
మంగళ సూత్రాలకు
ఎక్సపయిరీ డేట్లు రాస్తున్నారు
సహజీవనం అంటూ
సహనం కోల్పోయి
ఏడడుగుల బంధానికి
ఆరడుగుల సమాధి కట్టనున్నారు.
అగ్ని సాక్షిగా పెళ్ళెందుకు
తంతు సాక్షిగా
తల్లితండ్రులెందుకు?
మీడియా సాక్షిగా
లివింగ్ టు గెదర్ అంటున్నారు
ఓ.." పెళ్ళీ తరతరాలన్నీ
నీకు నూరేళ్ళు నిండనున్నాయి.
నువ్వే కోర్టులకెళ్ళినా
నెగ్గలేక ఓడి, కనీ కనపడని
అరుంధతీ తారగా
నిలిచిపోనున్నావు.

# తెలుగు సాహిత్యం - సామాజిక ప్రయోజనము

- ఎ.వి.కె.సుజాత

బతుకుబాటగలో పూతోటలు విరబూయాలన్నా, పున్నమి వెన్నెల నవ్వులు రువ్వాలన్నా ఉగాది ఉషస్సులు మెరియాలన్నా తెలుగు సాహిత్యం చదవాలి. వ్యక్తుల పావన జీవన బృందావనంలో సత్యం, ధర్మ, అహింస, న్యాయం, సుఖశాంతులు వెల్లివిరియాలంటే సామిత్యం మంచి సాధనంగా ఉపకరిస్తుంది. మానవ జీవితం సమత మమతల సుమహారం పరిమళించడానికి సహనం, త్యాగం అలవడటానికి సాహిత్యం తోడ్పడుతుంది. ఆకలిగొన్నవారికి పరమాన్నంలా ఎడారిలో ఒయాసిస్సులా, చీకటిలో వేకువ వెలుగుల సువర్ణ సుప్రభాతంలా మనల్ని సేదతీర్చే దివ్యౌషధం సాహిత్యం.

తెలుగు సాహితీవనంలో ఎన్నో సుమాలు తమ పరిమళాలతో మనకు అనిర్వచనీయమైన ఆనందాన్ని ఆహ్లాదాన్ని కలిగిస్తాయి. పద్య, గద్య కవిత్వం భావ సాహిత్యం, దిగంబర సాహిత్యం, విప్లవ, దళిత, స్త్రీవాద, మైనార్టీ సాహిత్యం, ప్రాంతీయ సాహిత్యం. అభ్యుదయ సాహిత్యం పెద్దలకు సంబంధించినవి. పిల్లల్లో అంతర్గత సృజనాత్మక శక్తులను వెలికితీసి, వారి సమగ్ర వ్యక్తిత్వ వికాసానికి కళాభినివేశానికి పట్టంగట్టేది బాల సాహిత్యం.

నేటి సామాజిక రుగ్మతల నెన్నింటినో సాహిత్యం ద్వారా రూపుమాపవచ్చును. వ్యక్తుల్లో మానసిక పరివర్తన, చైతన్యం తీసుకువచ్చే పవర్‌ఫుల్ వెపన్ సాహిత్యం. ఈవ్‌టీజింగ్ వంటి క్షుద్ర సంస్కృతిపై రుద్రవీణ మ్రోగించిన ఆకతాయిల ఆట కట్టించవచ్చు. సాహిత్యం ద్వారా యువతలో నైతికత, మానవీయత, ఆధ్యాత్మికత, తాత్వికత, విజ్ఞత, ఏకాగ్రత, సమైక్యతను పెంపొందించవచ్చు. సాహిత్యం ద్వారా మనీ విలువలకన్నా మానవీయ విలువలు మిన్న అని చాటిచెప్పి గృహహింస, వరకట్న మరణాలను అరికట్టవచ్చును. భ్రూణ హత్యలు, బాల్యవివాహాల వంటి దురాచారాలను రూపుమాపవచ్చును. మానవత్వాన్ని మంటగలిపి మగువల మాంగల్యాన్ని మసిచేసి ఎన్నో అత్యాచారాలకు, హత్యలకు కారణమైన మద్యపానాన్ని సాహిత్యం ద్వారా నిషేధించి ప్రజల్లో మానసిక చైతన్యం తీసుకురావచ్చును. సమాజంలో అశాంతి, అభద్రతలను పెంచే ఉగ్రవాదాన్ని అంతమొందించి లా అండ్ ఆర్డర్ సక్రమంగా ఉండేలా చూడటానికి సాహిత్యం తోడ్పడుతుంది. నేడు అవినీతి అసురుడు విశ్వమంతా వ్యాపించి వికటాట్టహాసం చేస్తున్నాడు. అలాంటి అవినీతిని అధః పాతాళానికి అణగద్రొక్కే వజ్రాయుధం సాహిత్యం. సమాచార చట్టం, విద్యాహక్కు చట్టం, జాతీయ గ్రామీణ ఉపాధి హామివంటి చట్టాలు చట్టుబండలవ్వకుండా ఎవరి చుట్టాలుగా మారకుండా సామాన్య ప్రజలకు ప్రయోజనకరంగా మారేలా సాహిత్యం ద్వారా చేయవచ్చును. అక్షరదీప్తి, ఆరోగ్యప్రాప్తి వంటి సంక్షేమ పథకాల అమలుకు అనువైన పరిస్థితులు కల్పించవచ్చు. పర్యావరణాన్ని పరిరక్షించుకోవచ్చును. పలు సాంఘిక, ఆర్థిక, రాజకీయ సమస్యలపై అవగాహన కలిగించి, ప్రజలను ప్రజాస్వామిక వాదులుగా పరిపాలనా దక్షులుగా రూపొందించటానికి సాహిత్యం మంచి సాధనం. ఎన్నో కులాలు, మతాలు, ప్రాంతాలు, భాషలు, జాతులున్నా ఆలపించేది సమైక్యతారాగమేనని సాహిత్యం ద్వారా నిరూపించవచ్చు.

వ్యక్తుల్లో సంకుచితం, స్వార్థం, వ్యర్థ ప్రలాపనల వంటి అనర్థాలను అదుపుచేసి జీవన పరమార్థం తెలుసుకొని, సార్థకతను పొందే మార్గం చూపుతుంది సాహిత్యం. కష్టసుఖాలు, లాభనష్టాలు, చీకటి వెలుగులు, గెలుపుని ఓటమిని సమానంగా చూసే స్థితప్రజ్ఞతను పెంపొందిస్తుంది. నేటి ఆధునిక సమాజంలోని యాంత్రికతను అధిగమించటానికి వ్యక్తులమెత్తని చిత్తానికి కలిగే ఒత్తిడిని తక్షణమే చిత్తు చేసి సత్తాచాటి మహత్తరన ఫలితాలను సాధించటానికి సాహిత్యం ఉపకరిస్తుంది. మనోమాలిన్యాలను త్రుంచి మాధుర్యాలను పంచి, మమతలను పెంచే, మహత్తర సాధనం. దైవప్రీతి, పాపభీతిని లోకనీతిగా మార్చి వ్యక్తులు శుభప్రదంగా, జయప్రదంగా, మంగళప్రదంగా, ఆనంద ప్రదంగా జీవించటానికి విరుల బాటలు వేసే తెలుగు సాహిత్యానికి శతకోటి వందనాలు. ●

## మన సభలు

- డాక్టర్ బి. జ్యోతి స్వరూపరాణి

సభలండోయ్ సభలు తెలుగు మహాసభలు
ప్రపంచతెలుగు రచయితల సభలు
అపుడు సభలు ఇపుడు సభలు
ఎపుడూ జరుగుతాయి సంబరాల సభలు

తెలుగు కీర్తినిచాటే సభలు
సాహిత్య సౌరభం విరజిల్లే సభలు
తెలుగుభాష నుడికారం తెలిపే సభలు
పదహారణాల తెలుగువారి సభలు

భాషపట్ల భక్తినిచాటే సభలు
భాషకు న్యాయం జరిగే సభలు
భాషను నిలబెట్టే సభలు
భాషకోసం ప్రాణం ఇచ్చే సభలు

కొండల కోనలు వాగువంకలు దాటి
వయ్యారాలు పోయే జీవనదిలా
చల్లని పిల్ల తెమ్మెరల సరాగాల సరసాల
స్వరాలు పలుకుతుంది
కమ్మని నా తెలుగు ఈ సభల్లో

రండి కలసికట్టుగా చేరుదాం
భాషపై పట్టు సాధిద్దాం
తెలుగుభాష జిగిబిగిని కాపాడుదాం
వలపు తెలుపు సమసుగంధాలను
జగానికంతా పంచుదాం....

# ఆంధ్రభోజుని వైభవం

- తాళ్ళపాక నటరాజ

"దేశ భాషలందు తెలుగు లెస్స" అని సంభోదించిన "ఆంధ్రభోజుడు" శ్రీ కృష్ణదేవరాయలు గారు శ్రీమతి నాగులాంబ నరసరాయల పుత్రుడు. వీరి బాల్యం చంద్రగిరి సీమలో గడిచినట్లు చరిత్ర చెబుతోంది. విజయనగర సామ్రాజ్య పాలన ఒడిదుడుకులలో వున్నప్పుడు క్రీ.శ. 1509 సం॥ అనగా విభవ నామ సంవత్సర మాఘ మాసంలో మహామంత్రి అప్పాజీగా పిలువబడుతున్న శ్రీ సాళ్వ తిమ్మరసు ఆశీస్సులతో పట్టాభిషిక్తుడయ్యారు.

శ్రీ కృష్ణదేవరాయలు బాల్యం నుండి ఖడ్గ విద్యలతోపాటు మల్లయుద్ధము, క్రీడలు, వ్యాయామములలో ఆరితేరినవారు. అప్పాజీ చాతుర్యంతో కటకం నుండి కన్యాకుమారి వరకు విజయదుందుభి మ్రోగించి సామ్రాజ్య విస్తరణ చేసినారు. శ్రీకృష్ణదేవరాయల సామ్రాజ్య విస్తరణలో సహాయకులుగా 1. అరవీటివారు 2. ఔకువారు 3. నంద్యాలవారు 4. వెలుగోటివారు 5. పెమ్మసానివారు 6. బూడహం వారు 7. తొరగంటివారు 8. తుళువ దొరలు 9. కమ్మవారు 10. జీదవరాజులు మొదలగు ఇతర రాజులు సహకరించినారు. ఈ విజయ సాధనలో శ్రీకృష్ణదేవరాయల వారు ఆరులక్షల (6,00,000) భటులు, అరవై ఆరువేల అశ్వదళం (66,000) రెండువేల (2,000) గజదళాన్ని పోషించినట్లు చరిత్ర వివరాలు అందిస్తోంది.

ఒకవైపు శ్రీకృష్ణదేవరాయల వారు సామ్రాజ్య విస్తరణ చేస్తూ కవులను, కళాకారులను ఆదరించి పోషించారు. తన అస్థానంలో అష్టదిగ్గజాలుగా పేరుపొందిన 8మంది కవులు ఉండిరి. వారిలో శ్రీ అల్లసాని పెద్దన, మాదయ్యగారి మల్లన, నంది తిమ్మన లాంటి గొప్ప కవులు కలరు. శ్రీకృష్ణదేవరాయల వారు అష్టదిగ్గజాలలో అగ్రగణ్యుడైన అల్లసాని పెద్దనగారి కాలికి 'గండపెండేరం' తొడిగి ఆయన కూర్చున్న పల్లకిని మోసి తనకు సాహిత్యం, కవుల పట్ల గల గౌరవాన్ని, అభిమానాన్ని చాటుకున్నారు. స్వతహాగా శ్రీకృష్ణదేవరాయల వారు "ఆముక్తమాల్యద" అను గ్రంథాన్ని రచించి కవిగా వెలుగొందారు. కవితాగోష్టులకు భువన విజయాన్ని నెలకొల్పారు. విజయనగర సామ్రాట్టులలో కళల పట్ల, కళాకారుల పట్ల ఆదరణ చూపుతూ పోషించారు. శ్రీకృష్ణదేవరాయల వారు శ్రీశైలం, అహోబిళం, తిరుమల, తిరుపతి, శ్రీకాళహస్తితో పాటు తన సామ్రాజ్యంలో అనేక దేవాలయాలను కట్టించి, అనేక దేవాలయాలను పునరుద్ధరించారు. వేలాది ఎకరాల భూమిని దేవాలయ నిర్వహణకు మాన్యాలుగా ఇచ్చినట్లు అనేక శాసనాలు వేయించారు. విదేశీయులతో వాణిజ్యం నెరిపారు. వ్యవసాయ రంగానికి, తాగునీటి కొరకు అనేక తటాకాలను నిర్మించి కరువుకాటకాలకు గురికాకుండా చేసారు. ఇతరులకు అనేక గ్రామాలను నిర్మింపజేసారు. పరమత సహనాన్ని పాటించారు. విదేశీ యాత్రికులను గౌరవించారు. తన సువిశాల రాజ్యమునందు ప్రజలకు సుపరిపాలన అందించుటకు గాను రాజ్యాన్ని 9 (తొమ్మిది) ఖండాలుగా విభజించి రాజప్రతినిధులను నియమించారు.

ఈ విధంగా కృష్ణదేవరాయల కాలంలో, సామ్రాజ్య విస్తరణ, కవులకు, సాహిత్యానికి గౌరవం, కళాకారుల పట్ల ఔదార్యం, ప్రజలకు సుపరిపాలనను, తటాక నిర్మాణాలు, ఆలయాల నిర్మాణం, పునర్నిర్మాణం చేసి అనేక బిరుదాంకితులయ్యారు. అందుకే ఆయనను శ్రీమన్మహారాజాధిరాజ, రాజపరమేశ్వర, మూరురాయర గండ, అరిరాయ విభాడ, అష్టదిక్కురాయ మనోభయంకర, త్రిసముద్రాధీశ్వర, వనరాజ్య స్థాపనాచార్య, గజపతి విభాడ, సాహితీ సమరాంగణ చక్రవర్తిగా శ్రీకృష్ణదేవరాయలు బిరుదాంకితులై ప్రజల మదిలో సుపరిపాలకులుగా క్రీ.శ.1509 నుండి క్రీ.శ. 1530వరకు వెలుగొంది శ్రీ తిరుమల వెంకటేశ్వరస్వామి కరుణా కటాక్షములతో పాలించి క్రీ.శ. 1530వ సం॥లో విష్ణు సామ్రాజ్యం పొందారు. అందుకే శ్రీకృష్ణదేవరాయల పట్టాభిషేకం జరిగి, రాజ్యపాలన చేసి 500 సం.లు అయినప్పటికీ ఆయన సాహితీ సేవలు, కళాపోషణ, సుపరిపాలన నేటికీ ప్రజల మదిలో మెదులుతోంది. ఇది శ్రీకృష్ణదేవరాయల వైభవం, చరితను తెలుగువారి మదిలో నాటుదాం. స్మరిద్దాం. కృష్ణరాయునికి వందనం. ఆంధ్రభోజునికి అభివందనం. ●

## అవినీతి మర్రివూడలు

- జి. లెనిన్ శ్రీనివాస్

పల్లవి :- మర్రివూడలల్లే - వేళ్ళూనుకున్నది
నిఘానీడల్లో - నిద్దురపోతుంది
పగ్గాల్లేని పాలన - పరవళ్ళయింది
అవినీతి రక్కసి - అందలమెక్కింది ॥2॥

అనుపల్లవి:- గోతికాడి నక్కల్ని - తరిమికొట్టాలి
దేవసంపదను - రక్షించుకోవాలి - ॥2॥

1. చరణం:- అధికారదందాతో - ఆస్తులను కూడేసి
కార్పోరేటు పేరుతో - కారుచౌకగా దోచి
రత్నగర్భలాంటి - దేశసంపదల్ని దోచి
లొసుగు చట్టాలతో - చుట్టరికం కలిపి - ॥మర్రి॥

2. చరణం:- రాజకీయాన్ని ఆర్థిక - వనరుగా మార్చేసి
సంక్షేమ పథకాలు- పర్సంటేజీలకిచ్చేసి
ప్రజాప్రయోజనాలను - గాలిదీపం చేసి
అధికార అండతో - ఉరిమి చూస్తున్నారు - ॥మర్రి॥

3. చరణం:- పారదర్శక పాలనంటూ - ప్రజలను నమ్మిస్తూ
అందిపుచ్చుకునేదాక - ఆదర్శాలనొల్లిస్తూ
అటుపైన హామీలు - నీటిపై రాతల్ని చేస్తూ
విషంలోపుట్టిన పురుగులకు-విషమే ఆహారమైనట్లు ॥మర్రి॥

4. చరణం:- ఆకాశంలో అభివృద్ధిని - అరచేతిలో చూపుతూ
సామాన్యుడి గోచిపాక నూడబీకుతున్నారు
గనులను,గిరుల సిరులను దిగమింగుతున్నారు
లక్షకోట్ల నల్లధనం ఎల్లలుదాటిస్తున్నారు - ॥మర్రి॥

5. చరణం:- పంట భూములపై - ప్రపంచీకరణ పడగనీడ
నల్లధనానికి తల్లి వేరైన - సర్కారు అవినీతి జాడ
అమాయకంగా జనానికి - సుద్దులు చెబుతున్న
ఇంటి దొంగవైన ఇష్టరాజ్యమై ఏలుతూ......

# 'నిన్న!... నేడు!!... రేపు...???

-టి.ఎస్.ఎ. కృష్ణమూర్తి

స్వాతంత్ర్యం లభించి అరవయి నాలుగు సంవత్సరాలయింది. అయినా నిన్నటికీ, నేటికీ మధ్య జరిగిన పరిణామాలలోంచి రేపటిని బేరీజువేసుకుని భయపడాల్సిన దుస్థితిలో ఉన్నాం మనం! నిరాశాజనకంగా ఉండిన 'నిన్న'లో ఆశాజనకమైన ప్రేరణలు, ఉత్సాహపూరితమైన ఉద్రేకాలు, ముందుకు దూసుకు వచ్చిన కాంతి పుంజాలు....... అన్నీ కలసి మన సమాజాన్ని జాగృతపరచి, ప్రతిభావంతంగా ప్రభావిత పరుస్తూ దేశమాత దాస్య శృంఖలాలను తెంచి జాతి తల ఎత్తుకు తిరగగలిగేలా చేశాయి.

అయితే ఆనందభరితంగా, ఆశాజనకంగా ఉండాల్సిన 'నేడు' అందుకు భిన్నంగా తయారయి కూర్చుంది. సమాజం నిరాశ, నిస్పృహలతోనూ, అంతులేని అభద్రతాభావంతోనూ చుట్టుముడుతున్న చీకటి కోణాలతోనూ చాలా నిరాశాజనకంగా కొట్టుమిట్టాడుతున్నది. మేధోవర్గాన్ని సైతం అదరగొడుతున్న నేటిలోంచి చూస్తే.....'రేపు' ఒక పగిలిపోబోతున్న అగ్నిపర్వతంలా పరమ భయానకంగా కనిపిస్తూ, వణికిస్తున్నది. కారణాలు మనకు తెలిసే అవకాశంలేదు... ఎందుకంటే మనం "ఎందుకు?" అని ప్రశ్నించడం ఎప్పుడో మరచిపోయాం కనుక! పైగా 'రేపు' మనకు ఎదురుకాగల విషపరిణామాలను గూర్చి ఏకాస్తయినా చీకూ, చింతా కలగడం లేదు. ఎందుకంటే మనం ఆలోచించడం కూడా మానుకుంటున్నాం కనుక!!

అసలు స్వాతంత్ర్యం అంటే ఏమిటి? దాని విలువేమిటి? అన్న విషయం... నేడు దాన్ననుభవిస్తున్న మనకన్నా...నిన్న బానిసత్వం అనుభవించినవారికే సుస్పష్టంగా తెలుసు. అందుకే వారి భావాలు, ఆలోచనలు చాలా లోతుగా ఉంటాయి. వారి మనసులోతులలోకి తొంగి చూడాల్సిన హృదయాల ఔన్నత్యాన్ని అధ్యయనం చేయాల్సిన వారిలో కొందరినయినా స్మరించుకోవాల్సిన అవసరం నేటి యువతరానికి అత్యవసరం అని అనిపించుచున్నది. మొట్టమొదట...... పంతొమ్మిది వందలా ఇరవయి ఏడవ సంవత్సరం, డిసెంబరు నెల పంతొమ్మిదవ తేదీనాడు..... అనగా ఎనభై నాలుగు ఏళ్ళ క్రితం..... తను ఉరి తీయబడడానికి ముందు రోజు సయ్యద్ జాస్మిన్ అహమ్మద్ అన్నీ ఒక దేశభక్తుడు ఉద్వేగంగా చెప్పిన మాటల్ని మననం చేసుకుంటే.....

"భారతదేశ సోదరులారా! మీరు ఏ మతానికి, ఏ సంప్రదాయానికి చెందిన వారైనా సరే దేశ సేవలో సహకరించండి. వృథాగా పరస్పరం కలహించకండి. ఒకవేళ దారులు వేరయినా అందరి లక్ష్యం ఒక్కటే! అలాంటప్పుడు ఈ వ్యర్థపు కొట్లాటలు, కుమ్ములాటలు ఎందుకు? ఐకమత్యంగా దేశంలోని తెల్లదొరతనాన్ని ఎదిరించండి. మన దేశాన్ని స్వతంత్రం చెయ్యండి.

రేపు నా పెళ్ళి.... ఉరికంబపు తాటిని స్వయంగా ముద్దాడి మెడకు తగిలించుకుని మాతృదేశ విముక్తి గావించడమనే అంతిమలక్ష్యం సాధించకుండానే వెళ్ళిపోతున్నాను.... కానీ మళ్ళీ జన్మిస్తాను... మళ్ళీ మిమ్మల్ని కలుస్తాను... సాయుధులమై స్వరాజ్యం కోసం పోరాటం సాగిస్తాం! ఏడుకోట్ల ముస్లిం మతస్థులలో దేశ స్వాతంత్ర్యం కోసం ఉరి కంబం ఎక్కబోతున్న మొట్టమొదటి వాణ్ణి నేనే! ఈ గర్వం చాలునాకు. ఆ గర్వంతోనే ఇరవై ఏడు సంవత్సరాల నా జీవితాన్ని దేశం కోసం సంతోషంగా అర్పిస్తున్నాను."

స్వాతంత్ర్యం రావడానికి ఇరవయి సంవత్సరాల మునుపు దేశం కోసం నవ్వుతూ ప్రాణాలు వదిలిన 'సయ్యద్ జాస్మిన్ అహమ్మద్' గొప్ప త్యాగధనుడు. ఎప్పుడో రాబోయే మృత్యువును గూర్చి అనుక్షణం భయపడ్తుంటాడు మనిషి. అలాంటిది కొద్ది గంటలలోనే కబళించడానికి సిద్ధంగా ఎదుట నిలబడ్డ మృత్యువుకు జంకకుండా సామాజిక బాధ్యతతో ఆయన భారతజాతికి అందించిన ఆ ఆఖరి సందేశం చిరస్మరణీయం.

అదేవిధంగా..... పంతొమ్మిది వందలా నలభై అయిదు ఆగస్టు పద్దెనిమిదో తారీఖున మరణించినట్లుగా చెప్పబడ్తున్న నేతాజీ సుభాష్ చంద్ర బోస్ అందుకు చాలా కొద్దిరోజుల ముందు ఆజాద్ హింద్ ఫౌజ్ సమావేశంలో తన అనుయాయులకు... తద్వారా... భారతజాతికి ఉత్తేజకరమూ, ఉద్వేగ పూరితమూ అయిన ఒక సందేశాన్ని అందజేశారు.... "కష్టసుఖాలలోనూ, కారుచీకటిలోనూ, ప్రకాశవంతమైన సూర్యకాంతిలోనూ నేను మీతోటే ఉంటాను. నేను మీకిచ్చేది ఆకలి, దాహం, ముందుకు సాగు మార్గం, మరణం!!... ఈ జీవన్మరణ సంగ్రామంలో మీరు పాల్గొంటే మిమ్ము విజయం వైపు, స్వాతంత్ర్యం వైపు తీసుకుపోతాను. 'భారత్ స్వాతంత్ర్యాన్ని ఎవరు కళ్ళ చూస్తారు?' అన్న శంక మీకొద్దు. భారతదేశ సర్వ స్వాతంత్ర్యాన్ని పొందడమే మనకు కావల్సింది. అందుకోసం మన తలలు త్రుంచి కుసుమాలుగా రాలుద్దాం!!"

ఎంతటి ఆలోచన? ఎంతటి ఔన్నత్యం? ఆ స్ఫూర్తి శాశ్వతం!! ఆ రోజులలో కవుల కలాలు, సన్యాసుల గళాలు కూడా ప్రజలను ప్రభావిత పరుస్తూ స్వాతంత్ర్యం విలువను, అవసరాన్ని నొక్కి వక్కాణించాయి. కవులు స్వాతంత్ర్యం విషయంగా ఎంత ఉత్తేజితులవుతుండేవారో తెలుసుకోవడానికి ఉదాహరణగా విశ్వకవి రవీంద్రనాథ్ ఠాకూర్ వారి "గీతాంజలి" లోని ముప్పయి అయిదవ గీతాన్ని మననం చేసుకోవచ్చు.... "ఎక్కడైతే మనసు భయభ్రాంత మవదో, ఎక్కడైతే తల ఎత్తుకు తిరగగలమో, ఎక్కడైతే విజ్ఞానం వెల ఇవ్వనవసరం లేకుండా లభించగలదో, ఎక్కడైతే సంకుచితపు గోడలతో ప్రపంచం ముక్కచెక్కలు కాకుండా ఉంటుందో, ఎక్కడైతే సత్యవచనం సర్వసామాన్యమో, ఎక్కడైతే హేతువనే జలవాహిని అలవాటు అనే ఎడారి ఇసుకలో ఇంకిపోదో ఆ 'స్వాతంత్ర్యధామం' వైపుగా ఈ దేశాన్ని మేల్కొలుపు తండ్రీ!"

ఇహ సన్యాసుల భావావేశాలకు ప్రతీకగా శ్రీ స్వామి వివేకానంద స్వాముల వారి మాటలలో స్వాతంత్ర్యపు భావనలు.... "నాగలి పట్టి పొలాలు దున్నే రైతుల గుడిసెలలోంచీ, చేపలు పట్టే బెస్తల గూళ్ళలోంచీ, చెప్పులుకుట్టే మాదిగలూ, వీధులు ఊడ్చే పాకీలూ మొదలైన సామాన్య జనుల నివాసాల్లోంచీ నవభారతాన్ని రానివ్వండి. పచారికొట్టూ, కమ్మరి కొలిమీ, కుమ్మరి ఆవమూ... అన్నీ నవభారతానికి జన్మస్థలాలు కానివ్వండి. కొండలూ, గుట్టలూ, వాగులూ, డొంకలూ, అరణ్యాలూ, కోనలూ మొదలైన వాటినన్నింటినుండే నవభారతాన్ని ఆవిర్భవించనీయండి!"

ఇహపోతే మహాత్ముడి భావపరంపరలకూ, సుదీర్ఘ ఆలోచనలకూ దర్పణంగా ఢిల్లీ రాంలీలాగ్రవుండ్సులో ఒకనాడు వారు వేసిన ప్రశ్నను మననం చేసుకోవడం సముచితం...."స్వాతంత్ర్య అంటే ఏమిటి?" మేధావులు సైతం జవాబు కోసం తడబడి తడుముకున్న ఆ ప్రశ్నకు చివరికి గాంధీగారే ఇచ్చిన జవాబు....

"ఒకదేశానికి స్వాతంత్ర్యం వచ్చిందని ఎప్పుడు చెప్పగలం? ఆ దేశంలో రామరాజ్యం నడుస్తుందని ఎప్పుడనగలం?? యవ్వనవతి, రూపవతి అయిన స్త్రీ సర్వాలంకార భూషితయైన నిశిరాత్రి పన్నెండు గంటల తరువాత కూడా నగర వీధులలో అయినా, కాలిదారులలో అయినా నిర్భయంగా స్వేచ్ఛగా ఏనాడయితే సంచరించగలుగుతుందో...... ఆనాడు...... ఆ దేశానికి స్వాతంత్ర్యం వచ్చిందనీ ఆ దేశంలో రామరాజ్యం నడుస్తోందనీ చెప్పగలం."

వాళ్ళు ప్రపంచాన్ని ప్రేమించారు. అంతకుమించి దేశాన్ని ప్రేమించారు. ప్రజలందరూ సుఖంగా, సంతోషంగా, స్వేచ్ఛగా జీవించాలని ఆకాక్షించారు. అందుకు కారణం..... వారు వందల సంవత్సరాల బానిసత్వాన్ని చవిచూసిన వారు. స్వాతంత్ర్యం విలువ వారికి బాగా తెలుసు!

కొంతమేర వరకూ ఆశాజనకంగా నిన్నటి వ్యక్తుల ప్రభావం నేటి మనుషుల మీద కూడా కొనసాగింది. కళాకారులు కూడా దేశాన్నిగూర్చి ఆలోచిస్తూ, సమాజాన్ని గూర్చి స్పందిస్తూ నడిచారు.... ఒక ఉదాహరణ....

పంతొమ్మిది వందలా అరవై రెండులో చైనా శతఘ్నులు భారతీయుల హృదయాలను తూట్లు పడేలా చేశాయి. ఒకరకంగా అది ఘోరపరాజయం. అప్పుడే ప్రజల గుండె లోతులను స్పందిస్తూ, అమరులైన భారత సైనికుల కోసం వాళ్ళ త్యాగాలను గుర్తు చేసుకుంటూ కళ్ళలో కన్నీరు నింపుకోమని అర్థిస్తూ ఓ గాయని గొంతెత్తి భారత జాతిని కోరింది......

"(ఆ)యే మేరే వతన్ కో లోగో(ం)
జరా ఆంఖోమే భర్‌లో పానీ
జో శహీద్ హుయేహై వున్‌కీ
జరా యాద్ కర్(లో) కుర్‌బానీ!!!"

ఆ స్వరం విని కోట్లాది భారతీయుల గుండెలు చమర్చాయి. సాక్షాత్తూ పండిట్ జవహర్‌లాల్ నెహ్రూ..."బేటా, తేరేగాన్ సే హమ్‌కో రోనా ఆయా!" అంటూ గద్గద స్వరంతో ఆ గాన కోకిల లతామంగేష్కర్‌ను ప్రశంసించారు. కళాకారుల దేశభక్తికి, స్పందనకూ ఉదాహరణగా ఇండియన్ చార్లీ చాప్లిన్ 'రాజ్‌కపూర్' భావాలను కూడా ఉటంకించవచ్చు....

"హోటోంపే సచ్చాయీ రహతీహై
జహా దిల్‌మే సఫాయి రహతీహై
హం ఉస్ దేశ్‌కే వాసీహై ! హం ఉస్ దేశ్‌కే వాసీ హై!!
జిస్ దేశ్ మె గంగా బహతీహై!"

మనోజ్ కుమార్ తన ప్రతి సినిమాలో హీరో పాత్రకు 'భారత్' అన్న పేరే తప్పని సరిగా పెట్టేవారు. కళలూ సారస్వతమూ సమాజ శ్రేయస్సుకు ఉపకరించే విధంగానే స్పందిస్తూ నడిచాయి కొంతమేర. కానీ క్రమంగా హింస, ద్వేషాలను, స్వార్థాన్ని పెంచి పెద్దచెయ్యడానికి కారకాలవుతున్నాయి.

అందుకే.."అవినీతి, బంధుప్రీతి, చీకటి బజారు అలముకున్న ఈ దేశం ఎటు దిగజారు?" అన్నాడు శ్రీశ్రీ నలభై సంవత్సరాల క్రితమే! అయిపోయింది..... సమర్థులైన పాలకులు, అవినీతి పరులైన నాయకులు, స్వార్థపరులైన వ్యాపారులు, నిజాయితీలేని లంచగొండి ఉద్యోగులు... ఇంకా గూండాలు, దళారులు, దేశద్రోహులు, స్వార్థపరులు కలిసి సమాజాన్ని ప్రత్యక్షంగా, పరోక్షంగా శాసిస్తూ సంఘాన్ని కలుషితం చేసేస్తున్నారు. కాంతివంతమైన దీపాలు ఆరిపోతూ పెనుచీకటి అలుముకునేలా చేస్తున్నారు. ప్రమాదాలు, హత్యలు నిరంతరాయంగా సాగుతున్నాయి.

ప్రపంచీకరణ ప్రభావం సామాన్య మానవుడ్ని కూడా రాక్షసుడిగా మార్చడానికి కంకణం కట్టుకుంటున్నది. పనిచేసేవారు తగ్గిపోతున్నారు. ఇదీ నేటి దుస్థితి. ఈ పరిస్థితుల మధ్యనుండి చూస్తుంటే భయానకంగా కన్పిస్తోంది 'రేపు'..... ....కానీ.... కొద్దో, గొప్పో దేశభక్తి, మనుషులను ప్రేమించే గుణమూ, భవిష్యత్తు మీద ఆశ, ఆలోచనా కలిగిన వ్యక్తులు కొందరు నేటి ఈ చీకటి కోణాల మధ్యలోంచే రేపటిని గూర్చి కొన్ని కలలు కంటున్నారు. కలలు కనడం నేరమేమీ కాదు కదా? కానయితే ఆ కలలను సాఫల్య పరచుకోవడానికి కృషిచేయకపోవడం విషాదం!

ఆ ఆశాజీవులు కలలు కనే 'రేపు' లో....

నిరాశా, నిస్పృహలూ, నిరుద్యోగమూ కన్పించడం లేదు ఎక్కడా! విరామం విరివిగా లభించడంలేదు! వినోదం కూడా పరిమితమే!

తెల్లచొక్కానే తొడుగుకోవాలనీ, నీడపాటునే కూర్చోవాలనీ, అధికారం చెలాయించాలనీ, పనిచెయ్యకుండా సుఖపడాలనీ భావించే మనుష్యులు ఎక్కడా తారసపడడం లేదు.

పని.....పని.....పని... ఎక్కడచూసినా.... పనే.....పనే.....పనే!!

ఎక్కడా అన్నార్తుడి ఆకలికేకలు విన్పించడం లేదు! పేదరికం, దీనత్వం కన్పించడం లేదు!! దోపిడి అన్న పదానికి అర్థం తెలియడం లేదు.

వారు కలలు కంటున్న ఆ రేపటి కోసం కొద్దో గొప్పో ఆలోచన ఉన్న ప్రతి దేశభక్తుడూ నిరంతరం కృషి చేయాల్సిన సమయమిది. ●

## మా మంచి చుట్టాలు

- దావకర్ల సాయి అభిషేక్

బస్సెక్కి వచ్చాడు తాతయ్య,
బొమ్మలెన్నో తెచ్చాడు తాతయ్య!

మోటరెక్కి వచ్చాడు మామయ్య,
మంచి పుస్తకాలు తెచ్చాడు మామయ్య!

పడవెక్కి వచ్చాడు పెద్దనాన్న,
పట్టు చొక్కాలు తెచ్చాడు పెద్దనాన్న!

నడుస్తూ వచ్చింది నానమ్మ,
నాకు నారింజలు తెచ్చింది నానమ్మ!

ఆటో ఎక్కివచ్చింది అమ్మమ్మ,
అరిసలెన్నో తెచ్చింది అమ్మమ్మ!

రైలెక్కి వచ్చింది చిన్నత్త,
రేడియో తెచ్చింది చిన్నత్త!

సైకిలెక్కి వచ్చాడు సాయన్న,
సరదాగా ఆడాడు సాయన్న!

పండక్కి వచ్చారు మా మంచి చుట్టాలు,
ఇల్లంతా సందడీ, సరదాలు!

# అనవసర ఆంగ్లం ముంపు - తెలుగు వాడకం పెంపు

-డా॥కొండూరి సీతారామ చంద్రమూర్తి

ఎవరెవరొచ్చారని అడిగితే నేను, మా ఫామిలీ అంటున్నారు. తీరా చూస్తే అతని కుటుంబం మొత్తం రాలేదు. అతడు, అతని భార్య మాత్రమే వచ్చారు. ఆంగ్లంలో ఫామిలీ అంటే కుటుంబం మొత్తం కదా! పోనీ ఆంగ్ల సంప్రదాయం ప్రకారం 'మి అండ్ మై వైఫ్' అని అనుకుందామా 'నేను నా ఇల్లాలు లేదా మా ఆవిడ అనచ్చు కదా! టీవీల్లో ఆడవాళ్ళ కోసం నడిపే ప్రత్యేక కార్యక్రమాలలో నేను ఇల్లాలినండీ, నేను గృహిణిని అని అనడం మోటని కాబోలు 'హౌస్‌వైఫ్' అన్నమాట స్థిరపడుతోంది.

తినే తిండి విషయంలో ఇంగ్లీషు మీద రోకు ఎక్కువైంది. కర్రీ, చట్నీ లాంటి మాటలు అలా ఉంచండి. ప్రస్తుతం అన్నం అంటే మోటయిపోయి 'వైట్‌రైస్' అంటున్నారు. అయినా తెలుగువారు తెలుగు తిండి మానేసి రోడ్డుపక్క కింద కుళ్ళు కాలువ, పైనబండీ మీద వండే పావ్‌బాజీ (చావుబాజా), పానీపూరి (నీ పని సరి), కట్‌మిర్చ్ (డెత్ సర్చ్), లాక్కో పీక్కో నూడుల్స్ పేగుల్స్ తినడం మొదలెట్టేసారు కనుక ఇంగ్లీషు మాటలేకాక ఇవికూడా తోడయ్యాయి.

మా వాడు జాబ్ హోల్డర్ అనడం గొప్పగా భావిస్తున్నారు. ఇంగ్లీషులో జాబ్ హోల్డర్ అంటే వాళ్ళనుకుంటున్న ఉద్యోగస్తుడు కాదు. ఎంప్లాయీ అనాలి. మా వాడు కొలువు చేస్తున్నాడు అంటే సరైన అర్థంలో వాడినట్టే. ఉద్యోగం అన్న సంస్కృతం మాటకి ఆ భాషలో అర్థం అది కాదు. అందువల్ల కొలువు అన్న తెలుగు మాటే సరైనది. కొలువు అంటే సభ అనే అర్థం కూడా ఉంది. రాజ్యసభకి పెద్దల కొలువు అని అనవచ్చు. మా వాడు కొలువుకున్నాడు అంటే ఉద్యోగం చేస్తున్నాడు అని అర్థం.

ఈ సందర్భంలో చెప్పుకోవల్సినది సంస్కృత పదాలు వాడకూడదు అని తెలుగువాళ్ళు అనుకుంటే కష్టం అనవలసినంత కష్టం. అయినా కష్టం అనే మాటకి మనం అనుకున్న తెలుగు అర్థం సంస్కృతంలో ఉందా అంటే అనుమానమే. శరీర పీడని మాత్రమే కష్టం అనాలి అంటున్నారు అమరకోశకారులు. సేవ చేయడం కష్టంగా ఉందని, పనివాళ్ళు లేకపోవడం కష్టంగా ఉందనీ వ్యాకరణం చదవడం కష్టంగా ఉందనీ పుం, స్త్రీ నపుంసక లింగాల్లో అనవచ్చనీ మినహాయింపు ఇచ్చారు. అనవసర సంస్కృతం గురించీ కూడా మనం ఆలోచించాలి. ఎందుకంటే భార్య అంటే వచ్చే గౌరవం పెళ్ళాం, ఇల్లాలు, ఆలి అంటే రాదనే భ్రాంతితో ఉన్నవాళ్ళు భార్య అనే అంటున్నారు. 'ఆవిడా మా ఆవిడే' అనడానికి సినిమావాళ్ళు భయపడలేదు. ఏతావాతా చెప్పేదేమిటంటే ఈ అనవసరపు సంస్కృత పద ప్రయోగాలే ఆంగ్ల ప్రయోగాలకి దోవ తీస్తాయని చెప్పకతప్పదు.

జంక్షన్ అనే మాటకి కూడలి అనే తెలుగు పదం సరిపోతుంది. నాలుగు రోడ్ల జంక్షన్, ఏడురోడ్ల జంక్షన్, హనుమాన్ జంక్షన్, గాంధీ బొమ్మ జంక్షన్, కొత్తవంతెన జంక్షన్ ఇలా ఎన్నైనా చెప్పుకోవచ్చు. డే అండ్ నైట్ జంక్షన్ అనే వింత అర్థాన్ని ఇచ్చేవి ఉన్నాయనుకోండి. మరి కూడలి అనే మాటపై పదాలతో కలిపి ఎందుకు వాడకూడదు? ఏడురోడ్ల కూడలి, హనుమంతుని కూడలి, గాంధీ బొమ్మ కూడలి అని. విచిత్రమేమిటంటే జంక్షన్ అనే ఇంగ్లీషు మాటకి ముందు వాడుతున్న పదాలన్నీ తెలుగు మాటలే. వాటికి మరో తెలుగు పదం కలిపి వాడడం సబబు కాని అనవసర ఆంగ్లపదం ఎందుకు?

అపార్ట్‌మెంట్ అనే మాటకి ప్రత్యామ్నాయంగా తెలుగు లేనట్టేనా? రాజీవ్ గృహసముదాయం, బలహీనవర్గాల గృహ సముదాయం అనడంలో లేని సంకోచం సాయివిల్లా గృహసముదాయం అంటే ఎందుకు వస్తోంది? ఇంగ్లీషులో హౌసింగ్ అనే మాట ఉంది. ఆ తీరుగా ఇళ్ళ కూడలి అనిగాని, గుంపు ఇళ్ళు అనిగానీ అంతస్తు ఇళ్ళు అనిగానీ అనలేమా? అసలే అనవసరంగా ఫస్ట్ ఫ్లోర్, సెకండ్ ఫ్లోర్ అంటున్నారు కానీ ఒకటో అంతస్తు, రెండో అంతస్తు అని అనడం లేదు. మేడ, డాబా, పెంకుటిల్లు, పూరిల్లు, పొదరిల్లు అన్న మాటలున్నాయి. ఏడంతస్తుల మేడ అన్న మాట ఉండనే ఉంది. ఏడుకురుమాళ్ళ మేడ అనే ఆంగ్లనువాదనవల తెలుగులో ఉంది.

అవసరమైతే కొత్తపదం తయారుచేసుకోవాలనే ఆలోచన మొదట రావాలి. అప్పుడు దానిని ప్రచారంలో పెట్టాలి. మంది ఒప్పుకోవాలి.

కాంప్లెక్స్ అనే మాటని తిరుపతిలో వసతి గృహాల సముదాయానికి సరైన అర్థంలోనే వాడుతున్నారు. ఆర్టీసీ కాంప్లెక్స్ సాధారణంగా వాడేమాట. అన్ని రకాల వసతులు ఒకేచోట ఉన్నాయన్న అర్థంలో అదీ సబబే.మరి కాంప్లెక్స్‌కి సరైన తెలుగు మాట సంగతేంటి? ఈ సందర్భంలో ఒక విషయం చెప్పాలి. ఒక శాసనసభ్యుడిని 'మీ ఊరికి బస్ స్టేషన్ కావాలా? బస్ కాంప్లెక్స్ కావాలా?' అని అడిగితే కాంప్లెక్స్ అంటే డిపోతో కలిసి ఉంటుందని అందువల్ల తన ఊరికి దగ్గరలో ఉన్న పల్లెటూళ్ళకి కూడా బస్ సౌకర్యం ఏర్పడుతుందన్న విషయం తెలీక ఆయన బస్ స్టేషన్ కోరాడు. ఈ సంగతి ఆయన సభల్లో చెప్పేవాడు. మరి కాంప్లెక్స్ అనే మాటకి తెలుగు పదం ఏది వాడాలి? లేదా కాంప్లెక్స్ అనే మాటకి ఇంగ్లీషులో ఉన్న అర్థాల్లో సులభంగా అర్థమయ్యేది కాదు అన్నదానిని అనుసరించి ఇరిన్ఫియారిటీ కాంప్లెక్స్‌తో వదిలేద్దామా? ఆలోచించండి. ఇలా తెలుగు ప్రత్యామ్నాయాలు సృష్టించవలసిన అవసరం ఒక పక్కనుండగా ఆంగ్ల తెలుగు మిశ్రమాలుగా అనవసర అసందర్భ పదాలు సృష్టిస్తున్నారు కొందరు. 'మళ్ళీ కాల్ చేస్తాను' రాసినప్పుడు చదివితే కొంత ఫర్వాలేదు. విన్నప్పుడు అర్థం మీద అసహ్యం వేస్తుంది. కనీసం మళ్ళీ ఫోన్ చేస్తాను అనచ్చు కదా! దురర్థాన్నిచ్చే పదాన్ని ఎందుకు వాడాలి? 'మళ్ళీ కబురుచేస్తాను' అనో 'మళ్ళీ మాట్లాడతాను' అనో అనచ్చు కదా! కాల్చేయవలసిన అవసరం ఏమిటి?

చిన్న మాటల్లాగ కనిపించవచ్చు కానీ ఓ కే, యా యా లాంటి ఇంగ్లీషు మాటలు సరే, అలాగే, అవును, అలాగా లాంటి మాటల్ని దాదాపు మింగేస్తున్నాయి. అలగలగే అంటే వెక్కిరిస్తున్నారు కూడా. తప్పించుకోలేనంత విషయం కాదిది. తెలుగు రానివాళ్ళతో అయితే సరే. కాని తెలుగువాళ్ళతో కూడా అవే మాటలు ఎందుకు వాడాలి? ఓకే అంటే ఇంగ్లీషులోనే విశేషణంగా, క్రియావిశేషంగా సంతృప్తికరమైన అంగీకారమే కాని పూర్తి అంగీకారం కాదు. కాని మనవాళ్ళు ఈ మాటకి పూర్తి అంగీకారాన్ని చెప్పేస్తున్నారు. ఓ కే వెనుక ఇంగ్లీషులో బోల్డు కథ ఉంది. సారీ, థాంక్స్ లాంటి పదాలకి తెలుగు ప్రత్యామ్నాయాలు అవసరం లేదంటున్నారు కొందరు, అలాగే బాగున్నాయిట.

తెలుగు వాడకం పెరగడానికి మనం చెయ్యవలసిన పనులు నాలుగు ఉన్నాయి. ఈ సందర్భంగా స్పష్టంగా అర్థం చేసుకోవలసిన విషయం ఒకటుంది. ఇంగ్లీషు భాష మన దేశంలోకి అడుగు పెట్టకముందే మనకి కొన్ని వ్యవస్థలూ, కొంత పరిజ్ఞానం ఉంది. దానికి సాహిత్యాన్ని తోడు తీసుకొని తెలుగు ప్రత్యామ్నాయాలని తయారుచేయవచ్చు. వాటిని వాడకంలోకి తేవడానికి చిత్తశుద్ధితో ప్రభుత్వం, ప్రజలు కృషి చెయ్యాలి.

ప్రస్తుతం వాడుకలో ఉన్న ఆంగ్ల పదాలకు ప్రత్యామ్నాయం లేదనుకుంటే వాటికి కొత్త తెలుగు పదాలు తయారు చేయాలి. అనవసరమైన సంస్కృత పదాలతో కాక అందుబాటులో ఉండే తెలుగు పదాలతో తయారుచేయడం మంచిది. వెన్నెముక ఉన్న జీవులు, వెన్నెముక లేని జీవులు అనడానికి బదులుగా సకశేరుకాలు, అకశేరుకాలు అనక్కర్లేదు. ఆంగ్ల భాషా సంపర్కం లేని ప్రాచీన తెలుగు సాహిత్యంలో ఈ ప్రత్యామ్నాయాలను తయారుచేయడానికి తగిన మాటలు దొరకవచ్చు. అంతేగాక ఆంగ్లేయుల పాలన ప్రారంభమైన కొత్తల్లో తెలుగులో పెట్టుకున్న అర్జీలను తర్జుమా చెయ్యడానికి దుబాసీలను నియమించారు. వాటిని పరిశీలిస్తే మనకు కొంత సమాచారం దొరకవచ్చు. ఉదాహరణకు సి.పి.బ్రౌన్ సేకరించిన 'తాతాచర్ల కథలు' అనే పుస్తకం నుంచి కొన్ని ఉదాహరణలు పరిశీలిద్దాం.

| | | | |
|---|---|---|---|
| కరారు | ఎగ్రిమెంట్ | బరాతం | పే ఆర్డర్/డి.డి |
| బందోలం | స్టాక్ | రొంపిదుక్కి | వెట్‌లాండ్ |
| తొలి | ఫ్రూక్ | పంగల | ఫోర్క్ |
| ముఖాంత్రం | థ్రూ | బంగీ ఉత్తరం | రిజిస్టర్డ్ పోస్ట్ |
| తగులుబడి | ఎక్స్‌చేంజ్ చార్జి | గుండుగుత్త | ఆల్‌టుగెదర్ |
| జడ్తి | రివ్యూ | కోరు | షేర్ |
| ఉమేదువారి | ఎప్రెంటిస్ | రోజుమర్ర పుస్తకం | డైలీ కేష్ బుక్ |
| పిక్కా | స్టాంప్ | చిన్న/పెద్ద ముతసద్దీ | జూనియర్/సీనియర్ అసిస్టెంట్ |
| పారుపత్తి | సూపరింటెండెంట్ | అక్కసరి సంస్థ | సిస్టర్ ఇన్‌స్టిట్యూషన్ |
| అరకొరగా | ఇన్‌సఫిషియంట్ | అరదట్లు | ఇన్‌సఫిషియంట్ |

అసలు ప్రత్యామ్నాయ పదాలు లేనట్లుగా వాదించేవాటికి కూడా తయారుచేయ్యాలి.

| | | | |
|---|---|---|---|
| హాజరు | ఉనికి | దరఖాస్తు | విన్నపం |
| టికెట్ | చీటీ | ఫైను | దండగ |

ఎక్జామినర్, ఇన్విజిలేటర్, అబ్జర్వర్ మొదలైన వాటికి కూడా ప్రత్యామ్నాయాలు తయారుచెయ్యాలి. అనవసరంగా తెలుగు ఆంగ్ల పదాలను కలిపి దుర్అర్థం వచ్చేటట్లు అసందర్భపు భాష వాడకూడదు. సెటప్ చేసాడు, ఫిక్స్ అయిపోయాడు. బాక్స్ బద్దలయిపోద్ది, ఫేస్ టర్నింగ్ ఇచ్చుకో, సైడు కోసేస్తా, ఫిల్మ్ కాలిపోయింది లాంటివి. వీటి ప్రయోగం వలన ఆంగ్లాన్ని కూడా సక్రమంగా రాయడం, చదవడం, మాట్లాడడం సరిగా రాదు.

ఇంగ్లీషుభాషలో లేని అర్థాలలో ఆ భాష పదాలని తెలుగులో వాడకూడదు. వాటికి ప్రత్యామ్నాయంగా తెలుగు పదాలే వాడాలి. ఆ ఇంగ్లీషు శబ్దాల అనువాదాలు కూడవద్దు. అంత సీను లేదు, సినిమా సూపరుగా ఉంది, నీ డ్రెస్ అదుర్స్, ఆమె నా లవర్, మొగుడ్స్ పెళ్ళామ్స్ వంటివి వాడద్దు.

తెలుగు వాళ్ళు తెలుగే మాట్లాడాలి నిజమే. కాని వలస పాలకుల పాలనలో ఇంత దూరం నడిచొచ్చాక ఇప్పుడు మనం తెలుగు వాళ్ళమనే స్పృహ కోల్పోయి మనకి అంటించుకున్న ఆంగ్ల పదాల జాడ్యం పోగొట్టుకోవడానికి బలమైన సంకల్పం ఉండాలి. ఇందుకు ప్రాచీన సాహిత్య పరిశీలన చేయాల్సిన అవసరం ఏమీ లేదు. తెలుగులోనే మాట్లాడాలని గట్టిగా అనుకోగలిగితే మాటలు వాటికవే మన నోటివెంట తన్నుకొస్తాయి. ఆ సంకల్పాన్ని కలిగించటం కోసం ప్రజల గుండె తలుపులు తడుతోంది తెలుగు భాషోద్యమం. ●

## నా అమ్మలపాదిలో యాభై ఆరు అస్త్రాలు

-సరికొండ నరసింహరాజు

ఒళ్ళంతా కళ్ళు చేసుకుని
నా అక్షరం కన్నీళ్ళు పెడుతుంది
తెలుగుతల్లి ఊతం కర్రైన
నా అక్షరం వెక్కిళ్ళు పెడుతుంది !

యాభై ఆరు దారులై
అక్షరాలు కలహించుకుంటుంటే
నా బీజాక్షరం కన్నీళ్ళు పెడుతుంది!

మనం పోరాడాల్సింది అవినీతి మీద... అణచివేత మీద...
ఆంగ్లం మీద... అమెరికా మీద కదా...
మరి చేయి చేయి కలిపిసాగి
వర్ణమాల చేతులు నరుకుతున్నారేంటి?!

మన తలకట్టు తలపాగాలను
మనమే తెగ్గోసుకుంటున్నా మేంటి?!

అక్షరాల నెత్తురు పారే చోట
చైతన్యం వెత్తావి ఎలా వీస్తుంది?!

నిన్నటిదాకా...
దొరసాని ఇంట్లో దాసియైన అక్షరం అమ్మ
నేడు తన ఇంట్లో తానే ఓ బానిస!

అక్షరాల్ని తెల్లగద్దలు తన్నుకుపోతుంటే
పహారాకాయాల్సిన బిడ్డలే
పసందుగా నవ్వుకుంటున్నారు!

'ఫారిన్ మద్యం' తాగుతూ
'తెలుగు నాటుకోడి' మాంసం నంజుకుంటున్నారు!

అక్షరాలను శాంతి పావురాలుగా ఎగరేస్తున్నా...
ఆంగ్లోన్మాదుల తూటాలకు నేల రాల్తునే వున్నాయ్!

అక్షరానికి గాయమైతే నా గుండెకు రక్తం కారుతుంది!

❋ ❋ ❋

ముసుగులు మాట్లాడటం ఆగిపోయాకే
నా అక్షరాల యుద్ధం మొదలైంది!

మంచెమీద వడిసేలు విసురుతూ
నా అక్షరాల పొలాన్ని నేనే పహారాకాస్తా!

నా చివరి రక్తపు బొట్టు వరకు
అక్షరాలకి అంగరక్షకుడనై వుంటా!

కాలానికి వామనమైన కలమే నా ఆయుధం!
నా అమ్ములపాదిలో ఇప్పుడు
యాభై ఆరు అస్త్రాలు
నా తలమీద తెలుగుతల్లి జెండా రెపరెపలు!!

# కవి పాదుషా పువ్వాడ శేషగిరిరావు

-గుడిసేవ విష్ణు ప్రసాద్

"మలగన్ దేవనదీ సమాగత లసన్మందానిల స్యందితో
జ్జ్వల వాఃపూర తుషార బిందువులు, ఆచ్ఛాదింతు క్రౌంచళ్కుపూ
సలనున్ బట్టు సెరంగు రంగు కయిసేతల్‌సేసి మారంద, ధా
రలు చిందన్ ఘటియింతు శ్రోత్రములకున్ సమ్యత్వ సిద్ధాంతముల్".

అంటూ తన పదమూడవ యేటనే కవితారాధన కోసం కలం పట్టి గళం విప్పి కమనీయ కావ్య పరంపరను లోకానికి అందించి ఉర్రూతలూగించిన మహాకవి వరేణ్యులు. ఆంధ్రసారస్వత ప్రపంచాన అగ్రశ్రేణి కవి పుంగవులలో ఒకరై తెలుగు తల్లికి అనుంగు బిడ్డడై ఎనలేని కీర్తి నార్జించి పెట్టిన యశఃకాయులు; చదువుల తల్లి చల్లని చూపులు యెదలో నిలుపుకొని బరిదాటక, గురివీడక దీక్షాదక్షతలతో సత్కవితా రసాలను మనకందించిన మహదాత్త శేముషి, మహా మనీషి, దివిసీమ నివాసి 'కవిపాదుషా' పువ్వాడ శేషగిరిరావు గారు.

పవిత్రమైన అధ్యాపక వృత్తిలో ఉంటూ అనేక కావ్యాలను జాతికి అందించిన కవివర్యులాయన. ఆయన ఉద్యోగ కాలం విద్యార్థులకు స్వర్ణయుగం. నిరాడంబర జీవనం సాగించిన ఆదర్శాచార్యులు. సారస్వత సహకారమున గొంతెత్తిన పుంస్కోకిల. నానా సభాసంసిజాకరములలో విహరించిన కలహంస, విద్యార్థుల మనః పద్మాలకు భానూదయము. రసిక జన మనోముకురమున తోచిన రసమూర్తి.

వీరు దివి తాలూకా మొవ్వ గ్రామములో 1906వ సంవత్సరం జూలై 12వ తేదీన జన్మించారు. వీరి ప్రాథమిక విద్య మొవ్వలోను, ఉన్నత విద్య బందరులోను సాగింది. ఉద్యోగం చేస్తూనే భాషా ప్రవీణ, పి.ఒ.ఎల్ పూర్తి చేశారు. ఉన్నత విద్య పూర్తికాగానే ఉద్యోగాన్వేషణలో పడ్డారు. విజయవాడలో దుగ్గిరాలవారి ప్రెస్‌లో ప్రూఫ్ రీడరుగా చేరారు. విజయవాడలో ఎస్.కె.పి.వి. హిందూ హైస్కూల్ ఉంది. అందులో ప్రధానోపాధ్యాయులు కొఠారు రామారావుగారు వారితో వీరికి పరిచయం ఏర్పడింది.

ఆ హైస్కూలు సెక్రటరీగారు తమ ఇంటివద్ద లక్కావజ్ఝల కృష్ణశాస్త్రి గారిచేత పురాణం చెప్పించు కుంటున్నారు. అదే సమయంలో శేషగిరిరావు గారు కొఠారు రామారావు గారి ప్రోత్సాహంతో శేషగారి రావు గారు ఉద్యోగం కోసం ఆయనను దర్శించడానికి వెళ్ళారు. ఆ పురాణ సందర్భంలోని "స్వస్తి జగత్రయీ భువన శాసన కర్తకు" అనే పద్యాన్ని తనకు పాఠంగా చెప్పమన్నారు సెక్రటరీగారు. సమాస భూయిష్టమైన ఆ పద్యానికి అర్థాదులు చెప్పి వామనుడు ఆశీర్వదించే మిషతో బలి చక్రవర్తి చక్రవర్తిత్వానికి 'స్వస్తి' చెప్పాడని తెలుగు జాతీయాన్ని ఉటంకించారు. అంటే ఆ సెక్రటరీ గారు ఆ సమన్వయానికి పొంగిపోయి వీరికి పండిత ఉద్యోగం ఇచ్చేశారు.

అలా 1928లో ఉపాధ్యాయ జీవితం ప్రారంభించారు. తరువాత బందరు హిందూ హైస్కూలులోను, హిందూ కళాశాలలోను దాదాపు 15 సంవత్సరాలు పని చేశారు. ఆ తరువాత విజయనగరం మహారాజ వారి ఆహ్వానంపై వారి కళాశాలలో ఐదు సంవత్సరాలు పనిచేశారు. అచటి నుండి శ్రీమాన్ ఎస్.టి.జి. వరదాచార్యులవారి ఆహ్వానంతో బందరు జాతీయ కళాశాలకు వచ్చారు. 1970 వరకు అక్కడే ఆంధ్రోపన్యాసకులుగా పనిచేసి పదవీ విరమణ చేసికూడా యాజమాన్యం వారిని వదులుకోలేక ఇంకా నాలుగు సంవత్సరాలు ఆయన సేవలను వినియోగించుకుంది. ఆయన ఎక్కడ పని చేసినా తెలుగు శాఖకు అన్ని ఇతర శాఖలతోపాటు గౌరవ ప్రతిష్టలు కలిగించ గలిగారు. పద్యం అంటే ఆయనకు ప్రాణం. ఛందస్సు పేరు చెబితే ఎప్పుడూ ముందడుగే. తిక్కనంటే ఎంతో మక్కువ. ముని మాణిక్యం గారింట్లో తిక్కన భారతం చదివి అర్థం చెప్పారు. అందుకేనేమో వారి కుమారునికి తిక్కన సోమయాజి అని పేరు పెట్టుకున్నారు. ఆ పేరు పెట్టినందుకు వారు కూడా తండ్రి గారి బాటలో సాహిత్య వారసుడిగా పద్యరచనలు చేస్తూ తండ్రిగారి కీర్తిని ఇనుమడింపజేస్తున్నారు.

శేషగిరిరావు గారు సహజ గంభీర ధోరణిలో రాగయుక్తంగా, జాతి గుఱ్ఱం కదను తొక్కుతున్నట్లుగా నిండుగా పద్యం చెప్పుచుంటే ఇతర తరగతుల విద్యార్థులు కూడా వచ్చి వినేవారు. ఆయన పద్య పఠన తీరు విలక్షణంగా ఉండేది. విచిత్రమేమిటంటే పద్యానికి, గద్యానికి అర్థం చెబుతూ మధ్యలో అనర్గళంగా ఆంగ్ల వాక్యాలు దొర్లించేవారు. ఆయన కావ్య పఠనం చేస్తుంటే కవి, గాయకుడు కలిసిన త్రివేణీ సంగమంలా ఉంటుందని శ్రీ గొట్టిపాటి వెంకట సుబ్బయ్యగారు 'మిత్రులు-నేను' అనే గ్రంథంలో తెల్పారు.

'కళాప్రపూర్ణ' 'కులపతి' శ్రీమాన్ ఎస్.టి.జి.వరదాచార్యులుగారు పువ్వాడ వారిని 'ఆయన పద్యాలు ఎంత సొంపుగా వ్రాస్తారో వాటిని ఆయన చదువు తుంటే అంత అమృతం సేవించినట్లుగా ఉంటాయి. ఆ అమృతాన్ని అందరికీ పంచిపెట్టి 'కవిపాదుషా' పేరును సార్థకం చేసుకున్నారు" అని కీర్తించారు. వీరి అధ్యాపక వృత్తిలోను, కవితా ప్రవృత్తిలోను సాన్నిహిత్యం సంపాదించిన విద్యార్థులు, సాహితీవేత్తలు అనేకులు. కవులుగా, రచయితలుగా, కళాకారులుగా అనేక రంగాలలో రాణిస్తున్నారు. శ్రీ పిల్కా వెంకటరత్న కవి, శ్రీ అద్దేపల్లి లక్ష్మణ స్వామి, శ్రీ మూలా పేరన్న శాస్త్రి, డా॥ కాజ లక్ష్మీ నరసింహారావు, శ్రీ భరాగో శ్రీ కొల్లూరి కోటేశ్వరరావు, శ్రీ గిడుగు రాజేశ్వరరావు, తిరుపతి విశ్వ విద్యాలయం మాజీ వైస్ ఛాన్సులర్ డా॥ మొవ్వ వెంకటరామశర్మ మున్నగు ప్రసిద్ధి పొందిన సాహితీవేత్తలున్నారు. కొందరు వారి కవితా శిష్యులుగా స్వీయకృతులను వారికి అంకితం ఇచ్చారు.

విజయవాడ ఎస్.కె.పి.వి.హిందూ హైస్కూలులో పాఠం చెబుతుండగా అప్పటి జిల్లా విద్యాశాఖాధికారి పేరయ్య శాస్త్రిగారు తరగతికి వచ్చారట అపుడు "గుప్పెడుటుకుల్ కొనియాడె భాస్కరా!" అనే పద్యానికి భావం చెబుతూ గుప్పెడు మూసి పిల్లలకు చూపిస్తూ మీకు సైన్సులో ఈ ఆకారములో ఉండేదానిని ఏమంటారు అన్నారట. 'గుండెకాయ' అన్నారు విద్యార్థులు. అప్పుడు పువ్వాడ వారు కుచేలుడు కృష్ణునికి తన హృదయాన్నే సమర్పించాడని వివరించారట. అదివిని పేరయ్య శాస్త్రిగారు ముగ్ధులై పువ్వాడ వారిని ఆలింగనం చేసుకొని అభినందించారట.

ఇక పువ్వాడ సాహిత్య విషయాన్ని గూర్చి తెలుసుకుందాం. అది 1922వ సంవత్సరం ఆయనకి పదహారు ఏళ్ళు. ఎస్.ఎస్.ఎల్.సి పరీక్షలు వ్రాశారు. చెళ్ళపిళ్ళ వారిని కలవడానికి కడియం వెళ్ళారు. ఇంటి ముంగిట అరుగు మీద శాస్త్ర గ్రంథాలు చేతబట్టుకొని ముప్పై యేళ్ళు పైబడిన శిష్యులు ముగ్గురు

గోడకు జారిగిలబడి శాస్త్రిగారు పత్రాలు సుళువు చేస్తున్నారు. ఆయన వంక చూసి "ఎవరవు నాయనా నువ్వు" అన్నారు. అహంభో అభివాదయే అని ఊరు, పేరు చెప్పారు శేషగిరిరావుగారు. 'బందరా రా కూర్చోబాబూ' అని ఆయన అందించిన వ్రాత ప్రతులను చక్షురక్షర సంయోగంగా పరిశీలించారు. కొంతసేపటికి ముందుకు వంగి, నిటారుగా కూర్చొని ఆ పద్యాన్ని చదివి తల ఊపి, మళ్ళీ బయటికి చదివారు. 'కవిత' అనే కన్య రసికునితో తన ఆంతర్యం చెప్పుకుంటోంది.

"మలగన్ దీవనదీ సమాగత లసన్మందానిల స్యంది......."

చదివి శిష్యులకు వినిపించారు. "ఈ కవులు బాలురైనను కవిత్వం పౌఢముగ నుండుటయే గాక నిర్దుష్టముగను, మృదుపద భూయిష్టముగను ఉన్నదని ఒక యోగ్యతా పత్రం వ్రాసి యిచ్చారు. అలా చెళ్ళపిళ్ళ వారి ఆమోద ముద్రనందిన ఆయన బాల్య రచనలన్నీ భారతిలో ప్రచురితమయ్యాయి.

పత్రికవారు ఒక్కసారిగా 116/-రూపాయిలు చెక్కుద్వారా పంపగా దానిని వారు త్రిప్పి పంపుతూ "నా సరస్వతిని అమ్ముకొనటం నాకు ఇష్టం లేదు" అని వ్రాశారు. ఈ విషయం తెలుసుకొన్న దేశోద్ధారక కాశీనాదుని నాగేశ్వరరావు పంతులుగారు వీరి రచనలనన్నింటినీ ఒక సంపుటిగా 1928లో ముద్రించి "కవిత" అనే పేరుతో ప్రచురించి ప్రతులన్నీ వారి ఇంటికి పంపించారట. ఒకసారి ఆయనను పిలిపించి చూసి ఈ కవితలు వ్రాసినది నీవా? ఇంత చిన్నవాడివి అని ఆశ్చర్యపోయారట.

వీరి తొలి కావ్యం గోవత్సయు తరువాత తాజమహలు, దారా, శతపత్రము, పాలవెల్లి, ఆంధ్ర సామ్రాజ్యము, అపశ్రుతులు అన్న పద్యకావ్యాలు; మధు కలశము, తెలుగు వెలుగులు, దీపకళికలు, ఆంధ్ర తేజము, ఏరువాక అన్న గద్య కృతులు; ఔరా? ఎవరు? అనే నవలలు; తెలుగు వారికి మాత్రమే సొంతమైన "రక్త తర్పణం" అనే బుర్రకథ; ఢిల్లీ దర్బారు, దుర్గాదాసు; పృథ్వీపుత్రి, ప్రతాప రుద్రమ దేవి, సహపంక్తి, ప్రాణరక్షణ, శిల్పకావ్యము, తిస్సా పరిష్కారము, తొట్రుపాటు, నందనార్, బిల్హణీయము, లక్ష్మీ స్వయంవరము, సత్యప్రభ, చదరంగం మున్నగు నాటకములు వ్రాశారు. వీరి స్వీయగానపు క్యాసెట్లు కూడా ఇప్పుడు వారి తనయుడు తిక్కన సోమయాజిగారి వద్ద లభిస్తున్నాయి.

వీరి రచనలు ఆంధ్ర, వేంకటేశ్వర, ఉత్కళ విశ్వవిద్యాలయాలలో ఇంటర్, బి.ఎ. భాషా ప్రవీణ తరగతులకు పాఠ్యగ్రంధాలుగా నిర్ణయించారు. వీరి రచనలపై శ్రీ ఎ.చందోజీ యం.ఫిల్, డా॥ యం. సరస్వతీ పి. హెచ్.డి చేశారు.

వీరి నాటకాలన్నీ అనేకసార్లు ఆకాశవాణిలో ప్రసారమయినాయి. వీరి రేడియో నాటికలన్నిటికి నాటక శిఖామణి కీ.శే.బందా కనకలింగేశ్వరరావు గారు సూత్రధారిగా ఉండేవారు. వీరి కావ్యాలు ఆకాశవాణిలో అద్భుతంగా సమీక్షించబడ్డాయి. ఆకాశవాణిలో అనేక పర్యాయాలు ఆయన ప్రసంగించారు. పొరుగోవత్సాన్ని శ్రీ కొతారు రామారావు పంతులుగారికి దారా కావ్యాన్ని శ్రీ మాజేటి రామచంద్ర రావుగారికి సహపంక్తి నాటకాన్ని, శ్రీ బందా కనక లింగేశ్వరరావు గారికి తెలుగు వెలుగులు అనే సాహిత్య విమర్శ గ్రంథాన్ని తమ శిష్యులైన శ్రీ మండలి వెంకట కృష్ణారావు గారికి అంకితం చేశారు.

<u>గోవత్సం</u> కథ యథాతదంగా ఒకనాటి రాత్రి వారి ఇంటి ఆవరణలో జరిగిన సంఘటన. అందుచేత దీనిని వ్రాయటానికి నాలుగు రోజులు మించి పట్టలేదు. ఉత్తమమైన మానవ ధర్మాన్ని, ఉజ్వలమైన ప్రేమను నిరూపించి నీలో గోవులో గల ఏక ప్రజ్ఞను సమాజప్రేమను వేలార్చడమే ఈ కావ్య పరమార్థం.

ఒక విద్యార్థి విహార యాత్రకు ఆగ్రా వెళ్ళి వచ్చి 'తాజమహల్' స్ఫటిక శిలా జ్ఞాపికను గురుభక్తితో వీరికి సమర్పించాడు. దాని ఆలోచనలే "<u>తాజమహల్</u>" ఖండకావ్యం. "<u>శతపత్రం</u>" వేంకటేశ్వరునికి సమర్పించుకున్న కవితా శతపత్రం ఇందలి పద్యాలను తిరుపతిలో మూలవిరాట్టు పాదసన్నిధిలో కూర్చొని ఆలపించగా జనం గంటన్నర సేపు ఆనందించారట. అది చుండూరు వెంకటరెడ్డి గారు కల్పించిన అపూర్వ అవకాశంగా వారు చెప్పుకున్నారు. తాజమహలు, దారా అనే జంటకావ్యాలు వీరి కీర్తిపతాకలు. వీరికి "కవిపాదుషా" అనే బిరుదును సంపాదించి పెట్టాయి.

వారి సాహిత్య జీవితంలో జరిగిన సన్మానాలు, సత్కారాలు అసంఖ్యాకం. ప్రత్యేకించి నాటి విద్యాశాఖామాత్యులు గౌ॥ శ్రీ మండలి వెంకట కృష్ణారావుగారు పువ్వాడవారి ప్రియతమ శిష్యులు ప్రతియేట ప్రభుత్వం జరిపించే ఉపాధ్యాయ దినోత్సవాన్ని గురుపూజా మహోత్సవంగా మలచిన ఘనత శ్రీ మండలి వారికి దక్కితే తొలిసారిగా సత్కారం అందుకున్న గౌరవం శ్రీ పువ్వాడ వారికి దక్కింది.

"1974లో అప్పటి విద్యా మంత్రి, ముఖ్యమంత్రి వర్యుల నుండి అందుకొన్న గురుపూజ, 1958 రిపబ్లిక్ దినోత్సవాలలో జాతీయ కవి సమ్మేళనంలో రాష్ట్రపతి రాజేంద్రప్రసాద్ గారి ప్రశంసా పూర్వక సన్మానం, 1975 ప్రప్రథమ ప్రపంచ తెలుగు మహాసభల్లో సన్మానం నేను మరువలేనివి" అని వారనేవారు. తొలినాళ్ళలో వీరు శ్రీ చోడవరపు జానకి రామయ్య గారితో కలసి జంట కవులుగా కొన్ని రచనలు చేశారు. జానకి రామయ్యగారు కొంత కాలం తరువాత తన రచనా వ్యాసంగానికి స్వస్తిచెప్పారు.

శ్రీ ముట్నూరు వారి దర్బారులో వీరు పాల్గొనేవారు. ముట్నూరు వారిపై వీరు వ్రాసిన పద్యం బహుళ ప్రచారంతో ఉంది.

"నీ తలపాగ కుచ్చు తవడించెడు ఠీవియె ఠీవి యేమహీ
నేతకు చేతకాదు గద నీ నడకన్‌గల సోయగమ్ము కృ
ష్ణా తరణాంబుసంభవ నినాదము పొందుదుగాదె తద్వచ
సృత తరంగ నాద వివశీకృత సర్వజనాను మోదమున్" ఇది విజయవాడలో ముట్నూరి వారి సన్మానసభలో యువకుడైన కవిపాదుషా పాడిన పద్యాలలో ఒకటి. వీరి పెదతాతగారైన పువ్వాడ శ్రీ రామదాసుగారు వ్రాసిన మొవ్వ వేణుగోపాల స్వామి కీర్తనల ప్రభావంతో వీరి వంశం తరతరాలుగా వర్ధిల్లు తోంది. వీరి రెండవ కుమారులు తండ్రిగారి ఒరవడిలో దుందుభి, జిగీష సువర్ణ సౌరభం ఆద్రుపాలి మున్నగు పద్య కావ్యాలు వ్రాసి మంచి పద్య కవిగా గుర్తింపు పొందారు.

కవిపాదుషా వారు తన కలం ద్వారా గళం ద్వారా పద్య, గద్య, నాటకాదుల ద్వారా, విద్యార్థులను ప్రేమతో ఆర్థిక, హార్దిక తోడ్పాటుతో శిష్యప్రశిష్యుల, తెలుగువారల గుండెల్లో చిరస్మరణీయమైన ముద్ర వేసుకొని 1981వ సంవత్సరం మే నెల 24న తన కవిత్వాన్ని సురలోకంలో వినిపించ డానికి దివిసీమను వీడి దివికి చేరారు. వీరు తెలుగు జాతికి, దివిసీమకు కీర్తికిరీటం లాంటివారు.

# తెలుగు సంస్కృతిని ప్రతిబింబింపజేసే చారిత్రక కావ్యాలు

-వి. శ్రీ ఉమామహేశ్వరి

తెలుగు వారి చరిత్ర ఎంతో ఘనమైనది. కాని మనల్ని గురించి మనం చెప్పుకోవడంలోగాని ఇతరులద్వారా ప్రచారం చేయడంలోగాని వెనుకబడి ఉన్నాం. ఈ వెనుకబాటు తనం వల్లనే తెలుగు భాషకు ప్రాచీనహోదా దక్కించుకోవడానికి నానా అగచాట్లు పడవలసిన పరిస్థితులు ఉత్పన్నమయ్యాయి.

ప్రతి పురాణంలో వంశం, మన్వంతరం, వంశచరిత్ర మొదలైనవి ఉంటాయి కనుక పురాణాలు చరిత్రకు మూలాధారాలుగా పేర్కొనవచ్చును. ఆంధ్రదేశ చరిత్రకు పురాతన వస్తువులు శిలాతామ్ర శాసనాలు, నాణెములు ముఖ్య ఆధారములు కాగా తదుపరి స్థానమైన కావ్యాలలో వంశ వర్ణనలు వీరగాథలు ప్రధానంగా నిక్షిప్తమై ఉంటాయి. ఏది ఏమైనప్పటికీ ఆయా కావ్యాలవలన ప్రధానముగా రాజకీయ ఆర్థిక పరిస్థితుల్ని కొంతమేర అంచనా వేయడానికి వీలుకల్గుతున్నది మరోవైపు పాఠకులకు రసానందాన్ని కూడా అందించాయి. తెలుగువారి చరిత్రకు గుండెకాయవంటి చారిత్రక కావ్యాలు ఎన్నోఉన్నాయి. అట్టి చారిత్రక కావ్యాలను కొన్నింటిని స్పృశిద్దాం.

<u>**తెలుగు చారిత్రక కావ్యాలు:**</u>

**వల్లభాభ్యుదయము:** శ్రీనాథ మహాకవి విరచితమైన ఈ కావ్యం క్షేత్ర మహత్య గ్రంథమైనప్పటికీ తొలితెలుగు రాజైన ఆంధ్ర విష్ణువు చరిత్రను ప్రధానంగా తెలుపుతుంది. ఇంకా శాతవాహన వంశం గురించి త్రిలోచన పల్లవుని గురిచి కూడా వర్ణిస్తుంది. అయితే ఇది శ్రీకాకుళ ఆంధ్ర విష్ణువు కథ అనే అంశంపై స్పష్టత లేదు.

**నవచోళ చరిత్ర :** పోశెట్టి లింగన రచించిన నవచోళ చరిత్ర ద్విపదకావ్యం. కన్నడ గ్రంథానికి అనువాద రచన. లింగకవి వీరశైవానికి చెందినవాడు. ఈ కావ్యం ద్వారా కరికాల చోళునిచరిత్ర, విక్రమచోళుని చరిత్ర, ఉత్తంగ చోళుడు, సత్యేంద్ర చోళుడు, మనజేంద్ర చోళుడు, వీరచోళ, ఉత్తమచోళ మొదలైన వారి చరిత్రలు తెలుస్తున్నాయి.

**ప్రతాప చరిత్ర :** తెలుగులో మొట్టమొదటి చారిత్రక గ్రంథంగా దీనిని భావిస్తారు. ఏకామ్ర నాథుడు కాకతీయుల వైభవాన్ని వివరిస్తూ వ్రాసిన చారిత్రక వచన గ్రంథమిది. చారిత్రక రచనలు చేసేవారికి ఈ గ్రంథం మార్గదర్శకం.

**సిద్దేశ్వర చరిత్ర :** ప్రతాపచరిత్ర ఆధారంగా కాసె సర్వప్ప కాకతీయుల చరిత్రను మరింతగా వివరించినారు. ద్విపద వచన శైలిలో ఈ కావ్యం కొనసాగుతుంది. ప్రథమ భాగంలో కైలాసవాసి అయిన శివుడు హనుమకొండలో సిద్దేశ్వరుడనే పేరుతో అవతరించినట్లు వర్ణించినాడు. శివపార్వతుల వివాహ వర్ణనలలో చక్కని దేశీయాచారాలను వివరించాడు. దీని ఆధారంగా కూచిమంచి జగ్గకవి సోమదేవరాజీయమనే చంపూ కావ్యాన్ని రచించినాడు.

**పల్నాటి వీరచరిత్ర :** గుంటూరు సీమలో 1181-1182 కాలములో జరిగిన పల్నాటి యుద్ధాన్ని వర్ణించే కావ్యం. శ్రీనాథుడు, మల్లయ్య, కొండయ్య అనే ముగ్గురు కవులు వ్రాసినట్లు తెలియుచున్నది. ఆ కాలములో పల్నాటి సీమ పాలకులైన హైహయ వంశీయులకు దాయాదులకు మధ్య జరిగిన కుటుంబ కలహాలు, నాయకురాలుగా ప్రసిద్ధిపొందిన నాగమ్మ నలగామునిమంత్రిణి. నలగామరాజు, మలిదేవరాజులకు మధ్య పరస్పరం జరిగిన అంతర్యుద్ధమును చక్కని కావ్యంగా మలిచారు.

ఈ కావ్యంలో అనుగురాజు చందవోలు రాకుమార్తెను వివాహమాడి పలనాటిని అరణంగా స్వీకరించడం, మలిదేవుడు కల్యాణపురాధీశ్వరుడైన వీరసోముని పుత్రికను వివాహమాడడం, కారంపూడి యుద్ధం మొదలైన చారిత్రక ఘట్టాలను రసరమ్యంగా వర్ణించడం జరిగింది.

**కాటమరాజు కథ :** నెల్లూరు ప్రాంతమందు నల్లిసిద్ధి రాజుకు కనిగిరి పాలకుడు కాటమరాజుకు పుల్లరి విషయమై జరిగిన యుద్ధాన్ని వర్ణించే కావ్యం కాటమరాజు కథ. ఈ కథ ద్వారా ఆనాటి రాజకీయ, సాంఘిక స్థితిగతులు తెలియు చున్నవి. శ్రీనాథుడు ద్విపదలో ఈ కావ్య రచన సాగించినట్లు తెలియుచున్నది.

**రాయవాచకం :** విశ్వనాథ నాయకుని స్థానాపతి రాయవాచకాన్ని రచించినట్లు తెలుస్తోంది. తుళు వంశీయులైన వీరనృసింహరాయలు, శ్రీకృష్ణదేవ రాయల యొక్క దిగ్విజయ వివరాలను, దినచర్యలను, కృష్ణరాయలు ఒఢ్ర రాకుమార్తెను వివాహం చేసుకోవడాన్ని, విజయనగర నిర్మాణ విశేషాల్ని ఈ రాయవాచకం వర్ణిస్తుంది. దీనిని ఆధారం చేసుకొని కుమార ధూర్జటి కృష్ణరాయ విజయమనే పద్యకావ్యాన్ని రచించాడు.

**నరపతి విజయము:** రామరాజీయమనే నామాంతరముతో వెంకయ్య ఈ కావ్యాన్ని వ్రాసి ఆరవీటి కోదండరామ రాజుకు అంకితం ఇచ్చినట్లు తెలుస్తుంది. తుళు వంశంలో సమర్థుడైన శ్రీకృష్ణ దేవరాయల తర్వాత ఆరవీటి వంశంవారు ప్రసిద్ధులు. ఇందులో చంద్రుని దగ్గరనుంచి కోదండరామరాజు కొడుకుల వరకు ఆరవీటి వంశ శౌర్య ప్రాభవాన్ని వర్ణించడం జరిగింది. రమ్యమైన చిత్ర కవిత్వంతో ఈ కావ్యం కొనసాగుతుంది.

**రఘునాథాభ్యుదయము:** నాయకరాజులకు సంబంధించిన జీవిత విశేషాలను వివరిస్తూ వెలువడిన చారిత్రక గ్రంథాలలో విజయరాఘవ నాయకుడు రచించిన రఘునాథ నాయకాభ్యుదయం ద్విపదలోను, రఘునాథాభ్యుదయం అనే యక్షగాన రూపంలోను పలువురి మన్ననలు పొందాయి. తండ్రి జీవిత చరిత్రను చక్కటి కావ్యాలుగా అందించడమే గాక నాయకరాజుల కాలంనాటి రాజకీయ, సాంఘిక పరిస్థితుల్ని తెలియచేసారు. నాయక రాజైన విజయరాఘవుని రాజవ్యవహారాలను, దినచర్యలను అతడు మదన మంజరి, కాంతిమణి అనే రాకుమార్తెలతో పాటు లీలావతి అనే వేశ్యను వివాహమాడుటను మున్నారుదాస విలాసం అనే ప్రబంధమును బట్టి యక్షగానాలను బట్టి తెలుస్తుంది. రంగాజమ్మ ఈ రచన సాగించినట్లు తెలుస్తుంది.

**రంగరాయ చరిత్రము:** గుంటూరు, నెల్లూరులలో జరిగిన వీరగాథలను ఇంతకు ముందు తెలుసుకున్నాం. బొబ్బిలి ప్రాంతములో జరిగిన ఈ యుద్ధం బొబ్బిలి యుద్ధంగా పేరొంది వీరుల చరిత్రలను తెలియజేస్తుంది. వీరరసం తొణికిసలాడే ఈ కావ్యాన్ని దిట్టకవి నారాయణ కవి రంగనాయ కదనరంగ చరిత్రగా రచించారు. మూడు అశ్వాసాలలో బొబ్బిలి సంస్థాన చరిత్రను విపులీకరించగా బొబ్బిలి యుద్ధఘట్టాలను వీరరసస్ఫోరకంగా వర్ణించడం జరిగింది.

ఈ విధముగా ఆయా కాలాలలో కవులు రచించిన గ్రంథాలు చక్కటి రసపోషణ కల్గివుండటమే గాక ఆ కాలమునాటి అన్ని పరిస్థితుల్ని వివరిస్తూ చారిత్రక ప్రాధాన్యాన్ని సంతరించుకున్నాయి. ●

# ప్రాచీన తెలుగు, ప్రపంచ భాషలు

-ముశం దామోదర్ రావు

భాష మనకు అంధకారంలో పాతముద్రలుగా బానిసై లిపి, పదాలు వాటి అర్థాలు మనకు దీపాలు. బ్రాహ్మి, ప్రాకృతం, సంస్కృతం, తెలుగు అన్నీ ఒకదానితో ఒకటి ముడిపడినవని అందరూ అంగీకరిస్తారు. పైన తెలిపిన భాషలతో బాటు ప్రపంచములో గల వివిధ భాషలలో సమానంతర పదాలు గలవని, వాటికి మూలము బ్రాహ్మి, సంస్కృతాలనే తెలియజేయాలనే తపన యీ వ్యాసాన్ని రాయటానికి నన్ను ప్రేరేపించినది.

అశోకుని ప్రజల లేఖలలో గల సారాంశాన్ని ప్రపంచం నలుమూలల యందు వ్రాయించిన రాతి శాసనాలు మనకు సహాయపడుచున్నవి. గాంధార శాసనంలో గ్రీకురాజును ఉటంకిస్తూ "అమ్తయాకో నమః యొన రాజ! వ్రాసిన పదము గ్రీకు భాషను బ్రాహ్మీలో ఎలా అతి సులభముగా పామర భాషలో వ్రాసారో మనకు తెలియగలదు.

దాదాపు 3000 సంవత్సరాలుగా పిల్లిమొగ్గలు వేస్తూ నత్త నడక సాగిస్తున్న మన తెలుగు గురించి తెలుసుకుందాం.

యిండో-ద్రావిడియన్ వృక్షంలో తెలుగు ప్రాంతంపైన దృష్టి సారిద్దాం. తెనుగు భాష పలు ప్రపంచ భాషలతో సంబంధాలు కలిగియున్నదని అందరికి తెలుసు.

రోమను రాజ్యాలతోపాటు, ఈజిప్ట్, ఇరాను, చైనా, దక్షిణ అమెరికా దేశాలలో గల మాయ, Aztec నాగరికులతో తెలుగు భాషకు చుట్టరికం ఉంది. ఆసియాలోని Polynesia ద్వీపంలో వాడుకలో మన "కుమారి" పదం గలదు. Camote కామెటు, కుమెటు కుమార పదాలు పాలినిసియా నుండి దక్షిణ అమెరికాతో వాడుకలో గలవు.

Austronesia ద్వీపాలలో అయి, ఫలం మూలం సంస్కృతం నుండి తెలుగులోనికి మరియు మరాటిలో చేరినవి. పపంచ భాషలలో లిపి వాటి సంబంధం సులువుగా తెలియగలదు. పిత్ర, పితర్, పాటర్, పాతర్ పదాలు బాగా తెలుసు. కాని బుమికి పర్యాయపదమైన అట్రిస్ (SK) ను లాటిన్ ఆగియిరో, గ్రీకు అగ్రోన్, ఆకియిర్ ఆటుక, అట్టిమ్ (Attic) Nook ములకు "నూకు"(Corner)

ఒక విషయం మనకు లాభమా, లేక నష్టమా అనేది ప్రక్కన పెడితే మన వేదాలు ముల్లెంలో వున్నట్లే యిప్పటికీ మౌఖికముగా ప్రక్షిప్తాలు లేకుండా తరతరాలుగా వస్తున్నవి. వేదాలు లిపి బద్ధం చేయటం ఆర్యులకు లిపి నిషేధమా లేక యితర కారణమా? ఋగ్వేదము లాంటి వాఙ్మయాలు రచించిన మహోన్నత శిఖరాలను అధిరోహించిన మన పూర్వీకులకు లిపి ఏర్పడటము కష్టతరము కాదు. టొకారిన్ అనే భాష యిప్పుడు వాడుకలో లేదు. యిది ప్రాచీన గ్రీకుల భాష. ఈభాషను కుషానుల, మెయుజి, బాక్ట్రియాలో వాడేవారు. చైనాలోని యునిర్ తండాలు యిరోపును ఆక్రమణ తరువాత యీ భాషను జిన్‌యంగ్ ప్రాంతంలో స్వతంత్ర చైనాదేశీయులు వాడినారని చరిత్ర తెలియజేయుచున్నది. ఇటీవలవాడిన ఒక కరెన్సీనోటుపైన ముద్రించిన చైనా టర్కీ టోచారిన్ భాష యొక్క లిపి. ●

# తెలుగు వెలుగు ఉజ్వలం కోసం

- వి. సుబ్బారావు

భాష గొప్పది నీకన్నా నాకన్నా
ఒక గొప్ప నదిలా జీవ నదిలా
జీవన నదిలా ఉత్తుంగ తరంగ ప్రవాహంలా
సాగుతున్న సాగిపోతున్న నా భాష గొప్పది-
ఒక వ్యక్తి కన్నా ఒక సంస్థకన్నా
ఒక సమూహమై నడుస్తున్న జీవనం
జన జీవనం కన్నా గుండె నిండు నను శ్వాసింపజేయుచున్న
నా తెలుగు భాష గొప్పది.
నా జాతి నా తెలుగుజాతి కలకాలం నిలిచి వెలిగి
గర్వింపదగ్గ భాష గొప్పది- నేడు ఆంగ్ల భాషా వ్యామోహం
దెబ్బలకి ఎదురుదెబ్బలకీ గాయపడుతున్న భాషల్లో తెలుగుభాష
మన తెలుగు భాష శబ్దంలోంచి నిశ్శబ్దంలోకి ప్రయాణిస్తున్న దారి
తీరు కలచివేస్తుంది గుండెని కలచి వేస్తుంది
నన్నూ నా గుండెనూ పగుళ్లు వార్చుతూ కలచివేస్తుంది.

ఆసన్నమైంది సమయం ఆసన్నమైంది
గుండె నిడుగా మేల్కొని మేల్కొల్పు పాడే సమయం ఆసన్నమైంది
వేల సంవత్సరాల భాషను
జీవంతో సజీవంతో తొణికిసలాడుతున్న భాషని, సంస్కృతిని
ఉజ్వలంగా మహోజ్వలంగా ఐక్యతతో సమైక్యతతో
తీర్చిదిద్దు సమయం ఆసన్నమైంది.
తెలుగు వాణ్ణి తెలుగు జాతిని తెలుగు భాషని, సంస్కృతిని
ఉన్నతంగా మహోన్నతంగా సమాయత్తపర్చి
నడిపించే సమయం ఆసన్నమైంది.
పుడమి ఉన్నంతకాలం తెలుగు నేల తెలుగువాడు ఉన్నంత కాలం
నా భాషని నిరంతర ప్రవాహంలా ప్రభాతంగా
జ్వలింపజేయు సమయం ఆసన్నమైంది
ఒక లక్ష్యంతో శాసించి శ్వాసింపజేయు సమయం ఆసన్నమైంది.

# ఆంధ్రుల సంస్కృతీ వైభవం

-ఎమ్.వి.జె. భువనేశ్వరరావు

పసిడి రెక్కలు విసిరి కాలం పారిపోయిన జాడలేవీ?

ఏవి తల్లీ! నిరుడు కురిసిన హిమ సమూహములు? అన్నారు మహాకవి శ్రీశ్రీ.

కాలం పసిడి రెక్కల్ని విసిరి వెళ్ళాలంటే అవి శ్రీమంతమై ఉండాలి. తెలుగు అలాంటి సంపద్భరిత సంస్కృతి గల జాతి అనటంలో ఎటువంటి సందేహమూ లేదు.

సంస్కృతి అంటే జీవన విధానం. జీవన విధానంలో మానవ సంబంధాలు ముఖ్యం. తెలుగువారి సంస్కృతి అంటే కొన్ని వేల ఏళ్ళ నాటిది. దాదాపు 4000 సంవత్సరాలకు పూర్వపు రామాయణం, మహాభారతం, 3000 సంవత్సరాలకు ముందటి ఐతరేయ బ్రాహ్మణం వంటి ఉద్గ్రంధాలలో పేర్కొన బడిన తెలుగుజాతి ప్రపంచంలోని మొదట్లోనే అవతరించిన మానవజాతి. ఇందులకు తెలుగు వారెంతగానో గర్వపడాలి.

భారతదేశంలో హిందీ తర్వాత ఎక్కువమంది మాట్లాడేభాష తెలుగు. తెలుగువారు ప్రపంచంలోని అన్ని దేశాలలోనూ విస్తరించారు. అప్పయ్య దీక్షితర్ అనే తమిళకవి, రెడ్డిరాజుల సామ్రాజ్యంలో నివసించారు. ఆయన మాటల్లో తెలుగు జాతి ఔన్నత్యం గురించి వినాలనుకొంటే

ఆంధ్రత్వ మాంధ్రభాషా చాప్యాంధ్ర దేశ స్వజన్మ భూః తత్రాపి యాజుషీశాఖానాల్పస్య తపసః ఫలమ్!

అనగా "ప్రపంచంలో ఒక మానవుడు తెలుగుజాతిలో పుట్టాలన్నా, ఒక మానవునకు తెలుగుభాష రావాలన్నా వాడు పూర్వంలో ఎన్నో జన్మలందు పుణ్యం చేసియుండాలి" నిజంగా నేటి ఆంధ్రులం ఎన్నో జన్మలందు పుణ్యం చేసిన వారమే కదా మరి!

మనది తెలుగు జాతి. మనం తెలుగువాళ్ళం మనది తెలుగుభాష. 'దేశభాషలందు తెలుగులెస్స' అని చిరకాలంగా ముద్ర వేసుకున్న భాస. ముఖ్యంగా మనది తెలుగు సంస్కృతి. మన సంస్కృతి చెక్కు చెదరకుండా సుభిక్షంగా ఉండేటట్లు చూచుకొనే బాధ్యత మనదే.

నిజానికి 'సంస్కృతి' అనే మాట సంస్కృత భాష నుండి వచ్చిందే! సంస్కృతం అంటేనే సంస్కరించబడినది అని అర్థం. సంస్కృతిలో సంసార భావం ప్రాణం వంటిది. సంస్కరించట మంటే చక్కగా ఉండేటట్లు చేయడం. అయితే ఈ చక్కదిద్దుకోవటంలో కూడా మన ఆచార వ్యవహారాలు అంత ర్భూతమై ఉంటాయి.

తెలుగు సంస్కృతి ఎంతో సుసంపన్నమైనది. ఆంధ్రుల గురించిన లిఖిత ఆధారాలు ప్రధానంగా మెగస్తనీసు రచించిన 'ఇండికా' గ్రంథంలోనూ, అశోకుని శాసనాల వల్లనూ లభిస్తాయి. మెగస్తనీసు క్రీ.పూ. 300 సంవత్సరంలో మౌర్యుల ఆస్థానానికి గ్రీకు రాయబారిగా భారతదేశాన్ని సందర్శించాడు. ఆంధ్రులకు ప్రాకారావృతమైన 30 నగరాలు, లక్షపదాతి సైన్యం 3 వేల అశ్వదళం, రెండువేల ఏనుగులతో కూడిన సైనికశక్తి ఉన్నదని వ్రాశాడు. ఆంధ్రదేశం చంద్రగుప్త మౌర్యుని కాలంలోనే మౌర్య సామ్రాజ్యంలో భాగమైంది.

ఏ జాతి సంస్కృతిలోనైనా సాహిత్యానిదే ప్రథమ ప్రాధాన్యం. 'సాహిత్యం' 'సహిత' లక్షణం కలది. జాతికి హితం కలిగించటం కోసమే సాహిత్యం పుట్టింది. అందమైన భాషలో ఆకట్టుకొనే కథా రూపంలో శ్రోతకు – పఠితకు నీతిని పదిలంగా మృదువుగా శ్రావ్యంగా అందించాలి. అటువంటి ఉత్తమ లక్ష్యంతో పుట్టిందే సాహిత్యం. తెలుగు సాహిత్యం గురించి తెలుసుకోవాలంటే తెలుగుభాష మాధుర్యాన్ని చవి చూడాలి.

నాటి శతక సాహిత్యం నుండి నేటి హైకూ వరకూ మరియు తాటాకు గ్రంథాల స్థాయి నుండి నేటి కంప్యూటర్ యుగం వరకూ నిక్షిప్తమై యున్న తెలుగు సాహిత్యం నిజంగా విశ్వవ్యాప్తమైందే. తెలుగు పద్యం, నాటకం, కథా కవిత్వం, నవలా నాటకం – అన్నీ ఒకదాన్ని మించి ఒకటి ఎదిగాయి. ఇరవైయ్యో శతాబ్దమైతే మనకు ఒక ఆధునిక సాహిత్య వైతాళికుడైన కందుకూరి వీరేశలింగం పంతులుని, కన్యాశుల్కాన్నిచ్చిన గురజాడ అప్పారావుని, వ్యవహార భాషావాది గిడుగు వెంకట రామమూర్తిని, ఒక విశ్వనాధుని, ఒక శ్రీపాదని, ఒక పానుగంటిని, ఒక నండూరిని, స్త్రీ స్వేచ్ఛకై కలం పట్టిన చలాన్ని, హేతువాద విశ్లేషణకు పూనుకొన్న కవిరాజు త్రిపురనేనిని, శ్రీశ్రీని, దేవులపల్లి కృష్ణశాస్త్రిని, ఉమర్ ఆలీషా, గుర్రం జాషువా, ప్రధాని స్థాయి కెదిగిన బహుభాషా కోవిదుడు పి.వి. నరసింహారావునీ, అంతర్జాతీయ బహుమతి నందుకున్న 'గాలివాన' కథానిక సృష్టికర్త పాలగుమ్మి పద్మరాజునీ, వివిధ మాండలికాల్లో నవలలు వ్రాసిన పోరంకి దక్షిణామూర్తినీ, చివరకు మిగిలిందన్న బుచ్చిబాబు, వాయులీనం విన్పించిన చాసో, రత్తాలు రాంబాబును చూపిన రావిశాస్త్రి, భరాగో, కాళీపట్నం, 'ఎదురీత' సాంఘిక నాటక సృష్టికర్త కొండముది గోపాలరాయశర్మ, 'మా భూమి'ని రచించిన సుంకర వాసిరెడ్డి, 'పాలేరు'ను వ్రాసిన బోయి భీమన్ననీ ఇంకా ఎంతోమంది సాహిత్య కారులనందించింది. ఇంకా అందిస్తూనే ఉంది. తెలుగు సాహిత్య విమర్శను పరిపుష్టం చేస్తూ తెలుగు సాహిత్య గ్రంథాలు భాషా సాహిత్య వికాసాలకు దోహదం చేస్తున్నాయి. తెలుగు సాహిత్యం ఇతర భాషలలోకి, ప్రపంచ భాషలలోకి అనువదితమై అంతర్జాతీయ ప్రతిష్ఠను పొందుతోంది.

కవిత్వంలో కొన్ని వ్యంగ్య చిత్ర కవితల్లాగా కన్పించవచ్చు. చీమకథలు, చిలుక కథలు, పిట్ట కథలు, పొడుపుకథలతో పాటు, పద్యాలతో పాటు, నానీ కవితలు, హైకూ కవితల్లో – రచయితలు, రచయిత్రులు ఉత్తమ సంస్కార ప్రబోధక రచనలు చేస్తున్నారు.

చిత్రకారుల్లో కూడా సంస్కార భావాలు ప్రచురంగా ప్రదర్శించే ప్రాజ్ఞులున్నారు. బాపూ రేఖా చిత్రాలున్నాయి. గిరీశాన్ని, మధురవాణిని, కిన్నెరసానిని, ఎంకినీ, తన చిత్రాల రేఖల్లో ప్రదర్శిస్తూ ప్రేక్షకలోకానికి సంస్కార భావాలు కలిగేట్లు చేశాయి.

చిరకాలంగా తెలుగు సంస్కృతిని సుసంపన్నం చేసిన జానపద కళా వైభవాన్ని మనం విస్మరించరాదు. తోలుబొమ్మలాటలు, యక్షగానం, బుర్రకథ, జముకుల కథలు, కువరంజి, వీధి నాటకాలు, పగటి వేషములు, జంగం కథలు, పిచ్చుకుంట్ల వారు, హరికథలు, భాగవతులు, కనక తప్పెట్లు, చెక్కభజన,

హరిహర పదాలు, బైండ్లవారు, మొదలైన జానపద కళారూపాలు తెలుగు సంస్కృతి వికాసానికి ప్రతిరూపాలుగా నిలుస్తాయి.

జంగం దేవర, చోడిగాడి కలాపం, దేవదాసి నృత్యం, తోలుబొమ్మలాటలో బంగారక్క కౌతిగాడు, ఫకీరు వేషం, డప్పుల నృత్యం, పిట్టలదొర, బుడుబుక్కల జోస్యం, గౌంతలమ్మ అశ్వనృత్యం, లంబాడి గన్నెగాడు, వదితలల రావణాసురుడు, బుడిగే జంగాలు, వాలకం నాట్యం, బుట్టబొమ్మలాట, చెంచులు, ఘటనృత్యం, హరిలో రంగ హరిభజన, జుట్టు పోలిగాడు, విప్రవినోదం, దేవతా కొలువులు, దండగానం, జిత్తుల గారడీ, జంతర్‌మంతర్ పెట్టె, రుంజ వాయిద్యం, ఎరుకులసాని సోది, ఉరుముల నృత్యం, గంగిరెద్దులాట, కొమ్మదాసరి, బుర్రకథ, భజన, హరికథ, కోలాటం, కాశీకావడి, హరిదాసు, బతకమ్మ ఉయ్యాలో నృత్యం, మందులవారి వేషం, వీరశైవులు, గొల్లసుద్దులు, గొరవయ్యల నృత్యం, చిందుభాగోతం, తప్పెటగుళ్ళు, ఏకాపత్రమయ, దసరావేషం, పగటివేషాలు, వీరభద్ర విన్యాసం, శూలాల నృత్యం, గరగల నృత్యం, తోలు బొమ్మలాటలోని ఆంజనేయస్వామి, అల్లాటప్పగాడు, తోడుపెద్దు సేవ, పులివేషాలు, అమ్మవారి వేషం, ఆదివాసీల థింసానృత్యం - ఇవన్నీ తెలుగు సంస్కృతిని ఉత్తేజపరిచి, తెలుగు నాట పేరెన్నిక గన్న కళారూపాలే. ఇవి లేకుండా ఏ పండుగా సంపూర్ణం కాదు. ముఖ్యంగా పల్లెటూర్లలో ఈ సాంప్రదాయక కళారూపాలు నేటికీ తాండవిస్తాయి. తెలుగు సంస్కృతిని పరిపుష్టం చేసిన ఈ కళారూపాలన్నింటినీ ఒక్కసారిగా ఒకే వేదికపై చూడగలిగే భాగ్యం ఎవరికి దొరికినా వారు అదృష్టవంతులే.

తెలుగువారి హస్తకళా నైపుణ్యాలు కూడా ప్రపంచ ప్రసిద్ధి గాంచాయి. మన రాష్ట్రంలో పేరెన్నిక గన్న చేనేతకారులు ఉన్నారు. కాలానుగుణంగా, సృజనాత్మకతకు మెరుగులు దిద్దుకొంటున్న గద్వాల్, పోచంపల్లి, కొత్తపేట, నారాయణపేట, వెంకటగిరి, పాటూరు, ఉప్పాడ చీరలు, గుంటూరు వెండిజరీ, చీరలు అత్యంత ప్రాముఖ్యతను సంతరించుకున్నాయి. పొందూరు ఖద్దరు పంచలు, ధోవతులతో పాటు ఖద్దరు చీరలు కూడా ప్రాముఖ్యమైనవే అయ్యాయి. హరప్పా నాగరికతా కాలం నుండి వర్ధిల్లుతున్న అతి పురాతనమైన హస్తకళ కలంకారి, కొండపల్లి ఏటికొప్పాక బొమ్మలు, బహమనీ రాజ్యపాలనలో తెలుగునాట వెల్సూనిన బిద్రీకళ, కరీంనగర్ వెండి నగిషీకళ ఫిలిగ్రీ. పెంబర్తి లోహపు రేకులు, బంజారా కుట్టుపనులు, నిర్మల్ వర్ణచిత్రాలు, దక్కను రగ్గులుగా ప్రసిద్ధి గాంచిన తెలుగు తివాచీలు, కొంకి సూదుల అల్లిక పనులు, హైదరాబాద్ గాజులు, బుడితి, హిమ్రూ, కొమ్ము, దంతపు వస్తువులు, పూసల అల్లిక, శిల్పకళ, వీణ మృదంగాలు, డోక్రా మొదలైన హస్తకళలు మన రాష్ట్రంలో ఉన్నాయి.

ఏ జాతి సంస్కృతినైననూ ఇతరులు ఆదర్శంగా తీసుకొని తమ ప్రాంతంలో అభివృద్ధి చేసుకొటున్నారంటే నిస్సందేహంగా అది మహోత్కృష్టమైన సంస్కృతీ! మలేషియా, జావా, సుమత్రా, సయాం మొదలైన చోట్ల తెలుగు సంస్కృతి ప్రభావపు ఆనవాళ్ళు గోచరిస్తాయి. ప్రవాసాంధ్రులు అమరావతిలో ఉన్నా లేక అమెరికాలో ఉన్నా తప్పనిసరిగా తెలుగుజాతి ఔన్నత్యాన్ని చాటి చెప్పేందుకే కృషి చేస్తారన్నది నిర్వివాదాంశం. ప్రపంచపు నలుమూలలా జరుగుతున్న ప్రపంచ తెలుగు మహాసభలు సైతం మన సంస్కృతీ సాంప్రదాయాల్ని ఉజ్జీవింపజేసేవే! ●

## ఐతే

- డా.జి. రెజీనా

ఏమైతేనేం నీలాగే ఉంటా
నన్నేవరూ మార్చలేరు, ఏమార్చలేరు
దేశవిభజన జరిగినా, ప్రజలు
ధరవరలతో అల్లాడినా ఐతే
నాకేంపని, నా జీతం నా కొస్తున్నప్పుడు
భ్రూణహత్యలు, వరకట్నపు చావులు ఐతే నాకేమిటి?
గంటలు గంటలు ఉపన్యాసాలకు
ఏడాది పొడుగునా పాఠాలకు సరిపెట్టగలను
విద్యార్థులు ఏమైతే నాకేమిటి?
సమాజానికి ఊకదంపుడు సలహాలనివ్వగలను
నన్ను నేను సంస్కరించుకోను
ఏ ప్రభుత్వాలు వచ్చినా ఏరాయైతేనేమి?
పళ్ళూడగొట్టుకోవడానికి ఎంత ప్రాప్తమో అంతే!!
మెట్ట వేదాంతానికి, శూన్యహస్తాలకు అలవాటు
పడ్డ మనస్తత్వం మరి ముందుకు సాగదు
సగటు మానవజాతి జీవితపు అంకెల గారడికి
అందుబాటులోకి నిత్యావసర వస్తువులంటూ
భ్రమకల్పించి ప్రజలెటుపోతే నా కేంటి
అనే రాజకీయ నాయకుల చిద్విలాసపు
పోకడలకు అభిమతానికి, నిలువెల్ల
నిస్తేజపు, నిర్వికారపు ధోరణికి
ఏ వికృతనామ సంవత్సరాదులైనా
ప్రకృతి ప్రసాదించే కొంగ్రొత్త రుచులైనా
ఋతు పరిణామాలైనా, కుటుంబంలో
చేరే అదనపు వ్యక్తులైనా, పుట్టుట
గిట్టుటలైనా 'ఐతే' ఏంటంట
అనే నన్ను ఒక వెట్టిదాన్నిగా జమకడతారు
అయితే నాకేంటి లోకం మునుగదు కదా
నాతోనే ఏ పని ఆగవు కదా!! కర్మసాక్షి
నీవు నా పక్షముంటావు కదా! నీవు
కూడ "ఐతే" నాకేంపని అని అనవు కదా!
కోయిలా కూయబోకే ఆమని వచ్చిందని
చెట్ల చిగురింతలు మనసుకు గిలిగింతలిడినా
హేమంత తుషార బిందువులు నులి
వెచ్చని సూర్యకిరణాలు వసంతంలో
మరి మరి కానరావు కదా! ఐతే
ఏమున్నది వింత? ప్రకృతి నిత్యకృత్యమిది
అనేవారిని ఆ భగవంతుడు కూడ మార్చలేరు...

# కాల్పనికత ముసుగులో వాస్తవికత

- డా.జి.వి. సత్యవాణి

ఆధునిక సాహిత్యంలోని ప్రక్రియలన్నీ తమ చుట్టూ ఉన్న మానవ జీవన సరళిని ఆధారం చేసుకుని వ్యక్తికి ప్రాధాన్యత నిస్తున్నాయి. ఒకప్పటి సాహిత్యం చతుర్విధ ఫల పురుషార్థాలను ఆధారం చేసుకుని, వాటిలో ఏదో ఒక దాన్ని నెలనాటే విధంగా రచింపబడింది. కవిత్వం కాలాన్ని దాటి భౌగోళిక ఎల్లల్ని దాటి సార్వకాలికమైన సార్వజనీనమై భాసిస్తుంది. రచనలోని కథ ఒక కాలానికి పరిమితం కావచ్చు. కానీ పాత్రల మనోచిత్రణ, సంస్కృతి వికాసం మొదలైనవి కాల పరిమితికిలోను కానివిగా ఉన్నప్పుడే రచన కాలాతీతమై నిలుస్తుంది. ఆధునిక నాటకం ఈ లక్షణాలకు విలక్షణమైనది కాదు. నాటకం కవిత్వం లాగా కథలాగా కాక ప్రదర్శనయోగ్యం కావటం వల్ల దానికి మరింత వెసులుబాటు లభిస్తుంది. మానవ మనోగత భావాల ద్వైదీభావాన్ని వ్యక్తీకరించటంలో నాటకానికి సాటి ప్రక్రియ మరొకటి లేదు. ఆధునిక నాటకంలో ఈ లక్షణం ఆధునిక పరికరాల తోడ్పాటుతో మరింతగా రూపుదిద్దుకుంది. నాటకం, దృశ్యకావ్యం అనే పేర్లున్న ఈ ప్రక్రియ కాల కాలాలుగా పరిచయమైనదే అయినా ప్రాచీన నాటకాలకూ ఆధునిక నాటకాలకూ వ్యత్యాసం అనంతం రచన ఏదైనా కాలాన్నీ, ఎల్లల్నీ అధిగమించినపుడు అది ఉత్తమ రచనగా పేరొందుతుంది.

తన చుట్టూ ఉన్న జీవనకాలాన్ని, జీవితాన్ని విడిచి రచయిత ఏ సృష్టీ చేయలేడు అన్నది ఎంత నిజమో! రచయిత ఆ జీవితంలోని అసమానతల్నీ, అస్పష్టతను చూసి ఒక అడుగుకాలం కంటేముందు వేసి సమకాలంలోని సమస్యలకు తనదైన తీరులో పరిష్కారాన్ని చూపిస్తాడనటం అంతే నిజం. నాటకం కల్పనకు ఇతర ప్రక్రియల్లాగానే తావిస్తుంది. కానీ వాస్తవికత నేనున్నానంటూ ముందడుగు వేస్తుంది. కాల్పనికత రచయిత ప్రతిభకు గీటురాయి అయితే వాస్తవికత రచయిత శిల్ప నైపుణ్యానికి కొలమానం. ఈ రెండింటినీ సమపాళ్ళల్లో మేళవించి నాటకాన్ని రక్తికట్టించడం అంత సులభం కాదు. అందులోనూ కాల్పనికత ముసుగువేసి వాస్తవికంగా సమాజంలో జరుగుతున్న నిజజీవితంలో ఎదురవుతున్న సమస్యల్ని వ్యంగ్యాత్మకంగా మనోరంజకంగా మలచటం శ్రమతో కూడుకున్న పని. వాస్తవికతను కాల్పనికత ముసుగులో దాచి సమకాలీన సమాజ అస్తవ్యస్త స్థితిని కాలం ఎల్లలు దాటిన ప్రాచీన భారత సంస్కృతి లక్షణాలతో కలగలిపి రచించిన రచనలున్నాయనటం అతిశయోక్తి కాదు. సమసమాజపు సాంఘిక సాంస్కృతిక జీవనాన్ని చిత్రించే నాటకాల్లో పై లక్షణాల్ని వెదికే ప్రయత్నంలో స్వీకరింపబడ్డవి డా. విజయభాస్కర్ గారి మూడు నాటకాలు 1. కుర్చీ, 2. గాంధీజయంతి, 3. మబ్బులో బొమ్మ.

ఈ మూడు నాటకాలూ సమకాలీన రాజకీయ, కౌటుంబిక వ్యవస్థలకు అద్దం పట్టేవే! అయితే మూడూ విభిన్నాంశాలు, విభిన్న స్థలాలకు చెందినవి. విభిన్న పరిసరాలను వ్యక్తులను సంఘటనలను దృశ్యీకరిస్తాయి. ఏ రెండింటికీ ఏ మాత్రం సంబంధం లేదు. మూడు ప్రత్యేక ఇతివృత్తాలు. నేటి సమాజ ప్రతిబింబం మాత్రమే మూడింటా ఏకసూత్రత.

**1. కుర్చీ :** కథ చాలా సూటిగా చెప్పబడింది. దళితులు రాజ్యపాలన చేయాలన్న సంకల్పానికి ఉదాహరణ ప్రాయమైన రచన. దళితులను పాలకుల్ని చేయాలంటూనే వారికి పదవులు వచ్చినా – వారు తమంతట తాము, తమ భావాల కనుగుణంగా పాలకవ్యవస్థను చేపట్టనీయకుండా, కొన్ని ఉన్నత వర్గాలు ఆ పాలక వ్యవస్థను తమ గుప్పిట దాచుకుని, వారిని పావులుగా వాడుకొనే ప్రయత్నం చేయటం ఇతివృత్తంగా సాగే నాటకం. ప్రస్తుత సమాజంలో ఎన్నో చోట్ల జరుగుతున్న ఈ వర్గ ఆధిక్య భావజాలాన్ని రచయిత చెప్పటంలో కృతకృత్యులయ్యారు. విద్య, ఉద్యోగ, పాలకాది సామాజిక ఉన్నతిలో దళితులకు ఇవ్వబడుతున్న ప్రాముఖ్యాన్ని సూచిస్తూనే, అది వారికి ఎంతవరకూ దక్కుతోందని ప్రశ్నించే రచన.

ఈ నాటక ప్రారంభమే ఒక గుడిసెలో ! ఆ నాటకంలో ప్రధాన పాత్ర, "కుర్చీ"లో కూర్చునే హక్కు సంపాదించుకున్న నర్సయ్య, అతని భార్య "సంకులమ్మ". ఈమె సగటు భారత స్త్రీ. భర్త బాధ్యతల్లో పాలుపంచుకొంటూ మరిది చదువుకోసం, ఉన్నతికోసం తన మీది చిన్నమెత్తు బంగారాన్ని అమ్మివేసి, తాను చేసిన త్యాగాన్ని, తను స్వీకరించిన బాధ్యతను గుర్తించి, తన్ను గౌరవించాలని కోరుకునే సాధారణ సగటు భారత స్త్రీ. నాటకం ఆమె ప్రార్థనతో ప్రారంభమవుతుంది. తన మరిది చదువుకొని ఉద్యోగం చేయటానికి, తన భర్త "కుర్చీ" ఎక్కడానికి కారణభూతుడైన భారత రాజ్యాంగ నిర్మాత అంబేద్కర్‌ను ఆమె పొగుడుతూ తన ధన్యవాదాలర్పించింది.

అంబేద్కర్ ఫోటో ముందు నిలబడి, నమస్కరించటం, ధన్యవాదాలర్పించటం, ఈనాడు సమాజంలో ప్రతి వీధిలోనూ కన్పిస్తున్న దృశ్యమే! నాయకులనూ, గొప్పవారినీ జయంతి, వర్ధంతుల సందర్భంగా గుర్తు తెచ్చుకుని పూలమాలలతో వారి విగ్రహాలకూ, ఛాయా చిత్రాలకూ గౌరవం సలపటం జరుగుతున్నదే! అయితే, ప్రశ్నల్లా ఎంతగా వారి ఆదర్శాలనూ భావాలనూ గౌరవించి ఆచరిస్తున్నామన్నదే! ఈ ప్రశ్న నాటకాంతం దాకా ప్రేక్షకుడిని వెన్నాడుతుంది.

ఒక నూతన పంథాను దర్శించి, సమాజానికి ఒక వినూత్న మార్గాన్ని చూపిన వారు కాలక్రమంలో దైవత్వం పొందటం భారత దేశ చరిత్ర చూసిన నిజమే! ఈ నాటకంలో అంబేద్కర్ భగవదంశగా భావింపబడటం కాల్పనికతకు చక్కటి ఉదాహరణ. రచయిత అంబేద్కర్, గాంధీ వంటి ప్రముఖ నాయకులు, ప్రజాహితం కోరి చేరిన వారు భవిష్యత్తులో దైవంగా పూజింపబడే అవకాశం ఉందని సూచిస్తున్నారు.

**2. గాంధీ జయంతి :** ఇది కాల్పనికతలో ఒక ఉన్నత స్థాయికి చెందిన నాటకం. యమసభలో యముడు గాంధీ గారి పాప పుణ్యాల పట్టిక పరిశీలించి శిక్షించవలసి వచ్చినప్పుడు "మహాత్మా" రాకతో లేచి నిలబడటం, ఒక వింత సువాసన ఆ మహాత్ముని ప్రవేశంతో ప్రసరించబడటం కాల్పనికతకు పరాకాష్ఠకానీ, మహాత్ముని నేరాలను పరిశీలించినపుడు, "అన్నప్రాశన నాడే ఆవకాయన్నం పెట్టినట్లు", "పాకడం రాని వాణ్ణి పరుగుపందెంలో చేర్చినట్లు"

భారతదేశం రాజకీయంగా స్వతంత్రంగా నిలబడే స్థితికి చేరకముందే దానికి స్వాతంత్ర్యాన్ని తెచ్చి, ప్రజాస్వామిక దేశంగా రూపుదిద్దాలని యత్నించడం ప్రధానంగా పేర్కొనబడింది. వాస్తవికంగా ఆలోచిస్తే ఈ కల్పన చాలా సమంజసంగా తోస్తుంది. ఆ నేరానికి దండన విచిత్రంగా కన్పించే కల్పన. 30 రోజుల పాటు తాను సంపాదించి పెట్టిన స్వాతంత్ర్యాన్ని అనుభవిస్తూ, పాలిస్తున్న తన పేరు చెప్పుకొని చెలామణీ అవుతున్న ప్రజా నాయకుల మధ్య గడిపి రావడం, కథలో మలుపులూ, నాటకంలో సంఘటనలూ ప్రస్తుత రాజకీయ పరిస్థితులకూ, నాయకులకూ అద్దం పడుతూ మహాత్మను విస్తృత పరచి, వేదనకు గురిచేసి, చేయని నేరానికి న్యాయస్థానం పాల్జేసి, చివరకు ప్రపంచానికి అహింసను పరమాయుధంగా చాటిన మహాత్మను హత్యానేరానికి గాను ఉరికంబానికి పంపటంతో నాటకం పూర్తవుతుంది.

భారతదేశ పురాణ సాహిత్యకాలం నుండి ధర్మమూర్తి అయిన యమధర్మరాజు లేచి నిలబడి ఒక మానవునిలో "మహాత్మను" గౌరవించడం, ఎంత గౌరవమున్నా ధర్మానికి కట్టుబడి నేరానికి దండనను ఇవ్వడం, దాన్ని అమలుపరచడం, గాంధీగారు భారతావనిలో పడ్డ రాజకీయ ఇడుములు రచయిత కాల్పనికతకు సాక్ష్యాలైతే, రాజకీయ గందరగోళం, స్వార్థపుటెత్తులు, నక్కజిత్తులు వాస్తవికతకు అద్దాలు.

**3) మబ్బులో బొమ్మ :** దర్శకుడు, తన నటులచేత ప్రదర్శింపచేసిన మూగనాటకానికి ప్రేక్షకులు ఇచ్చే వివరణ. చివరగా దర్శకుడు తన భావాన్ని ప్రదర్శించడం ఈ నాటకంలో కథ. ప్రేక్షకులు పేరులేని పాత్రలపై తమ భావాల్ని ఆరోపిస్తారు. పేర్లు పెట్టకపోవడంలో ఒక విశేషం ఉంది. సగటు భారతీయ కుటుంబంలో కన్పించే అత్త, మామ, భర్త, భార్యలే ఆ పాత్రలు. యువజంటలో భార్య కష్టాల పాలవుతుంది. అత్త భర్త వాటికి కారకులు. మామ భార్య ముందు ఒకడుకు ముందు ఎదిరించి నిలబడి మాటలాడే ధైర్యం లేనివాడు. మంచి, ధర్మాల కోసం ఎంత ప్రాకులాడినా నోరు లేని పాత్రే. సగటు కుటుంబాల్లో కన్పించే ఈ పాత్రలకు పేర్లు లేకపోవడంతో ప్రతి ప్రేక్షకుడూ ఏదో ఒక పాత్రతో తన్ను తాను పోల్చుకునే అవకాశాన్ని రచయిత కల్పించారు. ఇది ఒక శైలి విన్యాసం.

ప్రేక్షకులు సాధారణంగా కన్పించే ఆస్తితగాదా, పిల్లల పుట్టుకలను ఆధారంగా తీసుకొని, ఆకారణంగానే గొడవ వచ్చి చివరకు ఆ యువతిని కాల్చి చంపే ప్రయత్నం జరుగుతున్నట్లుగా కథను చెప్తారు. నాటకాంతంలో దర్శకుడు దాన్ని మార్చి యువతి తన్ను చంపాలనుకున్న భర్తను, అత్తను శిక్షించినట్లు చూపిస్తాడు. ఆ ప్రయత్నంలో ఆ యువతిని శక్తి స్వరూపిణిగా పేర్కొంటారు రచయిత. ప్రస్తుత సమాజంలో కన్పిస్తున్న స్త్రీ సమస్యల్ని చిత్రిస్తూనే రచయిత ఆ సమస్యలకు పరిష్కారం సూచించటంలో చక్కని కల్పనను జోడించారు. యువతి తనపై జరుగుతున్న హత్యాప్రయత్నాన్ని అడ్డుకొని వారినే శిక్షించటం మంచి కల్పన. ఆ కల్పనకు శక్తి స్వరూపిణి అంటూ భారతదేశ సంస్కృతిలోని మౌలికాంశాన్ని జతచేయటం విశేషం. ఈనాడు పదేపదే పేర్కొనబడుతున్న స్త్రీ వాద భావనను భారత సంస్కృతిలోని శక్తితత్వాన్ని ఆరోపించడంలో రచయిత వాస్తవానికి కాల్పనికత ముసుగు వేశారనవచ్చు.

భారతదేశ సంస్కృతిలో పురాతన భావాలైన వ్యక్త్యారాధన, ధర్మాధర్మవివేచన, స్త్రీ దేవతగా భావింపబడటం అనే మూడు విషయాల్ని సూత్రప్రాయంగా తీసుకుని డా. విజయభాస్కర్ గారు ప్రస్తుత సమాజంలో కన్పిస్తున్న వర్గ వైవిధ్యం, రాజకీయ బూటకం, స్త్రీ స్వాతంత్ర్య నాటకాల్ని మూడు విభిన్న విశిష్ట నాటకాలుగా మలచారు. మూడింటా సమసమాజం తొంగి చూస్తుంది. కానీ, కాల్పనికత ముసుగులో వేరు రూపంతో ఆవిష్కరింపబడింది. ●

## గీతాంజలి

-వల్లూరిపల్లి లక్ష్మి

గ్రామాన బాటపై నడచుచు నేను
భిక్షా పాత్ర చేబూని యిల్లిల్లు తిరిగేను!
ఒక మహోజ్జ్వల స్వప్నమ్ము వలెను
దూరాన కనిపించె నీ స్వర్ణ రథము!
ఎవ్వరీ రాజాధిరాజంచు తలపోసి
నివ్వెరపడి నిలిచి చూచేను నేను!
ఆశలు చెలరేగ, ఆనందభావాన
చెడ్డ దినాలన్ని సమసిపోయిన వనుచు
అడగకుండగనే అన్ని వైపులకు
విరజిమ్మెదరు ధనమంచు భావించి
భిక్షకొరకు ప్రతీక్షించుచు నిలిచేను!
నే నిలిచినచోట నీ రథమాగిపోగా,
నీ దృష్టి నా పైన ప్రసరించగానే
చిరునగవుతో రథము దిగివచ్చేవు నీవు!
ధన్యమైనది నా జీవితమ్మనుకొని
మదిలోన నేనెంతో ముదము నొందితిని
ఆకస్మికమ్ముగా దక్షిణ హస్తాన్ని చాచి నీవు
"నాకిచ్చుటకు నీ దగ్గరేమి కలద'న్నావు
ఒక భిక్షుకి దగ్గర భిక్షకై చెయిజాపుట
ఎంతటి రాజ పరిహాసమిద్ది అనిపించి
తికమకపడిపోయి, అనిశ్చితాన నిలచి
తడిమి నా జోలె, నెమ్మదిగా చిన్న ధాన్యపు గింజ
నొకటి బయటకు తీసి నీకర్పించినాను!
దినాంతాన గృహము చేరుకొని నేను
ధరణిపై నా జోలెను బోర్లించినపుడు
నిబిడాశ్చర్యాన నిర్విణ్ణనై నిలచేను!
దర్శనమిచ్చేను ఆధాన్యపు కుప్పలో
ధగధగ మెరయుచు పసిడి ధాన్యపు గింజొకటి!
ఎలుగెత్తి విలపించి కాంక్షించినాను, నా
సర్వసమ్ము నీ కర్పణ చేయవలెనన్న
సంకల్పము నాకేల కలగలేదనుచు!

# భాషాభివృద్ధికి సాంకేతిక అభివృద్ధి దోహదం

- ముదిగొండ శాస్త్రి

ఏదైన ఒక భాష అభివృద్ధి చెందాలంటే అందుకు సాంకేతిక అభివృద్ధి కూడా ఎంతో దోహదపడుతుంది. ఆధునిక కాలంలో పాలనా యంత్రాంగం కంప్యూటరీకరణపై ఆధారపడి నడుస్తోంది. అందుకు అనుగుణంగా భాషావేత్తలు తమ ప్రజ్ఞా పాటవాలను మలచుకునవలసి ఉంది. వేగంగా పరిగెత్తే కాలానికి అనుగుణంగా భాషాభిమానులు తమ బాటను మరల్చుకునవలసి వుంది. ప్రపంచమే ఒక కుగ్రామమయినప్పుడు తెలుగుభాషా దేశవిదేశాలలో వ్యాప్తి చెందేందుకు ఎన్నో అవకాశాలు ఏర్పడ్డాయి. ఆ అవకాశాలను ఉపయోగించు కుంటే భాషాభివృద్ధికి చక్కటి బాటలు వేసినట్టువుతుంది. తెలుగువారు ఖండా తరాలలో ఉన్నారు. ఇంటర్‌నెట్ ద్వారా తమకు కావలసిన అంశాలను చూసుకొన గలుగుతున్నారు. ఈ నేపథ్యంలో తెలుగు సాహిత్యం, తెలుగు విజ్ఞాన సర్వస్వాన్ని అంతర్జాలలో ఉంచేందుకు ప్రతి ఒక్క తెలుగువాడు కృషి చేయవలసి వున్నది.

తెలుగు భాషలో వచ్చే పలు పరిశోధనలను ఇంటర్‌నెట్‌లో

మిగిలిన వారికి విధి సందర్భాలలో ఉపయోగపడతాయి.

తెలుగునాట వేలాది తాళపత్ర గ్రంధాలు ఉన్నాయి. శిలా శాసనాలు ఉన్నాయి. ప్రాచీన వ్రాతప్రతులున్నాయి. వాటి వివరాలను అన్నీ ఇంటర్‌నెట్‌లో పొందు పరచవలసి ఉంది. అందుకు ప్రాచీన తాళపత్ర గ్రంధాల సర్వేక్షణ శ్రీకారం చుట్టింది. ఈ కార్యకలాపాలు పూర్తి కావలసి వుంది. దీనివల్ల తెలుగు సాహిత్య రూపాల మూలాలు అందరికి అందుతాయి. తాళపత్ర గ్రంధాలపై పరిశోధనల కొరకు ఈ ప్రక్రియ సుగమం అవుతుంది. తెలుగువారి కళలు, శాసనాలు, శిల్పాల ఫోటోలను వాటి సమాచారాన్ని నెట్‌లో పొందుపరచవలసి ఉంది.

తెలుగుపదజాలం పుట్టు పూర్వోత్తరాలకు సాంకేతిక పరికరాలు ఎంతో దోహదపడతాయి. సూక్ష్మ పరిశీలనా దృష్టితో ఇందుకు పరిశోధకులు ఆవిష్కరించవలసి వుంది. ద్రావిడ భాష నుంచి ఆవిర్భవించిన తెలుగుభాష ప్రాచీనతకు మూలాలు అన్వేషణకు ఇతర భాషలను తులనాత్మక అధ్యయం చేసేందుకు అంతర్జాలం ఎంతో దోహదపడుతుంది. భాషాశాస్త్ర అధ్యయనాలపై ప్రత్యేక దృష్టి సారించేందుకు, భాషా శాస్త్ర పరిశోధనల్లో నూతన ఆవిర్భావాలను వెల్లడించేందుకు కావలసిన సాంకేతిక వనరులను మరిన్ని రూపొందించుకొన వలసి ఉంది. ఇందుకు ఆధునిక కాలం నాటి కంప్యూటర్లు ఎంతో దోహదపడ తాయి. వేగంగా తులనాత్మక అధ్యయనం చేసేందుకు నేటి కంప్యూటర్ వ్యవస్థ ఒక చక్కటి ఆయుధం. తెలుగుభాషలో తెలుగు లిపిలో ఆశించినంత సాఫ్ట్‌వేర్ అభివృద్ధి కావలసి ఉంది. ఇతర భాషల భాషావేత్తలు, శాస్త్రవేత్తలు దీనిపై సారిస్తున్న దృష్టి మనం సాధించడంలేదేమో!

విదేశాలలో భాషాబోధనకు దృశ్య, శ్రవణ మాధ్యమాలు 1960వ దశకంలో ఏర్పాటయ్యాయి. తెలుగునాట నందమూరి తారకరామారావు ముఖ్యమంత్రిగా ఉన్నప్పుడు చిన్నపిల్లలకు మాతృభాషా బోధనకు బాపు, రమణల సాయంతో పాఠాలు రూపొందించి వాటిని జపాన్ నుంచి బుల్లితెరలు తెప్పించి, పాఠశాలలకు పంపి, అందుకనుగుణంగా క్యాసెట్లు రూపొందించారు. అప్పట్లో అదొక విప్లవాత్మక పరిణామం. పిల్లలకు సాంకేతిక పరికరాలపై అవగాహన కలిగేందుకు పాఠశాలల్లో కంప్యూటర్ విద్యను ప్రవేశపెట్టారు. ఇదొక శుభపరిణామం. రాజీవ్‌గాంధీ ప్రధానమంత్రిగా ఉన్నప్పుడు సమాచార శాస్త్ర సాంకేతిక పరిజ్ఞానం పై ఎంతో కృషి చేశారు. ఆ కృషి ఆశించినంతగా కింది వ్యవస్థకు చేరలేదు. మారుతున్న కాలానికి అనుగుణంగా ప్రసార సాధనాలను మలచుకోవాలి. ఈనాడు ప్రపంచవ్యాప్తంగా ప్రసారసాధనాల ఉనికికి ఎంతో ప్రాచుర్యం ఏర్పడింది. గ్రంధాలయాల్లో అన్నివేళల ఇంటర్‌నెట్ సదుపాయం ఏర్పాటు చేయవలసి వుంది. భాషాభివృద్ధికి, తెలుగు సాహిత్యాభివృద్ధికి ఎంతో దోహదపడుతుంది.

80 ఏళ్ల సుదీర్ఘ చరిత్ర కలిగిన ఆకాశవాణి తెలుగు ప్రసారాలకు మణి దీపాలుగా ఎందరో ప్రముఖులు నిలిచారు. పింగళి లక్ష్మీకాంతం ఆకాశవాణి ద్వారా తన కవితలను వినిపించారు. కవికోకిల గుర్రం జాషువా 1956-59 సం॥ములో ఆకాశవాణి మదరాసు కుర్రాలో తెలుగు ప్రసంగాల ప్రొడ్యూసర్‌గా పనిచేశారు. దేవులపల్లి కృష్ణశాస్త్రి హైదరాబాదు తెలుగు ప్రసారాలశాఖ ప్రొడ్యూసర్‌గా 1957-64 సంవత్సరాల మధ్య పనిచేశారు. ఆంధ్రప్రదేశ్ రాజధానిగా హైద్రాబాదు రూపురేఖలు తీర్చిదిద్దుకుంటున్న సమయంలో ఆయన ఇచ్చిన ప్రసారాలను ఇప్పటికీ తెలుగువారు మరిచిపోలేరు. కృష్ణశాస్త్రి మేనకోడళ్ళు వింజమూరి సీతాదేవి, అనసూయ అప్పట్లో వినిపించిన జానపద గీతాలు తెలుగువారి హృదయాల్లో నిలిచిపోయాయి. ఆంధ్రషెల్లీగా పేరుపొందిన వీరి సాహిత్యం వ్యాప్తి చేసేందుకు ఆకాశవాణి ఒక ప్రసార, ప్రచార సాధనమైంది. మునిమాణిక్యం నరసింహారావు కథలు ఆకాశవాణిలో శ్రోతలను కడుపుబ్బనవ్వించేవి. నాయని సుబ్బారావు తరువాత స్థానం నరసింహారావు పౌరాణిక పద్యాలు పాడారు. రేడియో అన్నయ్య న్యాపతి రాఘవరావు బుజ్జారేకుల పిల్లుందా!

అంటూ పిల్లలకు చక్కటి సాహిత్యం వినిపించారు. రేడియో అక్కయ్య న్యాపతి కామేశ్వరి అదే తీరులో బాలల కార్యక్రమాలు అందించారు. బందా కనకలింగేశ్వరరావు తెలుగులో రావడానికి కారణం ఆకాశవాణి ప్రసార కార్యక్రమాలే. ఛాందభావాలకు విరుద్ధంగా త్రిపురనేని గోపిచంద్ పోరాడిన అంశాలకు ఆకాశవాణి ఊపిరిపోసింది. శ్రీశ్రీ ఆకాశవాణిలో ఢిల్లీ కేంద్రములో వార్తా విభాగంలో పనిచేశారు. రేడియోలో ఆయన స్వయంగా తన కవితలను వినిపించేవారు. బాలాంత్రపు రజనీకాంతరావు ప్రసారాలు విని రేడియోశ్రోతలు ఆనాడు చెవికోసుకునేవారు. దాశరధి, ఉషశ్రీ, గొల్లపూడి మారుతీరావు, రావూరి భరద్వాజ ఆకాశవాణిని ఎలా వినియోగించుకున్నారో దూరదర్శన్ కూడా అదేవిధంగా వినియోగించుకున్నారు. ఇలా సాంకేతిక రంగంలో ప్రసార సాధనాలు భాషాభివృద్ధికి, సాహిత్యాభివృద్ధికి ఎంతో దోహదం చేస్తున్నాయి.

ఆధునిక కాలంలో ఛానళ్ళు పెరిగాయి. భాషావేత్తలు. సాహితీవేత్తలకు ఛానళ్ళు ఆయుధాలుగా మారాయి. అయితే ఈ ఛానల్స్ అన్నీ వినోదంగా వున్నాయి. వీటిల్లో భాషాభివృద్ధి, సాహిత్య, సాంస్కృతిక, చారిత్రక అంశాలపై తమ చర్చలను వినిపించేందుకు దోహదపడాలి. వివిధ అంశాలు చర్చించేందుకు భాషావేత్తలు ముందుకు రావాలి. గరికపాటి నరసింహారావు, చాగంటి వెంకటేశ్వరరావు, వంటి ప్రముఖులు కొందరు సాహిత్య ఉపన్యాసాలు

ఇస్తున్నారు. ఇలాంటివి మరిన్ని రావాలి. శిల్పాలు, కళాఖండాల చిత్రాలను వెబ్‌లో ఉంచి ఖండాంతరాలలో తెలుగుభాష ప్రసారం చేసే కార్యక్రమాలను ఇతర దేశాల్లోని తెలుగువారు ప్రత్యక్ష ప్రసారాల ద్వారా చూడగలుగుతున్నారు.

ప్రస్తుతం తెలుగు మహాసభలు తానా, ఆటా కార్యక్రమాలకు హాజరు కానివారు కూడా ఇంటినుండే ప్రసారాలను తిలకించుచున్నారు. సాంకేతిక అభివృద్ధికి ఇదొక చక్కటి శుభపరిణామం. ఈ చర్చల సారాంశాన్ని రికార్డు చేసి పుస్తక రూపంలోకి తీసుకురావాలి. అయితే ఎంతమంది కవులు తమ సాహిత్యాన్ని వెబ్‌లో ఉంచగలుగుతున్నారు? అనేది ఒక ప్రశ్న. ఆధునిక సాహితీ విమర్శలను, భాషా విమర్శలను, వెబ్‌సైట్‌లలో ఉంచాలి. ప్రతి ఒక్క కవి, ప్రతి ఒక్క సాహితీవేత్త తమకంటూ ఒక వెబ్‌సైట్‌ను ఏర్పాటు చేసుకోవాలి. ఒకరి భావాలు మరొకరికి పంచుకునేందుకు ఇది చక్కటి సాధనం. లైబ్రరీలో పుస్తకాలు చదువుకుంటూనే, ఇంట్లో హాయిగా కూర్చుని నెట్‌లో అన్ని గ్రంథాలను అన్ని అంశాలను అధ్యయనము చేసుకోగలుగుతున్నారు. ఈ తరహా అంశాలపై ప్రత్యేక దృష్టి సారించాల్సి ఉంది. పెద్దపెద్ద విద్యాసంస్థలు, సాహిత్య సంస్థలు ప్రచురించే పుస్తకాలను, నెట్‌లో ప్రదర్శించాలి. అత్యాధునిక సాంకేతిక వనరులను అవకాశాలకు మనం ఎంతవరకు అంది పుచ్చుకుంటున్నామన్నది ప్రశ్న. మారుతున్న సాంకేతిక వనరులకు అనుగుణంగా సాహితీవేత్తలు, భాషావేత్తలు తమ దృక్పథాన్ని మార్చుకునవలసి వుంది. తెలుగుభాష ప్రాచీనతకు ఇవ్వన్నీ ఎంతో దోహదపడతాయి. తెలుగుభాష మృతభాష కాకుండా ఉండేందుకు సాంకేతిక పరిజ్ఞానాన్ని తప్పనిసరిగా విని యోగించుకోవాలి. విదేశాలలో వున్న తెలుగువారి పిల్లలకు తెలుగు నేర్చుకునేందుకు చక్కటి వెబ్‌సైట్‌లు ప్రారంభించాలి. తప్పనిసరిగా రోజుకో అరగంట సేపు ఇంటర్‌నెట్ ముందు గడపవలసి వుంది. ఇంటర్‌నెట్ ముందు ఉంటే, గ్రంథాలయంలో ఉన్నట్టే! ఇంటర్‌నెట్ ముందు ఉంటే భాషా అధ్యయనం చేస్తున్నట్టే! ఇంటర్‌నెట్‌ను మన ఆశయాలకు, లక్ష్యాలకు అనుగుణంగా మలచుకుంటే భాషాసేవ చేసినట్టే!

## నివేదన

**- మాధవీ సనారా**

ప్రపంచ తెలుగు రచయితల మహాసభలిడె వచ్చెను  
ఎక్కడెక్కడున్న తెలుగు కళాకారులొచ్చెను.  
ఎక్కడివారైనా సరే తెలుగులంతా ఒక్కటే  
యాస వేరు కావచ్చును భాసమాత్రమొక్కటే.  
ఒకేతల్లి మనందరిది లేరు తల్లులిద్దరు.  
కలహంతో, కుతంత్రంతో వాడ్ని చెప్పనిద్దరు.  
చిక్కనైతే కవితరాయి చక్కనైన తెలుగువారు  
చెక్కిలిపై పుట్టుమచ్చ లాంటి తెలంగాణ వారు.  
అందరము తెలుగులకు మనందరిది తెలుగు కులమే  
రాయలసీమొ, కోనసీమొ చిగురు చేవ కొమ్ములకు  
మహాభారతంలో కథ దాయాదుల మధ్య రగడ  
కాలం మారింది కదా ఎప్పుడగునో యిది విరగడ  
ఇంత బతుకు బతికి కూడ ఇంటి వెనుక చచ్చుటకా?  
తెలుగు జాతి బిడ్డలుగా తలను ఎత్తి తిరుగుటకా?  
అందరమూ కలిసింటే హస్తిని బంధించమా?  
మనమంతా ఒకటిగుంటె హస్తిన చేధించమా?

## నూత్న దీప్తులు

**- సూర్యదేవర రవికుమార్**

వేలకువేల యేండ్లు పృథిలీస్థలి భారతభూమి నిస్తులో  
ద్వేల వికాసవైభవము పెంపెసరలారగ తేజరిల్లివి  
ద్యాలయమై ధరాత్రి దివమై మహనీయముగా రహించి యీ  
ర్ష్యాళువులే మహీశుల యనైక్యతతో గొనె బానిసత్వమున్

స్వాతంత్ర్యేచ్ఛ నశింపజేసి ప్రజలన్ స్వార్థమ్ములో ముంచి త  
న్మాతృద్రోహులుగా నొనర్చి భరతక్ష్మామండలాధీశులై  
చేతఃప్రీతిగా కొల్లగొట్టిరి వసుశ్రీ యెల్ల నాంగ్లేయులా  
రీతుల్ గాంచుచు రుద్రులైరి భరతోర్వీజాతులౌ సజ్జనుల్

పుట్టినది మాతృధరణీ విముక్తి కొఱకు  
ప్రాణముల్ తృణప్రాయముల్ పారతంత్ర్య  
మోర్వజాలము స్వాతంత్ర్యపర్వదినమె  
లక్ష్యమని దేశభక్తులు లక్షలాది  
యాంగ్ల ప్రభుత నెదిర్చి తామంతమైరి

అట్టి త్యాగార్జిత ఫలము కర్వదేండ్లు  
నిండె నీనాటికిని వారి నిందుకలలు  
పండుకాలము రాదాయె ప్రబలె దోచు  
కొనెడి దుర్బుద్ధి నేతల మనములందు

నేతల నుండి ప్రాకెనది నేల చెరంగుల కెల్ల సర్వులన్  
జూతురు నేడు ధబ్బు సులుసూత్రముగా గడియించు మార్గమున్  
నీతియు నీమమున్ దొలగె నిన్ను పరాయుల కమ్మ వచ్చునో  
మాతరో! మాతృభక్తి మతి మంతుల జేయుము నీ సుపుత్రులన్

అట్టి పుత్రులున్న నర్వదేడులె కాదు  
మరల సహస్రాబ్ద పరితయుతముగ  
నిలిచి వెలుగ గలదు నీత్రివర్ణపతాక  
దేశప్రజకు నూత్నదీప్తులిడుచు

## మన తెలుగుతల్లి

**"జయశ్రీ" నరసింహరాజు నందిగామ**

కం॥ భాషయె మూలము మైత్రికి  
భాషయె సంస్కృతికి హేతువైయెసంగున్  
భాషయె తరగని నిథియౌ  
భాషయె భూషణముకాగ వర్ధిలవలయున్

కం॥ ఆశలు దీర్చెడు భాషకు  
ఆశాభంగము కలిగెను ఆంధ్రావనిలో  
ఆశలు దీరుత, తల్లికి  
ఆశాజ్యోతిగ తెలుంగు అవని వెలుగుతన్

కం॥ పెంచవలె తల్లిబాసను  
త్రుంచుడు పరభాషపైని తొలగని కాంక్షల్  
నించుడు మదినభిమానము  
మంచిగ మనతల్లి బాస మహిలోనిలువన్

# గురువింద నవ్వింది

-గంధం వేంకాస్వామి శర్మ

ఎంతకాలం నుండో కుళ్ళి కుమిలి పోతుంది తనలో తాను అర్చేవాళ్ళు తీర్చేవాళ్ళు లేకపోగా రోజూ ఎన్నోమార్లు వినవలసి వచ్చింది ప్రతివాడి నోట తన్ను గురించిన దూషణ ఎలాంటివాడైన భూషిస్తే సంతోషించగలడు లేదా మానేయగలడు. కాని దూషిస్తే వూరుకోగలగడా? వెంటనే ప్రతీకారం చేయటమో, అదీ చేతకాకపోతే ఎద్వటమైనా చేస్తాడు గాని, యీ మాత్రమైన చేయకుండ వుండలేడు. యే మహాయోగో మందమతో గాకుండ వుంటే! ప్రతీకారం చేయటానికి చేతగాదు సరిగదా నోరార కసితీర తిడదామన్నా సృష్టికర్త తన్నో నోరూవాయి లేని "విత్తు"గా మాత్రం సృష్టించాడాయె! ఇక చేయగల్గిందొకటేనని ఆ "గురువింద గింజ" హృదయభారం తీరేదాక యేడ్చి మానేద్దామనే మొదలు పెట్టింది యేడ్వటం! తీరా మానేద్దామనుకునే సరికి, సరిగా అదే తిట్టును తననెవరో తిట్టటం, తన ఉక్రోషాన్ని దిగమింగుకోలేక యింకా బిగ్గరగా యేడ్వటం, ఇలాగే ఆ యేడ్పుకు అంతూ దారి లేకుండా పోయింది.

ఇంతలో తన స్నేహాన్నాశించి ఆ అడవుల్లో నివసించే "అమ్మాయిలు" తనతోపాటు తన స్నేహితుల్ని, బంధువుల్ని సేకరించి ఆడుకున్నంతసేపు ఆడుకుని తమనంత దండలుగా గుచ్చడం మొదలుపెట్టారు. "ఆటవికులు" గాబట్టి గాబోలు వాళ్ళకు తన రంగెంతో అందంగా గన్పించిందనీ; తనకున్న నలుపును వాళ్ళు అసహ్యంచుకోలేదని! వాళ్ల అమాయక హృదయాలెంత మంచివో ఆడుకొని, ఆ కాస్త పరిచయానికే వాటిని వదిలిపెట్టలేక, అలంకరణ సామగ్రిగా రూపొందించి హృదయమంత తృప్తితో ఆ పడుచులు తమ్మును గౌరవిస్తూ మురిసిపోతుంటే సూది దిగేప్పుడు కల్గిన బాధంతా మరిచిపోయి, ఆ పడుచుల ఆనందానికి, తృప్తికి, తమ హోదాకు, గౌరవానికి సమ విలువగట్టి, మనం కూడా కొంత మందినైనా మురిపించి సంతసింప చేయగలిగాం గదా మన జన్మసార్థకమైందని, మన పొరుగుల కానందాన్నివ్వగల్గటం కన్నా జీవింతలో "వ్యక్తి" సాధించగల్గిందీ, సాధించవలసిందీ మాత్రమేమిుందని భావించి తమ పూర్వ బాధను తాత్కాలికంగా మరచి మురిసి, ముసి ముసి నవ్వుల రత్నాలను రాల్చాయా "గురువింద గింజలు".

అరుణోదయంతో, అరుణ కాంతులను విరజిమ్మే గురువెంద దండలను ధరించుకొని బిలబిలలాడుతూ పరుగులెత్తే వాళ్ళా ఆటవికులు నాగరికుల నివాసాలకు "బిచ్చానికి". నిన్న కల్గిన సంతోషం నిలువునా నీళ్లు గారిపోయింది పాపమా గురువింద గింజలకు, అడ్డం వచ్చిన బడిమూక జనాభా నిష్కారణంగా వాళ్ళ వాళ్ళ తప్పులన్నీ వో ప్రక్కకు తోసివేసుకొని, అన్యాయంగా తమను విమర్శించే విషాదం గాకపోతే సంతోషమెలా వస్తుంది? కాని భగవంతుడు మూర్ఖుడు కాడనీ తమ నలుపునూ యేదో వో ప్రయోజనం కోసమే పెట్టి ఉంటాడని భావించి, భగవంతుణ్ని ప్రార్థించేవి, "ఓ దయాళూ! మాకీ దూషణను సహించేంతటి సహనాన్నైనా ప్రసాదించమని! జడపదార్థ జాతికి చెందిన గురువింద గింజలు, వాటికింకా భగవంతుని మరణవార్త తెలియక కాబోలు!

రాత్రి రాత్రంతా ఆర్తనాదంతోనూ, ఆర్తత్రాణ పరాయణుని ప్రార్థనలతోనూ గడిపిన గురువిందలకు తెలవారగానే తృప్తిగల్గేది తమ్మా అమ్మాయిలు అలంకరించుకుంటుంటే, వారికి తామాభరణాలు, ఆదరణీయాలూ, అభిమానభరితాలు గాగల్గినందుకు ప్రపంచంలో వెలుగు నీడల్లా సుఖదుఃఖాలూనూ! ఈ మాటనో బైరాగి "తత్వమరయవే ఓ మనసా, గురు సత్య మెరుగవే ఓ మనసా!" అంటూ ఈ పాటను పాడితే విని గురువింద గింజలు కొంచెం ఊరట చెందాయి.

ఓ సరములోంచి ఊడిపడ్డదా గురువెంద వోరోజు దారం తెగిపోవడం వలన, తన బంధుమిత్ర బృందాన్ని వదిలి పెట్టవలసినందుకు విచారపడ్డా, విధి విధిగా జరగుతుందని విధాతైనా తప్పించలేడని విన్న గురువెంద వూరటతోనే వూరుకుంది. విడివడ్డందుకు విధిలేక, విధిగాబట్టే తన జీవితంలో ఓ మాటైనా నవ్వగల్గింది. తనకా అదృష్టం పడుతుందని ఆ గురువింద ఆరోజుగానీ, మరేరోజు గానీ స్వప్నావస్థలోగానీ, సుషుప్త్యావస్థలోగానీ, జాగ్రదవస్థలోగానీ తలచలేదు. ఆరోజు గాని భగవంతుడు తన్నెంతటి ప్రయోజనం కోసమిని సృష్టించాడో తానర్థం చేసికోలేకపోయింది. తెరతీసినట్లుగా కనువిప్పుగా తన "స్వస్థితి" తెలిసికొనేసరికి హృదయం తేలికపడి ఫక్కున నవ్వింది – గురువింద గింజ!

నట్టనడివీధిలో నాల్గుబజార్లు కలిసే చోటపడ్డ ఆ గురువింద ప్రపంచం పోకణ్ణి కళ్లారా చూస్తుంది. అనుక్షణం ఆ వీధులవెంట యిసుక వేస్తే రాలని ప్రజలు వస్తూ పోతుండేవాళ్లు; రాత్రయ్యే ఏ కొద్ది గంటలోతప్ప. ఆ రాత్రిలోనూ ఒకరో యిద్దరో కంటపడుతూనే వుండేవాళ్లు కదా! ఆఖరిక్కనుకుందా గురువింద "యీ జనాభాలో అంతా చెప్పేవాళ్లే కన్పిస్తున్నారు. యికచేసేవాళ్లెవరా? అని. ఈ సంశయం మస్తిష్కంలో ప్రవేశించాక ప్రత్యేక శ్రద్ధతో పరికించటం మొదలు పెట్టిందా గురువెంద; ప్రపంచపు పోకడను. అందుకనే నవ్వగల్గిందానాడు. కాబట్టే ఆ గురువెంద కడుపుబ్బ నవ్వగల్గింది". తనను యేది తెలుసుకోలేదని విమర్శించు తుంటారో దానిని – వాళ్లేమన్నా తెలిసికోగల్గారా? అని ప్రశ్నించుకొని తానే లేదని సమాధానం చెప్పుకొని–ఫక్కున నవ్వింది. నట్ట నడిబజార్లో పడ్డ–గురువింద గింజ.

ఏ సుముహూర్తాన నడిబజార్లో పడ్డదోగాని హాయిగా నవ్వుతూ కాలాన్ని వెళ్లబుచ్చుతోందా "గురువెంద గింజ" ఆ కాస్త నలుపే లేకుంటే తన యెఱ్ఱని యెరుపు అంతగా అందగించి నిండుగా గన్పించేదే కాదేమో! నేర్చుకునే ప్రజలకు తన నలుపెంత పాఠాన్ని నేర్పుతుంది!! ఆ కాస్త నలుపే లేకుంటే తనీనాడంత హాయిగా నవ్వగల్గేదే కాదేమో!!! అని భావించటంలో సంతోషించి తృప్తినీ ఆనందాన్ని గుత్తగొంది గురువెంద.

నల్లని చీకటిలో తెల్లని వో అమ్మాయి! అటే వస్తోంది. అమ్మాయికి అల్లంత దూరంలో అబ్బాయి!! చక్కని జంట, చిలుకా గోరింకల్లా!!! రోజు వాళ్లని ముసి ముసి నవ్వుల మాటల్లో చూస్తుంటే గిలిగింతలు పెట్టినట్లయింది. 'గురువింద కన్యకు'. ఈడూ జోడూ నవదంపతులు కాబోలని తనొకరకం సుఖానుభూతి ననుభవించి మురిసి ముగ్ధైపోయేది "కులుకులాడి గురువింద" తన్నొకమారు తిరిగి చూచుకొని ధూళి, దూగరా దులుపుకొని మందహాస రేఖల్ని నును సిగ్గుతో మేళవించి మమకారం మూగగా ముక్తసరిగా పురికొల్పుతుంటే, గగుర్పాటు కలత పెడుతుంటే, తన హృదయాధి నాధుణ్ణి అంతర్నేత్రాలతో భావఫలకంపై దర్శించి మధురక్షణాల ననుభవించేదా "గురువెంద మగువ!"

సామాన్య ప్రకృతితో యీ నవదంపతుల సంభాషణను వినాలని ఉవ్విర్లూరింది ముగ్ధగురువెంద. అమ్మాయి అదోలా యేడుపుముఖం పెట్టి మాట్లాడుతోంది. అబ్బాయి మరోలా ముఖం పెట్టాడు. ఆశాభంగమయ్యింది గురువిందకు కాని

ప్రణయ కలహమేమో లెమ్మని భావించింది. ప్రణయకలహం "పారిజాతాప హరణం" లో మహా రసవత్తరంగా నడిచింది. శాస్త్రిగారి పురాణంలో పురాణం లోనే అంత పసందుగా వుంటే ప్రత్యక్షంగా యింకెంతో రుచిగా వుండొచ్చని నవ్వరుచులూర్చుకుంటూ నిరీక్షిస్తోంది. "నవ జవ్వని గురువెంద".

"ప్రసాద్! మన ప్రేమ ఫలం పెరుగుతోంది నాలో. నీవు నన్ను వెంటనే పెళ్లి చేసుకోకపోతే నేను నలుగురి నోట్లోనూ నానవలసివస్తుంది అని వాపోతుందా పదుచు. "తూ! మనమిద్దరం ప్రేమికులం, నిన్ను పెండ్లి చేసుకొనటానికి నాకభ్యం తరం లేదు. నిన్ను జూచి నవ్వడానికి యీ సంఘానికే మవసరం? నిన్ను వీళ్లు చిన్న చూపు చూస్తారని భావించటం నీ "మెంటల్ వీక్‌నెస్" ను చెపుతోంది. ధైర్యంగా వుండు వచ్చే సమ్మర్లో" నిన్ను చేసుకుంటా" నన్నాడా అబ్బాయి.

"పిడుగు పడ్డట్లు విరగబడి యేడ్వటం మొదలుపెట్టిందా అబల. జాలి, "చాల్లే!" అని అదలించినా "హ్హ హ్హ హ్హ" అని విరగబడి వికటాట్టహాసం చేసిందా గురువింద. "చంద్రశేఖరం గారూ!" కేకవేశాడో బక్కచిక్కన బడిపంతులు. నిలబడ్డాడో నిగనిగలాడే విగ్రహం. "మన అబ్బాయి పరీక్ష సంగతి తెలిసిందా?" "ఆ! తెలిసింది. వెధవ కాలం పోనిద్దురూ! మనవాడి తెలివితేటలు మన మెరుగనివా? అయినా తెలివితేటల్ని కొలిచే సాధనాలు యీ పరీక్షలేటండీ? ఒక్క రెండు మార్కులు తగ్గిపోయాయట. పనికి మాలిన లెక్కల్లో. అందుకని మనవాడు పైక్లాసు చదవడానికి పనికిరాడట!"

"అరె! యింతకూ పరీక్ష పోయిందన్నమాట!" పోకేంజేస్తుందండీ! ఆ పేపరు దిద్దినవాడు వట్టి దద్దమ్మట! మనవాడు వ్రాసింది వాడికసలు అర్థంగాక యిష్టం వచ్చినట్లు మార్కులు వేశాట్ట.! మరో సంగతండోయ్! మనవాళ్ల మంచి పకడ్బందీగా వ్రాసినా వాళ్లు అర్థంగాక ఆ ఉక్రోషం పట్టలేక యిలా మార్కులు వేయకపోవటం కూడా వుంటుందిట! ఇంతకూ అదృష్టం కూడా వుండాలిగా అంటూ జారుకున్నాడా వ్యక్తి. సకిలించినట్లు ఇకిలించింది. భ్రష్టత్వ భంగిమల్ని పరికించిన – పనికిరాని గురువింద!

వింతలో వింతగా చూపట్టింది లోకం పోకడ – అంటే ప్రజల ప్రవర్తన ఓ లక్ష్యశుద్ధితో పనిజేసేవాడూ, ఓ విశిష్టతను గడించినవాడూ, పరిగణించే వాడూ అపురూపుడయ్యాడు. మాతృభాషలో మాట్లాడటం మర్యాదహీనం, రానిభాష మాట్లాడటం గౌరవం. శుచి కరణాలను ప్రక్షాళన చేసుకొని శుభ్ర వస్త్రంతో భోంచేయడం చాదస్తం, వీధుల వెంట అడ్డం వచ్చినవన్నీ త్రొక్కివచ్చిన "బూట్లు" తోటి వారాల తరబడి మురికిపట్టిన "సూట్లతో" టీ కుర్చీమీద కూర్చొని "మీల్స్" తీసుకోవడం నాగరికతా; దేశాన్ని మోసం చేసేవాడు దేశభక్తుడిగా చెలామణి, పని చేయకుండా పెట్టుబడిదారుని నాశనం జేయాలనే శ్రామికులూ, పనిచేజేసేవాళ్లనే పీక్కుతినే ఉద్యోగులూ – యజమానులూ; మాస్టరుగారికేమీ రాదనే విద్యార్థులూ, ప్రజలూ ప్రభుత్వము వొకటేననే ప్రభుత్వపు సహకార అభ్యర్థనలు; ప్రజలు వేరూ, ప్రభుత్వం వేరూననే పార్టీ రాజకీయాలూ; ఇదే జీవితపు బాట.

"సినిమా కారు పోరాబాబు పో; పోయి చూడు యీ లోకం పోకడ" అనే రికార్డు వేస్తూ బజారువెంట వస్తుంటే ఆలోచన భగ్నమయింది మన గురువెందకు. ఇవన్నీ నెమరు వేసుకొని, ఆ పాటను సమన్వయిస్తే.... నవ్వలేనంతగా నవ్వింది – గురువింద గింజ.

ఇంతకూతన నలుపురంగు మాత్రమే! కాని కళంకం కాదు. ఇన్ని రకాల కళంకాలను భరిస్తున్న ప్రజా సమూహమంతా యేకంగా తన నాడి పోసి కుంటుంటే విన్నప్పుడల్లా నవ్వుతూనే వుంది – నలుపెరిగిన గురువింద – తృప్తితో కసిదీర!

## ఎర్రని పిల్లయితే

- మేడిచర్ల సూర్యప్రకాశరావు

1. అందచందాలు లేని నల్లని పిల్లను పెళ్లిచేసుకున్నావేం రా!
వరకట్నం రూపేణా ఎక్కువ ముడుతుందనా?
అబ్బే నాకు అనుమానం ఎక్కువ. ఎర్రని పిల్లయితే అందరికళ్లు దానిమీదే ఉంటాయి మరి.

### "అయితే మా నాన్నే"

2. ఈ లెక్క ఎవరు చేసార్రా? టీచరు ప్రశ్నించాడు క్లాసులో.
తప్పుచేసానా మాస్టారు. అయితే ఆ లెక్క మా నాన్నే చేసాడు! బంటి సమాధానం.

### "వడ –దడ"

3. డాక్టరు వద్దకు వేసవి కాలంలో పరుగు పెట్టుకొని వచ్చిన అప్పారావు డాక్టరు ఇలా అన్నాడు. "డాక్టరు గారూ! నాకు ఒక్కటే దడ డ"
బయటగ ఎండలో పరుగుపెట్టుకొని వచ్చావుకదా! అందుకు నీకు ఎండలో వడదెబ్బ తగిలి ఉంటుంది! అప్పారావుతో అన్నాడు డాక్టరు.
"వడదెబ్బే తగిలిందికాని ఆవడదెబ్బ కాదు. ఇంటిపని సరిగా చేయలేదని వడలు తింటున్న మా ఆవిడ ఓ వడతో కొట్టింది డాక్టర్!" డాక్టరుగారితో చెప్పాడు అప్పారావు.

### "రెక్కతెగి"

4. "మా ఇంటివద్ద రెక్క తెగిపడిందోయి నామీద!" చెప్పాడు మదన్
ఫ్యాను రెక్క తెగిపడిందా? నీకు దెబ్బతగిలిందా? ప్రశ్న మీద ప్రశ్న వేశాడు జగన్.
"అబ్బే! విల్లంబులతో కొడితే పక్షిరెక్క తెగిపడింది మీద!" చెప్పాడు మదన్.

### "సున్నం వేస్తే అన్నం"

5. నీకు అన్నం పెట్టిన ఇంటికి కన్నం పెట్టావా? పోలీసు స్టేషన్లో యస్. ఐ ప్రశ్న
"నేను ఆ ఇంటికి సున్నం వేస్తే అన్నం పెట్టారు. ఆ ఇంటికి ఏ వెధవో వేసుంటాడు కన్నం నేను కాదండీ!" యస్.ఐ తో అన్నాడు జగ్గారావు.

### "పింటూ ఔర్ మింటూ"

6. "మా అమ్మ నాకు ఇడ్లీ పెట్టింది!" చెప్పాడు పింటూ
మా అమ్మ నాకు కిడ్నీ పెట్టింది! చెప్పాడు మింటూ
"నీవు తినడానికి పక్షి కిడ్నీ పెట్టిందా మీ అమ్మ? ప్రశ్నించాడు మింటూని పింటూ.
"మా అమ్మ డాక్టరు. నాకు కిడ్నీ పాడైపోతే మరో కిడ్నీ పెట్టింది!" పింటూతో చెప్పాడు మింటూ.

### "తీసుకుపొమ్మని"

7. దేవుడు కన్పించి ఏదైనా వరం కోరుకోమంటే ఏం కోరుకుంటావురా?
"మా ఆవిడ్ని తీసుకుపొమ్మని కోరకుంటాను".

### "పాపాలు – పాపలు"

8. "పాపాలు చేస్తే నరకానికి పోతారు!" కొడుకుతో అన్నాడు జగ్గారావు.
"అలా అయితే నీవు పాపల్ని కిడ్నాప్స్ చేయటం మానుకో నాన్నా!" తండ్రితో చెప్పాడు బింటూ.

# కృష్ణాజిల్లా భూగోళిక స్వరూపము

- దామెర విజయసారథి

కృష్ణాజిల్లాఆంధ్రప్రదేశ్‌లోని ఒక ముఖ్య మైన జిల్లా. ఈ జిల్లా 16°11'24" అక్షాంశము 81°08'24" రేఖాంశబులు గల ప్రదేశంలో వున్నది. భూగోళిక నైస్వర్గిక స్వరూపాలు ఆధారంగా ఈ జిల్లాను రెండు ప్రధాన విభాగాలుగా గుర్తించవచ్చు.

అందులో ఒకటవది ఎగువప్రాంతం (upland) దీనిలో 22 మండలాలు పరిపాలనా సౌలభ్యానికి విభజించటం జరిగింది. ఇక రెండవది డెల్టా (delta) ప్రాంతం. ఈ భాగములో 28మండలాలు వున్నాయి.

కృష్ణాజిల్లాలోని వివిధ శిలలు వాటి ప్రాముఖ్యత:

ఈ జిల్లా ప్రధానంగా తూర్పు కనుమ పర్వత శ్రేణువులతో విస్తరించివుంది. ఈ ప్రాంతంలో భూ ఉపరితలం మీద మొట్ట మొదగా ఏర్పడ్డ ఆర్కియన్ శిలా సముదాయము, ఆ తరువాత కాలంలో సముద్ర అంతర్భాగం నుంజి చొచ్చుకొని వచ్చిన కడప బేసిన్‌కు సంబంధించిన శిలలు మరియు గోండ్ వానా ఖండంగా పిలువబడే దక్షిణ భూగోళ ప్రాంతం ముక్కలుకాగా ఏర్పడ్డ గోండువానా శిలలతో నిండివుంది.

శాస్త్రపరంగా అతి ప్రాచీన శిలలనుండి నవీన శిలలను ప్రాధాన్య క్రమంలో కింద నుంచి పైకి వ్రాసినప్పుడు కృష్ణాజిల్లాలోని శిలా సముదాయం ఈ క్రింది విధంగా విభజించవచ్చు.

నవీన కాలానికి చెందిన అల్యూవియ్-ఇసుకనేలలు
ఎగువ గోండువానా శిలా సముదాయం
గోండువానా కాలంనాటి శిలా సముదాయం
కడప బేసిన్‌ద్వారా ఏర్పడ్డశిలా సముదాయం
తూర్పుకనుమలలో ఏర్పడ్డ నైసిక్ శిలా సముదాయం
ఆర్కియన్ గ్రానైట్ శిలలు.

**ఆర్కియన్ శిలలు:-** ఇవి మనకు జిల్లాలో కనిపించే ప్రాంతాలు నందిగామ, జగ్గయ్యపేట, పెనుగంచిప్రోలు, బాపులపాడు, వత్సవాయి మండలాలు. వీటిలో వుండే ప్రధాన శిలలు గ్రానైట్ శిలలు మరియు డొలరైట్ శిలలు. ఇవి చాలా కఠినమైన శిలలు. వీటిలో కొన్ని ప్రాంతాలలో ఖనిజాలు కూడా వున్నాయి. ముఖ్యంగా ఇనుప ఖనిజం జగ్గయ్యపేటగలోని గంద్రాయి ప్రాంతంలో లభిస్తుంది. ఇక భూగర్భజల లభ్యతపరంగా ఈ శిలలు చాలా తక్కువ ప్రఖ్యాతగల శ్రేణిలో వుంటాయని చెప్పుకోవచ్చు. సాధారణంగా భూగర్భజలం ఈ శిలల్లో పై పొరల్లో మాత్రమే (సుమారు 4 నుంచి 30 అడుగుల లోతు) లభ్యమవుతుంది. కనుక ఈ ప్రాంతంలో భూగర్భజలానికి అనువైనవి ప్రతవ్వకపు బావులు మాత్రమే. కాని ప్రత్యేక స్థలాల్లో అక్కడక్కడ సుమారు 80 నుంచి 130 అడుగుల వరకు భూగర్భజల లభ్యత వుంటుంది. ఈ ప్రాంతాలలో జలాన్ని బోరుబావుల ద్వారా పొందవచ్చు.

ఈ ప్రాంతాలలో ప్రవహిస్తున్న ప్రధాన నదులు లేదా ఉపనదులు, సెలయేళ్లు భూగర్భ జలాన్ని రీచార్జి చేయటానికి దోహదం చేస్తున్నాయి. ఇవి ఒకటి కృష్ణానది, రెండు మున్నేరు, మూడు పాలేరు, వైరా మరియు చిన్నచిన్న వాగులు, వంకలు, భూగర్భ జలపరంగా ఈ ప్రదేశాన్ని పాలేరు, మున్నేరు చర్లపాడు, వైరా బైసిన్‌లుగా విభజించారు.

**తూర్పు కనుమల ద్వారా ఏర్పడ్డ నైసిక్ శిలలు :-** కృష్ణాజిల్లాలో ఈ రకమైన నైసిక్ శిలా సముదాయం ఇబ్రహీంపట్నం, జి.కొండూరు, మైలవరం, ఎ.కొండూరు, తిరువూరు, విస్సన్నపేట, చాట్రాయి, రెడ్డిగూడెం, నూజివీడు మరియు ఆగిరిపల్లి ప్రాంతాలలో కొంత భాగం మేరకు విస్తరించివున్నాయి.

ఈ శిలా ప్రాంతంలో ముఖ్యంగా ఖోండలైట్, బార్నోకైట్, లెప్టినైట్, కార్ట్జైట్ వంటి శిలలు లభ్యమవుతాయి. వీటిని చార్నోకైట్ శిలా సముదాయంలో క్రోమైట్ ఖనిజం దొరుకుతుంది. ఈ ఖనిజం కొండపల్లి గ్రామ ప్రాంతం నుంచి సుమారు గంగినేని గ్రామం వరకు లభ్యమవుతుంది. బ్రిటీషుకాలం నాటి నుంచి ఈ ఖనిజాన్ని మైనింగ్‌చేసి శుద్ధిచేసిన ఆధారాలు కొండపల్లి ఖిల్లాకు పడమర ప్రాంతంలో వున్నాయి.

ఈ శిలా సముదాయంలో లభ్యమయ్యే మరొక ఖనిజం మైకా. ఇది ఎ.కొండూరు, తిరువూరు మండలాల్లో పలుచోట్ల దొరికినట్టు ఈ ఖనిజాన్ని మైనింగు చేసి వెలికితీసిన దాఖలాలు వున్నాయి. ఈ ప్రాంతంలోనే క్వార్ట్జ్ కూడా లభ్యమవుతుంది. ఈ మండలాల్లోని కొన్ని ప్రాంతాలలో అరుదుగా లభించే రంగు రాళ్లు కూడా దొరికినట్టు ఆధారాలున్నాయి.

**గోండ్‌వానా కాలంలో ఏర్పడ్డశిలలు :-** ఈ కాలంనాటి శిలలు ప్రముఖంగా నూజివీడు, బాపులపాడు, ఆగిరిపల్లి మండలాల్లో విస్తరించివున్నాయి. ఈ శిలలకు భూవిజ్ఞాన శాస్త్రజ్ఞులు పేరుపెట్టినప్పుడు నూజివీడు మండలంలోని గొల్లపల్లి గ్రామం పేరు ఆధారంగా "గొల్లపల్లి ఇసుకరాతి శిలలు" అని నామ కరణం చేశారు. ఈ శిలల తర్వాత ఏర్పడ్డ "రాజమండ్రి ఇసుకరాతి శిలలు కూడా కృష్ణాజిల్లాలో లభ్యమవుతాయి. ఈ శిలా సముదాయం మీర్జాపురం గ్రామం నుండి బాపులపాడు మండలంలోని వివిధ గ్రామాలకు విస్తరించివున్నాయి. ఈ శిలా ప్రాంతంలో భూగర్భ జల లభ్యత అధికంగా ఉండటం విశేషం. ఈ ప్రాంతంలో భూగర్భ జలాలు సుమారు 10 అడుగుల నుంచి 30 అడుగుల లోతు మధ్య లభ్యమైయేవి. కాలక్రమేణ భూగర్భ జలాల వాడకం పెరగడం వల్ల మరియు వాతావరణం కాలుష్యం ద్వారా ఏర్పడ్డ వర్షాభావ పరిస్థితులవల్ల ఈ ప్రదేశంలోని నీటి మట్టాలు క్రమేపి తరుగుతూ తవ్వకపు బావులకు అందనంత లోతునకు చేరుతున్నాయి. కానీ భూగర్భ జల లభ్యత ఈ ఇసుక రాతి ప్రదేశంలో సుమారు 200 - 600 అడుగుల వరకు ఉండటం వల్ల ప్రస్తుతం భూగర్భ జలాన్ని గొట్టపు బావులద్వారా వెలికి తీస్తున్నారు. ప్రస్తుత కాలంలో ఈ ప్రాంత నీటిమట్టాలు సుమారు 130 అడుగుల నుంచి 250 అ॥ లోతు వరకు ఇంకిపోవడాన్ని ప్రమాద సంకేతంగా భావించాలి.

ఈ శిల ప్రదేశంలో ప్రముఖమైన ఖనిజసంపద లేనప్పటికి గొట్టపు బావుల నిర్మాణానికి మరియు నీటిని శుద్ధి పరిచే యంత్రాలు ఉపయోగించే అనువైన గులకరాయి (గ్రావేల్) మీర్జాపురం ప్రాంతంలో లభ్యమవుతుంది. ఇంతే కాకుండ పాత్రలు మరియు ఇటుకరాళ్ల తయారీలో ఉపయోగించే బంకమన్ను (క్లే) నిక్షేపాలు రమనక్కపేట ప్రాంతంలో పుష్కలంగా వున్నాయి. ఈ ఇటుకరాళ్లను ఇటుక ఆకారంలో మల్చి తవ్వకపు బావులకు లైనింగుగాను మరియు ఇంటి ప్రహరీలు, దేవాలయాల కట్టడికిగాను ఉపయోగిస్తారు.

**కృష్ణాడెల్టా:-** ఈ ప్రాంతాన్ని పరిపాలన సౌలభ్యం కొరకు 28 మండలాలుగా విభజించారు. ఈ డెల్టా ఆవిర్భావం సుమారు 350 సంవత్సరాల క్రితం జరిగినట్టు పరిశోధనలు చెప్పుచున్నాయి. ఇంతకు ముందు కాలంలో కృష్ణ, గోదావరి నదులు రెండు కొల్లేరు సరస్సుగా ప్రసిద్ధిచెందిన లోతట్టు ప్రాంతంలోకి కలసికట్టుగా ప్రవహించేవి. కాల క్రమేణ ఈ నదుల ద్వారా తేబడిన గులకరాళ్లు, ఇసుక మరియు బంకమట్టి ఆవ్రా క్రమేపి భూభాగం ఏర్పడడం ప్రారంభించింది. ఈ విధంగా భూభాగం ఏర్పడుతు సముద్ర తీరాన్ని అంచలంచలుగా వెనుకకు నెట్టిందని అంచనా. ప్రస్తుతం మనం చూస్తున్న తీర ప్రాంతం సుమారు 250 సం॥ క్రితం ఏర్పడి ఉంటుంది అనుటకు శాస్త్రపరమైన ఆధారాలున్నాయి. ఈ అంచనాలు డెల్టా ప్రాంతంలోని వివిధ ప్రదేశాల్లో బంకమట్టి మరియు ఇసుక నమూనాలను సేకరించి వాటిలోని రేడియోధార్మిక కర్బన్ ఆధారంగా వాటి వయస్సును లెక్కించి పై పేర్కొన్న ఆధారాలను నిర్ధారించారు.

ఇలా నది ప్రవాస దిశ మార్పు చెందగడం వల్ల నది ప్రవహించే వివిధ పాయలు భూస్థాపితం కాబడి ప్రస్తుత కాలంలో మనకు మంచి భూగర్భ జలాలను అందించే ప్రదేశాలుగా రూపాంతరం చెందాయి. కానీ కాలక్రమేణ జరిగే మార్పుల వల్ల కొన్ని మంచినీటి పాయలు ఉప్పునీటితో కలుషితం కాబడ్డాయి. ఇలా కొంత ప్రకృతి వైపరీత్యాల పరంగా మానవ తప్పిదం వల్లను కలుషితం కాబడి ప్రస్తుతం కేవలం12% మాత్రమే మంచినీటి లభ్యతకు నోచుకుంది, 21% ప్రాంతం కాస్త మంచి నీరుగాను, చవ్వ నీరుగాను మరియు ఉప్పు నీరుగాను మారిపోయింది. ఇక మిగిలిన 67% ప్రాంతం పూర్తిగా ఉప్పు నీటి ప్రాంతంగా వుంది.

కనుక భూగర్భ జల ప్రాంత పరంగా అత్యధిక జల లభ్యత కలిగిన ప్రాంతంగా పేందిన డెల్టా మంచినీటి లభ్యతకు అనేక ఒడొదుడుకులను ఎదుర్కొంటుంది. వర్షాభావ పరిస్థితులలో కృష్ణనదిలో నీటి ప్రవాహం సంవత్సరాలపాటు లేనప్పుడు డెల్టా ప్రాంతంలో నీటి నాణ్యత తగ్గిపోవడం, నీటి లభ్యత కూడా మందగించడం డెల్టా రైతాంగానికి ప్రత్యక్షంగా అనుభవమైంది. భూగర్భ జల పరిరక్షణకు అవసరమైన చర్యలు తీసుకోవడం అవసరం. డెల్టాకాలువలు మరియు డ్రైన్ ద్వారా ప్రవహిస్తున్న నీటిని భూగర్భంలోకి రీచార్జ్ చేయటం ద్వారా మంచినీటి ప్రాంతాన్ని కాపాడుకోవటం కాకుండా కలుషిత ప్రాంతాన్ని పునఃనిర్మించవచ్చు. ●

## తెలుగువారందరికీ నా నమస్కారం

**- చింతపల్లి ఉదయ జానకి లక్ష్మి**

తెలుగువారందరికీ నా నమస్కారం
తెలుగు మాట్లాడటం మన సంస్కారం
తెలుగు మాట్లాడకపోవడం ఓ వికారం
దేశదేశాలలో తెలుగువారుండటం ఓ సత్కారం
కవులు కలసిపంచుకునే కవితల ప్రాకారం
రచయితల రచనల ప్రపంచపు సమాహారం
సాహిత్యాభిమానులందరి సాంస్కృతిక మమకారం
మహాసభలలో ధ్వనించే సదస్సుల ఓంకారం
తెలుగుతల్లిచే పొందుతారు అందరూ పురస్కారం
తెలుగువారందరికి నా నమస్కారం

## మా మంచి మామయ్య

**- బి.వి. స్వరూప్ సిన్హా**

నువ్వొస్తున్నావని... నీ చల్లని వెన్నెలలో
నవ్వులు రువ్వే పారిజాతాలు మల్లే మాలతీ పరిమళాలు

ఒక్కసారిగా నన్ను చుట్టుముట్టి
నీ గురించి కుశలమడుగుతూంటే...

మా ముంగిట్లో రాధా మనోహరం అలవోకగా తలవూపుతూ
నిన్ను స్వాగతించడానికి వెన్నెల వెండి ముసుగును
కొబ్బరాకుల చిలిపి గాలికి అది చేసే అల్లరికి
ముద్దు ముద్దుగా విసుక్కుంటూ సుతారంగా సవరించుకుంటూ

నీ క్షేమ సమాచారాన్ని
నా చెవిలో చెప్పబోతుంటే...

తెలివి మీరిన, తెలివి తెల్లారిన
ఇరవై నాలుగ్గంటలూ మిడిగుడ్లేసుకుని
'నెట్'లో కొట్టుకులాడే ఈ మనుషులేమిటి?
ఇలా హడలిపోతున్నారు?

ఎన్నో ఏళ్లకు నన్ను దగ్గరగా చూడాలని
అమ్మ ఒడిలో కేరింతలు కొడుతున్న నాకు
వెండి గిన్నెలో పాలబువ్వ తినిపించాలని
నాకు దగ్గరగా... ఇంకాస్త మరి కాస్త దగ్గరగా
నువ్వు వస్తున్న కబురు విని
వీళ్ళంతా యిలా బిత్తర చూపులు చూస్తున్నారేం ?

'సూపర్ మూన్' అనీ – 'సునామీలనీ'
'ఎర్త్‌క్వేక్'లనీ – వెర్రి కేకలు పెడుతున్నారెందుకు?

'నీళ్లకోసం పరిశోధన' – అంటూ
నీ పాలబుగ్గలపై పే.... ద్ద గాయం చేసినా
ఈ మట్టి బుర్ర మనుషులపై
కన్నెర్ర చెయ్యకుండా – కరుణచూపి
చల్లని పలకరింపుతో పరామర్శిద్దామని
నువ్వొస్తుంటే.... ప్రాణాలు గుప్పెట్లో పెట్టుకుని
వీళ్లంతా వెర్రి చూపులు చూస్తున్నారెందుకు ?

ఏమిటి మామయ్యా, ఈ విడ్డూరం? పాల సముద్రంలో –
అమ్మతోపాటు నువ్వు తోడబుట్టిన వాడవని మేనమామవనీ...
అడపాదడపా అమ్మనూ మమ్మల్ని పలకరించి పోతూ,
అనుబంధాలను గుర్తు చేసే ఆత్మబంధువువని

బోసి నవ్వులతో – అమ్మచేతి గోరుముద్దలు తింటూ,
నిన్ను రారమ్మని పిలిచే పసిపాపలకు
వెన్నెల పంచే చల్లని చందమామయ్యవని
ఈ మనుషులు తెలుసుకునేదెప్పుడు?
నీలా ఈ అనుబంధాల్ని నిలుపుకునేదెప్పుడు ?

# కృష్ణాజిల్లాలో అలనాటి సంగీత సంపద

- కె.ఎస్.ఆర్ బాలకృష్ణ శాస్త్రి.

మాది కృష్ణాజిల్లా మచిలీపట్నం. అనగా బందరు. ఆ వూళ్లో చింతగుంటపాలెంలో ఇప్పటికీ మా స్వగృహం ఉన్నది. నా తల్లిదండ్రులు కీ॥శే॥ క్రొండపల్లి సీతారామాంజనేయులు, శ్రీమతి కామేశ్వరమ్మ. మాది పెద్ద కుటుంబం. సీతారామా మా ఇష్ట దైవం. మా ఇంట్లో ఎల్లప్పుడు సంగీతం వినబడుతూ ఉండేది. మా ఇంట్లో తరంగాలు పాడటం మా చిన్నప్పటి నుండి వచ్చిన అభ్యాసం. ప్రతి ఏకాదశికి భజన కార్యక్రమాలు జరుగుతూవుండేవి. ప్రతి దేవాలయంలో శనివారం భజనలు జరుగుతూండేవి. మా చిన్నతనంలో మేముమ పాడేవాళ్లం. పెద్దల సూచనల మేరకు మా తలితండ్రులు మాకు సంగీతం చెప్పించారు. మా ప్రధమ గురువులు శ్రీ హేమాద్రి వెంకటేశ్వరులు గారు. వారు హరి వారి శిష్యులు. శ్రీ హరి నాగభూషణం గారి తాతగారు శ్రీ హరి రామయ్యగారు. వారి ముత్తాత గారి పేరు కూడా శ్రీ హరి రామయ్యగారే. వారు శ్రీ త్యాగరాజ స్వామి వారి గురువులైన శ్రీ శొంఠి వేంకట రమణయ్య గారికి గురువులట. అందుకే కృష్ణాజిల్లాలో ఏనాటి నుంచో సంగీత శాస్త్ర విషయములు తెలిసినవారు ఉండేవారన్నమాట. కృష్ణాజిల్లాలోని ప్రసిద్ధ దేవాలయాలలో ప్రతి శనివారం, ఏకాదశి మరియు మహా పర్వదినాలలో భజనలు ఉండేవి. దానివల్ల సంగీతం, లయజ్ఞానం వృద్ధి అయ్యేవి. హరికథా గానంతో సంగీత సాహిత్య జ్ఞానం ప్రజల్లో పెరిగి సంగీతంపై ఆసక్తి పెరిగింది. భక్తులు, అభిమానులు విధిగా ధన సేకరణచేసి సంగీత కచేరీలు పెట్టేవారు. వదాన్యులు అధికంగా సంగీతాన్ని పోషించారు. కృష్ణాజిల్లాలో సంగీత పోషకులైన జమిందారులు నూజివీడు జమిందారులు. శ్రీ యం.ఆర్ అప్పారావుగారు, చల్లపల్లి జమిందారు శ్రీ యార్లగడ్డ శివరాం ప్రసాదుగారు సంగీతాన్ని పోషించి ఆరాధించారు. అంటే తరంగాలు, అష్టపదులు, ఆధ్యాత్మిక రామాయణ రామదాసు, త్యాగరాజ కీర్తనలు గానం చేయబడుతూ వుండేవి. కృష్ణాజిల్లా లలిత కళలకు ప్రసిద్ధి పొందింది. బందరు జిల్లా కేంద్రంగా వుండటం చేత చుట్టుప్రక్కల వుండే గ్రామాల, పట్టణ కళాకారులందరూ కూడా బందరులో జరిగే గణపతి, శ్రీ రామనవమి, దేవీ నవరాత్రుములు ప్రత్యేకంగా త్యాగరాజ ఆరాధనోత్సవాలకు వచ్చి ఆ కార్యక్రమాలలో పాల్గొని వారి వారి ప్రతిభా విశేషాలను నిరూపించుకునేవారు. కృష్ణాజిల్లాలోని దివి తాలూకాలో గల హరి పురంలో 'వాగ్గేయకార రత్న' శ్రీ హరి నాగభూషణం గారు (1884-1959) జన్మించారు. అంతకు ముందే పెద్దకళ్లేపల్లిలో జన్మించిన త్యాగరాజ స్వామివారి పరంపరలోని శ్రీ సుసర్ల దక్షిణామూర్తి గారు ఒకరకంగా సంగీతకళకు న్యాయం చేశారని చెప్పాలి. వారి శిష్యులే 'గాయక సార్వభౌమ' శ్రీ పారుపల్లి రామకృష్ణయ్య పంతులుగారు (1882-1951). వారి శిష్యులే ఈనాడు యావత్ ప్రపంచాన్ని తన గాత్ర సంగీత మాధుర్యంతో ఆనందింపజేయుచున్న సంగీత స్రష్ట డా॥ మంగళంపల్లి బాలమురళీకృష్ణ గారు.

కృష్ణాజిల్లాలో అనేక మంది మహా విద్వాంసులు జన్మించారు. అట్టివారిలో గరికపర్తి కోటయ్యదేవర గారు (1861-1924) త్యాగరాజ కృతులను ఆంధ్రులకు ప్రథమంగా అందించిన అదృష్టశాలి. వీరు హిందుస్థాని, కర్ణాటక గాన సాంప్రదయాల్లో గొప్పవారు. గొప్ప వాగ్గేయకారుడిగా, వాయొలిన్ వాద్య ప్రవీణుడుగా కీర్తిప్రతిష్టలు సంపాదించారు. తోట్లవల్లూరు, చల్లపల్లి జమిందారుల స్వర్థన గాయక్తుడుగా వున్నారు. అనేకమంది సంగీత విద్యార్థులను తయారుచేసి తన నడివయస్సు నంతను బందరులోనే గడిపి గీతాలు, స్వరజతులు, వర్ణములు, కీర్తనలు విశేషంగా రచించారు. పల్లవి పాటలో దిట్ట ఫిడేలు వాయించుచూ పాడెడి జంత్రగాత్రజ్ఞులు. వీరినే శ్రీ జంగం కోటయ్య దేవర అనేవాళ్ళు. అలనాటి ఆంగ్ల పరిపాలకుల గవర్నర్ లార్డ్ & లేడియాంప్టిల్ 1903లో బందరు వచ్చినప్పుడు శ్రీ కోటయ్యగారి కచేరి ఏర్పాటుచేయగా శ్రీ కోటయ్యగారు గవర్నరు గారిపై స్వరజతిపాడి మెప్పును పొంది బందరు-విజయవాడ రైల్వే లైను ఏర్పాటుచేయించిన విద్వాంసులే కాక సంఘసేవకులయ్యారు. శ్రీ హరి నాగభూషణం గారు కూడా పాటపాడుతూ వయొలిన్ వాయించేవారు. ఈ జిల్లాలో జన్మించిన మహానుభావులైన శ్రీ పారుపల్లి రామకృష్ణయ్యా గారికి అనేక మంది శిష్యప్రశిష్యులు అటులనే శ్రీ హరి నాగభూషణం గారికి కూడా శిష్యప్రశిష్యులు తయారై సంగీత ప్రచారము చేయుచూచున్నారు. కృష్ణాజిల్లా బందరు వాస్తవ్యులైన జొన్నలగడ్డ శివశంకర శాస్త్రిగారు ఆధ్యాత్మ రామాయణ కీర్తనలు మొత్తం రామాయణాన్ని ఒకవారములో పాడేవారు. సంగీతపరంగా ఎన్నో రాగాలు, తాళాలు సంగీతజ్ఞులకు ఉపయోగపడ్డాయి.

కృష్ణాజిల్లాలోని వడాలి గ్రామస్థులైన వారణాశి వారి కుటుంబము సంగీత సేవకు అంకితమైనదనుటలో సందేహంలేదు. అట్టివారిలో ప్రధములు శ్రీ వారణాశి బలరామయ్య -వారి అన్న కుమారుడే శ్రీ బ్రహ్మయ్య శాస్త్రిగారు (1885-1958) వీరు బందరు స్థిర నివాసముగా ఏర్పరుచుకుని శ్రీ కోటయ్య దేవర వద్ద ఫిడేలు సాధన వృద్ధిచేసి అనేకమంది శిష్యులను తయారుచేశారు. వీరి ప్రతిభ ఏమిటంటే మదరాసే నగరంలో వయొలిన్ కచేరి చేసి వయొలిన్ వాద్య శిఖామణి అను బిరుదును పొంది సన్మానం పొందారు. వీరి సోదరులే శ్రీ వారణాసి ఘంటయ్య శాస్త్రిగారు (1895-1997) మృదంగంలో అత్యద్భుతమైన మేధాశక్తి కల్గి 'మృదంగ కేసరి' 'మార్దంగిక శిరోమణి' మొదలగు బిరుదులను పొంది సువర్ణ ఘంటా కంకణాదులు బహుమతులుగా పొందారు. మృదంగ వాద్యంలో అత్యంత ప్రతిభ కల్గిన శ్రీ అశ్వథాటి రామ్మూర్తి గారు (1876-1944) కూడ బందరు వాస్తవ్యులే. శ్రీ హరి నాగభూషణం గారికి శ్రీ తుమరాడ సంగమేశ్వర శాస్త్రి (వీణ) గారికి, శ్రీ సుసర్ల గంగాధర శాస్త్రి (వీణ) గారికి అనేక పర్యాయములు మృదంగం వాయించారు. 1936లో దేశోద్ధారక నాగేశ్వరరావు గారి అధ్యక్షతన విజయవాడలో గొప్ప సన్మానం జరిగింది. శ్రీ చెళ్ళపల్లి వెంకట శాస్త్రి వంటి సంస్కృ తాంధ్ర పండితులు అలనాటి మహా విధ్వాంసులనందరిని ప్రోత్సహించుచూ వారిపై అనేక పద్యాలు వ్రాశారు. ఈ మమా కళాకారులందరికీ గజారోహణములు (ఏనుగు పై

ఊరేగింపులు) జరిగాయి. అది వారి సంగీత ప్రతిభకు తార్కాణం. గాత్రంలో వాయోలిన్‌లో మృదంగ వాద్యాలలో ఈ మహనీయులకు అనేక యంది శిష్యప్రశిష్యులున్నారు.

కృష్ణాజిల్లాలోని సంగీత విద్వాంసుల యొక్క వివరాలు....

గాత్రపరంగా 'గాయక సార్వభౌమ' శ్రీ పారుపల్లి రామకృష్ణయ్య పంతులుగారు దివి తాలుకా పెద్ద కళ్ళేపల్లి గ్రామం. విజయవాడలో స్థిరమైనారు. 'వాగ్గేయకార రత్న' శ్రీ హరి నాగభూషణంగారు దివి తాలూకా హరిపురంలో జన్మించి బందరులో స్థిరమైనారు. వీరు సంస్కృతాంధ్రాంగ్ల భాషలలో నిష్ణాతులు. వకీలు పట్టాపొంది ప్లీడరుగా కూడా ఖ్యాతినార్జించారు. 'సంగీత విద్వాన్' శ్రీ క్రోవి సత్యనారాయణ గారు బందరులో స్థిరమైన మహా విద్వాంసులు. రాగాలాపనలో పల్లవి పాడుటలో దిట్ట. రాగమాలిక పల్లవులు లయగతి బేధములతో పల్లవులు పాడుటలో దిట్ట. అనేక మంది శిష్యప్రశిష్యులు తయారైనారు. శ్రీ చోడవరపు సుబ్బారావు గారు అనేక మంది కర్ణాటక సంగీత విద్వాంసులను తయారుచేశారు. శ్రీ ఉపద్రష్ట సుబ్రహ్మణ్య శాస్త్రి, శ్రీ తాడేపల్లి శ్రీ కంఠశాస్త్రి, శ్రీ లంక మేధాశేషాచలపతి, శ్రీ పసుమర్తి శీతారామయ్య, శ్రీ హేమాద్రి వేంకటేశ్వర శాస్త్రి, శ్రీ సుసర్ల పెద్ద నరసింహ శాస్త్రి, చిన్న నరసింహ శాస్త్రి, శ్రీ శివరామ్ మొ॥ విద్వాంసులందరూ కూడా కృష్ణాజిల్లా వాస్తవ్యులే. ఇతర ప్రాంతాల నుండి వచ్చి సంగీత విద్యాభ్యాసం చేసేవారికి తగు ఏర్పాట్లుచేసి సంగీత విద్యాబోధన చేసేవారు.

తరంగ గానం చేయటంలో ప్రధమ శ్రేణికి చెందిన వారు శ్రీ ఏలేశ్వరపు రామాంజనేయులుగారు (వెల్లటూరు) వీరు కృష్ణాజిల్లాలోని జగ్గయ్యపేట వద్దగల వేదాద్రి శ్రీ నరసింహ స్వామి వారి దేవాలయంలో 12 సంవత్సరములు తపస్సు చేసి నరసింహ ఉపాసకులై మంత్ర తంత్రములయందు నిష్ణాతులై సన్మార్గ ధోరణిలో నడుచుచూ వారు నేర్చిన తరంగాలను నిత్యం సాధన చేసేవారు. వేదాద్రే వారి నివాస స్థానం అంటారు.

అటులనే తరంగములను పాడుటలో కృష్ణాజిల్లా గుడివాడ తాలూకాలోని చవటపల్లి, సిద్ధాంతం గ్రామాలకు చెందిన శ్రీ ర్యాలి పిచ్చయ్య గారు, శ్రీ ఘంటశాల సూరయ్య గారి శిష్యులు. శ్రీ సూరయ్యా గారు సినిమా సంగీత ప్రపంచానికే చక్రవర్తి అయిన శ్రీ ఘంటశాల వేంకటేశవరరావు గారి తండ్రి. శ్రీ సూర్యనారాయణగారు, శ్రీ పిచ్చయ్య గారి శిష్యులు. ప్రప్రథమంగా ఆకాశవాణి జాతీయ కార్యక్రమంలో ఢిల్లీ కేంద్రం నుండి తరంగాలు పాడిన కళాకారులు వీరే. వీరు సంగీత కచేరీ వలెనే రాగం పాడి తరంగం పాడుచూ రామశబ్దం, కొనుక్కోలు (భరతం-స్వరకల్పన మాదిరిగ) పాడుచూ సంగీత కచేరీ పద్ధతిని అమల్లోకి తెచ్చిన సంగీత విద్వాంసులు. కృష్ణాజిల్లా బందరు వాస్తవ్యులైన శ్రీ కొండపల్లి సీతారామాంజనేయులు గారు, శ్రీ ద్రోణవఝుల వేంకటరామయ్య గారు, శ్రీ తాడిగడప పురుషోత్తం గారు, శ్రీ బడ్డపాటి ఉమామహేశ్వరరావు గారు (సంగీత) రాగాలాపనలు చేయుచూ తరంగాలు పాడేవారు. కృష్ణాజిల్లాలోని చెన్నూరు వాస్తవ్యులైన శ్రీ మల్లపరాజు గారు, శ్రీ పిచ్చిరాజు గారు వారి సోదరులు అనేకమంది తరంగ గానం చేసేవారు.

వయోలిన్ పరంగా గరికపర్తి కోటయ్య దేవరగారు, శ్రీ హరి నాగభూషణం గారు, శ్రా వారణాసి బ్రహ్మయ్య శాస్త్రిగారు, శ్రీ శిష్టు బ్రహ్మయ్య శాస్త్రి గారు, శ్రీ చల్లపల్లి పంచనాధం గారు, కుమారుడు శ్రీ కృష్ణమూర్తి శ్రీ సుసర్ల లక్ష్మీ నరసింహం సోదరులు, శ్రీ ఏలేశ్వరపు కృష్ణమూర్తి, హరి సోదరులు (హరి హనుమత్ శాస్త్రి, హరి అచ్చుత రామశాస్త్రి), ఎన్.సి.హెచ్.కృష్ణమాచార్యులు, శ్రీ దత్తాడ పాండు రంగరాజు, శ్రీవి.వై.ఎల్. నరసింహారావు, ఐనంపూడి వేంకటేశ్వరరావు, పాలపర్తి రామకృష్ణయ్య, శ్రీ పువ్వుల వరకోటి మొదలగు అనేకమంది మహా విద్వాంసులు శిష్యులను తయారుచేసినారు. వారు కృష్ణజిల్లాలో మరియు ఇతర జిల్లాల్లో కూడా స్థిరమైనారు.

కృష్ణాజిల్లాలో హార్మోనియం (హార్మణి) వాద్యంలో పేరుగాంచిన మహా కళాకారుడు పెదన గ్రామ వాస్తవ్యుడు శ్రీ ఎడవల్లి నాగేశ్వరరావు గారు. బందరు వాస్తవ్యులు శ్రీ వేమూరి రామారావు. వీరే కాక సర్వశ్రీ డి.మీనయ్య, శివరావు, రామదాసు, నరసింహమూర్తి, చిరువోలు లక్ష్మణరావు, తోట పాండురంగారావు, గుడివాడ నారాయణ రావు మొ॥ వారు హార్మోని వాద్య కళాకారులు. కేవలం కర్ణాటక సంగీతమే కాక నాటక రంగానికి కూడా తమ వాద్య విశేషాన్ని అందించేవారు.

కృష్ణాజిల్లాలోని నాదస్వర వాదనలో ప్రఖ్యాతి గాంచిన సర్వశ్రీ దాలిపర్తి పిచ్చిహరి, సూర్యనారాయణ, రామయ్య, లాలాజీ రావు, చినముత్తేవి సుబ్బారావు, సూర్యనారాయణ, సూరకచ ప్రకాశరావు, శోభనాచలం, రంగనాయకులు, నాగూర్‌మీరా సాహెబ్ వంటి నాదస్వర మహా విద్వాంసులు వారి ప్రతిభ చాటారు. వారి శిష్యప్రశిష్యులు మన రాష్ట్రంలోనే కాక ఇతర రాష్ట్రాలకు కూడా వలన వెళ్ళారు.

క్లారినెట్ పరంగా సర్వశ్రీ గోవాటి సుబ్బారావు, తరకటూరి ఆంజనేయులు, వేంకటేశ్వరరావు, నాగేశ్వరరావు. బందరులో బ్యాండు వాయించుటలో క్లారినెట్ వాద్యానికి ప్రత్యేకతను ఏర్పాటు చేసిన కోటయ్య గొప్ప వాద్య కళాకారులు.

వీణ పరంగా సర్వశ్రీ సుసర్ల గంగాధర శాస్త్రి గారు, కొడమ సింహం తిరువెంకళాచార్యులు, కొండూరు సత్యనారాయణ, జోగేశ్వర శాస్త్రి మొదలగు వైణికులు కృష్ణాజిల్లాలోని వారే.

ఫ్లూట్ (వేణువు) పరంగా కృష్ణాజిల్లాలో ప్రపధములు గరికపర్తి కోటయ్య దేవరగారు వారి కుమారులు. మరియు ఎం.బ్రహ్మానందం, కామేశ్వరరావు, ఆనందరావు మొదలగువారు.

కృష్ణాజిల్లాలోని హరికథా కళాకారుల (భాగవతార్) ప్రధమ తాంబూలంగా సీతలక్ష్మీ నారాయణ భాగవతార్, శ్రీ ,ఇంతపాటి విశ్వనాధం భాగవతార్ (గుడివాడ), శ్రీ అమ్ముల విశ్వనాధ భాగవతార్ (బందరు), శ్రీ నౌడూరి వాశ్వనాధ భాగవతార్ (అవనిగడ్డ), శ్రీ కూచిభట్ల కోటేశ్వరరావు భాగవతార్ (విజయవాడ), ఎన్.సి.హెచ్.కృష్ణమాచార్యులు వారిని చెప్పాలి. వీరే కాక సర్వశ్రీ మోపర్రుదాసు, అక్కిపల్లి జగన్నాదరావు, దావులూరి నారాయనరావు, కేతవరపు రామకృష్ణ శాస్త్రి, చిట్టా పరుషోత్తం. ప్రీ పురుషోత్తం గారు ఏ మహనీయుని కథ చెప్పబోవుచున్నారో ఆ వేషము దాల్చి ఉదా॥ త్యాగరాజు వేషంలో త్యాగరాజు హరికథాగానం చేసేవారు. వీరేకాక సర్వశ్రీ ఆంజనేయ

దాసు, ద్వాభాష్యం కమలనాథం, కిళాంబి పార్థసారథి, ముదపాక మల్లేశ్వరరావు, పట్నాల మల్లేశ్వరరావు, ముట్నూరి కుటుంబరాయ శాస్త్రి, యజ్ఞనారాయణ శాస్త్రి, ఇంగువ వాసుదేవ శాస్త్రి, పైడిపాటి సుబ్బారావు మొదలగు వారు కూడా జిల్లాకే కాకుండా రాష్ట్రానికి పేరు సంపాదించారు.

సంగీతం భగవదాత్తమైంది. ఆనాటి మహాసంగీత విద్వాంసులందరు ఎంతో ఓర్పుతో, నేర్పుతో, శిష్యవాత్సల్యముతో సంగీత బోధనచేసి వారిచే సాధన చేయించి సంగీత కళయందు ఆశక్తిని వృద్ధిచేశారు. దాని ఫలితమే ఈనాటి సంగీత విద్వాంసులు ఆనందముగా సుఖముగా జీవిస్తున్నారు. అట్టి సంగీతం శిష్య పరంపరగా వృద్ధి కావాలని ఆశిద్దాం. కృష్ణాజిల్లాలోని విజయవాడలో ఆకాశవాణి కేంద్రం 1948లో ఆరంభమైంది. నాటి నుండి అనేక సంగీత కార్యక్రమాలు శ్రోతలు వినుచు ఆనందాన్ని అనుభవిస్తున్నారు. సంగీత విద్వాంసులకు, సంగీత విద్యార్థులకు ఈ ఆకాశవాణి కేంద్రం సంగీతపరంగా ఎంతో సేవ చేయుచున్నది. ఈ సంగీత పరిచయ కార్యక్రమం ద్వారా కృష్ణాజిల్లాకు చెందిన ఎంతో మంది గొప్ప సంగీత విద్వాంసులను శ్రోతలకు పరిచయం చేసిన ఈ ఆకాశవాణి బృందం వారు ఎంతో అభినందనీయులు.

# ఆంధ్రకవులకు అక్షర సువర్ణ సీసపద్యాల మాల

- డా॥ రామడుగు వెంకటేశ్వరశర్మ

1) అక్షరరమ్యేతి హాసవాసంతి! "నన్నయ!" ఆదికవి! వందనాల సుమము
"నన్నెచోడ!" "కుమార!" నవ "కవిరాజశిఖామణీ!" శివకవీ! క్రమవినుతి
శివమెత్త జేయువాక్ శ్రీ ప్రభాగ్రీష్మ సూర్యా! "సోమనాథ!" పారమ్యవినతి
అమృత భారతకావ్య హరిహరవార్కుకా! "తిక్కయజ్వకవీంద్ర!" మ్రొక్కు లివియె
మహిత మమృతంబు జ్ఞాన సంపత్తికోరి నవ్యమానంద సంస్పందనంబు తోడ
రమ్య రసికావలీమహారచయితలిడు అక్షర సువర్ణసీస పద్యాలమాల"

2) గాన యోగ్య ప్రభాకార! రామాయణ శ్రీ "రంగనాథ!" జేజేలు వేలు
రామాయణాకాశరమ్యవీధీ "భాస్కరా!" ప్రౌఢ కవితా! బరాబరులివె
సూక్తి వైచిత్ర్యాఖ్యసురభిళకావ్య ప్రసూన! "ఎఱ్ఱన" యోగి సుందర! నతి
"నాచనసోమనా!" నవగుణ! సర్వజ్ఞ! కవితాసనాథ! స్వాగతయుతనతి
మహితమమృతంబు జ్ఞాన సంపత్తికోరి నవ్యమానంద సంస్పదనంబుతోడ
రమ్యరసికావలీమహారచయితలిడు అక్షరసువర్ణ సీస పద్యాలమాల"

3) "కవి సార్వభౌమ!" శ్రీ కావ్యేంద్ర బాషాభిరామ జీవన! తేనమామి – శుభము
మందారమకరందమాకంద సుందరకవన! "పోతన!" నమస్కారయ్య
భూరి సత్యవ్రతాం "భోజరాజీయా!" "అనంతార్యకవి!" మ్రొక్కులందుకొనుము
విదితాద్భుతావక్ర "విక్రమార్కచరిత్ర!" "జక్కనకవి! నమశ్శతములివియె
మహితమమృతంబు జ్ఞానసంపత్తి కోరి। నవ్యమానంద సంస్పందనంబు తోడ
రమ్యరసికావలీ మహారచయితలిడు అక్షర సువర్ణసీస పద్యాలమాల॥

4) మంగళకైశికీ "మహితభావోత్ప్రేక్షదా! "మాల్యద కవీ!" నితాంత వినుతి
రమ్యప్రబంధశరచ్చంద్ర! "కవితాపితామహా!" తెలుగు "పెద్దన!" నమోస్తు
"పారిజాత" పరీమళారోచి! ముగ్ధభావాస్పదా! "తిమ్మనా!" అంజలులివె
"రాజశేఖర చరిత్రా" ధ్య! "నిశ్శంకవచావిలాసా" "మల్లనా!" వినుతులు
మహిత మమృతంబు జ్ఞానసంపత్తి కోరి నవ్యమానంద సంస్పందనంబుతోడ
రమ్యరసికావలీ మహారచయితలిడు అక్షర సువర్ణసీస పద్యాలమాల

5) రమ్యసాహిత్య స్ఫురన్మాధురీ మహిమా! "ధూర్జటికవీ!" నమస్యులివియె
మహిత సంశ్లేష చమత్కృతి మత్ "రామభద్రకవీ!" నమోవాకములివె
సంగీతగంగా తరంగ సమ్యక్ శ్లేషయమక "భూషణ!" నమస్సుమము లివియె
స్వర్ణ "ప్రభావతీ" "పూర్ణోదయ కళా" మహేంద్రజాల కవీంద్ర! సాంద్రనతులు
మహిత మమృతంబు జ్ఞాన సంపత్తి కోరి నవ్యమానంద సంస్పందనంబు తోడ
రమ్యరసికావలీ మహారచయితలిడు అక్షర సువర్ణ సీస పద్యాలమాల॥

6) పాండు రంగ ప్రౌఢ పదగుంభనవిశిష్టకేళీ! "తెనాలి!" అవేల నతులు
కవి"నిరంకుశ""రుద్రకవి!" "కందుకూరి జనార్దనాష్టకకవీ!" అంజలులివె
"సంకుసాలనృసింహసత్కవీ!" కవికర్ణవిలసత్రసాయనా! వినతులివియె
రామగాథాభక్తిరాజత్కవనమల్లికా! "మొల్లకవయిత్రి!" ఘననుతులివె
మహిత మమృతంబు జ్ఞానసంపత్తికోరిన నవ్యమానంద సంస్పందనంబు తోడ
రమ్యరసికావలీ మహారచయితలిడు అక్షర సువర్ణ సీస పద్యాలమాల॥

7) విరిపొట్లమున్ విప్పుకరణి కావ్యముగుప్పుమనిపించు "రఘునాథ!" అంజలులివె
ప్రతిపద్యరసవదప్రతిమచమత్క్రియా "విజయవిలాసకవీ!" నమోస్తు
భక్తికిటీకయై ముక్తికినౌకైన "తాళ్ళపాకికులంబ!" దండములివె
అవని నాటవెలంది నాడించు హాస్యప్రజాకవీ! "వేమనా!" సన్నుతులివె
మహితమమృతంబు జ్ఞాన సంపత్తికోరి నవ్యమానంద సంస్పందనంబు తోడ
రమ్యరసికావలీ మహారచయితలిడు అక్షర సువర్ణ సీసపద్యాలమాల॥

8) "గిడుగు"వో, భాషకేపిడుగువో అన తెలుంగున వెల్గు "రామ్మూర్తి" వినుతులివియె
తొలిగాకథను దిద్ది అలగిరీశముమార్చు "గురజాడ!" ముత్యాలసరము!నతులు
అవధానమునకూపిరై పద్యవిజయులౌ "తిరుపతికవులార!" కరమునతులు
స్త్రీ సంస్కరణల సజీవగోదావరీ! "కందుకూరీ!" నమస్కారమయ్య
మహితమమృతంబు జ్ఞానసంపత్తికోరి నవ్యమానంద సంస్పందనంబు తోడ
రమ్యరసికావలీ మహారచయితలిడు అక్షర సువర్ణ సీసపద్యాలమాల॥

9) ప్రహసన గణపతీ! ప్రథిత వీరేశానువర్తీ! "చిలకమర్తి!" వందనములు
అమలినభావరమ్యాలోకనాల "రాయప్రోలు కవివరా!" అంజలులివె!
"సత్యహరిశ్చంద్రసరసనాటకకర్త!" నటలోకనక్షత్ర! నతులు–నుతులు
భావగీతాలమేల్పాలవెల్లీ! ఆంధ్రపెల్లి "దేవులపల్లి!"జల్లులనుతి
మహితమమృతంబు జ్ఞానసంపత్తికోరి నవ్యమానంద సంస్పందనంబుతోడ
రమ్య రసికావలీ మహారచయితలిడు అక్షర సువర్ణసీస పద్యాలమాల॥

10) జ్ఞానరామాయణ కల్పవృక్షా! "విశ్వనాథ!" "కిన్నెరకవీ! నతి శతంబు
మెరపుల తొలకరీ! సరస సౌందరనంద! "పింగళి–కాటూరి!" వేలనతులు
పీయూష కవితల పీష్య!మూర్తీ భవత్ పిరదౌసి ! "జాషువా!" వినుతి గొనుమ
ఈ శతాబ్దంబునాదేయన్న "శ్రీశ్రీ" కవీ! కలం విప్లవా! వేల నతులు
మహితమమృతంబు జ్ఞానసంపత్తి కోరి నవ్యమానంద సంస్పందనంబుతోడ
రమ్యరసికావలీ మహారచయితలిడు అక్షరసువర్ణసీస పద్యాలమాల॥

# తెలుగు కవిత్వంలో మానవీయత

- కె. రామకృష్ణ

"విశ్వశ్రేయః కావ్యం" అన్నదాన్ని బట్టి లోక కళ్యాణం కోసం కావ్యమన్నది స్పష్టమవుతున్నది. కావ్యమును ఋషులు కానివారు రచించలేరని "నా నృషిః కురుతే కావ్యమ్" అన్న మాటలతో విదితమవుతున్నది. మరి కావ్యాలను రచించిన, రచిస్తూవున్న కవులందరూ ఋషులు కారు కదా? అంటే సంస్కారం గలవారు, చక్కని మనోవాకాసం గలవారు గూడ ఋషితుల్యులుగా పరిగణించు తారని అట్టి సంస్కారం గలవారు సమాజంలోని దురాచారములను నిర్మూలించ డానికి కావ్యరచన చేపడుతున్నారని చెప్పవచ్చు. వ్యక్తి సంస్కారం ద్వారా సమాజ సంస్కరణకు ఉద్దేశింపబడింది కవిత్వం. కనుక తెలుగు కవుల కవితా సంస్కారాన్ని గూర్చి చెప్పడమే ఈ వ్యాసం పరమార్థం.

లోకానుభవమునకు ఆర్తి, ఆవేశము తోడైనపుడు గుండెలు కరిగిన ఋషుల కన్నీరే కవిత్వమై జాలువారుతుందట. "పెదవి నుండి జారు పదములా కవనము! కరిగి! కరిగి గుండె కవితయగును! అనుభవమ్ము కవిత ఆర్తియే కవనమ్ము! కవిత ఋషులు కార్చుకంటినీరు".

వ్యక్తి ముందుగా మానవీయత గల వాడుగా మారాలి. మానవీయత గల మనిషి ఆర్షత్వంతో కవిత వ్రాసి సమాజాన్ని సంస్కరిస్తాడు. "సారమతిం కవీంద్రులు ప్రసన్న కథా కలితార్థ యుక్తిలో నారసి" అన్న పద్యం చివర "భారత సంహిత రచన బంధురుడయ్యె జగద్ధితంబుగన్" అనుటచేత జగత్తులోని ప్రజలు, ప్రకృతి, పశుపక్ష్యాదులు అన్నింటి మేలుకోరి నన్నయ భారత రచనకు శ్రీకారం చుట్టాడన్నది నిజం.

"కవిత ఆంతరంగిక స్వగతం కాదు.

కవిత జగత్ కళ్యాణం కోసం జరిగే సారస్వత సత్రయాగం" అన్నారు మరో సంస్కారి. భూలోకాన్ని అభ్యుదయం వైపు నడిపించడానికి సుకవీశ్వరుడు పుడతాడట - నూతన జగత్తును నిర్మిస్తాడట.

కవితా ప్రయోజనాన్ని గూర్చి కవిత్వ తత్వాన్ని గూర్చి కవిశేఖరుల భావనలు గమనించినపుడు కవిత్వమన్నది మనిషిని మార్చేదిగా, మంచిని పెంచేదిగా, నవ్యత్వం నిండుకొన్నదిగా, మానవత్వాన్ని ఆవిష్కరించేదిగా ఉండాలని శ్రీశ్రీ అభిప్రాయం.

"మనిషి కోసం కవిత్వం - మంచిరోరి నవ్యత్వం
నవ్యత్వం ప్లస్ మానవత్వం - ఈక్వల్ టు కవిత్వం"

అలాంటగిదైతేనే పరిపూర్ణపు బ్రతుకును ప్రసాదిస్తుందని ఆయన నమ్మకం.

"కదిలేది, కదిలించేది - మారేది, మార్పించేది - పాడేది - పాడించేది పెనునిద్దుర వదిలించేది" గా వుంటూ "శిలలు కరుగవలయు, కలలు పండ వలయు, కలతలడగవలయు కవిత విన్న" - అన్నది మహాకవులు ఆకాంక్ష. కవియన్న వాడు "నిరుక్త వక్తగా, ద్రష్టగా, స్రష్టగా, కవితలల్లి" కర్తవ్య ప్రబోధం చేయాలి. "బధిర సంఘమునకు బహిరింతరాత్మలై - కదలగలరు కవులు మెదలగలరు".

"గణాలను పేర్చుకొంటేనే సరిపోదు - గుణాలను కూర్చుకోవాలి, నవతను రూపుదిద్దుకోవాలి. అంతేగాని ప్రాసలు చిత్రభాషలు కవితలు కావు" అన్నారు సినారెగారు. మానవీయత లక్ష్యంగా సాగిన తన కవితా సంస్కారమే తనకు అత్యున్నతమైన జ్ఞానపీఠం పురస్కారాన్ని అంతుకోవడానికి అర్హతను సంపాదించి పెట్టిందని నారాయణరెడ్డి గారు అవార్డు స్వీకారోత్సవ సభలో అన్నారు.

"ఎవరికి ఈ సన్మానం ఎందుకు ఈ సన్మానం
చెట్టంతటి పేరొందిన చిగురుకు ఈ సన్మానం
సముద్రాలు గీచిన సరిమద్దులు చెరిపివేసి
మనుషుల ముడివేసిన మాటకు ఈ సన్మానం
కులం కీళ్ళు విరిచే నా కలానికీన్మానం" మనవులందరూ సోదర భావంతో మెలిగినపుడు భూలోకం మరో స్వర్గమై వెల్లివిరుస్తుంది.

"మనుషులందరు అన్నదమ్ముల మాదిరిగా జీవింపగల్గిన
మర్త్యలోకమె దివ్యపదవికి - మారుపేరై పరిమళించును
ఆకసము బీజ ప్రదాతగా - అవనియే ఒక ఆదిమాతగా
కానగల్గిన మానవునకు - జగజ్జనాళి ఒకే కుటుంబం".

చంద్రమండల యానానికి బుద్ధి బలాన్ని ఉపయోగించడానికంటే మానవునిలో దైవత్వాన్ని కలిగించడం ముఖ్యమని గూడ ఆయనన్నారు. "చంద్రమండలమును కనుగొన ధీశక్తులను వెచ్చించుకన్న - మానవుని దేవతగ మార్చెదు - మార్గమును కనుగొనుట మిన్న". హైదరాబాదులో మత, భాషాద్వేషాలు మరచి సహజీవనం చేస్తున్న పలు మతాల జన జీవనానికి అద్దం పడుతున్న సినారె మరో కవిత.

"ఇది హైదరాబాదు - ఇది భిన్న సంస్కృతులు ఎదిగి పూచిన పాదు
ఇటు తెలుగువాణి -ఉరుదుబాణి కలసిపోయినవి ముక్తా ప్రవాళములట్లు".

ఇక కవికోకిల జాషువా ఎంతటి మనో వికాసం కలవాడో తెలిమజేసే కవిత.

"ఆడిన మాట తప్పను మహాత్ముని చెప్పుల జాడలోనకా
లాడ చెరించెదన్, ప్రజల కన్నము బెట్టెద, వర్ణభేదం పుం
జీడనణంచెదన్, కటిక చీకటి వాపెద, వెర్రి నమ్మకా
లూడని బాద హస్తమున నేనె దశాత కళాకుఠారమున్".

ఇందులోని సామాజిక స్పృహ విలువైనది.

"కులమతాలు గీచుకున్న గీతల జొచ్చి
పంజరాన గట్టు వడను నేను
నిఖిల లోకమెట్లు నిర్ణయించిన, నాకు
తరుగులేదు - విశ్వనరుడనేను''. కులమతాల పంజరంలో ఇరుక్కుపోవడం జాషువాకిష్టం లేదు. విశ్వనరుడిగా లోకమంత విహరించాలన్నదే ఆయన కోరిక.

తిండి గుడ్డలు లేక అల్లాడుతున్న తోటి మానవుల దుర్గతిని మాన్పడానికి ప్రయత్నించకుండా ఆలయాలకు మాన్యాలిచ్చే ధనవంతుల పోకడకు విచారిస్తూ త్రిపురనేని రామస్వామి చౌదరిగారు

"మలమలలాడు పొట్ట, తెగమాసిన బట్టకలంత వెట్టగా
విలవిల యేడ్చుచున్న నిరుపేదకు - జాలిని చూపకుండ
జీవరహితుండగు బొమ్మకు ఇండ్లు వాకిలుల్
పొలములు పొట్రగ యిచ్చెడి ప్రబుద్ధులు" గుడులు కట్టి తను దాతృత్వాన్ని

చాటుకునేవారు, నలిగినవారిని, నిరాశ నమిలిన వారిని పట్టించుకోవాలని ఆకాక్షించాడు. మనిషి తన ఆత్మలోని భగవంతుని దర్శిస్తే చాలునంటాడు వేమన మహాకవి.

"తనను ఆత్మయందె దైవంబుగలుగ
తీర్థయాత్రలకంచు తిరుగు నరుడు
గంధపు చెక్కలు గాద్దె మోసినయట్లు
విశ్వదాభిరామ వినురవేమ!"

ఇదే భావాన్ని యుగకవి గురజాడ తన కవితలో ఆవిష్కరిస్తూ అన్న మాటలు

"దేవుడెక్కడో దాగెనంటూ కొండకోనలు వెదుకులాడేవేలా!
మనిషి చేసిన రాయి రప్పకి
మహిమగలదని సాగి మొక్కుతు
మనుషులంటే రాయి రప్పల - కన్న కనిష్టం!"

కవితా ధోరణి మారాలని, మానవుని అభ్యుదయమే అందరి లక్ష్యంగా ఉండాలనే, దేనికి మించిన పరమధర్మం మరొకటి లేదని నార్ల వారి హితోపదేశం.

"నరునివృద్ధి కంటె చరమ లక్ష్యము లేదు
నరుని జగతి విడచి పరము లేదు
నరుడు లేని చోట నారాయణుడె లేడు
వాస్తవమ్ము నార్లవారి మాటగ".

నేడు మన పుణ్య భారతాన్ని పట్టి పీడిస్తున్న సమస్యలలో మత మౌఢ్యం ఒకటి. దేశంలో జరిగే నర మేధానికి మత కలహాలే చాలావరకు కారణం. ఈ పరిస్థితిని చక్కపరచడానిక విశ్వమానవ సౌభ్రాతృత్వమును పాదు కొలుపడానికి, ఎందరో మహా కవులు ఎంతో కాలం నుండి ప్రయత్నిస్తూనే వున్నారు. తమ కవితా సంస్కారాన్ని పంచి పెడుతూనే వున్నారు. లోకంలో మంచి, చెడ్డ అనే రెండు కులాలే వున్నాయి. మంచిని కులం పేరుతో హింసించ వద్దంటారు యుగకవి గురజాడ.

"మంచి చెడ్డలు మనుజులందున
ఎంచి చూడగ రెండె కులములు
మంచియన్నది మాలయైతే
మాలనే యగుదున్" - లోకంలో ఎన్నో మతాలున్నా మానవత్వం ఒక్కటే. ఎన్నో జాతులున్నా అందరూ నివశించే జగతి మాత్రం ఒక్కటే ఎందరో ఎన్నో విధాలుగా ప్రార్ధనలు చేస్తున్నా అందరి పరమార్ధం ఒక్కటే. ఒక జగతిలో, ఒకే మానవజాతిలో భేదభావాలు ఉండటాన్ని నిరసించారు నార్ల. మానవత్వమే మంచి మతమని, అది ఉన్న చోట దేవుడుగూడ తరిస్తాడని ఆయన విశ్వాసం.

"మతములెన్నియైన మానవత్వమొక్కటె - జాతులెన్నియైన జగతి యొకటె
పథములన్నియైన పరమార్ధ మొక్కటె - వాస్తవమ్ము నార్లవారి మాట"
"ఎన్ని పేర్ల తోడ ఏయే మతములున్న
మానవతను మించు మతము లేదు
మానవత ఫలింప మాధవుండె తరించు
వాస్తవమ్ము నార్ల వారి మాట" - ప్రతివాని ఎదలో సమైక్య భావాన్ని కలిగించడానికి తెలుగు కవితా సంస్కారం ప్రయత్నిస్తూనే ఉంది ఆది నుంచే.

"వాడ వాడలా చెలిమి మేడలు కట్టి
భారతమాతకు భావదీపాలు పెట్టి
"శాంతి కోసం పరితపిస్తూ - క్రాంతి కోసం తపిస్తూ".....
"కులం పేర పెట్టకు పార్టీలను - భాషపేర విభజించకు దేశాన్ని"
"మతం పేర చీల్చకు జనాన్ని" అంటూ హెచ్చరిస్తూనే ఉంది.

"నాకూ, నా ప్రజలకు కావలసిందిప్పుడు - సాహిత్యంలోను, సమాజంలోను చవకబారు ఆవేశపు అరుపులు కావు. అందర్ని ప్రగతి పథానికి కార్యశూరుల్ని చేసి నడిపించే పసిడి పలుకులు" అన్న నూతలపాటి గంగాధరం యిందుకోసం

"నా కలం బలంతో చుక్కల్ని పిండి - చిక్కటి కాంతి పదిమందికి పంచి పెడతాను. నా ప్రజలు నడిచే దారిలోని గండ శిలలను బొండు మల్లెలుగా మలచి, నా దేశ ప్రగతి ప్రయాణాన్ని సుగమం చేస్తాను" అంటూ "నరుని ఒడిలో బడ బానలాన్ని దాచి - గుడిలో పాషాణమై కూర్చొన్న" భగవంతునిపై భారం వేయక

"సాటివారి కోసం చెందనపు చెక్కలా అరిగి
కన్నీళ్ళకు కాంతి నివ్వడానికి కొవ్వొత్తిలా కరిగి
నిత్యం, నిలకడగా వెలిగే మానవతా జ్యోతిని చేతబట్టుకొని" చెత్త కుండీలను నిప్పంటించుకుంటూ, పూరి గుడిసెల్లో కూడ భోగి కాంతుల్ని సృష్టించదలచాడు గంగాధరం.

"చీకటిని తొలగించేందుకు - దీపమై వెలిగి
సుషుప్తిని వదిలించేందుకు చూతన్య ఝరియై సాగి"

తన కవితామృతాన్ని ప్రసాదించాడు. మానవునికి మనసులోని అగాధాల నుంచి వెలికితీసే ప్రబోధ కవిత్వ ఎంతో ఉద్భవిస్తూ ఉంది. ప్రేమ, సౌజన్యం, ప్రసన్నత, మానవీయత పుష్కలంగా నిండుకొన్న కవితా సంస్కారిన్ని సమాజం స్వీకరించాల్సి ఉంది. ఆచరించాల్సి ఉంది. ఏది ఏమైనా ఇది మాత్రం నిజం.

"ఆదర్శం ఒడిలో - ఆత్మ సంస్కారం బడిలో
క్షణక్షణానికి - అభ్యుదయంలోకి
పసిబిడ్డలా సాగే ప్రస్తుతాన్ని మాత్రం
మూర్ఖంగా ఏ హిరణ్యకశిపుడూ పట్టి బాధించలేడు - కట్టి బంధించనూ లేడు". ●

## బొమ్మ భావుకత

**- వెలగపూడి బాపూజీరావు, కడలి సురేష్:**

తల్లి ధరణి ఒడిలో జీవిస్తూ కడుపునే తూట్లు పొడుస్తుంటే...
రావామరి సునామీలు, భూకంపాలు!

దేశదేశాల విద్వేషాలతో రగిలిపోతూ బాంబుల వర్షం
కురిపిస్తుంటే... రావామరి సునామీలు, భూకంపాలు!

వనములు వాయువులు కలుషితమౌతుంటే
రావామరి సునామీలు, భూకంపాలు !

మానవ మృగాల దాడికి పుణ్యపురుషుల ప్రతిరూపాలు
మట్టి కరుస్తుంటే... రావామరి సునామీలు, భూకంపాలు!

జాతి సిగ్గుపడే వికృత చేష్టలతో యాసిడ్ దాడులతో
మనుగడ సాగించే మానవ బాంబులున్నప్పుడు
రావామరి సునామీలు, భూకంపాలు!

మారణ హోమాలు, విధ్వంసాలు, యుద్ధ తంత్రాలే ప్రగతికి
మంత్రాలనుకుంటే... రావామరి సునామీలు, భూకంపాలు!

# వచన కవితా ప్రక్రియలో లఘు రూపాలు

- కొట్టి రామారావు

లఘురూపాల్లో ప్రధానంగా పేర్కొనదగినవి: 1. మినీ కవితలు 2. హైకులం 3. నానీలు 4. పేరడీలు 5. రెక్కలు. కవిత్వంలో లఘురూపం గురించి ప్రముఖ కవి సాహిత్య విమర్శకులు "డా॥అద్దేపల్లి" కవిత్వంలో లఘురూపం ఎప్పుడు సజీవంగానే ఉంటుంది. ఎందుకంటే భావప్రకటనలో విశాల పరిధికే పరిమిత పరిధికి ఇస్తున్న ప్రాధాన్యాలలో దేనిది దానిది ప్రత్యేకంగా ఉంటుంది. పరిమిత పరిధిలో అపరిమితమైన భావాన్ని ఇమిడించాలనే లక్ష్యంతో లఘు రూపాలు ప్రభావితమౌతూనే ఉంటాయ్" అన్నారు పైన వివరించిన లఘు రూపాల్లో ఒక్కొక్కదాని గురించి చర్చిద్దాం.

**1. మినీ కవితలు:-** క్లుప్తత, గాఢత, సంక్షిప్తత - చివరగా శీర్షికలతో తళుక్కున మెరిసే కొసమెరుపు తీగ -మినీ కవిత. నేటి యంత్ర యుగంలో వేగం ప్రధానం. కాలాన్ని సద్వినియోగం చేసుకోవడం - అదే సమయంలో కవిత్వాన్ని ఆస్వాదించడం - ఇవీ మినీ కవితల ఆవిర్భావానికి కారణాలై యుండవచ్చు. కొన్ని ఉదాహరణలు చూద్దాం.

నీడ:- ఉదయాన్నే నిన్ను చూసి ఉలిక్కిపడతాను! మధ్యాహ్నం నీవేలేనని మురిసిపోతాను! సాయంత్రం నువ్వు కినపించక ఒంటరినవుతాను. జీవితమంతా నీవు నాకు తోడు నీడ - జిసనారా.

"భార్య": ఆమెకు పుణ్య స్త్రీగా పోవాలనే వుంది కాని ముసలాయన్ని చూసేదెవర్సు.గురజాడ: "అడుగుజాడ"! తెలుగగు జాతికి పరువు! ప్రజలభాషకి ఎరువు! మహాకవి. శ్రీశ్రీకి! దారి చూపిన గురువు.

**2. హైకులం:-** హైకుల తాత్విక పునాది జెన్‌బేద్ధం జెన్ అంటే ద్యానం. మనస్సు మీద ముద్రపడిన విషయంమీద సంపూర్ణమైన ఏకాగ్రత ధ్యానం. ఈ ఏకీ భావన పొందిన క్షణాలు అనుభూతినందించే ప్రయత్నం హైకూ.

హైకూల ప్రస్తావన రాళ్ళపల్లి, కట్టమంచి, సంజీవ దేవ్ తెచ్చారు. అయితే తెలుగులో హైకూల రచన ఇస్మాయిల్, గాలి వానరరెడ్డి, డా రెంటల, సి.ఐ. వెంకట్రావు, బి.వి.వి ప్రసాద్, డా పెన్నా, చిమ్మపూడి, భశ్వాల్, డా ఫుద్వీరాజ్, కొట్టి రామారావు. డా॥ ఫుద్వీరాజ్ అయితే హైకూ క్లబ్‌నీ, హైకూ పత్రికనే స్థాపించాడు.

హైకూ నిర్మాణం:- 3 పాదాల్లో, మొదటి పాదం 5, రెండవ పాదంలో 7, 3వ పాదం 5 అక్షరాల్లో కొంతమంది ఈ అక్షర నియమం పాటించలేరు. కొరారా, ఫుద్వీరాజ్ మెదలగు కవులు ఈ అక్షర నియమాన్ని పాటించి మంచి హైకూలు రాసారు.

i. హైకూ ఒక పద చిత్రం:- వర్షం వెలిసింది! ఎండిన చెట్లకు పూసినయ్! నీళ్లపుష్పాలు నీతో వర్షంలో! తడుస్తున్న నాకది! వెన్నెలవానే.

ii. హైకూ కవి జీవితాన్ని ప్రేమించేవాడయి ఉండాలి:-

చిత్రకారుని! రంగులు వలికాయి! సంధ్య పొద్దున!

కలువరాణి! చుట్టూ పచ్చని సైన్యం! వరిపొలాలు.

iii. హైకూ మార్మిక కవిత:- అంటే మౌలిక సత్యాల అన్వేషణ, అనుభవం.

వెనకడుగు! ముదిమి సంకేతం! సూర్యాస్తమయం.

iiii. హైకూ కవికి సొంత శైలిఉండాలి:-

భార్య ప్రసవం! పుట్టేది ఆడమగ! నొప్పుల్తో భర్త.

పుష్ప విలాపం! కవికి సన్మానం! పూలదండల్తో.

హైకూ కవిత్వాన్ని కళ్ళజోడుతో కాదు. మనసుతో చదవాలి. హైకూ మనిషి హృదయాన్ని తెరుస్తుంది. సకల ప్రపంచాన్ని మన హృదయంలోకి ప్రవేశపెడుతుంది. సుభ్రప్రధమైన సహజీవనాన్ని కలిగిస్తుంది. ఒక కవితా ప్రక్రియ ప్రయోజనం ఇంత కన్నా ఏం కావాలి?

**3. నానీలు:-** నానీలు క్లుప్తంగా: నావి నీతి వెరసి మనవి అని నానీల సృష్టికర్త ఆచార్య ఎన్.గోపీ సూత్రీకరించారు. 'వార్త' పత్రికలో గోపీచే ప్రారంభమైన నానీలు అనతికాలంలోనే విశేష ప్రాచుర్యం పొందాయి. ఇప్పటికి దాదాపు 200 నానీ సంకలనాలు వచ్చాయి. కొత్తగా కవిత్వం వ్రాస్తున్న వారేగాక ప్రసిద్ధులైన పర్వ కవులు సాహిత్య విమర్శకులు, అనేక సాహిత్య ప్రక్రియల్లో ప్రసిద్ధులైన కవులు, రచయితలు కూడ నా కోసం వుంటాయి ప్రచురించారు.

నిర్మాణం:- నాలుగు పాదాల్లో 20-25 అక్షర నియమంలో మొదటి పాదాలు ఒక భావాంశాన్ని మిగిలిన రెండు పాదాలు మొదటి రెంటికి సమర్ధకంగా లేక వ్యంగీకరిస్తూ చెప్పే అద్భుత కవిత్వం నానీలు.

ఉదా:- 1. మా నాన్న ! చెరుకు పండించేవాడు
అందుకే ! అనుబంధాల్లో అంత తీపి.

2. నేను రోజూ ! ఎంతో మందిని కలుస్తుంటాను
నన్ను నేను కలవడమే ! కుదరడం లేదు.

3. ఎగసిడిన ! కెరటాలపైని ! ఒడ్డునుతాకి ! వెనక్కి తగ్గక తప్పదు

4. పిల్లల చదువులు ! ఒక మహాయజ్ఞం ! యజ్ఞఫలకం.

హైకూలకు నానీలకు తేడా ఏమిటి? దీనికింత ప్రాచుర్యం రావడానికి కారణం ఏమిటి - తెలుసుకుందాం.

హైకూ కవిత్వం ప్రధానంగా అనుభూతి పరం. వైవిధ్యానికి అవకాశాలు తక్కువ. హైకూ నిర్మాణం కూడా సంక్లిష్టం. ముఖ్యంగా పాదాలు వాటికుండాల్సిన అక్షర నియమం వెసులుబాటు తక్కువ.

నానీలకలా కాదు. 4 పాదాల నియమం మన తెలుగు భాషలో చందోబద్ధమైన పద్యాలకు చాలా వాటి కున్నది. డా॥గోపికి ఈ నాలుగు పాదాల నియమం వేమన పద్యాలనుబట్టి స్ఫురించిందని ఆయనే చెప్పారు.

నానీలలో వెసులుబాటు:- 4 పాదాలకు కలిపి 20-25 అక్షరాలుండాలి. ఒక్కో పాదానికి (హైకూలాగ) ఇన్నేసి అక్షరాలుండాలనే నియమం లేదు. ఒక్కక్షరంతో కూడ ఒక పాదం ఉండవచ్చు. ఉదా: స్త్రీ.

వైవిధ్యం:- నానీలలో వైవిద్యం అపారం. సమకాలీన సమస్యలన్నీ వీటిలో చిత్రతమౌతున్నాయి. ప్రాంతీయ అస్తిత్వాలు ప్రపంచీకరణ నేపద్యం నేతన్న, రైతన్నల ఆత్మహత్యలు, స్త్రీసం లేదని, ప్రకృతి సౌందర్యం, అమ్మ, రాజకీయాలు, లంచగొండితనం, స్నేహం చివరకు సూరి (ఒక టైలర్ గొప్ప కవిత్వం రాశారు),

ప్రతి సూక్ష్మాంశాన్ని మైక్రోవేవ్‌ల్లో పట్టుకున్నాయి. కొన్ని ఉదా॥

1. కిరటం! వచ్చింది! భూదేవి పాదపూజకు! నూరు గుప్పులతో రసరాజు

2. బ్రహ్మనే సృష్టించాడు! రైతన్న! అన్నం! పరబ్రహ్మ స్వరూపం కదా!-నేతల

3. కన్నీళ్లు రానివ్వకు ! ఒకపావే ఉన్న నేల ! మరింత! కుంచించుకు పోతుంది

4. ఆగని అలలు! అది సాగరం! తరగని ట్రాఫిక్! ఇది నగరం

5. జననం! దిగంబరం! మరి మరణం! చిదంబర రహస్యం

కొందరు కవులు కళాకారుల గురించి వారి పేర్లు చెప్పకుండా వారి కృతులతో కవిత్వంలో స్ఫురింపజేయడం – వినూత్నంగా

6. రస గంగాధరం ! కవితామృతం కురిపించిన రాతి! మళ్ళీ ఎప్పుడొస్తుందో.

7. సంగీత సాహిత్యాల! సాగర సంగమం! తెలుగు సినిమాకి! స్వాతిముత్యం.

కొందరు మూడేసి నానీల సంపుటాలను ప్రచురించారు. వారిలో సోకుపల్లి, కొ.రా.రా, జోసెఫ్‌లు ఉన్నారు.

కొట్టి రామారావు భగవద్గీతనేచ నానీల రూపంలో రాయడం ఒక కొత్త ప్రయోగం.

4. రెక్కలు:- ఇది అత్యాధునిక కవితా ప్రక్రియ. దీని రూపశిల్పి ఎమ్.కె.సుగకుబాబు. ఈ ప్రక్రియను డా॥అద్దేపల్లి అభినందించి ప్రోత్సహిస్తున్నారు. ఎమ్.కె.సుగకుబాబుతో పాటు పి.శ్రీనివాసగౌడ్, మోపిదేవి రాధాకృష్ణ, గొద్దంటి రంగారావు, కొట్టి రామారావు మొ॥ కవులు లెక్కల సంపుటలను ప్రచురించారు.

రెక్కలులో ప్రత్యేకత, వినూత్న నిర్మాణం:- వాహికలోనే భావ నిబంధనకు సంబందించిన ప్రాముఖ్యం ఉంది. జీవిత సంఘటనలోంచి సారభూతంగా ప్రతిపాదించే తాత్వికత రెక్కలులో ఉంది. రెకలు రూపంలో 4 పాదాలు, 2 పాదాలు – రెండు భాగాలుగా విబజింపబడి వుంటాయి. మొదటి 4 పాదాలుపక్షి శరీరమైతే చివరి రెండు పాదాలు పక్షి రెక్కలు. రెక్కలుంటేనే పక్షి ఎగురుతుంది. ఇవి ఎంత బలంగా వుంటే వేది ఎదగడానికి అనుకూలత కలిగివుంటే అంతబాగా ఎగురుతుంది. మొదటి 4 పాదాలు జీవితానుభవాన్ని గూర్చి చెబితే చివరి రెండు పాదాలు అనుభవం ద్వారా కవి చెప్పదలచిన తత్వంగూర్చి చెప్తై. జీవితానుభవానికి ఉపరితలానికి వెళ్లి ఆలోచిస్తే విశదమౌతుంది. రెక్కలతో ఆకాశంపైకి ఎగిరితేనే చలనం ఉన్నతమౌతుంది. ఇలా "రెక్కలు" అనే పేరుని రూపనిర్మాణంకి అన్వయించడం ఒక ప్రధానమైన అంశం. సత్యమైన జీవితానుభవం, నిత్యమైన తత్వంగా ఘనీభవించితేనే పద్యం రెక్కలు ప్రక్రియకి అంతఃస్రవంతిగా ఉంటుంది.

ఉదా:- 1. తనలో తలెత్తిన ప్రశ్నలే! సిద్ధార్థుణ్ని! బుద్ధుణ్నిచేశాయి.
ప్రశ్నే ప్రభావితం.

2. రెక్కలతో ! తట్టినప్పుడే! ఆకాశం! తలుపు తీస్తుంది.
ముందడుగు వేస్తేనే ! ప్రపంచం కౌగలిస్తుంది.

3. ప్రతి! సౌ హార్ద్ర హృదయంలో! దైవత్వం! ద్యోతకమౌతుంది.
అన్వేషి ! తత్వమసి.

4. పశిడిపూలు ! మిసిమి తునకలు ! పాప ! నవ్వులు
స్వర్ణకాంక్షలే ! రెండుకు?

ముగింపు:- లఘు రూపంలో పైవిగాక పేరడీలు ! ట్రుప్రోలు ! నానోలు మొదలయినవి ఉన్నవి.

నానోలు:- రూపశిల్పి ఈగ హనుమాన్.

4 పాదాలు, 4 పదాలు: నానో భౌతికశాస్త్రవం భాషిక పదం – దానర్థం: ఒక తెలుశీతకోతివ వంతు.

ఉదా:- 1. అనుభవం ! కొమ్మలుకా ! చాగుళ్లు ! ఊహలు.
2. రైతు ముణం ! ఆనందతో ! వర్షం ! కురిసింది.

●

## తెలుగు పున్నమి వెన్నెలలో..!

**- సిద్ధాంతపు. ప్రభాకరాచార్యులు**

సంకల్ప బలాన్ని శక్తిని అందించే
కనకదుర్గమ్మ పాదాలచెంత
బిరబిరా పరుగులిడుతున్న కృష్ణమ్మలా......
భాషోద్యమానికి నడుంబిగించి
మాతృభాషకు మహర్దశను కలిగించి
ఎందరెందరో రచయితలను
స్తబ్ధతనుండి చైతన్యదారుల్లో పయనింపజేసి
నవభారత యువ చేతన నిర్మాణం చేస్తూ
భాషోద్యమ దిశానిర్దేశం కోసం
తెలుగు ప్రాచీనతపై
తొలి జాతీయ సదస్సును నిర్వహించి
చిన్నయసూరి తొలి శతాబ్ది ఉత్సవాన్ని జరిపి
సాహితీ సేద్యం చేస్తున్న
ప్రపంచతెలుగు రచయితలందరిని
ఒకేచోట సమాయత్తపరచి
భాషోద్యమ స్ఫూర్తిని రగిలిస్తూ
పూర్ణచంద్, గుత్తి కొండ'ంత' అండతో
బుద్ధప్రసాద్ లక్ష్మీ ప్రసాద్‌ల ఆశీస్సులతో
తెలుగు పసిడిని వెలికితీసి
వజ్రభారతిని అలంకరించి
తెలుగు మణి దీపాల కాంతిని
ప్రపంచం ముంగిట్లో ప్రసరింపచేసి
పరిశోధకులెందరికో ఆకరగా నిలిచి
సాటిలేని మేటి సంఘంగా
సాహితీవేత్తల గుండెల్లో పదిలమై
'తెలుగు పున్నమి' వెన్నెలలో........
మన చరిత్ర సంస్కృతిని పండించబోతున్న
కృష్ణాజిల్లా రచయితల సంఘమా!
నీకు జయము జయము.

# గుడ్ బై...

- సకలాభక్తుల కృష్ణమూర్తి

ఎక్కడో లయ తప్పింది...
గతి తప్పకుండా నా గుండెకో హితవు
మంచివాళ్ల సరసన చేరితే అక్కడే ఉండిపోతావ్...
దుష్టహృదయాల దరిజేరితే నీ అస్తిత్వాన్నే కోల్పోతావ్!
ఆడంబరాలకు, ఆకర్షణలకు
లొంగకు, జనారణ్యంలో దారితప్పకు
రాజకీయాల పీటముడుల్లో చిక్కుకోకు
దూరాన దిగంతాల పిలుపువిను
ఒంటరి వాడననుకోకు అన్నార్తుల నాదుకో
అదొక్కటే నీ లక్ష్యం, నిత్యం సత్యం అయినా......
నీ అస్థిత్వం క్షణకాలమే అని తెలుసుకుంటే నిశ్చింతగ
నిద్రపోగలవ్, శాశ్వతంగ ఈ దివికి 'గుడ్ బై' చెప్పగలవ్!

నాపేరు ఆధునికరావు నా ఊరు విలాసపూరు
నన్నందరూ ఆర్జనరావనీ అంటారు
ఆధ్యాత్మిక పరులు మా పూర్వీకులందరు
కొందరు మరణానంతరం నేత్రదానంచేస్తే
నేను జీవించి ఉండగానే బుల్లితెరకు
నేత్ర, కర్ణ దానములు చేసిన ఘనుడను
కాసులవేట తర్వాత మిగిలిన సమయంలో దానిక అర్పణం
అరుణోదయానికి నిశి రాత్రికి కూడా లేదు దీని విషయంలో బాధ.
సుష్టుగా సంపాదించి షష్టిపూర్తి కొచ్చాను
పుష్టి తగ్గిన దేహం సుస్తికి గురికాగానే దేముడు గుర్తొచ్చాడు
ఇంతవరకు ఆయన్ను తలవగ, మ్రొక్కగా తీరిక లేదు నాకు
చిన్నబోయింది నా వదనం తెప్పరిల్లింది అంతలోనే........
ఇంతప్పుడు అమ్మచెప్పిన అజామిళుని కథ గుర్తుకొచ్చి
పాపాలెన్నో చేసినా అతను మరణ సమయంలో
తన కొడుకును నారాయణ అని పిలిచిన పుణ్యానికి
వైకుంతధామానికేగిన వైనం
స్ఫురణ కొచ్చింది ఇంతలోనే.........
నేను డాడీనని, మా ఆవిడ మమ్మీఅని
మా అబ్బాయి చింటూ అని, మా అమ్మాయి పప్పీ అని
ఇహ ముక్తికి మార్గమెక్కడా అని గొణుక్కోవడం నా వంతైంది.

అమ్మనీ మరువం అమ్మ భాషనీ మరువం
అమ్మ ప్రేమ మధురాతి మధురం అమ్మ భాషదిలోని సుగంధ మరువకం
గుర్తించు అమ్మ భాషలోని మాధుర్య మర్మం
పరభాషను మాట్లాడినంత మాత్రానే అందలేవు ఉన్నత జీవిత హర్మ్యం
మాతృభాషను, మాతృపితరులను వాన ప్రస్థానానికి పంపటం ఎదుగుదల కాదు.
సంస్కృతి సంప్రదాయాల ప్రస్థానం అయోమయంలో పడేయటం విజ్ఞత కానేకాదు
శిరస్సుపై ఉంచుకొని పూజించాల్సిన వారిని జిహ్వపై దొర్లాల్సి భాషను - నేలకు -కొట్టడం
స్వలాభం కోసం రాష్ట్రాన్ని ముక్కలుగా విడగొట్టాలనుకోవడం
అవుతోంది మానవ విలువలకు అడ్డుకట్టడం

ఒకప్పటి ఈయన మాతృభాష..........
దేశభాషలందు తెలుగు లెస్స అని కీర్తించబడ్డ యువరాణి
కొందరు సహృదయులైన తెల్లదొరలలచే ఆదరించబడ్డ ప్రాచీన రాణీ
నేడు పాశ్చాత్యభాషల మోజులో అదృశ్యమౌతున్న పారిణి
అయినా ఎప్పటికీ భాషాభిమానుల హృదయరాణి
అచ్చులు, హల్లులు, దీర్ఘాలు వగైరా చెలికత్తెల నడుమ వెలుగొందిన మహారాణి
కృష్ణాజిల్లా రచయితల సంఘం నిర్వహిస్తున్న ఈ
రెండవ ప్రపంచ తెలుగు రచయితల మహాసభలు
తెలుగు భాషాభివృద్ధికి కావాలిమరచి బోణి
జంతునాం నరజన్మ దుర్లభః అని శ్లాఘించారు జగద్గురువులు
మనకన్నాముందే జనించాయి ఎన్నో జీవజలాలు
మనకన్నా ముందే జనించిన జీవుల్లోని ఆవు తన తల్లిని అంబా అని పిలుస్తుంది
పిల్లి మ్యావ్ మ్యావ్ అనీ మేక మే మే అనే పిలుస్తుంది
మనం మాత్రం మాతృభాషను సమాధి చేస్తూ
అమ్మను 'మమ్మీ' అని పిలుస్తూ పిలిపించుకొంటూ
బోడి ఆధునీకత వ్యామోహంలో నాన్నని 'డాడీ' అని పిలుచుకొంటూ పిలిపించుకొంటూ
సంబరపడుతూ అంబరానికి ఆది ఈ పిలుపని పొరబడుతున్నాం
ఎవరెంత భ్రమపడినా ఎవరెంతగా హొయలు పడిన
తేనెలూరు భాష మన తెలుగుభాష
దేశభాషలందు లెస్సగ కీర్తించబడినది
తెలుగుభాష హైలెస్స అని వాడకంలో తెలుగును ఉపయోగించు
తెలుగును తెలుగు పదాల్లోని మాధుర్యాన్ని అందరికీ పంచు
జననీ జన్మభూమిశ్చ స్వర్గాదపి గరీయసి అంటూ
తల్లి, పుట్టిన భూమి స్వర్గంకన్నా మిన్న అని శ్లాఘించారు
అవతార పురుషులు శ్రీరామచంద్రులు
దేశభాషలందు తెలుగు లెస్స అంటూ
తెలుగును విరివిగా ఉపయోగించాలి నేడే జనులందరు.

## కాలము - విలువ

- మల్లవరపు నళిని శోభ

ఒక సంవత్సరము విలువ తెలియాలంటే
పరీక్ష తప్పిన విద్యార్థినడుగు
ఒకనెల విలువ తెలియాలంటే
నెల జీతము తీసుకున్న ఉద్యోగినడుగు
ఒక గంట విలువ తెలియాలంటే
ఎదురుచూస్తున్న ప్రియుడినడుగు
ఒక నిమిషం విలువ తెలియాలంటే
ఎక్కవలసిన రైలుబండి తప్పిపోయిన వ్యక్తి నడుగు
ఒకక్షణం విలువ తెలియాలంటే
ప్రమాదము నుండి బయట పడినవాడినడుగు
కాలం.......ప్రతిక్షణం...........అత్యంత విలువైనది.

# నా తెలుగు భాష ఆచంద్ర తారార్కం

- గాజుల సత్యనారాయణ

విశ్వవిఖ్యాతి గాంచిన భాషలలో తెలుగుకూడా ఒకటి. తెలుగువారు తమ మాతృదేశాన్ని, మాతృ మూర్తులనూ, కమ్మనైన తమ భాషనూ ఏనాడు మరువలేము. అలాగే మన పూర్వీకుల నుండి వారసత్వంగా వస్తున్న సంస్కృతీ సంప్రదాయాలనూ, మన కట్టుబాట్లనూ, విలువలను కూడా ఎప్పటికి మరచి పోలేము. భారతదేశంలో తొలి భాషా ప్రయుక్త రాష్ట్రంగా మన ఆంధ్రరాష్ట్రం అవతరించింది. మన తెలుగు భాషకు ఉన్న ప్రత్యేకతను చాలాకాలం పూర్వమే పదుగురు గుర్తించారు. రెండువేల సంవత్సరాల పైగా వారసత్వంగా వస్తున్న మన తెలుగుభాష, దేశ విదేశాల్లో మాట్లాడేవారి సంఖ్య ఈనాడు 16 కోట్లకు పెరిగింది. భారతదేశంలో హిందీభాష తరువాత ఎక్కువమంది మాట్లాడే రెండవభాష మన తెలుగు భాష.

ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం తెలుగుకు అధికార భాష హోదాను కల్పించి, తెలుగును డిగ్రీస్థాయిలో గూడా బోధనభాషగా ప్రవేశపెట్టింది. కేంద్ర పబ్లిక్ సర్వీసు కమీషన్ పరీక్షల్లో గూడా తెలుగుకు స్థానం లభించింది. ఈ మధ్యనే తెలుగుకు ప్రాచీన హోదా కల్పించి ఉన్నత శిఖరాలను అధిరోహింప చేశారు. ఎంతోమంది పండితులు తెలుగు భాషలో ఎన్నో ప్రయోగాలు చేసారు చేస్తున్నారు. అమ్మకు మరో పేరు భాష. అమ్మకూ భాషకు తేడా లేదు. అమ్మ మనకు ముందుగా నేర్పేదే భాష. అత్త, అమ్మ అనే మధురమైన పిలుపు తోనే భాష ప్రారంభమవుతుంది.

ఆరుబయట చల్లని పిండివెన్నెల్లో చందమామను చూపుతూ, గోరుముద్దలు తినిపిస్తూ అమ్మ నాకు నేర్పిన భాషే తెలుగు భాష. అమ్మ భాషే అమృతం. ఏ వ్యక్తియైనా గుండె లోతుల్లోంచి వచ్చే భావాన్ని మనసు విప్పి చెప్పగలిగేది మాతృభాషలోనే! స్వంతభాషపై పూర్తిగా పట్టు ఉంటేనే ఇతరభాషల పై పట్టు దొరుకుతుంది. ఈనాడు ఒక భాష అంతరించిందంటే, ఆ జాతి యావత్తు అంతరించినట్లే! కన్న తల్లిని మనము ఎన్నడూ మరువనట్లే తల్లి భాషను కూడా ఏనాడూ మరువకూడదు. తుపాకి శరీరాన్ని లొంగదీసుకుంటే, భాష ఆత్మను లొంగదీసు కుంటుంది. ఒకభాషను దూరం చేయడమంటే ఆ జాతి సంస్కృతిని దూరం చేయడమే అవుతుంది. పరమత ద్వేషం ఎంత నీచాతి నీచమో, పరభాషావ్యామోహం కూడా అంతే నీచం. పరాయి భాష మెదడు నుంచి శరీరాన్ని, మనసు నుంచి మెదడును విడదీస్తుంది. మాతృభాషను ప్రేమించలేనివాడు, మాతృదేశాన్ని కూడా ప్రేమించలేడు. తెలుగు భాష వాడుక మన జాతి మనుగడకు వేడుక కాగలదు. విద్యా, సాహిత్య, సంస్కృతిక రంగాల ద్వారా తెలుగు భాషను ప్రోత్సహించినప్పుడే ఆ భాష పది కాలాలపాటు జీవిస్తుంది. అమ్మపాల కమ్మదనంతో పాటు అచ్చ తెలుగు మకరందాన్ని మన ముందుతరాల వారి కందిద్దాం.

యావత్ ప్రపంచ దేశాలలో మన సంస్కృతీ సంప్రదాయాలనూ, మన వారసత్వ విలువలను గుర్తించేటట్లు చేసింది మన తెలుగుజాతి. ఆ జాతి గౌరవాన్ని కాపాడడం మన అందరి బాధ్యత. తెలుగు భాషా వికాసానికి ప్రతి ఒక్కరూ చేయూతనివ్వాలి. కానీ ఈనాడు ఆ తెలుగు భాష కనుమరుగు కాబోతున్నది. కారణాలు అనేకం. ఆ తప్పు ఒకరిది కాదు. ఎనిమిది కోట్ల ఆంధ్రులది. యావత్ తెలుగు జాతిది. ఎందరో మహానుభావులు తెలుగుభాషకు వారివారి పరిధిలో ఎన్నో సేవలు చేశారు. తెలుగు భాషను రక్షించుకొనడానికి ప్రతి తెలుగువారు తమ వంతు విధిగా ఈ భాషను రక్షించుకోవడానికి పూనుకోవాలి.

రెండువేల సంవత్సరాల చరిత్ర గల్గిన తెలుగుభాష, ఈనాడు మృతభాషగా మారే పరిస్థితులు ఏర్పడ్డాయి. మాది మృతభాష కాదు అమృత భాష అని ఎలు గెత్తి చాటుదాం. కలసికట్టుగా పయనిద్దాం. ప్రపంచ నలుదిశలా ప్రతి ధ్వనించే భాషే తెలుగు భాష. నా తెలుగు భాష ఒక అమృత జలపాతం. వసంత పరిమళ సౌరభం... ఆచంద్ర తారార్కం.

జై తెలుగు తల్లి ! జై తెలుగు భాష !!

## స్వాగతం - సుస్వాగతం

-రాచూరు శివరామప్రసాద్

తెలుగువెన్నెల – వెలుగు వెన్నెల
బంగరు తెలుగుతల్లి – వెలుగు కన్నుల
పూచిన ఆమని – పున్నమి వెన్నెల
తిలకించగ రండి – ఈ తెలుగుభాష తీరుతెన్నుల
పులకించగ మేను – కనరండి మన తెలుగు సాహితీ
సంస్కృతి చరిత్రలను – పశిమిపైరు వెన్నుల

తెలుగుకార్తెలు – నీలిమబ్బులై వర్షించగా
తెలుగు నేలలు – కతపచ్చలై హర్షించగా
తెలుగుభాష మాధుర్యం – చవిచూడ
తెలుగు నుడికార చాతుర్య – చదివిచూడ

తెలుగు వెలుగును – తొలి వెలుగు తెలుగును
తెలుగుతల్లి పాదాల – రంగు పారాణి జిలుగును
తేట తేట తెలుగును – తేనె తీపి తెలుగును

తరలి రండి – చూడముచ్చటై కనులారా
కదలిరండి – మాట్లాడ మక్కువై మనసారా
తెలుగువారి అందరికీ ఇదే
మా కృష్ణజిల్లా రచయితల సంఘ ఆహ్వానం
తెల్లవారి తూరుపు తొలి వెలుగులా
మీ రాకకు ఇదే మా స్వాగతం – సుస్వాగతం

## తెలుగు సౌరభం

- కోశా విమలకుమారి

ఎక్కడిదీ అందం! ఎంత చక్కనిదీ సౌరభం!
తెలుగువారి తేటతెలుగులదీ అందం,
అమ్మపాల కమ్మదనపు సౌరభమీ సౌగంధం!
అమృతంపు ధారల అలరించు నీ ఆంధ్రావని
నన్నయ నడయాడిన గడ్డ ఈ తెలుగునేల
ఎఱ్ఱన భారతానికి భాష్యం చెప్పిన నేల
వేమన వేదానికి నాందీ ప్రస్తావన మన తెలుగుసీమ
అన్నమయ్య కీర్తనల సంగీత సరిగమలు
క్షేత్రయ్య పదాల పదనిసలతో అలరించిన
అవని ఇది! అందరి మన్ననలందించిన ఆంధ్రావని
తెలుగు వెలుగులు విరజిమ్ము కవులను కన్నతల్లి మన తెలుగుతల్లి
పరువాలు చిందేటి పర్వత శ్రేణులు దేదీప్యమానమై
వెల్గొందు దేవాలయ ప్రాంగణాలు
పుష్పఫలభరిత పచ్చని పైరుల పరిమళాలు
కృష్ణగోదావరి నదుల నాట్యమాడు పసిడి సంస్కృతి
అట్టి అవనిలో తెలుగువారి శ్వాస, ధ్యాస తెలుగు భాష
జాతులెన్ని ఉన్న జాగృతి ఒక్కటె జగతిలో
భాషలెన్ని ఉన్న తెలుగు భాషకె సౌలభ్యం.
తెలుగునేల, తెలుగుగాలి, తెలుగుజాతికి జీవం!
అమ్మభాష అనురాగం తెలుగు పలుకుల మమకారం
ఆంధ్రజాతికది అంకితం! అమరం!
తెలుగువాడలేవర! భాష గౌరవం నిలుపరా!
బాధ్యతంత నీదిర! మాతృభాషను మరువకురా!
కలత నిదుర మానర! తెలుగుభాషతో తరియించరా!
అమ్మపాలు ఆపితే ఆర్తినొందు బిడ్డరా!
తెలుగుమాట మరిచితే జాతి జీవం కోల్పోవురా!
అన్యభాష లాడకురా! తెలుగుభాషను కాపాడుమురా!
తెలుగు వాడవు నీవై తెలుగు తేజం చూపరా!
పరదేశమేగినా పరభాషలాడినా
మాతృభాషదే పైచేయని గర్వంగా చాటరా!
పలుభాషలు నేర్చినా ప్రథమభాష మనదంటూ
పలుమార్లు చాటరా తెలుగుదారిలో నడువరా!

## రెండింటికీ చెడ్డ రేవళ్ళు

- పి. నాగలక్ష్మి

"పాతికేళ్ళక్రితం నేను చదివిన స్కూలు
ఇపుడది (SUCCESS) సక్సెస్ హైస్కూలట
సక్సెస్ అంటే.....! తెలుగు మీడియం హైస్కూల్లోనే
ఇంగ్లీషు మీడియం తరగతులట లోనికి తింగిచూశా!
తెలుగుమీడియం పిల్లలతో కలిసి కూర్చుని
ఇంగ్లీషు మీడియం పాఠాలు నేర్చుకుంటున్న
రెంటికీ చెడ్డ రేవళ్ళు "కొన్ని సక్సెస్ హైస్కూళ్ళ" విద్యార్థులు"

## పసిడి పలుకుల వాణి

- డా. సి.హెచ్. కళావతి

పల్లవి॥ పసిడి పలుకుల వాణిని
తెలుగు వెలుగుల రాణిని
భాషయందు భావమందు
నాకు సాటిలేదులే మరిమేటి ఏదీరాదులే ॥పసిడి॥

చరణం॥ నన్నయ నుడికారంతో సొబగు దిద్దుకున్నాను
తిక్కన కందములతో కళకళలాడాను
శ్రీనాథుని సీసము నా మేనుకు సింగారం
పోతిన కవితలోని మాధుర్యం నాదేలే మాధుర్యం నాదేలే॥పసిడి॥

చరణం॥ రాచరికపు వ్యవస్థలోన రాణించితి ఆనాడు
ప్రజాస్వామ్య యుగములోన పతనమైతి ఈనాడు
తేనెలొలుకు తెలుగునెపుడు తేలికగా చూడకు
మరువకండి మరువకండి మాతృభాష మధురిమ
మీ మాతృభాష మధురిమ ॥పసిడి॥

చరణం॥ సరస్వతీ విలాపమును వివరించిన కందుకూరి
ఆవేదన నీకెపుడు అవగాహనమయ్యేను
దేశభాషలందు తెలుగు లెస్స అని మరువకు
మాసి పోనియకు తెలుగు వెలుగు తేజమును
నీ తెలుగు వెలుగు తేజమును ॥పసిడి॥

చరణం॥ విలపించకు విలపించకుము నా తల్లిభారతీ
ఆంధ్రపుత్రులం మేము నీ భాషాభిమానులము
మాసిపోనీయము మరుగున పడనీయము
తెలుగు వెలుగు తేజమును వైభవమున నిలిపెదము
వైభవమున నిలిపెదము ॥పసిడి॥

## ఊబి

- శింగిశెట్టి సంజీవరావు

పసిమి గోగు కాడ దాని చిఱుత అరవిరిసిన శ్వాస
ఎంతవరకని గుబాళిస్తుంది ఆప్తమైన గొంతు పలికిన
ఏ జాడ అడుగులైన వినిపించకున్నాయి.
చమురు పోస్తూ ఉంటే చిన్ని ప్రాణం ఎదిగి కొడిగట్టడానికి
ముందుకెంతో కాలం పడుతుంది.
మొదటి అంకంలోనే దాని జీవితానికి తెర పడ్డదెందుకు.
విసవిస నడిచిన పట్టెల చిరు సవ్వడులు ఏవి
లేత రక్తనాళం చించివేస్తే అసువులు బాసిన మిగులు పచ్చిముద్ద
ఏ దేవతారాధనలో నిర్మాల్యమో ఆ వైపే తొంగి చూస్తున్న ఊబి
నిమజ్జనం కోసమా ఊగుతున్న పూనకం చిన్నారి పిడికెడు
కలేజాపైన తప్పెట దరువు వేస్తుంటే ఆ ఊబి చెమర్చింది.
మట్టి పుట్టం తడిసింది నాళాన్ని చిదిమిన రక్తంతో.
చిన్ని పారిజాతాన్ని అపహరించి బలి పెట్టిన మౌఢ్యం ముందు
అభ్యుదయం – అనుకంప తన తల దించుకుంది.
దాని మస్తిష్కం సహస్రాంలో మరో ఊబి సానుభూతి ఒత్తిడి నెత్తురు.

## అమ్మ

-కాట్రగడ్డ వెంకట్రావు

అమ్మ వడి కమ్మనైన తీపిదని ఎందరికి తెలుసు ?
అమ్మ ప్రేమ చలువ పందిరని కొందరికే తెలుసు !

జన్మజన్మల పేగుబంధపు అనుబంధం దేవుడిచ్చిన వరం
తేనెలొలుకు తెలుగుదనపు తొలిపలుకుల గురువే! అమ్మా!

రక్తపు ముద్దలతో పేగు తెంచుకు పుట్టి
కనీ, మోసిన పచ్చి బాలింత కన్న కడుపే!.... అమ్మా!

ముద్ద ముద్దలో తల్లి ప్రేమ రంగరించి
జోకొట్టి జోలపాడిన మాతృమూర్తీ!... అమ్మా!

తప్పటడుగుల నడత చేర్చిన తేట తెలుగుల తెలుగు నేర్చిన
అమ్మ మనసే మమకారం అమ్మ పలుకే బంగారం!

గతం పండి బ్రతుకు నిండిన జీవన్మరణంలో అలమటించే
కన్న కడుపుల తీపి గురుతుల ఆరాటమే... అమ్మా

ఎన్ని జన్మలకైనా తీర్చుకోలేని అమ్మతనం!... తల్లి రుణం!
లోకంలో విలువ కట్టలేనిది దైవము కన్న మిన్నయైనదే అమ్మా

ప్రేమంటే అదే కన్నతల్లి కడుపు తీపి
అదే!... అదే! అమ్మంటే!... తల్లి ప్రేమే!

## వానా ఓ వానా

- అలిపిరాల సువర్ణ

వానా ఓ వానా అని ఎంత పిలిచినా రావు
పిలిస్తే పలకవు రమ్మంటే రావు
బతిమలాడినా రావు కాళ్లు పట్టుకున్నారావు
మంత్రతంత్రాలకు భయపడి పరిగెత్తుకురావు
జపతపాలకు అసలు లొంగవు
నీ అంతట నువ్వే వస్తావు ఓ రోజు పిలవని
పేరంటానికి వచ్చినట్లు వచ్చినదానివి కాసేపు
కూర్చుని మేమిచ్చిన పసుపు కుంకాలు వాయినాలు
తీసుకుని మర్యాదగా వెళ్లిపోవు
నీ ఇష్టం వచ్చినట్లు కుంభవృష్టిగా కురుస్తావు
ఊరువాడా ముంచెత్తుతావు... ఎక్కడెక్కడా
మనుష్యులు జలదిగ్బంధాలలో చిక్కుకుపోతారు
రక్షింబడినవాళ్లు తప్పించుకున్నా తతిమావారు
నీ ప్రవాహంలో కొట్టుకుపోతారు
రమ్మని పిల్చినప్పుడు రాకుండా పిలవని అతిథిలా
వచ్చి, వచ్చిన వెంటనే పెట్టింది తిని వెళ్లే అతిథిలా
కాకుండా నీ ఇష్టం వచ్చినన్నాళ్లు కూర్చొని మమ్మలందరిని
ముంచికాని వెళ్లవు ఎందుకు వానా ఓ వానా!

## అక్షర - సుమనస్సులు

ఓ నేస్తం ! చూడవోయి సమస్తం చూడలేక చస్తున్న వ్యస్తాన్ని
మధ్య ప్రాచ్య ఆర్యావర్తంలో కృష్ణానది సెలయేరుల గలగల రావం
యిది గంభీరమిది. ఘనగర్జనం సాగర సంగీత నైక నదీ సంగీతం
ఇంద్రకీలాద్రి నగరవాసియై ప్రాచ్యకవులచే ది "వెన్నీస్ ఆఫ్ ది ఈస్ట్"
విజయైశ్వర్యాల - విద్యలవాడ వాసిగాంచి
వర్ధమాన కవి పుంగవుల వెలుగులకై
అధిరోహిస్తున్న - అభినవ కవిత్రయం
విజయవాడ - హరిహరేశ్వర - దత్తాత్రేయ - నాగోబా
స్వయంభూకనకదుర్గ - మేరీమాత సాక్షిగా
రెండవ ప్రపంచ తెలుగు రచయిత సాహితీ మిత్రుల, నవత, యువత
కనుబావాలబాష్పాల కన్నుల హోరు. అక్షరనక్షత్రాల హారతిగా జాల్వారు
రెండవ ప్రపంచ తెలుగు రచయితల మహాసభకు అలరించు కవితా
ఆహుతుల నవ కవితా మాలికలకు
యిదికవితారసమిది! మధురానవ కృష్ణాజలమిది
భావనసుధా పావన తీర్థము
యుగయుగాలుగా - తరతరాలుగా!
కాలగమనంలో - ఎన్నెన్ని - యుగాలు ఏర్పడినవా
సమన్వయాల - నిరంతరాన్వేషణ
ఇది నైర్మిత్యము - నిత్యము - సత్యము
ఇది పరంజ్యోతి - పరిపూలస్మెరము
వర్ధమాన కవితా శ్రేయస్సే - విశ్వశ్రేయస్సే - కవితా మాలికలుగా
బాసించగా - సంబావించగా

## వందనం - వందనం (కవితాగానము)

-లంకా పూర్ణయ్యశాస్త్రి

తెలుగు తల్లికి వందనం - తెలుగువారికి వందనం
తెలుగు భూమికి వందనం - ఆంధ్రప్రజలకు వందనం
సమైక్యాంధ్రులకు వందనం - ఆంధ్రతల్లికి వందనం
తెలుగు తల్లికి వందనం- ప్రకృతి - సహజసంపదలకు వందనం
జల జల పారు నదీమ తల్లులకు వందనం - చందనం
పాడి పంటలనిచ్చు రైతన్నలకు - పశుజాతులకు వందనం
అమరవీరులకు వందనం - వీరనారీమణులకు వందనం
బాల పౌరులకు వందనం - భావి పౌరులకు వందనం
పూజలుచేయు పండితులకు వందనం - బడులకు వందనం
విద్యలనొసగు పంతులయ్యలకు వందనం - ఇంటింటా స్త్రీ మాతలకు వందనం
తల్లిదండ్రులకు వందనం - అల్లరిచేయు పాపలకు వందనం
నీతిని ప్రభోదించు స్వాములకు సాష్టాంగ వందనం
పాఠశాలలకు వందనం - గ్రంధాలయాలకు వందనం
సరస్వతీ పుత్రులకు వందనం - అన్ని జాతులకు వందనం
అన్ని మతాలకు వందనం - వందనం

## భారత స్త్రీ

- శ్రీ భమిడిపాటి రాధాకృష్ణమూర్తి

ఓంకారాన్ని చీల్చుకుని పుట్టిన – పుడమి తల్లి ప్రథమ సంతతి స్త్రీ
మంచు చీర కట్టుకుని చలి కొంగు కప్పుకుని
సూర్యుణ్ణి ఫాల భాగాన ధరించిన తొలి ఉషస్సు స్త్రీ
నగ్నత్వాన్ని సుకుమారంగా స్పృశించి పరవశించి
పిడికిళ్లు తెరవని పసిగుడ్డుకు అమృతం పట్టింది స్త్రీ
'జననీ జన్మభూమిశ్చ' అని మొదటి పీట మీద ఆసీన అయి
'మాతృదేవోభవ' అని ప్రథమ తాంబూలం అందుకుని
రక్తం పంచుకు పుట్టిన అమృతానికి ఉగ్గు పెట్టి
పెంచి పెద్దజేసి పట్టంకట్టి మకుటం పెట్టింది స్త్రీ
అడ్డాలు గడిచి గడ్డాలు పెరగ్గానే మీసాలు దువ్వి
సరిహద్దులు దాటిన మతోన్మాదం, అధికార కాంక్షతో కలిసి
'న స్త్రీ స్వాతంత్ర్య మర్హసి' అంటూ వంటింటి కుందేలును చేసి
ఆమెను ఆమె జీవితాన్ని కుదేలు చేసినా
సహనానికి, సహజీవనానికి – ఓర్మికి, కూర్మికి ఆలయమైంది స్త్రీ
ప్రతి ఉద్యమం, ప్రతి ఘనత, ప్రతి విజయం, ప్రతి ఊపిరిలో
తానుండి వెన్ను నిమిరింది, భుజం తట్టింది
అవని అంతా ఆడది ఆటబొమ్మ – స్త్రీ భోగవస్తువు
భారతావనిలో మాత్రం ఆడది ఆదిశక్తి – మాతృమూర్తి
తనదైన దైవత్వాన్ని నిలుపుకుంది – పెంచుకుంది స్త్రీ.
కళ్లు తెరవండని ప్రవచించింది బధిర శంఖమైంది
శాంతిని కాంక్షిస్తూ చేసిన ఘోష అరణ్య రోదనమైంది
అర్ధరాత్రేమిటి పట్టపగలే స్త్రీకి దుశ్శాసన పర్వమైంది
భృకుటి ముడిచి – జ్యావల్లి మోయించి – సంఘశక్తితో
శాంతి సమరాంగణాన సారథ్యం వహించిన విజయంవైపు సాగింది
ప్రతి నీలి మేఘం అంచునా ఉన్న క్రాంతి రేఖ భారత స్త్రీ.

## పేదవాడు - పాలిటిక్స్

- సకలాభక్తుల కృష్ణమూర్తి

పేదవాడికి జీవించను, మరణించను జీవనయాత్ర
ముక్కలు చెక్కలుగ మారిన బ్రతుకుయాత్ర
దేశమంతా నేడు స్వార్ధ పాలిటిక్స్ వికృత యాత్ర
రాజకీయమంటే ప్రజాసేవ, దీనజనోద్ధారణ ఆనాడు
ధనః, మనః, ప్రాణాలు ధారవోసిన మిషనరీజీవ్
ఈనాడది కరప్షన్, వారసత్వ ప్రొఫెషన్, అవకాశవాదం
ఓట్లు దండుకునే ఓదార్పుల పాదయాత్రలు
పటాటోపపు రాజకీయ రచ్చబండ మీటింగులు
గెలిచినా, ఓడినా ఊసరవెల్లుల్లా రంగుల మార్పిడి
ఆరడుగుల ఊసరవెల్లుల్ని చూసి తమ జాతికే సిగ్గుచేటని
అసలైన ఊసరవెల్లులు మూకుమ్మడిగా ఆత్మహత్యలు
మహామహులైన జీవశాస్త్రజ్ఞులకే అంతుపట్టని
ఈ విచిత్ర జంతుఫినామినా.. ఇసుక నుండి ఇనుముదాకా కొల్లగొట్టడం
అన్నదాతల గోళ్లూడగట్టి, పంటల నేలతల్లిని
'సెజ్'ల పేరిట వివస్త్రను చేసి పబ్లిగ్గా చెరచమని అస్మదీయులకు ధారాదత్తమనే
సరికొత్త రాజకీయ యజ్ఞ ప్రక్రియ ఫ్యూచర్, ఫార్వర్డ్ ట్రేడింగుల మిషలు పెట్టి
దేశాన్నే నల్లబజారు చేసిన ఉదారహృదయులు
ధరలుపెంచి సామాన్యుడి నడుం పోగొట్టి
కూలదోసి తెరుస్తున్నారు స్విస్ ఎకౌంట్లు! రోజువారి కూలి, 'రేగ్ పిక్కర్', బిచ్చగాడు
చచ్చాక, చిత్రగుప్తుడి ఎదుట తొడగొట్టి బోరవిరుచుకు సవాల్ చేయగలరు.....
మరి మీరో, మొరలు వినరుగాక వినరు
పై పెచ్చు దమనకాండలు, మారణహోమాలు
దారి దొంగలకన్నా కనా కష్టం ఓట్లేసి దగాపడ్డ తమ్ముళ్లం మనం
దమాయించి మరీ దోచుకుంటున్న అన్నలువారు రాజకీయ రాక్షస జలగల్లారా !
మీ బ్రతుకులు చెడ !! దేశం బాగుపడ!!! వినండి కవుల ఉద్బోధం!

## వెన్నెల జలపాతం

- జయంపు కృష్ణ

ఇదే తెలుగు ఇదే తెలుగు – మాతృభాష మహా వెలుగు
మధురమైన పదములతో – అధరాలను అలరించే
కోయిలమ్మే గొంతు పలుకు – పురివిప్పిన నెమలి కులుకు
అమృతం జాలు వొలుకు – అడవి పుట్ట తేనెలొలుకు
రాయలసిరి పోషణతో – రసరమ్యంగా ఎదిగినది
కవి తిక్కన భారతంతో – మురిసి మెరిసి సాగే నది
అమ్మ – నాన్న – అత్త – మామ – అలతి అలతి మాటలతో
వన్నె తెచ్చు తేటలతో – రంగు హంగు వర్ణాలతో
ప్రబంధాల సోయగాలు – పురాణాల సరాగాలు
కావ్యాల నవ్య సిరులు – రాసులు విరజిమ్ము ఝరులు
కరిగే కలకండ ముక్క – అరిగే శ్రీ గంధం చెక్క
అమ్మ రొమ్ము పాలచుక్క – తెలుగు విరుల సరి లెక్క
సానపట్టి మెరుగు దిద్ది – నును తేలిన తెలుగు నాది
తీపి రూపు తెలుపునట్టి – లిపి వెలుతురు గెలుపు నాది
తెలుగు నా మాతృభాష – ఎద ఎదలో అదే ఘోష
మురిసెను తెలుగు కన్నెలా – విరిసెను ఈ తెలుగు వెన్నెల

## ఆదుకోవాలని ఉంది...!

-చలసాని వసుమతి

బహు భాషావేత్తగా సముద్రాన్ని కుచ్చిళ్ళు సర్దుకునే అమ్మగా వృక్షాన్ని
అద్భుత ఆనందాల ప్రవచనాలను విన్పించే
నీటి జల్లులను చూస్తూ సృజనాత్మికనై
సర్వేశ్వరునికి ఇంద్రియాలనవ్వాలని ఉంది
యద్భావం తద్భవతి అర్థంలో ప్రతికూల
తరంగాలనుండి విముక్తి పొంది నడవాలని ఉంది అనుకూలంగా...
శాంతిని తుడిచే సీరియల్స్ పరుగుల సవాల్‌లో
కలవరపడే మనసుకు, దారి కల్పిస్తూ స్థితప్రజ్ఞనై నిలవాలని ఉంది
స్పందించుటకే జీవితమనే సత్యం మరిచి
భరించటానికి జీవితమనే, నేటి నాగరికతను నలిపివేయాలని ఉంది.
శోధించి మరీ వినోదాలకు దాసులై నిస్సందేహంగా పతనాన్ని చవిచూస్తూ
కుమిలి, కుమిలి దుఃఖించే అల్లులను ఆదుకోవాలని ఉంది
అలసిన మనసుకు మైక్రోచిప్ అవుట్ పుట్‌ల విజ్ఞానాన్ని నింపి
నవ్యభవితను శోభింపచేయాలని ఉంది సత్యం సుందరం లోనికి జారిపోవాలని ఉంది.

# తెలుగులోనే పలుకుదాం!!

-శ్రీమతి భమిడిపాటి బాలత్రిపుర సుందరి

1. తెలుగు-తెలుగంటావు... తెలుగేమిటీ...! తెలుగే - పలుకమంటావు నీకీ తెగులేమిటీ?
నువ్వు పుట్టిన ఊరు తెలుగు... నువ్వు బ్రతికే రాష్ట్రం తెలుగు...
నువ్వు నేర్చిన భాష తెలుగు... నీ చుట్టు ఉన్నది తెలుగు - వెలుగు
తెలుగు-తెలుగంటాను... అననేమిటీ! తెలుగే-పలకనంటావు... నీకీ తెగులేమిటి?
తెలుగే నేర్వాలని చెప్తుంటావు.... తెలుగే మాట్లాడాలంటుంటావు...
తెలుగు మాధ్యమంలో చదవమంటావు... నా చుట్టూ ఉన్నది ఆంగ్లం - వెలుగు
తెలుగు-తెలుగంటావు... తెలుగేమిటి? తెలుగే పలకమంటావు... నీకీ తెగులేమిటి?

2. అ ఆ లనన్నీ చెప్పేశావు అంకెలు బాగా తెలిసేశావు
నెలలు, వారాలు వల్లేశావు నీతో చుట్టూ ఉన్నది తెలుగు - జిలుగు
తెలుగు - తెలుగంటాను... అననేమిటీ! తెలుగు - పలకనంటావు... నీకీ తెలుగులేమిటి?
ఎబిసిడిలు దిద్దేశాను నంబర్సన్నీ చెప్పేశాను
మంత్సు, వీక్సు వల్లించాను నా చుట్టూ ఉన్నది ఆంగ్లం - జిలుగు
తెలుగు-తెలుగంటావు... తెలుగేమిటి? తెలుగే పలకమంటావు... నీకీ తెగులేమిటీ?

3. అమ్మ! నాన్న! పిలిచేశావు అత్త! మామ! అనేశావు
తాత! మామ్మ! నీదన్నావు నీ చుట్టూ ఉన్నది తెలుగు బంధం
తెలుగు-తెలుగంటాను.... అననేమిటీ! తెలుగే-పలకనంటావు... నీకీ తెగులేమిటి?
మమ్మీ! డాడీ! అంటున్నాను అంటీ! అంకుల్ పిలుస్తున్నాను
గ్రాండ్‌ఫా! గ్రాండ్‌మా! నాదన్నాను నా చుట్టూ ఉన్నది ఆంగ్లం బంధం!
తెలుగు-తెలుగంటావు... తెలుగేమిటి? తెలుగే-పలకమంటావు.... నీకీ తెగులేమిటీ?

4. బడికి - రోజూ వెడుతున్నావు పాఠాలన్నీ - చదువుతన్నావు
ఆటలు బాగా ఆడుతున్నావు నీ చుట్టూ ఉన్న పిల్లల పలుకే తెలుగు
తెలుగు - తెలుగంటాను.... అననేమిటీ! తెలుగే - పలకనంటావు... నీకీ తెగులేమిటి?
స్కూలుకి రోజూ వెడుతున్నాను లెసన్సనీ చదువుతున్నాను
గేమ్సు బాగా ఆడుతున్నాను నా చుట్టూ ఉన్న పిల్లల పలుకే ఆంగ్లం
తెలుగు-తెలుగంటావు... తెలుగేమిటి? తెలుగే-పలకమంటావు.... నీకీ తెగులేమిటీ?

5. తెలుగు అన్నం తింటున్నావు తెలుగు పండుగలు జరుపుతున్నావు
తెలుగు భాషే వద్దంటావు నీ చుట్టూ ఉన్నది తెలుగు సంస్కృతి
తెలుగు-తెలుగంటాను... అననేమిటీ! తెలుగే-పలకనంటావు... నీకీ తెగులేమిటి?
ఆంగ్లం రైస్ తింటున్నాను ఆంగ్లం ఫెస్టివల్ జరుపుతున్నాను
ఆంగ్ల భాషలోనే జీవతముంది నా చుట్టూ ఉన్నది గ్లోబల్ సంస్కృతి
తెలుగు-తెలుగంటావు... తెలుగేమిటి? తెలుగే-పలకమంటావు.... నీకీ తెగులేమిటీ?

6. భాషలెన్నయినా నేర్వమన్నాను విషయాలన్నీ తెలియమన్నాను
అమ్మభాషలోనే - చదవమన్నాను నీ చుట్టూ ఉన్నది తెలుగు పున్నమి
తెలుగు-తెలుగంటాను.... అననేమిటీ! తెలుగే-పలకనంటావు... నీకీ తెగులేమిటి?
తెలుగు భాషనే... నే పలుకుతాను తెలుగు మాధ్యమంలో - నే చదువుతాను
ఉన్నత విద్యకు దారి ఏదంటాను? నా చుట్టు ఉండదిక... పున్నమి వెన్నెల
తెలుగు-తెలుగంటావు... నీ గోలేమిటీ? తెలుగులో చదివితే... నా భవితేమిటీ?

7. కృష్ణాజిల్లా రచయితల సంఘం ముందుకురికింది భాషావేత్తల్ని హెచ్చరించింది
తెలుగు ప్రపంచం కదలి వచ్చింది నీ చుట్టూ ఉండేదిక... పున్నమి వెన్నెలే!
తెలుగు తెలుగందాము-తెలుగునే పలుకుదాము తెలుగు భవిష్యత్తులో వెల్లి విరుద్దాము

## అమ్మ ప్రేమ

- కె. వి. రమణ (రమ్మ)

భగవంతుని మారురూపం అమ్మ - సృష్టికి మూలం అమ్మ
సృష్టి మనుగడకి ఆధారం అమ్మ - మమతకి మారు పేరు అమ్మ
అమ్మంటే స్వచ్ఛమైన అనురాగం - అమ్మంటే నిస్వార్థ ప్రేమకు ప్రతీక
బిడ్డ అభివృద్ధి కోసం తానే కర్పూరమై కరుగుతుంది
తానే దీపమై ఆరని కాంతి నిస్తుంది - అమ్మ సరిదిద్దే తప్పటడుగులే
బిడ్డ భావిజీవితంలో వేసే ముందడుగుకు పునాది.
స్వచ్ఛమైనా ఆడతనానికి ప్రతీక మాతృత్వం.
'అమ్మతనం' ఆడదానికి మాత్రమే దేవుడిచ్చిన వరం.
మాతృత్వం పొందే ప్రతి స్త్రీ జీవితం ధన్యం. అలాగని జన్మనిస్తేనే అమ్మకాదు!
దీనులపట్ల అనాథలపట్ల అమ్మతనం చూపగల ప్రతి ఆడది అమ్మే
నిస్వార్థంగా ప్రజాసేవ చేసిన "మదర్ థెరిసా" ప్రజలందరికీ అమ్మే కదా!
నోరులేని మూగజీవాలలో సైతం మనకు దర్శనమిస్తుంది అమ్మతనం
ఈ లోకంలో పెద్దపీట అమ్మతనానిదే సృష్టికి ప్రతిసృష్టి చేయగల సామర్థ్యం అమ్మదే
కల్తీ లేనిది తీయనైనది అమృతతుల్యమయినది అమ్మ ప్రేమ
అమ్మ వాత్సల్య సంపద ముందు ఏ సంపద సాటిరాదు.
ఎంతకీ తరగని గని, ఎవరూ కాజేయలేని నిధి అమ్మ ప్రేమ
అమ్మ ప్రేమ నిత్యం సత్యం, శాశ్వతం.
మనకు జన్మనిచ్చిన అమ్మలందరికి శతకోటి వందనాలు

## మన తెలుగు తోట

- కుమారి నల్లఘుట్ల నందిని

మన తెలుగు తెల్లని వెన్నెల బాట
పరవశించి పాడుకునే ప్రగతి గీత
అణువణువు పులకింప చేసే సహజాత
ప్రతి పదమున జాగృతి చూపే అనుంగుమాత

మన తెలుగు తెల్లని మల్లెల మూట
నునులేత కాంతులీను సుందరమగు పూలతోట
ఎందరో మహాకవి పుంగవుల లలిత కవితా వ్యవసాయంతో
సుశ్యామల మయిన తెలుగు తోట తళుకులీనే ఆణిముత్యాల పేట

ఆంధ్రమాత ఆలించి లాలించు అచ్చ తెలుగుపాట
అఖిలాంధ్ర జనులాస్వాదించు రసాల తేట
తరతరాలకు రసతరంగణిగా వెలువడిన తేనెల మూట

వన్నెచిన్నెల వెలుగు వెదజల్లిన తెలుగు కోట!
సహోదర! తెలుగు పలుకును నరనరాన జీర్ణించుకో!
జీవనిధిగా జనుల కొసగిన ఆ వెలుగు బాటను నమ్మి నడుచుకో!

తెలుగు పలుకును పరవశించి పాడుకో!
ప్రగతి పథమున తెలుగుధనమును నిలుపుకో!!

# సాహిత్య అకాడమీ - తెలుగు సాహిత్యం

- కె. శ్రీనివాసరావు, సంయుక్త కార్యదర్శి (సాహిత్య అకాడమీ, ఢిల్లీ)

స్వాతంత్ర్యం వచ్చిన తరువాత దేశంలో ఉన్నత సాహిత్య ప్రమాణాలను నెలకొల్పేందుకు, వివిధ భాషల్లో సాహిత్యాన్ని అభివృద్ధి పరిచేందుకు, ఉత్తమ రచయితలను గుర్తించి గౌరవించేందుకు, పురస్కారాల ద్వారా వారిని సత్కరించేందుకు, వివిధ భాషా రచయితల మధ్య అనుసంధానం ఏర్పర్చేందుకు, ఒక భాషలోని ఉత్తమమైన, సృజనాత్మకమైన సాహిత్యాన్ని మరో భాషవారికి అంద జేసేందుకు తొలి ప్రధాని పండిట్ జవహర్‌లాల్ నెహ్రూ ఏర్పరచిన సంస్థ సాహిత్య అకాడమీ. ఒక్క మాటలో చెప్పాలంటే భిన్నత్వంలో ఏకత్వం సాధించేందుకు, సాహిత్యం ద్వారా జాతీయ సమగ్రతను పెంపొందించేందుకు నాటి దేశ నిర్మాతలు కన్న కలల ఫలితంగా ఏర్పడ్డ సంస్థ సాహిత్య అకాడమీ. 1954 మార్చి 12న ఏర్పడిన సాహిత్య అకాడమీని కేంద్ర ప్రభుత్వం ఏర్పర్చిన ప్పటికీ అది సొసైటీల చట్టం క్రింద సాహితీవేత్తలు ఎన్నుకున్న స్వతంత్ర ప్రతిపత్తిగల సంస్థగా కొనసాగుతోంది. నాడు జవహర్‌లాల్ నెహ్రూ అధ్యక్షుడుగా, సర్వేపల్లి రాధాకృష్ణన్ ఉపాధ్యక్షుడుగా, స్వాతంత్ర్య సమరయోధుడు, సాహితీవేత్త కృష్ణ కృపలానీ కార్యదర్శిగా ప్రారంభమైన సాహిత్య అకాడమీ అప్పటి నుంచి ఇప్పటి వరకు భారతీయ భాషల్లోకి అత్యుత్తమ మౌఖిక, లిఖిత సాహిత్యాలను సమస్త భారత జాతికి అందజేసేందుకు విశిష్టమైన కృషి చేస్తున్నది.

24 భారతీయ భాషల్లో పుస్తకాలు ప్రచురిస్తున్న ఏకైక అతి పెద్ద ప్రచురణా సంస్థ కూడా సాహిత్య అకాడమీయే. 57 ఏళ్లుగా వివిధ భాషలు, సమూహాల మధ్య గాఢమైన సాంస్కృతిక అనుబంధాలను పెనవేస్తూ కొనసాగుతున్న ఈ సంస్థ ఇప్పటి వరకూ 5 వేలకు పైగా పుస్తకాలను ప్రచురించింది. భారతీయ సాహిత్య నిర్మాతలు అన్న పేరుతో సాహితీ మూర్తుల జీవిత చరిత్రలు, అకాడమీ పురస్కారాలు లభించిన ఉత్తమ రచనల అనువాదాలు, భారతీయ, విశ్వ భాషల్లోని ఉత్తమ గ్రంథాలు, అనువాదాలు, కవిత్వం, నవల, కథ, నాటిక, విమర్శ, చరిత్ర, యాత్రా సాహిత్యం వంటి అనేక ప్రక్రియల్లో గ్రంథాలను సాహిత్య అకాడమీ ప్రచురిస్తున్నది. అంతేకాదు, సాహితీ ప్రముఖులతో సెమినార్లు ఏర్పాటు చేసి వాటిలో వెలువరించిన ప్రసంగ పత్రాలు, ఆరు సంపుటాల్లో భారతీయ సాహిత్య విశ్వకోశం (ఎన్‌సైక్లోపీడియా), భారతీయ సాహిత్య గ్రంథ సూచికలు, బాల సాహిత్యం, విభిన్న భాషల వాఙ్మయ చరిత్రలు, ప్రాచీన, మధ్యకాల, ఆధునిక భారతీయ సాహిత్య సంపదలు పొందుపరచిన పది భాగాల సమగ్ర సంగ్రహం మొదలైన అనేక రకాల గ్రంథాల ప్రచురణలను సాహిత్య అకాడమీ వెలువరిస్తున్నది.

సాహిత్య అకాడమీ సంవత్సరానికి సగటున 300లకు పైగా సాహితీ సమావేశాలను నిర్వహిస్తున్నది. అందులో భాగంగా దేశంలో వివిధ ప్రాంతాల్లో సాహిత్య వేదికలు, సెమినార్లు, అనువాద కార్యశాలలు, సాహిత్య గోష్ఠులు, కవి సమ్మేళనాలను నిర్వహిస్తున్నది. గత ఏడాది సాహిత్య అకాడమీ దాదాపు 400 పుస్తకాలను 24 భాషల్లో ప్రచురించింది. అంటే సగటున ప్రతి 22 గంటలకు ఒక పుస్తకాన్ని అకాడమీ ప్రచురించిందని అర్థం చేసుకోవాలి. అదే విధంగా గత సంవత్సరం అకాడమీ దాదాపు రు. 7 కోట్ల రూపాయల పుస్తకాలను విక్రయించింది.

ప్రతి ఏటా 24 భాషల్లో ఉత్తమ రచనలకు పురస్కారాలను అందజేయడం సాహిత్య అకాడమీ చేస్తున్న సాహితీ కృషిలో విశిష్టమైన కార్యక్రమం. ఈ పురస్కారాల్లో భాగంలో అకాడమీ ప్రతి ఉత్తమ రచనకు రు. లక్ష నగదు, ప్రశంసాపత్రాలను అందజేస్తున్నది. అంతేగాక, 24 భాషల్లో ఉత్తమ అనువాదాలకు రు. 50 వేల నగదు, ప్రశంసాపత్రం, 24 భాషల్లో బాల సాహిత్యానికి రు. 50 వేల నగదు, ప్రశంసాపత్రం కూడా సాహిత్య అకాడమీ ప్రతిఏటా అందజేస్తున్నది. ఈ ఏడాది నుంచి యువ పురస్కారం పేరుతో 24 భాషల్లో 35 సంవత్సరాలలోపు రచయితలు ఒక్కొక్కరికీ రు. 50 వేల నగదు, ప్రశంసాపత్రం కూడా అకాడమీ అందజేయడం ప్రారంభించింది.

తెలుగుభాషా సాహిత్యానికి కేంద్ర సాహిత్య అకాడమీ చేసిన కృషి తక్కువేమీ కాదు. అకాడమీ ఏర్పాటైన నాటి నుంచి అకాడమీ ఇప్పటి వరకు 49 మంది తెలుగు సాహితీ వేత్తలకు పురస్కారాలను అందజేసింది. తెలుగులో మొట్టమొదటి సాహిత్య అకాడమీ పురస్కారం 1955లో సురవరం ప్రతాపరెడ్డి రచించిన ఆంధ్రుల సాహిత్య చరిత్రకి లభించిందని చెప్పడానికి నేను గర్విస్తున్నాను. 20వ శతాబ్దంలో ప్రచురించిన అత్యుత్తమైన ఈ గ్రంథం తర్వాతి కాలంలో ఐఏఎస్, ఐపిఎస్ విద్యార్థులకు కూడా పాఠ్య గ్రంథమైంది. అప్పటి నుంచీ తెలుగు భాషకు చెందిన ఉత్తమ రచయితలను సత్కరించడంలో, పురస్కారలను అందజేయడంలో సాహిత్య అకాడమీ వెనుతిరిగి చూడలేదు. కవి సామ్రాట్ విశ్వనాథ సత్యనారాయణ, త్రిపురనేని గోపీచంద్, గుర్రం జాషువా, తుమ్మల సీతారామమూర్తి, మహాకవి శ్రీశ్రీ, సి.నారాయణరెడ్డి, బోయి భీమన్న, దేవులపల్లి కృష్ణశాస్త్రి, రావూరి భరద్వాజ, ఆరుద్ర, గుంటూరు శేషేంద్ర శర్మ, రాయప్రోలు సుబ్బారావు, బాలాంత్రపు రజనీ కాంతరావు, తాపీ ధర్మారావు, పొన్నంగి శ్రీరామ అప్పారావు, దేవరకొండ బాలగంగాధర తిలక్, దాశరథి, పుట్టపర్తి నారాయణాచార్యులు, కుందుర్తి ఆంజనేయులు, వి.ఆర్.నార్ల, ఇల్లిందల సరస్వతీదేవి, ఆలూరి బైరాగి, పాలగుమ్మి పద్మరాజు, రాచమల్లు రామచంద్రా రెడ్డి, ఎస్.వి.జోగారావు, కె.శివారెడ్డి, భమిడిపాటి రామగోపాలం, మధురాంతకం రాజారాం, కాళీపట్నం రామారావు, కేతు విశ్వనాథ రెడ్డి, అజంతా, బలివాడ కాంతారావు, ఎన్.గోపి, వల్లపాటి వెంకట సుబ్బయ్య, తిరుమల రామచంద్ర, చేకూరి రామారావు, అబ్బూరి ఛాయాదేవి, గడియారం రామకృష్ణశర్మ, మునిపల్లె రాజు, యార్లగడ్డ లక్ష్మీప్రసాద్, సలీం వంటి లబ్ద ప్రతిష్టులైన రచయితలకు సాహిత్య అకాడమీ అవార్డులు లభించాయి.

1989 నుండి అకాడమీ భారతీయ భాషల్లో అనువాద గ్రంథాలకు అవార్డులు అందజేయడం ప్రారంభించింది. అప్పటి నుండి తెలుగులో 22 ఉత్తమ అనువాదకులకు పురస్కారాలు లభించాయి. మొట్టమొదటి పురస్కారం తెలుగులో మాజీ ముఖ్యమంత్రి, మాజీ కేంద్ర మంత్రి, మాజీ గవర్నర్,

సాహితీవేత్త అయిన బెజవాడ గోపాలరెడ్డి అనువాదించిన రవీంద్రుని నాటికలకు లభించింది. పుల్లెల శ్రీరామచంద్రుడు, ఇలపావులూరి పాండు రంగారావు, చల్లా రాధాకృష్ణ శర్మ, లక్ష్మీప్రసాద్, అనంత పద్మారావు, మద్దిపట్ల సూరి, బేతవోలు రామబ్రహ్మం, గంగిశెట్టి లక్ష్మీనారాయణ, వాడ్రేవు చిన వీరభద్రుడు, దీవి సుబ్బారావు మొదలైన ప్రముఖులు అనువాద పురస్కారాలు లభించిన వారిలో ఉన్నారు.

గత ఏడాది నుంచి (2010) సాహిత్య అకాడమీ బాల సాహిత్య పురస్కారాలను అందజేయడం ప్రారంభించింది. తెలుగులో బాల సాహిత్యానికి మొట్ట మొదటి పురస్కారం కలువకొలను సదానంద రచించిన అడవితల్లి అనే నవలకు దక్కింది.

మధ్యయుగ, శాస్త్రీయ సాహిత్య రంగంలో దేశంలో ఉత్తమ రచయితలు, ఇద్దరికి మాత్రమే ప్రతిఏటా విశిష్టమైన భాషా సమ్మాన్ పురస్కారాలను అంద జేస్తున్నది. ఇప్పటి వరకు ముగ్గురు తెలుగు రచయితలు తుమ్మలపూడి కోటీశ్వరరావు (2001), వేటూరి ఆనందమూర్తి (2006), కొర్లపాటి శ్రీరామ మూర్తి (2009) ఈ పురస్కారాలను అందుకున్నారు.

భారతీయ సాహిత్యానికి అత్యుత్తమ సేవలు అందించినందుకు సాహిత్య అకాడమీ ఫెలోషిప్‌లను ప్రకటించింది. ఇది అకాడమీ అన్నింటికన్నా అత్యున్నత గౌరవంగా భావించే ఫెలోషిప్ డా॥ సర్వేపల్లి రాధాకృష్ణన్ (1968), విశ్వనాథ సత్యనారాయణ (1970), గుంటూరు శేషేంద్రశర్మ (1991), భద్రిరాజు కృష్ణమూర్తి (2004) ఈ ఫెలోషిప్‌ను అందుకున్నారు.

ఇప్పటివరకూ అకాడమీ తెలుగులో 54 నవలలు, 27 కథల సంపుటిలు, 16 నాటికలు, 8 కవితా సంకలనాలు, 109 భారతీయ సాహితీమూర్తుల చరిత్రలు, 43 ఇతర పుస్తకాలను వెలువరించింది. సాహిత్య అకాడమీ కోసం ఇతర భాషల రచనల్ని తెలుగులో అనువదించిన ప్రముఖుల్లో మాజీ ప్రధాని, బహుభాషా కోవిదులు శ్రీ పి.వి. నరసింహారావు కూడా ఉన్నారు. ఆయన 1964లో హరినారాయణ ఆప్టే రచించిన మరాఠీ నవల పన్ లక్షత్ కొన్ ఘటావొను తెలుగులో అనువదించారు. మద్దిపట్ల సూరి, జ్వాలాముఖి, వి. సత్యనారాయణశాస్త్రి, యార్లగడ్డ లక్ష్మీప్రసాద్, పుట్టపర్తి నారాయణాచార్యులు తదితరులు అకాడమీకి ఈ అనువాద ఉద్యమంలో చేయూత నిచ్చారు.

భారతీయ సాహితీ నిర్మాతలు పేరుతో అకాడమీ అనేక మంది తెలుగు రచయితల సాహితీ జీవ చరిత్రలను ప్రచురించింది. ఆరుద్ర, సి.ఆర్.రెడ్డి, దాశరథి, దేవులపల్లి కృష్ణశాస్త్రి, దువ్వూరి రామిరెడ్డి, దుర్గాబాయి దేశ్‌ముఖ్, కాశీనాథుని నాగేశ్వరరావు, కాళోజీ నారాయణరావు, శ్రీశ్రీ, నార్ల వేంకటేశ్వర రావు, పానుగంటి లక్ష్మీనరసింహారావు, బెమ్మర పోతన, పరవస్తు చిన్నయసూరి, రాచకొండ విశ్వనాథశాస్త్రి, కందుకూరి వీరేశలింగం, తిరుమల రామచంద్ర, తుమ్మల సీతారామమూర్తి, విశ్వనాథ సత్యనారాయణ, ఉన్నవ లక్ష్మీనారాయణ మొదలైన ఎందరో ప్రముఖుల సాహితీ జీవిత చరిత్రలు వెలువడ్డాయి. వీటిలో చాలా వరకు హిందీ, ఇంగ్లీషు ఇతర భాషల్లో కూడా అనువాదమయ్యాయి.

తెలుగులో ప్రచురించిన అనేక ఉత్తమ రచనలు ఇతర భాషల్లో కూడా అనువాదాలయ్యాయి. ఇప్పటి వరకు 130 తెలుగు రచనలు అన్యభాషల్లో అనువాదమయ్యేందుకు సాహిత్య అకాడమీ దోహదం చేసింది. దాదాపు 20 పుస్తకాలు ఇంగ్లీషులోను, 25 పుస్తకాలు హిందీలోను అనువాదం కాగా, అస్సాం, బెంగాలీ, కన్నడ, కాశ్మీరీ, కొంకణి, మలయాళం, తమిళం, ఉర్దూ, మరాఠీ, సింధీ, పంజాబీ, ఒడియా భాషల్లో కూడా అనేక తెలుగు రచనల అనువాదాలు ప్రచురితమయ్యాయి.

మరో ముఖ్యమైన విషయం నేడు తెలుగు భాషకు ప్రాచీన హోదా లభించడం వెనుక సాహిత్య అకాడమీ కృషి కూడా ఉన్నది. కేంద్ర ప్రభుత్వం అప్పగించిన బాధ్యతలకు అనుగుణంగా వివిధ భాషా నిపుణుల సమావేశాలు నిర్వహించి, తెలుగు భాషా సాహిత్యాలకు ప్రాచీన హోదా పొందగల అర్హత, విశిష్టత ఉన్నదని నిర్ధారించడం వెనుక అకాడమీ కీలక పాత్ర పోషించింది.

ఒక్కమాటలో చెప్పాలంటే దేశంలో వివిధ భాషల్లో ఉత్తమ సాహిత్యానికి వేదికగా, సాహితీ చరిత్రను వర్తమాన తరానికే కాక భావి తరాలకు అందజేసే బృహత్తర బాధ్యతలను సాహిత్య అకాడమీ నెరవేరుస్తున్నది. అయితే జాతీయ స్థాయిలో సాహిత్య అకాడమీ ఒక్కటే ఈ బాధ్యతలను నెరవేరిస్తే సరిపోదు. నిజానికి ప్రతి భాషలోనూ ప్రతి ఏటా లెక్కలేనన్ని ఉత్తమ రచనలు వస్తున్నాయి. అనేక ప్రక్రియల్లో రచనలు జరుగుతున్నాయి. సామాజిక, సాంస్కృతికోద్య మాలకు రచనలు ప్రతిబింబమవుతున్నాయి. ఢిల్లీ నుంచి ఒక కేంద్ర సంస్థ వీటన్నింటినీ గుర్తించి గౌరవించడం సాధ్యం కాదు. ఇందుకు రాష్ట్రస్థాయిలో ప్రత్యేక కృషి జరగాలి. ఢిల్లీలో సాహిత్య అకాడమీని ఏర్పర్చినప్పుడు ప్రసంగించిన జవహర్‌లాల్ నెహ్రూ రాష్ట్రాల్లో కూడా సాహిత్య అకాడమీలు ఏర్పరచినప్పుడే ప్రాంతీయ సాహిత్యాలకు ఎక్కువ గుర్తింపు లభిస్తుందని అన్నారు. తదనుగుణంగా 1957 ఆగస్టు 7వ తేదీ ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీని నాటి రాష్ట్రపతి డా. రాజేంద్రప్రసాద్ ప్రారంభోత్సవం చేశారు. నాటి రాష్ట్ర విద్యామంత్రి పట్టాభి రామారావు, బెజవాడ గోపాలకృష్ణారెడ్డిని అధ్యక్షుడిగా, విశ్వనాథ సత్యనారాయణను ఉపాధ్యక్షుడుగా, దేవులపల్లి రామానుజరావును కార్యదర్శిగా నియమించారు. ఆ తర్వాతి కాలంలో శివశంకర స్వామి ఉపాధ్యక్షుడిగా ఎన్నికయ్యారు. కేంద్రమంత్రిగా, గవర్నర్‌గా కూడా కొనసాగుతూ కూడా 1982 వరకు బెజవాడ గోపాలరెడ్డి ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీని అద్భుతంగా నిర్వహించారు. అనేక ప్రాచీన, అర్వాచీన గ్రంథాలను ప్రచురించారు. 1962 నుంచి దాదాపు 20 సంవత్సరాలు ఆయన కేంద్ర సాహిత్య ఆకాడమీకి కూడా కార్యవర్గ సభ్యుడుగా కీలక పాత్ర పోషించడం, జ్ఞానపీఠానికి 1963 నుంచి 1971 వరకు అధ్యక్షుడిగా బాధ్యతలు నిర్వర్తించడం, విశ్వనాథకు జ్ఞానపీఠ అవార్డు రావడానికి దోహదం చేయడం మనందరకు గర్వకారణం. తిరుమలలో తామ్రపత్రాల్లో నిక్షిప్తమైన అన్నామా చార్య కీర్తనలు వెలుగులోకి తెచ్చేందుకు అనేక కారణభూతులయ్యారు. ఎందుకో బెజవాడ గోపాలరెడ్డి తర్వాత ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ రద్దయింది. అనేక ఇతర రాష్ట్రాల్లో సాహిత్య అకాడమీలు ఉన్నాయి. మన రాష్ట్రంలో కూడా ఈ అకాడమీని పునరుద్ధరించి సాహిత్యానికి పూర్వవైభవాన్ని తెచ్చిపెట్టాలని తెలుగువాడిగా నా చిరు కోరిక.

# ఆధునిక తెలుగుకవుల దేశభక్తి

- డా॥ పోలేపెద్ది వేంకట హనుమచ్ఛాస్త్రి

దేశభక్తి ప్రతి జాతికి నిసర్గమైన భావన. వేదకాలం నాటి ఋషులు పాడుకున్న నదీసూక్తం, పృథివీ సూక్తం దేశమాత బాహ్యస్వరూప కీర్తనానికి ముఖ్య లక్షణాలు. అందుకే ఋషులు కర్మాచరణానికి దేశభక్తిని మూల సత్యంగా గ్రహించడం జరిగింది. "జననీ జన్మభూమిశ్చ స్వర్గాదపిగరీయసి" అన్న ప్రాచీన సూక్తి ఈ విషయాన్నే అభివ్యక్తం చేస్తోంది.

దేశభక్తి భావన నిర్వచనానికందేది కాదు. అట్లనికాలపుడెక్కల క్రింద పడి నశించేదీ కాదు. తాను జన్మించిన దేశం మీద అపారమైన అభిమానం, తన జాతిశ్రేయస్సు కోసం పాటుబడాలనే తపన, ఆరాటం, పట్టుదల ఇవే అసలైన, సిసలైన దేశభక్తికి మూల భూతమైన సూత్రాలుగా భావించవచ్చు. జనతను జాగృతం చేయడానికి కలం పట్టి కావ్యరచనలు సాగించి దేశభక్తిని ప్రబోధించి, ఆధునిక తెలుగు సాహిత్యం దేశభక్తి కవిత్వాన్ని సుప్రతిష్టం చేసిన కవివరేణ్యుల కవితా మాధుర్యాన్ని ఒకింత ఆస్వాదిద్దాం. స్థూలంగా ఆధునిక తెలుగు కవిత్వంలో దేశభక్తి కవితలు రెండు పాయలుగా ప్రవహించింది. ఒకటి జాతీయాభిమాన సంబంధి, రెండు "ఆంధ్రాభిమాన సంబంధి".

20వ శతాబ్దం ఆరంభం నుండి వివిధ రాష్ట్రాల్లో జాతీయ చైతన్యం పెల్లుబికింది. శతాబ్దాలుగా పరదాస్య శృంఖలాల్లో చిక్కుకునిపోయి స్వేచ్ఛకోసం తపించి వ్యధలతో మదనపడుతున్న మానవాళికి స్వాతంత్రోద్యమం ఆశాజ్యోతిని వెలిగించింది. ఈ ఉద్యమం క్రమక్రమంగా భారతదేశమంతటా శాఖోప శాఖలుగా విస్తరించింది. వెల్లువలవలె భావగీతాలు పరవళ్లు తొక్కాయి. ప్రబోధ గీతాలు పుంఖానుపుంఖాలుగా వెల్లివిరిసాయి. భారతీయుల మనఃఫలకాల మీద స్వాతంత్ర్యమనే భావ ముద్రలను అక్షరాత్మకంగా అద్దిన ఆంధ్ర జాతీయ కవి శిఖామణులనేకులు **'దేశభక్తి కవితా శంఖాన్ని'** పూరించారు. దేశీయులలో కలిగిన సంచలనాన్ని మొట్టమొదటి సారిగా చిలకమర్తి లక్ష్మీ నరసింహం గారు ఆవేశపూరిత రీతిలో ఎలా కవితాబద్ధం చేశారో చూడండి.

**"భరత ఖండంబు చక్కని పాడియావు**
**హిందువులు లేగదూడలై ఏడ్చుచుండా**
**తెల్లవారనుగడుసరి గొల్లవారు**
**పితుకుచున్నారు మూతులు బిగియకట్టి"** అన్న పద్యం.

**"చెరసాలల్ పృథుచంద్రశాలలెయగున్**
**చేదోయి కీలించు నయ్యరదండల్**
**విరిదండలయ్యెడున్, హేయంబైన చోడంబు లే**
**పరమాన్నంబగు మోటుకంబళులు**
**దాల్పన్ పట్టుసెల్లాలగున్ స్థిరదై**
**యేనరుదాత్మదేశమును భక్తిన్ గొల్చునవ్వానికిన్॥**

అన్న పద్యాలు సభను ఉత్సాహరంజితం చేయడంతో, తెలుగులో జాతీయోద్యమ కవిత్వానికి బీజవ్యాపన జరిగింది. ఆంధ్రజిహ్వాగ్రాలపై చిందులాడాయి. చెన్నాప్రగడ భానుమూర్తి గారి **"భారత ధర్మ దర్శనం"**, మంగిపూడి వెంకటశర్మ గారి **"భరతమాత"** అన్న కావ్యాలు ప్రాచీన భారత దేశపు ఔన్నత్యానికి వెలిగించిన దీపాలు. చిలకమర్తి వారి భావతీవ్రత, ఉద్యమస్ఫూర్తి, సమ్మిళితంగా రాయప్రోలు సుబ్బారావు గారి రచనలలో జాతీయోద్యమం పొంగులెత్తింది. గోఖలే గారి నేతృత్వాన్ని వివరిస్తూ, **"భస్మసుప్త వహ్ని లతికమాద్రి మార్పడిన యీ మహదార్య కుమార పాలి మేల్మొల్పితి దేశ పూజ కొరకున్"** అని కీర్తించారు.

ఈ విధంగా ప్రారంభమైన జాతీయాభిమానం **"జన్మభూమి"** మున్నగు పద్యాల్లో పరాంకోటి చెందింది. గరిమెళ్ల వారి **'మా కొద్దీ తెల్లదొరతనం'** అన్న గేయం, **'మేలుకొలుపు'** అను శీర్షికతో అజ్ఞాతకవి వ్రాసిన **'మేలుకొను మీ భరత పుత్రుడా మేలుకొనుమీ సచ్చరిత్రుడా'** అన్న గేయాలు విశేష ప్రచారాన్ని సంపాదించి భారత జాతీయోద్యమాన్ని దేశభక్తి భావనలను బహుముఖాలుగా ప్రబోదింపచేశాయి. ఈ విధంగా జాతీయోద్యమ కవిత్వం ఆంధ్ర దేశంలో వెల్లివిరియడానికి దేశంలోని ఉద్యమాలతో పాటు **'రవీంద్రుని జాతీయ గీతాలు'** కూడా కొంత వరకు ఉపకరించాయని చెప్పవచ్చు.

తెలుగులో వెలువడిన **'దేశభక్తి'** కవిత్వంలో 'ఆంధ్ర దేశాభిమాన కవిత్వ'మే విస్తారంగా వెల్లివిరిసింది. భావ కవులలో భారత జాతీయతను, ఆంధ్రాభిమానాన్ని, దేశభక్తిని, ప్రబోధించిన వారిలో దువ్వూరి, బసవరాజు, రాయప్రోలు, విశ్వనాథ, కొడాలి, జాషువా, తుమ్మల వారు విశేషించి పేర్కొనదగినవారు.

రాయప్రోలు వారి **'జన్మభూమి'** అన్న గేయం జాతీయ కవిత్వానికి దేశభక్తికి శిరోభూషణం.

**'ఏ దేశమేగినా ఎందు కాలిడినా**
**ఏ పీఠ మెక్కినా ఎవ్వరేమనినా**
**పొగడరా నీ తల్లి భూమి భారతిని**
**నిలుపరా నీ జాతి నిండు గౌరవంబు'**

యింత స్పష్టంగా, సజీవంగా మాతృభూమిపై గల మక్కువను, అభిమానాన్ని వర్ణిస్తూ **'అవమానమేలరా అనుమానమేలరా - భారతీయుడనంచు భక్తితో పాడ'** అన్న చరణాలలో దేశభక్తి జాతీయాభిమానం తరగలెత్తింది. అటు పిమ్మట దేశీయులలో జాతీయాభిమానం జాగృతిని కలిగించి, దేశ భక్తిని ప్రబోధించి, కర్తవ్యాన్ని ఉపదేశించిన గేయం 'గురజాడ అప్పారావు' గారి దేశభక్తి గేయం. ఈ గేయంలో **"దేశ మనియెడ దొడ్డ వృక్షం ప్రేమలను పూలెత్తవలెనోయ్"** అనియు, **'అన్నదమ్ముల వలెను జాతులు మతములన్నియు మెలుగవలెనోయ్'** అన్న చరణాలలో విశ్వమానవ ప్రేమకు స్వర్ణ పతాక మెత్తబడింది.

**'ఆత్మవిశ్వాస సూర్యోదయ'** కాంతులతో భరతజాతికి ప్రబోద కావ్యాలా లపించిన కవి దువ్వూరి రామిరెడ్డిగారు. **"అంబుదంబుల అమృతపూరంబు**

లొలుకగా ఇంద్ర చాపంబు తోరణ మింపుగలుగగా" అని వినువీధులలో వెడలుతున్న స్వాతంత్ర్య రథాన్ని దర్శించి, మాతృచరణ సన్నిధిలో ఆత్మలను కర్పూరంగా వెలిగించినిదే, స్వాతంత్ర్యఫలం సిద్ధించదు అని ప్రబోధించి, "ఒక చేతన్ ఋధిరంపు పాత్ర వేరొక్కం పీయూష పాత్రిక" గైకొన్న స్వాతంత్ర్య భారతి యొక్క మూర్తిని, స్ఫూర్తిని ధ్వనింపచేశారు. 'నైవేద్యం' అనే శీర్షికతో వెలయించిన పద్యాలు, 'మేలుకో భరత కుమారా మేలుకో తరుణ ధీరా' అన్న ప్రభోదాత్మక గేయాలు మాతృదేశభక్తికి వెలలేని ఆభరణాలు. మాతృదేశభక్తిని అసిధారా సదృశమైన ఆవేశంతో వెల్లడించిన వారు వేదుల సత్యనారాయణ శాస్త్రి గారు. తమకు తాము ఒకపువ్వుగా భావించుకొని "కానుకై ధరాధిపుకాళ్ల కదంబొరలాడి, వాడిపోలేనని" మరియు

"నీ చపు దాస్య వృత్తి మననేరని, శూరత,
మాతృదేశ – సేవా చరణంబునన్,
తనువులర్పణ చేసిన వారి పార్థివ
శ్రీ చెలువారుచోట, దదశృగ్రుచులన్,
వికసించి వాసనల్ వీచుచు
రాలిపోవగవలెన్ తదుతాత్త సమాధి మృత్తికల్"

అను కాంక్షను వ్యక్తీకరించిన చక్కని భావ తీవ్రత కలిగిన దేశభక్తి రచన.

'తుమ్మల' వారి 'పరిగపంట' లో భారత సవిత్రిని 'వెన్నతో చతుర్వేద ఋక్కులు పంచి" అని భావించారు. జాషువా తమ ఖండ కావ్యంలో "సింధు గంగానదీ జలక్షీరమెపుడు కురిసి బిడ్డల పోషించికొనుచున్న పచ్చి బాలింతరాలు మా భరత మాత" అని వివరించారు. కవికొండల వెంకట్రావు గారు 'మాతృ సంకీర్తనంలో' "నీదు పాదయుగళమేది నీరధి నిత్యాభిషేక శీకర శీతల ప్రబోధిగా" కీర్తించారు. "ఆర్యసంతతివారు కనుమూసి కాలంబుగడుపుల తగునె" అని వెంకట పార్వతీశ్వరకవులు హెచ్చరించి, భారతమాతను భారత సంస్కృతిని దేశభక్తిని వేనోళ్ల కీర్తించినవారే.

జాతీయోద్యమం, స్వరాజ్యం, గాంధీ, రాట్నం వస్తువులుగా స్వీకరించి రసగుళికల్లాంటి అనేక ప్రచార కావ్యాలు, గేయాలు వెలువడి, సామాన్య ప్రజల్లో కూడా దేశభక్తితో కూడిన స్వాతంత్ర్య శంఖారావాన్ని పూరించిన వానిలో సుప్రసిద్ధమైన "కొల్లాయి గట్టితేనేమి మా గాంధి" అన్న గేయం, "గాంధీ మహాత్ముడు బయలుదేగా, కలకలనవ్వింది జగత్తు కలకల నవ్వింది" అన్న బసవరాజు అప్పారావు గారి గేయాలు, మాధవపెద్ది సుందరరామశాస్త్రి గారు ఆలపించిన "అంటరానివారెవరో కాదు మా వెంటరానివారే" అన్న గేయం, బలిజేపల్లి లక్ష్మీకాంతం గారి "స్వరాజ్యరథం" దుగ్గిరాల గోపాలకృష్ణయ్య గారి "రాంభజన" కీర్తనలు, ఆలపించని దేశీయుడు మార్మోగని సభ లేదనుట అతిశయోక్తి కాదు.

దేశభక్తికి మూలకందమైన ఆంధ్రాభిమానం, జాతీయాభిమానం, దేశాభిమానం, భాషాభిమానం, అని మూడు పాయలుగా విడివడింది. ఈ మూడు పాయల్లో ఆంధ్రాభిమానం యొక్క సర్వతోముఖ స్ఫూర్తి ఇమిడి యుంది. దీనికి 'గత వైభవ స్మరణం' వర్తమాన స్థితిపట్ల విచారం, భవిష్యత్ కర్తవ్య ప్రబోధం ముఖ్య లక్షణాలుగా భావించవచ్చు. 'నాదుజాతి, నా దేశము, నాదు భాష అను అహంకారదర్శనమందు మాంధ్ర' అని ప్రతిపాదించిన అహంకార దర్శనమే రాష్ట్రోద్యమ కవిత్వానికి బీజప్రాయమైంది. రేఖలు రేఖలుగా తొంగి చూస్తున్న ఆంధ్రోద్యమ కవిత్వాన్ని రాయప్రోలు వారి రచనల్లో సమగ్ర బింబాకృతి వచ్చింది. ఆంధ్రావళి కావ్యంలో ఆంధ్రమాత శీర్షికతో వివరించిన

'అమరావతి పట్టణమున బౌద్ధులు విశ్వవిద్యాలయములు స్థాపించునాడు
ఓరుగల్లున రాజవీర లాంచనముగ పలు శస్త్రశాలలు నిలుపునాడు

అన్న ప్రశస్తమైన పద్యాలు ఆంధ్ర తేజస్సును, పౌరుషాన్ని భాషను తెలుగు భూమిని కీర్తించి, తర్వాత కవులకు మార్గదర్శకులయ్యారు రాయప్రోలువారు. జాత్యాభిమానాన్ని బాహాటంగా వర్ణించినవారిలో విశ్వనాథ తుమ్మల ముఖ్యులు. విశ్వనాథ వారి "ఆంధ్ర పౌరుషంలో" "ఆంధ్ర యువకులు, తూరుపు కనుమ దుర్గముల నేలినదినమ్ము" అని "కోట గోడలనుండి కుప్పించు సింహంబు లోయన" అని ఆంధ్ర పరాక్రమాన్ని, శౌర్య ప్రశస్తిని, వివరించి, దేశభక్తిని ప్రబోధింపచేశారు. తుమ్మల వారి రాష్ట్ర గానంలో "తెలుగు జోదుల తుటారి, కటారి, చెలరేగి, పగర చీల్చిన దినమ్ము" అని, "యావదాంధ్ర విషయమునొక్క రాజ్యముగ చేసి విజయదుందుభిపై దెబ్బవేయు వరకు, తెలుగు పసిపాపకైన నిద్రింపదగునె" అని కర్తవ్యాన్ని బోధించి దేశభక్తిని తమ కవిత్వంలో అడుగడుగునా ఇనుమడింపచేశారు.

'సమదర్శిని' లో త్రిపురనేని వారు

"కంచుకోటల కంచు తల్పులు
ఖంగు ఖంగున మ్రోగనపుడు
తంజనగరపు కోటగోడలు
చెంగుచెంగున ఎరుగురపుడు"

అని తెలుగువార్ల పరాక్రమం ఎంత ఉవ్వెత్తుగా ఎగిసిందో తెలుసుకొమ్మని తెలుగు బిడ్డలను హెచ్చరించారు.

రాను రాను దేశీయాభిమానం తీగలు సాగింది. కవులు ఆంధ్రుల శిల్పకళావైభవాన్ని, భౌతిక స్వరూపాన్ని, క్షేత్ర ప్రాశస్త్యాన్ని, రాజుల ప్రాభావాల్ని, ఆంధ్రాభిమానాన్ని, ఆంధ్ర పౌరుషాన్ని, తమ తమ దేశభక్తిని కవితాబద్ధం చేసిన రమణీయ కావ్యాల్లో పుట్టపర్తి వారి 'పెనుగొండ లక్ష్మి', కొడాలి వారి 'హంపీ క్షేత్రం', గంటి జోగిసోమయాజులు గారి 'రామచంద్రుని హంపీ యాత్ర', మల్లాది వారి 'స్వప్న మాధురి', ఇంద్రకగంటి హనుమచ్ఛాస్త్రి గారి 'ద్రాక్షారామం', కొండూరి వారి 'అమరావతి', ఖండకావ్యంలో విశ్వనాథ వారి 'మబ్బులు', దువ్వూరి వారి 'కొండవీడు' మున్నగు కావ్యాలు దేశభక్తికి ప్రశంసింపదగిన కావ్యఝరులు.

ఏవం విధంగా ఆధునిక తెలుగు కవుల దేశభక్తి అనే శీర్షికలో మనం ప్రస్తావించిన కావ్యాలు, గేయాలు, దేశభక్తి తత్త్వం, కవితా వైభవం, మనం ప్రస్తావించని అనేకానేక గేయాలు, పద్యాలు, కావ్యాలు, ఆంధ్రదేశభక్తికి, జాతీయాభిమానానికి, సామాజిక ఔన్నత్యానికి, సమీచీనమగు సాక్ష్యంగా అలరారుతున్నాయి.

# మహాసభల విజయానికి తమ ఔదార్యాన్ని అందించిన ఉదారులు



శ్రీ లగడపాటి రాజగోపాల్

శ్రీ ఐలాపురం వెంకయ్య

శ్రీ దేవినేని రాజశేఖర్ నెహ్రూ

శ్రీ ఐలాపురం రాజా

శ్రీ జి. వెంకటేశ్వరరావు (కె.సి.పి. లిమిటెడ్)

శ్రీ ఎ.ఆర్. రావు అవ్వాస చైర్మన్, ఎగ్రిగోల్డ్ సంస్థలు

శ్రీ కడియాల బుజ్జిబాబు

శ్రీ వసంత కృష్ణప్రసాద్

శ్రీ బొమ్మిడాల కృష్ణమూర్తి

శ్రీ యం.డి.వి. ఎస్.ఆర్. పున్నంరాజు చైర్మన్, సన్‌ఫ్లవర్ విద్యాసంస్థలు

శ్రీ డా॥ లావు రత్తయ్య చైర్మన్, విజ్ఞాన్ విద్యాసంస్థలు

శ్రీ కోగంటి సత్యనారాయణ చైర్మన్, ఎస్.డి.వి. స్టీల్స్ లిమిటెడ్

శ్రీ టి. సుబ్బిరామిరెడ్డి లలిత కళాపరిషత్

శ్రీ టి. రాంప్రసాద్ మేనేజింగ్ డైరెక్టర్, కామాక్షి స్టీల్స్ ప్రైవేట్ లిమిటెడ్

శ్రీ ఎ.వి. సుబ్బరాజు లోటస్ గ్రూప్

శ్రీ రేబాల మోహనరావు

శ్రీ మారెళ్ల పుల్లారెడ్డి

శ్రీ శ్రీశైల వాసు

శ్రీమతి చలసాని వసుమతి

శ్రీ కొలనుకొండ శివాజీ

శ్రీ గోళ్ళ నారాయణరావు

శ్రీ మైనేని గోపాలకృష్ణ – అమెరికా

శ్రీ పువ్వాడ విఠల్ వేణుగోపాల్

# కృష్ణాజిల్లా రచయితల సంఘం జీవిత సభ్యులు

**R. Ravi Sarma**
Editor, Nataka Kala
1-9-112/2D/1, Vidya Nagar,
Hyderabad - 44

**Mulpuu Ravi Kishore**
Telugu Sampradaya Parirakshna Samiti
Flot No. 30, Road No. 3,
Sri Kanaka Durga Gegeted Officers Colony,
Gurunanak Nagar Road,
Vijayawada

**Gabbita Durga Prasad**
Vuyuru

**T. Rama Mohana Rao**
Machilipatnam

**P. Tikkana Somayaji**
G7, L.I.C Colony,
Vijayawada

**P. Srikanth**
60-4-5, Raju Street,
Siddardh Nagar,
Vijayawada - 520010
Cell : 9985293222

**N. Anja Rao**
Madepalli (Village),
Jalipudi Post, Eluru Mandalam,
W.G. Dist Cell : 9505860698

**G. N. Achari**
Lakkavaram (W.G. Dist)-534451
Cell : 08813249911

**Upadhuyayula Rama Rao**
Oriental College,
Vidya Nagar, Eluru
W.G. Dist. 9849469754

**Ch. Padma Kumari**
8th Ward, Kotta Veedi,
Near Beteka Prarthana Mandiram
Kanigiri - 523230
Cell : 9177700613

**Savappagari Eranna**
15-58, S.R. Peta,
Pattikonda - 518380 (Kurnool Dist.)
Cell : 9666957904

**K. Satya Narayana**
C/o Nama Sivaiah
Circle Street, Machili Patnam

**Kotti Ramarao**
Nayer Baddi Center,
Machilipatnam-521001

**Sri Latha**
Machilipatnam

**Lanka Satnarayana Sastri**
23/356, Rama Naidu Peta,
Machilipatnam-521001
Ph : 08672-222937

**B. Dhanvantari Acharya**
11/678, Jagannadha Puram,
Machilipatnam
Cell : 9441865109

**B. Gnaneswara Rao**
Rtd. Post Master,
Machilipatnam
Ph : 8008664282

**K. Susila**
30/426, Musthakhanpet,
Machilipatnam
Cell : 9440330500, 9290967656

**P. Venkateswara Rao**
13-160, Nijampet, Machilipatnam
Cell : 9490300640

**M. V. Venkateswara Rao**
27/28, Khojjilli pet,
Machilipatnam-521001
Cell : 9848852228

**A. Subramanyam**
20/142-6, Chilakapudi,
Machilipatnam - 521002
Cell : 9959145636

**A. Pothu Raju**
16-309-1A, Machavaram,
Chilakalapudi, Machilipatnam

**M. Silar (Md)**
20/620, Lakshmanarao Puram,
Chilakalapudi, Machilipatnam-2
Cell : 9985564946

**V. Poorna Chandra Rao**
4/292/F-1, Godugu Peta,
Machilipatnam -1,
Cell : 9885475627

**Ch. Prameela**
Surekha Apartment,
Chakirevu Palem,
Machilipatnam-1
Cell : 9247216090

**Voleti Uma Saraswathi**
17-423, English Palem,
Machilipatnam-1
Cell : 9866366457

**B. Lakshmi**
3-114, Desai Pet,
Machilipatnam
Cell : 9866525861

**D. Dattatreya Sarma**
17/12-1, Edepalli,
Machilipatnam
Cell : 9247558854

**D. Visalakshi**
4-199, Vidya Nagar,
Gopala Patnam,
Visakhapatnam-530027,
Ph : 0891-6638252, 9010902794

**M. Rajeswara Rao**
Kavya Samiksha,
Sapthagiri Nagar,
China Muriki Vada,
Visakhapatnam -530051
Cell : 9391811226, 9396447227

**Gajula Satya Narayana**
Vijetha Books,
29-2-10, Rama Mandir Street,
Governorpet, Vijayawada- 2
Cell : 9848687652

**Acharya B. Venkateswarlu**
Dravida Viswa Vidyalayam,
Kuppam

**T. Venkatravu (T.V)**
33-13-53/97, Ramana Nagar,
Sunnapu Battila Centre,
Vijayawada-10

**R. Venkateswara Sarma**
5-19-9A, Sri Kavitha Sadan,
2/17, Bradi pet, Guntur-2

**MVJ. Bhuvaneswara Rao**
15-21-12/3, Near Womens College,
Anakapalli-531002

**M. Radha Krishna**
Plot No. 104,
G.R. Reddy Nagar Colony,
ECIL Post, Kapra,
Hyderabad-62
Cell : 9849349516

**V. Sasi Kala**
S.D.R. Complex, Gandhi Veedi,
Naidu Peta (Nellore Dist.) - 524126
Cell : 9440745336

**P. Pandu Rangarao**
101, Vasantavilla Apartments,
Raghuram Street, MogalrajPuram,
Vijayawada-10

**S.K. Saida**
67-9-13, Marrichettu Centre,
Darsipet, Patamata,
Vijayawada-10

**M. Tirupathi Reddy**
Lecturer, S.V.K.P. Degree College,
Markapur -523316
Prakasam Dist.

**A. Srinivas**
H.No. 4-4-119,
Bharat Nagar Colony,
Hyderabad-500048,
Cell : 9705167669

**A. Venkateswara Rao**
4-4-1/9, Bharat Nagar Colony,
Attapur, Hyderabad-500048
Cell : 9705167669

**M. Kala Sagar**
33-8-11, 2nd Floor,
Bankapalli Vari Street,
Seetharam Puram,
Vijayawada-2

**G. Bhanu Prasad**
48-9-8, Vishnu Nagar,
Gunadala, Vijayawada-4
Cell : 9849357093

**Yasoda Purna Chandra Rao**
1051, Lakshmi Chandra Nilayam,
NSCB Nagar, Vijayawada-15

**M. Tirupathi Reddy**
Lecturer,
S.V.K.P. Degree College,
Markapur -523316
Prakasam Dist.

**S. Paparao Naidu**
C/o. Sarwani Graphics,
Hiramandalam,
Srikakulam Dist.- 532459
Cell : 9441569849

**G. Srinivasulu**
Beside Andhra Bank,
Vuppu Gundur Post,
N.G. Padu Mandalm,
Prakasam Dist -523186
Ph : 9492123731

**K. Venkata Rao**
1-43-39,
Near Stadium East Gate,
Srikakulam-532001

**K. Savitri**
Karanam gari Street,
Vuppu Gunduru Post,
Nagulupala padu Mandalam,
Prakasam Dist-523186
Cell : 8985145190

**P. Nageswara Sarma**
Panchayati Complex,
Amaravathi-522020

**Dr. R. Sasi Kala**
M.N.R. College For Women,
Vizayanagaram
Cell : 9396252045

**Dr. P.V.B. Sanjeev Rao**
S.K.V.T. Degree College,
Rajamandry
Cell : 9849579579

**C.B.S.P. Ramam**
9, Journalist Colony,
32-13-53/7A,
Mogalrajpuram,
Vijayawada-10
Ph : 0866-2474635

**P. Pattabi Rama Rao**
9, Journalist Colony,
32-13-537/4,
Mogalrajpuram,
Vijayawada-10

**P. Venkata Ramanacharulu**
Sri Lakshmi Prasanna Nilayam,
11-29-36, Aavula Vari Street,
Vijayawada-520001

**J. Kodanda Ramaiah**
Jammi Palem,
Enamadugu Post,
Kovvuru Mandalam,
Nellore Dist - 524137
Cell : 8985938861

**Y. Sri Ranganayaki**
(Telugu Lecturer)
12-12-4, Kugler Hospital Road,
Kothapeta, Guntur-1

**T. Padmavathi**
C/o. V.D. Gandhi
Door No. 5-54-49, Bradipet,
Guntur-522002

**Ch. Lakshmi Narayana**
D.No. 18, Sared Hearth Road,
T.C Palya, K.R. Puram Post,
Bangalore-36

**S.M. Subhani**
C/o N. Radha Krishna Murthy,
D.No. 8-11-112, 7th lane,
Nehru Nagar, Guntur-522001
Cell : 9490776184

**G. Venkateswarlu** Teacher,
1-162E, Polla Subbaiah Street,
Markapur - 523316 Post
Prakasam Dist
Cell : 9247234991

**M. Kantha Rao**
Bharati Bhavan Aparts
Plot No. C1, Sirdi Nagar,
Near Saibaba temple,
Vijayawada-520 008
Ph : 0866-2491202, 9490196359

**Y. Vijaya Lakshmi**
Sri Sai Harshita, GF3,
Sajjapuram, Tanuku - 534211
Cell : 9440353558

**L. Purnaiah Sastri**
D.No. 41-3-24, Biyapu Kotal Bazar,
Satyam Hotel Lane, Krishnalanka,
Vijayawada-520013
Ph : 0866-2524612, 9849684461

**R. Krishna Rao**
54-16-13/1, Plot No. 503,
Alayam Apartments, Road No. 1,
Venkateswara Nagar,
Vijayawada - 8

**P. Durga Rao**
76-85-13A, Hanumaiah Street,
Bhavanipuram, Vijayawada-12
Cell : 9848627711

**G. Kishor Kumar**
Machilipatnam

**V. Hajarataiah Gupta**
26-20-14, Swami Street,
Gandhi Nagar, Vijayawada-520003
Cell : 9848122167

**Dr. M. L. Naidu**
Flot No. 1, Sakuntal Apts,
Brindavan Colony, Lappipet,
Vijayawada-520010

**Dr. Sappa Durga Prasad**
Nata Raja Nruthya Nilayam
Danavaipet, Rajamundry-533103
Cell : 9849273096

**M. Nagendra Prasad**
19-12-140, Bairagipatteda Colony,
Tirupati-517501

**P. Abad Khan**
C/o. Abdul Azad Khan,
Racherla-523368
(Prakasam Dist.)

**R. Hari Venkata Prasad**
D.No. 59A-13-23,
Old Postal Colony, Patamata,
Vijayawada-10
Cell : 9490793973

**T. Mahaboob**
26-3-22 77/101 Pavani Residency,
Railway Gate Road,
Vedaya Palem,
Nellore-4

**Dr. B. Bhuvaneswari Devi**
31-9-4, Ist Floor,
Maruthi Nagar, Sardar Patel Road,
Alluri Seetha Ramaraju Bridge,
Vijayawada-4
Cell : 9885146017

**C.S. Veera Swami (Ln.)**
11-25-37, K.T. Road,
Venkata Satya Sai Complex,
Vinnakota Vari Chowk,
Vijayawada-520001
Cell : 9885114696

**K. Govardana Kameswara Prasad**
41-6-24,
Gurrala Veera Ragavaih Street,
Krishnalanka, Vijayawada-50013

**D. Durga Koteswara Rao**
32-1-16, Prajasakhi Nagar,
Vijayawada - 10
Cell : 9393446899

**Masid, Shaik Emam Basha**
Head Master,
42-15-13, Block No. 68,
Ajith Sing Nagar, Vijayawada-15
Cell : 9441296473

**G. Narayana Rao**
Vijayawada

**B. Malyadri**
Andhra Clony, Doorvani Nagar Post,
A. Narayana Puram, Banglore
Cell : 9731227199

**M. P. Jhonkavi**
Mutukuru Post,
Durgi Mandal,
Guntur Dist-522612

**Rachapati Ramesh**
10/585, Bellam Nandi Sreet,
Kadapa-516001

**G. Subrahmanya Sastry**
21-374, Kata Street,
Nandyala-518502

**Rayachoti Krishna Murthy**
A/13, Devdatha HSG,
Subhash Road, Dombival W
Thane Ms
Vishnu Nagar-121202

**C. Govinda Rajulu**
Project of Telugu Orintal
Rearch institute,
SVU. Tirupati-517502

**P. C. Venkateswarlu**
Asst. Professor
Oriental Research Institute
SVU, Tirupati-517502

**K. Ramesh Babu**
Senior TGM,
BSNL Customer Service Center,
Gudivada

**Ch. Madhava Kanaka Simhachalam**
6-25, Near S.G.I, Main Road,
Duggirala (Guntur Dist.)
Cell : 8125752234

**M. Prabhakar Rao**
Flot No. 303, Sri Sai Enclave,
Adavi Seshagiri Rao Street,
Lakshmi Nagar, Satyanarayana Puram,
Vijayawada
Cell : 9866033906

**Ch. Rama Jogaiaha**
B I Block, Flot No. 2,
Santhi Sikhara Apartments,
Raj Bhavan Road,
Somajiguda, Hyderabad-500082
Ph : 040-23313770, 9391007780

**Amballa Janardhan**
Sree Nivasam, B - 204, Dheeraj Kiran,
NR Infant Jesus School,
Chincol, Bunder Road, Malad (West)
Mumbai-400064
Ph : 09987533225, 09619733225

**L. Prabhakar Rao**
72-19-5/3, Sai Durga Nagar,
Lala Cheruvu, Rajamandry-533106
Ph : 0883-2426262, 9490889763

**A. Suvarna**
1C1 Floor, Drawoo Palace,
Amar Jyothi Layout,
Sanjay Nagar, Bangalore-560094

**A. Suvarna**
1C1 Floor, Drawoo Palace,
Amar Jyothi Layout,
Sanjay Nagar,
Bangalore-560094

